# పద్యంలో మనం



రచన

డాక్టర్ జి.వి. పూర్ణచందు

ప్రచురణ



శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు

28-3-51, అరండల్‌పేట, విజయవాడ - 2.

ఫోన్ : 2434320, సెల్ : 94401 72936

# PADYAMLO MANAM

by : **Dr. G.V.Purnachand,** B.A.M.S.,
Susruta Ayurvedic Speciality Hospital,
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.
Mobile : 94401 72642; Ph : (O) 2577373



Ist Edition :
31 May, 2016

Released on the occassion of the
61st birthday of Sri Mandali Buddha Prasad

**PRICE : Rs 116/-**

Cover Design & Type Setting :
MADHULATHA GRAPHICS,
Arundalpet, Vijayawada.
Ph. : 2434320 p.p.

Printed at:
Chitanya Offset Printers
Suryaraopet, Vijayawada-2

Publishers:
**Sree Shanmukheswari Prachuranalu**
28-3-51, Sanjeevaiah Colony,
Arundalpet, Vijayawada - 520 002
Ph : 2434320 (O) Cell : 94401 72936



తెలుగు భాషకు సంస్కృతికి

పునరుజ్జీవనోద్యమ శ్రీకర్త

**మండలి బుద్ధప్రసాద్** గారికి

షష్ఠ్యబ్దిపూర్తి కానుకగా .....

**పూర్ణచందు**

# అక్షర పూర్ణుడు పూర్ణచందు

- డా॥ ఎన్. గోపి

*పూర్వపు వైస్ చాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం*

తెలుగులో పద్యం ఒక వాకిక మాత్రమే కాదు. గణబద్ధమూ పాదబద్ధమూ అయిన పదాల కూర్పు మాత్రమే కాదు. అదొక సంస్కృతి. పైకి యాంత్రిక చట్రంలా కనిపించినా ఆ గీతల మధ్య ఒక మాంత్రిక లోకాన్నే సృష్టించ వచ్చు. సృష్టించారు కూడా. ఆ లయలో, ఆ నడకలో పదాలకు వినూత్న సౌష్టవాన్నీ అర్థాలకు నవీన స్ఫూర్తినీ కలిగించవచ్చు.

పుట్టడం పుట్టడమే తెలుగు సాహిత్యం పద్యంతో పుట్టింది. వదులుగా ఉన్న శాసన ఛందోబద్ధ రూపాలను అద్భుతంగా పరిష్కరించి భారతాన్ని ప్రారంభించాడు. నన్నయ! తన శైలీ మాహాత్మ్యంతో నగిషీలను ఏర్పరిచాడు. ద్రవ రూపంలో [illegible] [illegible]కు తీరుపులు సంతరించాడు. ఎప్పటికైనా పద్యం అంటే తెలుగులో ఒక ప్రక్రియ మాత్రమే కాదు. కవిత్వానికి పర్యాయపదం. 'ఓ పద్దెం చెప్పు' అంటే కవిత్వం చెప్పమనే. పద్యం నుంచి పక్కకు జరిగి ప్రయోగాలు చేసినవారు కూడా పద్యంలో పుట్టి పెరిగిన వారే, శ్రీశ్రీ తో సహా.

అటువంటి పద్యానికి వ్యాఖ్యానప్రాయమైన ప్రకాశ వ్యాసంగం చేస్తున్నాడు. డా॥ జి.వి. పూర్ణచందు. గత 110 వారాలుగా 'పద్యానుభవం' పేరుతో శీర్షిక నిర్వహిస్తున్నాడు. లోకంలో ప్రసిద్ధమైనవీ లేదా తనకు బాగా నచ్చినవీ, వ్యాఖ్యాన సాపేక్షమైనవీ, జటిలమైనవీ పద్యాలను ఎన్నుకొని మనతో ముచ్చటిస్తున్నాడు. డా॥ పూర్ణచందులాంటి వారికిది సాహసమే. ఈ సాహసాన్ని ఆయన అలవోకగా నిర్వహిస్తున్నాడు. సాహస మనడం ఎందుకంటే, ఆయన బహువ్యాపి. పైకి రెండు చేతులు కన్పిస్తున్నా వెయ్యి చేతులతో పని చేస్తున్నాడు. 9 వార, మాస పత్రికల్లో వివిధ అంశాల పైన ఏక కాలంలో శీర్షికలు నిర్వహిస్తున్నాడు. ఇప్పటికే శతాధిక గ్రంథకర్త. బహుపార్శ్వీన శేముషీ గుణ సంపన్నుడు అనకుండా ఉండలేను.

పద్యం అనేది ఒక వ్యాజం. దాని వంకతో ప్రపంచంలోని పలు అంశాలను ఆయన వెలిగిస్తూ పోయాడు. ప్రతి పద్య వ్యాఖ్యానానికీ ఒక వినిర్మాణాన్ని (ఫార్మెట్) ఏర్పరచుకున్నాడు. మొదట పద్యాన్ని ఒక ప్రవచన పద్ధతిలో ఉన్మీఖీకరణం కావించడం, అది ఏ కవిదో చెప్పి సందర్భోచితంగా వివరించడం, ఇక దాని పాదాలను పక్షాలుగా మార్చుకొని సాహిత్య వీధుల్లో విహరించడం. వ్యాసికను

ముగించే సరికి ఆ పద్యంతో మనకు పరిచయమే కాదు ఆత్మీయత కూడా ఏర్పడుతుంది. అదే దాని సాఫల్యం. ఎక్కడా తన పాండిత్య ప్రదర్శనకు చోటివ్వడం కంటే పాఠక హృదయాల్లో దానికి చోటు సంపాదించడమే ధ్యేయంగా పెట్టుకున్నాడు. అనువాదంలో తెలుగుదనం అమలినశృంగారం, కాలానికి నిలిచే విమర్శ, తెలుగు భాషకు తిరుక్షౌరం, నీటి దొంగలు, వ్యర్థ ప్రయోగ నిష్ఫలాలు, సభామర్యాదలు లాంటి వాటి గురించి మనం కూడా పరామర్శ ప్రాయమైన వ్యాసాలు రాయొచ్చు.

కాలానికి నిలిచే విమర్శ అనేవ్యాసంలో తెలుగువారికి విమర్శను సహృదయంగా స్వీకరించే గుణం ముందునుండీ లేనట్టుంది. అందుకని, తెలుగు కావ్యాలలో పాత్రలుకూడా విమర్శనా అసహిష్టతనే ఎక్కువగా ప్రదర్శిస్తుంటాయి. సాక్షాత్తు పరమేశ్వరుడైనా అంతే! అంటారు పూర్ణచందు. ఇది నిజం

పూర్ణచందు అనే పేరు ఈయన పట్ల సార్థకమయ్యింది. అబ్బో! ఈయన ఎప్పుడు శ్వాసిస్తున్నాడు, ఎప్పుడు భోంచేస్తున్నాడు, అక్షరం ఈయన తత్వంలో ఎలా నిరంతరం ప్రసరిస్తున్నది! ఇది నిజంగా ఆశ్చర్యమే. వృత్తిరీత్యా ఆయుర్వేద వైద్యుడు. తెలుగువారి ఆహార చరిత్రపైన 9 పుస్తకాలు రాశాడు! ఆహారవేదం పేరుతో 600 పేజీల గ్రంథం వచ్చింది. నా చిన్నతనంలో ఈ గ్రంథం చదివివుంటే నా ఆహారపుటలవాట్లు ఇంత కన్నా బాగుండేవనిపించింది.

డా॥ పూర్ణచందు భాషావేత్త అనడానికి నేనే మాత్రం సంకోచించను. ఆఫ్రో ఏసియాటిక్ భాషల్లో తెలుగు పదాలకు మూలాలు వున్నాయన్న అంశ మొక్కటి. చాలు. అకడిమీషియన్లు ఇక మీద దీనిపై దృష్టి పెట్టవచ్చు. తెలుగు ప్రజలు తెలుగు నేల పైన సింధూనాగరికతకు సమకాలికులుగా వుండే అవకాశం వుందని కొత్త ఆలోచనలు రేకెత్తించారు డా॥ పూర్ణచందు.

అమలినశృంగార గ్రంథరచన కూడా మౌలికమైనదే. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాలకు సాంఖ్య శాస్త్రంలోని అంశాలతో తులనాత్మక అధ్యయనం చేసి వ్రాసిన గ్రంథమిది.

ఇక భాషోద్యమ సైనికుడుగా ఆయన చేసిన, చేస్తున్న కృషి కలకాలం నిలిచిపోతుంది. ఈ కృషి తెలుగు ప్రాచీనత గుర్తింపు దాకా వెళ్లింది. వృక్ష శాస్త్రంలో కూడా ఈయన పరిజ్ఞానం తక్కువదేమీ కాదు. మూడున్నర దశాబ్దాల్లో డా॥ పూర్ణచందు వందకు పైగా గ్రంథాలను వెలువరించడం కేవలం సంఖ్యా ప్రసిద్ధి కోసం కాదు. ప్రతి పుస్తకం సమాజం పైన తనదైన ముద్ర వేసిన నాణ్యతా పూర్ణమైనది.

ఇన్నీ ఉండి సహృదయత లేకుంటే ఎలా వుంటుంది? అది డా॥ పూర్ణచందు లాగ వుండదు. మినీకవితా ఉద్యమానికి ఆయన చేసిన సేవ ఆవిస్మరణీయం.

డా॥ పూర్ణచందు సామాన్యుడు కాదు. ఆయన సమర్థమైన కార్యకర్తృత్వం కూడా ఆయనలోని సాహితీ సంవేదనకు శాస్త్ర వైదుష్యాన్ని ఏ మాత్రం చంపలేకపోయింది. ఈయన ఇంకా షష్ట్యబ్దాలు కూడా నిండని యువకుడు. మానసికంగానైతే నవయువకుడు.

ఇక ప్రస్తుత గ్రంథ విషయానికొస్తే ఇంగ్లీషు వారిలాగ పద్యం ఒక Stanza కాదు. Poem is prose style కాదు. అదొక రసాత్మక వాక్యం. వ్యుత్పత్తిని బట్టి పాదాలను హింసించేది కాదు, కొత్త ధ్వనులను స్థాపించేది.

పదం ద్వారానే పుట్టినా పదానికి కొత్త నైగనిగ్యాన్ని సంతరించే రసనాదం పద్యం. పదానికి హితమైనది. జనానికి ఇష్టమైనది. ఆ ఇష్టాన్ని మరింత పెంచే దిశగా సాగింది డా॥ పూర్ణచందు వ్యాఖ్యానం.

ఈ విలువైన గ్రంథం సకల సన్మిత్రుడు, సాహితీ ప్రియుడు రాజకీయ నిర్మలుడూ అయిన డా॥ మండలి బుద్ధప్రసాద్ పుష్యబ్ధి కానుకగా విడుదల కావడం వారికి బంగారానికి తావి అబ్బినట్టు ! డా॥ పూర్ణచందుకు నా హృదయ పూర్వక అభినందన.


# కృతజ్ఞతలు

**'పద్యంలో మనం'** పుస్తకానికి తన గద్యంలో నన్ను రంగరించి తొలిపలుకుల గుళికలను అందించిన ఆత్మీయులు గౌరవనీయ **ఆచార్య గోపీ** గారికి,

విశాలాంధ్ర దినపత్రికలో 'పద్యానుభవం' పేరుతో ఇందులోని వ్యాసాల న్నింటినీ ప్రచురించి, వ్రాసినంత కాలం ఈ శీర్షికని కొనసాగించదంటూ నన్ను ప్రోత్సహించిన సంపాదకులు **శ్రీ ముత్యాల ప్రసాద్** గారికి,

ఈ 'కృతి'ని స్వీకరించిన మాన్యులు **మండలి బుద్ధ ప్రసాద్** గారికీ ప్రచురించిన శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణల అధినేత లయన్. వల్లంరెడ్డి లక్ష్మీనరసారెడ్డిగారికి, కవి మిత్రులు శ్రీ విహారి గారికి, శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి గారికి,

ధన్యవాదాలతో.....

**జి.వి. పూర్ణచందు**

# పద్యంలో మన వరుస...

# అచ్చతెనుగు తీయన

"పగలు సేయుచు వేడిమి మిగుల జగము
గ్రాచు జమునబ్బ మున్నీట గలిసె ననియొ
తొగ వెలందుక నగియె నమ్మగువ పెంపు
గని సయింపక తమ్మి మొగంబు మొగిచె"

పగలంతా తన వేడిగాడ్పులతో అడలెత్తించిన సూర్యుడు సాయంత్రం అయ్యేసరికి సముద్రంలో మునిగిపోయాడని కలువమ్మాయి నవ్వింది. దాని విప్పారిన ముఖాన్ని చూసి తామరమ్మాయి ముఖం చిన్నబుచ్చు కుందట. ఇందులో కేతన కవి సంస్కృత నుడులకుచేసిన అచ్చతెలుగు కూర్పులనేకం కనిపిస్తాయి. చదవగానే అర్థం తట్టక పోవచ్చు గానీ, విడమర్చి చూస్తే ఎవరికి వాళ్లకే కళ్లకు కదుతుంది.

ఒకమాటని ఇంకో భాషలోకి అరువుగా తెచ్చుకోవటం మామూలుగా జరిగేదే! రైలు, రోడ్డు, బస్సు, ఫ్యాను, మిషను లాంటివి మాటలు తెలుగుకాదంటే కుదర దన్నంతగా అవి తెలుగులో కలిసిపోయాయి. ఇప్పటికి కనీసం మూడు వేల యేళ్ళక్రితం, తెలుగు సంస్కృత భాషల మధ్య ఇలాంటిదేదో ఒకటి నడిచింది. అది పాణినికి ముందో, తర్వాతో జరిగి ఉంటుంది.

కొన్నేళ్ళపాటు ఆ రెండు భాషలు మాట్లాడిన వాళ్ళు పక్కపక్కన బతికిన కారణంగా చాలా తెలుగు మాటలు సంస్కృతభాష లోకి, సంస్కృతం మాటలు తెలుగులోకి చేరి ఉంటాయి. ఒక భాషలోంచి పదాలు ఇంకో భాషలోకి కాలవ లాగా జర్రున పోలేవు, ఇచ్చి పుచ్చుకునే పద్ధతిలో(ఆదానప్రదానాలు)ఎదురుకోలు నడకలు నడుస్తాయి. అలా కొన్ని సంస్కృతం నుడులు తెలుగులోకీ, కొన్ని తెలుగు నుడులు సంస్కృతంలోకీ వెళ్ళాయి.

కాలక్రమంలో అటువెళ్ళిన తెలుగు మాటల్ని కూడా సంస్కృతం లోంచి అరువు తెచ్చిన పదాలుగానే ముద్రవేయటం మొదలు పెట్టారు. అది తెలుగు ప్రాచీనతని తక్కువ చేయటానికి కారణం అయ్యింది. తెలుగు పండితులు కూడా తెలుగు భాషకు వెయ్యేళ్ళకన్నా మించిన చరిత్ర లేదనే ఒక బలమైన నమ్మకంలో ఉండిపోయారు. అకారణంగానే తెలుగు నేలపైన ఒక్క విశ్వవిద్యాలయంలో కూడా తెలుగుభాష ప్రాచీనత గురించి సమగ్ర పరిశోధన జరగలేదు. మన భాషా శబ్దాలను అరువు వచ్చిన వనటం, మన స్వంత ఇంటికి మననుండి అద్దె వసూలు చేయటం లాంటిది! సంస్కృతం, తెలుగు భాషల మధ్య మాటల రాకపోకల్ని, ఆ కాలాన్ని తేల్చితే, తెలుగమ్మ "సంస్కృతమాత"కు అప్పగారో, చెల్లెలో తెలిసి ఉండేది.

ఎఫ్.బి.జె.క్వీపర్ అనేభాషావేత్త ఋగ్వేదంలో "ఇండోఆర్యన్ భాషాకూటమి" కి చెందని దాదాపు 350 ఇతర భాషా పదాలు ఏరి, "ఇవి వేదభాష లోకి వచ్చిన ముండా లేదా ద్రావిడ భాషా కూటమి పదాలు కావచ్చు"నన్నాడు.'క్వీపర్స్‌లిష్టు'గా ఇది ప్రసిద్ధి చెందింది. వాటిలో పుత్ర, మత్స్య, మయూర, గజ, తాళ- ఇలాంటిపదాలు కూడా ఉండటంతో అబ్బుర పడ్డారంతా!

తొంబై యేళ్ళ క్రితం కోరాడ రామకృష్ణయ్యగారు 'పుత్ర, మత్స్య, తాళ...' ఇవి తెలుగు లోంచే సంస్కృతం లోకి వెళ్ళాయన్నారు. దీని వైనం ఏవంటే, తెలుగు భాష ఇచ్చి

పుచ్చుకుని ఎదిగిందే గానీ, పుచ్చుకుని మాత్రమే పెంపు పొందలేదని! పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు వీళ్ళ రోజుల్లో జాను తెనుగు, దేశికవిత వాదాలు బలంగా ఉండేవి. తిక్కన, కేతనల కాలానికి అచ్చతెలుగు వాదం వచ్చింది. సంస్కృత పదాలను తెలుగులోకి అనువదించటం కోసం అనవసర ప్రయాస పడకుండా ఉన్నపళంగా తీసుకుని వాడేసినవాడు నన్నయ. వాటిని సాధ్యమైనంత తెలుగులోకి తేవటానికి ప్రయాస పడినవాడు తిక్కన. కేతన, ఇంకాఎందరో ఇతర కవులు ఆయన వెంట నడిచారు.

ఈ పద్యంలో ఇలాంటి అచ్చ తెలుగింపులు కొన్ని ఇంపుగా కనిపిస్తాయి... **పగలు సేయుచు** : పగటిపూటను చేస్తూ ...,**వేడిమి మిగుల జగముగ్రాచు:** తనవేడితో జగాన్ని ఉడికిస్తూ..., **జమునబ్బ:** యమునా నదికి తండ్రి అయిన సూర్యుడు **మున్నీట** : సముద్రంలో; **గలిసె ననియె:** కలిసిపోయాడని కాబోలు; **తొగవెలందుక** : కలువబాల ; **నగియె** : నవ్విందట; **నమ్మగువ పెంపుగని:** నవ్వుతున్నప్పుడు విప్పారిన ఆమె ముఖాన్ని చూసి **సయింపక:** సహించలేక ; **తమ్మి:** తామర పూబాల ; **మొగంబు మొగిచె** : ముఖం ముడుచుకున్నదట

సూర్యుడు అనే సంస్కృత మాటని అచ్చతెలుగు చేయటానికి "పగలు సేయువాడు" అని అనగలగాలంటే కవికి గట్టి పాండిత్యంతోపాటు, అమ్మనుడి పట్ల అభిమానం కూడా ఉండాలి.శాస్త్ర సాంకేతిక మైన, వేదాంత పరమైన పదాలను ఇంకో భాషలోకి తర్జుమాచేయాలంటే ఒదగక పోవచ్చు. తర్జుమాయే ఒక్కోసారి అందంగా కనిపించవచ్చు! వృషభవాహనుణ్ణి 'ఎద్దునెక్కి తిరిగెడివాడు' అన్నప్పుడు అదిమామూలు అనువాదం అవుతుంది. "గిత్తతత్తడి సామి" అంటే అందులో అచ్చ తెలుగుదనం అందంగా అమరి కనిపిస్తుంది.

పుట్టన పుట్టినాయన(వాల్మీకి)లాగానే జనంలో నానే నుడుల్నీ, జగంలో ఉన్న కథల్నీ ఏరి తెచ్చి, తెలుగమ్మకు మెతుకు చూపాలనుకోవటం (నైవేద్యం) ఇప్పుడు మన కవులకు అక్కర కావాలి! కబ్బాల(పుస్తకాలు) లోంచి ఊరే దాని కన్నా ఊరోళ్ళు వాడే దానిలో అచ్చతెనుగు తీపి ఎక్కువ. ☆

# అధికార మదం

**"అభ్రమండలి మోచునందాక నూరక/పెరిగినట్లో మేను నరవరేణ్యా**
**యవధి భూధర సానువందాక నూరక/పరచినట్లో మేను పార్థివేంద్ర**
**యబ్జ భూభువనంబునందాక నూరక యెగసినట్లో మేను జగధీశ**
**యహిలోకతల మంటు నందాక నూరక/పడినయట్లో మేను ప్రభువతంస**
**యఖిల జగములు మ్రింగునంతాకలియును**
**నబ్ధులేడును జెడగ్రోలు నంత తృషయు**
**నచల చాలన చణమైన యదట గలిగె**
**నసురభావంబు నను జెందు నవసరమున"**

ఆల్కాహాల్ సేవించిన వాడిలో కలిగే లక్షణాన్ని 'మదం' అంటారు. మదం వలన చెలరేగి ప్రవర్తించటాన్ని 'మదాత్యయం' అంటారు. అప్పటిదాకా ...ఏవండీ' అన్నవాడు కాస్తా, రెండు చుక్కలు పడగానే 'ఏరా'లోకి దిగిపోతాడు. "మదం ఎక్కిందా?" అని మందలించడం తెనాలి రామకృష్ణుడు "కల్లు జవి గొన్నావా? ..." అని తిట్టిన తిట్టు లాంటి దన్నమాట.

మందుకొట్టాక, మదం ఎక్కగానే కొన్ని లక్షణాలు పేట్రేగుతాయి. ఆకాశం దాకా పెరిగిపోయి దాన్ని ఆక్రమించాననుకుంటాడు. భూమికి ఆ అంచునుంచీ ఈ అంచు దాకా అంతా తనదే పొమ్మంటాడు. కింద పాతాళం కూడా తన ఆధీనం లోదే నంటాడు. అన్ని లోకాల్నీ కబళించేయాలన్నంత ఆకలి, సప్త సముద్రాలనూ తాగేయాలన్నంత దాహమూ కలిగి, అది తీరక మళ్ళీమళ్ళీ మదిర సేవిస్తుంటాడు. ఇలా లోకాల్ని కబళించే కలలు తియ్యగా కనటాన్ని పామర భాషలో 'కిక్కు' అనీ, పండిత భాషలో 'మదం' అనీ అంటారు. తను తలుచుకుంటే ఈ కొండని ఒక్క తన్ను తన్ని సినిమాలో లాగా అవతలికి విసిరి కొట్ట గలననుకునే వింత తత్వమే మదం. చివరికి ఏ మురుక్కాలువ పక్కనో పడున్నాడని తెచ్చి తెలిసినవాళ్ళు అప్పచెప్తుంటారు. మదం తెచ్చి పెట్టే ప్రమోదమూ, ప్రమాదమూ ఇలా ఉంటాయి.

మందు కొట్టటం వలన కలిగే మదం కన్నా 'అధికార మదం' అంతకన్నా ఎక్కువ కిక్కు ఇస్తుంది. పదవిలోకి వచ్చీరాగానే వెంటనే అధికారమదం తలకెక్కిపోతుంది. చిటికెలో కిక్కెక్కే గుణాన్ని 'యోగవాహి' అంటారు. అంతటి శక్తి ఒక్క 'అధికార పదవి' కి మాత్రమే ఉంది. పదవి రాగానే పైన ఆకాశం దాకా,

కింద పాతాళం దాకా, చుట్టూ ఆ కొన నుండి ఈ కొనదాకా మొత్తం తన కబ్జాలోనే ఉండాలంటాడు. లోకాలన్నింటినీ కబళించేస్తాననీ, సప్త సముద్రాల్ని తాగేస్తాననీ అంటాడు.

లోకానికి హాని చెయ్యడం కోసం మనిషి లోపలికి ఓ రాక్షసుడు ప్రవేశిస్తాడు. ఆ రాక్షసుడు అతన్ని ఆక్రమించినప్పుడు అతనిలో కలిగే ఇలాంటి లక్షణాల్నే 'మదం' అంటారు. 'మందు మదం' భ్రమను కల్పిస్తే, 'అధికార మదం' దాన్ని నిజం చేస్తుంది.

పైన చెప్పిన పద్యం అల్లసాని పెద్దనగారి 'మనుచరిత్ర' లోది. తనకు వైద్యం నేర్పటానికి బ్రహ్మదత్తుడనే ముని ఒప్పుకోలేదని, ఇందీవరాక్షుడు ఆయన వైద్య పాఠాలు రహస్యంగా విని వైద్యం నేర్చేసుకుని, తిరిగి ఆ ముని దగ్గరకే వెళ్ళి వెక్కిరిస్తాడు. ఒళ్ళు మదం ఎక్కికొట్టుకోవటం అంటే ఇదే! దాంతో ముని అతన్ని రాక్షసుడివై పొమ్మని శపించాడు. ఆ క్షణంలో అతన్ని ఒక రాక్షసుడెవరో ఆవహించినట్టు తాను భూమ్యాకాశ పాతాళాల దాకా పెరిగిపోయిన భావన పొందినట్టు, లోకాల్ని కబళిస్తు న్నట్టు, సముద్రాల్ని తాగేస్తున్నట్టు అన్పించిందని, ఇందీవరాక్షుడు స్వారోచిషుడికి చెప్పటం ఈ పద్యంలో కనిపిస్తుంది.

ప్రతి మనిషిలోనూ ఒక సైతాన్ ఉంటాడు. మనసులోని సత్వగుణం ఈ సైతాన్ని అణచి ఉంచాలని చూస్తుంది. సత్వం గెలిస్తే మనిషి మానవుడు అవుతాడు. సైతాన్ గెలిస్తే మనిషి పొలిటికల్ మాఫియా అవుతాడు. ఇది ఎవరో పుణ్యాత్ముడు ఇచ్చే శాపం వలనే జరగాలని లేదు. మనిషి మనసులో సాత్వికాంశ పలచ బడే కొద్దీ సైతాను తనకు తానుగా విజృంభిస్తుంటాడని ఫ్రాయిడ్ సిద్ధాంతం. "నాది దుందుడుకు స్వభావం. కోపం వస్తే కొడతాను. తప్పేంటి?" అని ఒక నేత బహిరంగంగా అన్నాడంటే, పాపాలకు శాపాలు కారణం కాదనీ, అవి భస్మాసుర వరాలేననీ అర్థం అవుతుంది.

వెనకటికి ఒక బామ్మగారు "నీ ఇంట కోడి కాల్చా" అని శపిస్తే, శుభం అన్నాడట పక్కింటాయన రొట్టలేస్తూ! ఈ రోజుల్లో బ్రహ్మదత్తుడు వచ్చి దుర్మార్గం చేసిన వాణ్ణి 'బ్రహ్మ రాక్షసుడివైపో' అని శపిస్తే, వెంటనే సదరు దుర్మార్గుల వారు ముని గారికి ఆజన్మాంతం ఋణపడి ఉంటా నంటాడు. జన్మజన్మలకూ రాక్షసుడిలాగే ఉండనివ్వాలని, శాప విమోచనం వద్దనీ అడుగుతాడు.

'Drive the Devil Out'-నీలో సైతాన్ తరిమేసేయ్' అనేదిపాత పాట!"Keep the Devil in'-నీలో సైతాన్ని దాచేయ్-దోచేయ్" అనేది నేటి మేటి నీతి. ☆

# అనుకూల వార్తలు

**అటవిన్నందిన యట్టివాని పొడవెం తన్నట్లు ఫాలాక్షునె**
**క్కటికయ్యంబున గన్న ఫల్గుణు భుజాగర్వంబు లెక్కించుటం**
**తటి వానింగొనొ ధర్మసూతిసమరోత్సాహంబుమై నెత్తి వ**
**చ్చుటకుం గొంకునె వీపు సక్కనయి నిల్చుం గాక మీ సైన్యముల్**

వార్తలు తెచ్చేవాళ్ళని ఈ కాలంలో పాత్రికేయులు, విలేకరులు అంటున్నాం. మహాభారత యుద్ధ సమయంలో సంజయుడు యుద్ధ విలేకరి పాత్ర పోషించాడు.

జరుగుతున్న సంఘటనల్లోంచి వార్తను ఏరి తెచ్చి అందించటం వార్త నందించే వాడి విధి. ఇక్కడ వార్తను చేర వేస్తున్నవాడు సంజయుడు, వింటున్నవాడు ధృతరాష్ట్రుడు రేడియో వార్తలు చదవటం లాంటిదీ సన్నివేశం.

అది రేడియో వార్తలైనా, దూరదర్శన్ వార్తలైనా, ఇతర ప్రైవేట్ ఛానల్ల వార్తలైనా లేక అచ్చు వార్తలైనా వార్త 'అచ్చం' గా ఉండాలి. వార్తకు మషాలాలు అతిగా జోడిస్తే చివరికి గ్రేవీ తప్ప అందులో కూరముక్కలు లేకుండా పోయే ప్రమాదం ఉంది.

నేపాలీ భాషలో మషాలా అనే పదానికి భిన్నార్థాలున్నాయి. 'ఈ రేడియోలో మషాలా చచ్చిపోయింది.' అంటే వార్తలూ చప్పగా ఉన్నాయనో , రేడియో సరిగా వినిపించడటం లేదనో, మనకు ఇష్టమైన వారికి అనుకూలమైన వార్తలు లేవనో కాదు. ఆ రేడియోలో బ్యాటరీ అయిపోయిందని అర్థం.

కలకలమో కోలాహలమో కలిగేలా వార్తని ఉపయోగించు కోవటం, అనుకూలమైన రాజకీయ పక్షానికి అనుకూలంగా వార్తని మెలి తిప్పటాల్ని వార్తలో మషాలాగా భావించుకుంటే, ఒక దశలో జర్నలిజం బ్యాటరీ కూడా అయిపోయే ప్రమాదం ఉంది. వార్తల్లో మషాలా లేదంటే పచ్చి నిజాలే ఉన్నాయని అర్థం. పచ్చి నిజాల్ని పండేలా చేసి, రసం పిండి, రుచికరమైన పానీయంగా మార్చే క్రమంలో మషాలాలు చేరిపోతాయి.

మహాభారతం చదివే పాఠకుడు కూడా పాండవ పక్షపాతంతోనే చదువుతాడు. కాబట్టి, పాండవ పక్ష రచయితలు యుద్ధవార్తల్ని పాండవానుకూలంగా చెప్పించటం సహజం. సంజయుడు ధృతరాష్ట్రుడికి మషాలా దట్టించి, బాగా ఉడికించిన వార్తలు చెప్పా దనటానికి తిక్కనగారి ఈ పద్యం సాక్ష్యం. చిట్టచివరికి పాండవులే గెలిచారు కదా అని అడగవచ్చు. ఆ గెలుపు మొదటి రోజే నిశ్చయం అయ్యింది కాదు. రెండు

వైపులా వేలాది యోధులు నేల కొరిగాకే సాధ్యం అయ్యింది. కానీ, మొదటి రోజు నుండీ సంజయుడు" ఆ పాండవులు ముందు మీ కౌరవసేనఎంత?" అన్నట్టుగా వ్యాఖ్యానాలు జోడిస్తో వార్తలు చెప్పటాన్ని గమనించాలి!

**ఆట మిన్నందిన యట్టి వాని పొడవెతన్నట్టు** : అక్కడ ఆ యుద్ధ రంగంలో ఆకాశం అంత ఎత్తున ఎదిగిన వాడి పొడవెంత...? అని కొలవటం సాధ్యం కాదు.

**ఫాలక్షు నెక్కటి కయ్యంబున గన్న ఫల్గుణు భుజాగర్వంబు లెక్కించు** : సాక్షాత్తూ శివుడితో తలపడి, గెలిచి, పాశుపతాన్ని సాధించుకున్న వాడి భుజగర్వాన్ని అంటే, యుద్ధచాతుర్యాన్ని, బలాన్ని లెక్కించటం సాధ్యంకాదు.

**అంతటి వానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబు మైనెత్తి వచ్చుటకుం గొంకునె:** అంతటి మహావీరుడూ, తన తమ్ముడూ అయిన అర్జునుడు ఉండగా సమరోత్సాహంతో దాడిచేయటానికి వెనుకాడతాడా ధర్మరాజు...?

**వీపు సక్కనయి నిల్చుంగాక మీ సైన్యముల్** : రేపటియుద్ధంలో అబ్బో! మా వీపులు చూడండి! ఎంతచక్కగా ఉన్నాయో " అంటూ మీ మహా సైన్యం అంతా వెన్ను చూపి పారిపోవాల్సిందే" అని హెచ్చరిస్తాడు. పాఠకుడు పాండవ పక్షపాతిగా ఈ కథని చదువుతాడు కాబట్టి ఇది ఆనందంగానే వుంటుందడానికి ! కానీ వార్తలు చెప్పవలసిన పద్ధతి ఇదేనా ?

అవతలి పక్షం వాడిమైండ్ 'సెట్ మీద ఒక వార్త ద్వారా ఎంతటి ప్రభావాన్ని కలిగించ వచ్చో బాగా అర్థంచేసుకున్న వాడు సంజయుడు. దుర్యోధనుడికి పరాజయం తప్పదనే అభిప్రాయన్ని ధృతరాష్ట్రుడిలో కలిగించటం అతని ధ్యేయం. అవతలి వాడి ఉప్పు తింటూ ఇవతలి వాడికి ప్రయోజనం చేకూరేలా వ్యవహరించటమే ఇది ! ఓడిపోయే భాగ్యానికి యుద్ధం దేనికని ధృతరాష్ట్రుడు అనుకోవాలి. ఆ మేరకు దుర్యోధనుడి పైన వత్తిడి తేవాలి... ఇదీ సంజయుడి మనసులో మాట.

వచ్చేస్తోంది ఫలానా పార్టీ' అంటూ పోలెగాళ్ళు (Polsters) జర్నలిజం ముసుగులో ఉన్న పార్టీల ఏజెంట్లు చేసే ట్రిక్కులు ఇవే!

ఇవి ఓటర్లని పెద్ద ఎత్తున ప్రభావితం చేయకపోవచ్చుగాని, పందెం రాయుళ్ళ మీద మాత్రం ఎక్కువ ప్రభావం చూపిస్తుంది. అనుకూల వార్తలు రాయించుకునేది పందెగాళ్ళే నంటే ఆశ్చర్యంలేదు. ★

# అచ్చతెనుగు తీయన

"పగలు సేయుచు వేడిమి మిగుల జగము
గ్రాచు జమునబ్బ మున్నీట గలిసె ననియొ
తొగ వెలందుక నగియె నమ్మగువ పెంపు
గని సయింపక తమ్మి మొగంబు మొగిచె"

పగలంతా తన వేడిగాడ్పులతో అడలెత్తించిన సూర్యుడు సాయంత్రం అయ్యేసరికి సముద్రంలో మునిగిపోయాడని కలువమ్మాయి నవ్వింది. దాని విప్పారిన ముఖాన్ని చూసి తామరమ్మాయి ముఖం చిన్నబుచ్చు కుందట. ఇందులో కేతన కవి సంస్కృత నుడులకుచేసిన అచ్చతెలుగు కూర్పులనేకం కనిపిస్తాయి. చదవగానే అర్థం తట్టక పోవచ్చు గానీ, విడమర్చి చూస్తే ఎవరికి వాళ్లకే కళ్లకు కదుతుంది.

ఒకమాటని ఇంకో భాషలోకి అరువుగా తెచ్చుకోవటం మామూలుగా జరిగేదే! రైలు, రోడ్డు, బస్సు, ఫ్యాను, మిషను లాంటివి మాటలు తెలుగుకాదంటే కుదర దన్నంతగా అవి తెలుగులో కలిసిపోయాయి. ఇప్పటికి కనీసం మూడు వేల యేళ్ళక్రితం, తెలుగు సంస్కృత భాషల మధ్య ఇలాంటిదేదో ఒకటి నడిచింది. అది పాణినికి ముందో, తర్వాతో జరిగి ఉంటుంది.

కొన్నేళ్ళపాటు ఆ రెండు భాషలు మాట్లాడిన వాళ్ళు పక్కపక్కన బతికిన కారణంగా చాలా తెలుగు మాటలు సంస్కృతభాష లోకి, సంస్కృతం మాటలు తెలుగులోకి చేరి ఉంటాయి. ఒక భాషలోంచి పదాలు ఇంకో భాషలోకి కాలవ లాగా జర్రున పోలేవు, ఇచ్చి పుచ్చుకునే పద్ధతిలో(ఆదానప్రదానాలు)ఎదురుకోలు నడకలు నడుస్తాయి. అలా కొన్ని సంస్కృతం నుడులు తెలుగులోకీ, కొన్ని తెలుగు నుడులు సంస్కృతంలోకీ వెళ్ళాయి.

కాలక్రమంలో అటువెళ్ళిన తెలుగు మాటల్ని కూడా సంస్కృతం లోంచి అరువు తెచ్చిన పదాలుగానే ముద్రవేయటం మొదలు పెట్టారు. అది తెలుగు ప్రాచీనతని తక్కువ చేయటానికి కారణం అయ్యింది. తెలుగు పండితులు కూడా తెలుగు భాషకు వెయ్యేళ్ళకన్నా మించిన చరిత్ర లేదనే ఒక బలమైన నమ్మకంలో ఉండిపోయారు. ఆకారణంగానే తెలుగు నేలపైన ఒక్క విశ్వవిద్యాలయంలో కూడా తెలుగుభాష ప్రాచీనత గురించి సమగ్ర పరిశోధన జరగలేదు. మన భాషా శబ్దాలను అరువు వచ్చిన వనటం, మన స్వంత ఇంటికి మననుండి అద్దె వసూలు చేయటం లాంటిది! సంస్కృతం, తెలుగు భాషల మధ్య మాటల రాకపోకల్ని, ఆ కాలాన్ని తేల్చితే, తెలుగమ్మ "సంస్కృతమాత"కు అప్పగారో, చెల్లెలో తెలిసి ఉండేది.

ఎఫ్.బి.జె.క్వీపర్ అనేభాషావేత్త ఋగ్వేదంలో "ఇండోఆర్యన్ భాషాకూటమి" కి చెందని దాదాపు 350 ఇతర భాషా పదాలు ఏరి, "ఇవి వేదభాష లోకి వచ్చిన ముండా లేదా ద్రావిడ భాషా కూటమి పదాలు కావచ్చు"నన్నాడు.'క్వీపర్స్‌లిష్టు'గా ఇది ప్రసిద్ధి చెందింది. వాటిలో పుత్ర, మత్స్య, మయూర, గజ, తాళ- ఇలాంటిపదాలు కూడా ఉండటంతో అబ్బుర పడ్డారంతా!

తొంబై యేళ్ళ క్రితం కోరాడ రామకృష్ణయ్యగారు 'పుత్ర, మత్స్య, తాళ...' ఇవి తెలుగు లోంచే సంస్కృతం లోకి వెళ్ళాయన్నారు. దీని వైనం ఏవంటే, తెలుగు భాష ఇచ్చి

పుచ్చుకుని ఎదిగిందే గానీ, పుచ్చుకుని మాత్రమే పెంపు పొందలేదని! పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు వీళ్ళ రోజుల్లో జాను తెనుగు, దేశికవిత వాదాలు బలంగా ఉండేవి. తిక్కన, కేతనల కాలానికి అచ్చతెలుగు వాదం వచ్చింది. సంస్కృత పదాలను తెలుగులోకి అనువదించటం కోసం అనవసర ప్రయాస పడకుండా ఉన్నపళంగా తీసుకుని వాడేసినవాడు నన్నయ. వాటిని సాధ్యమైనంత తెలుగులోకి తేవటానికి ప్రయాస పడినవాడు తిక్కన. కేతన, ఇంకాఎందరో ఇతర కవులు ఆయన వెంట నడిచారు.

ఈ పద్యంలో ఇలాంటి అచ్చ తెలుగింపులు కొన్ని ఇంపుగా కనిపిస్తాయి... **పగలు సేయుచు** : పగటిపూటను చేస్తూ ...,**వేడిమి మిగుల జగముగ్రాచు:** తనవేడితో జగాన్ని ఉడికిస్తూ..., **జమునబ్బ:** యమునా నదికి తండ్రి అయిన సూర్యుడు **మున్నీట** : సముద్రంలో; **గలిసె ననియెు:** కలిసిపోయాడని కాబోలు; **తొగవెలందుక** : కలువబాల ; **నగియె** : నవ్విందట; **నమ్మగువ పెంపుగని:** నవ్వుతున్నప్పుడు విప్పారిన ఆమె ముఖాన్ని చూసి **సయింపక:** సహించలేక ; **తమ్మి:** తామర పూబాల ; **మొగంబు మొగిచె** : ముఖం ముడుచుకున్నదట

సూర్యుడు అనే సంస్కృత మాటని అచ్చతెలుగు చేయటానికి "పగలు సేయువాడు" అని అనగలగాలంటే కవికి గట్టి పాండిత్యంతోపాటు, అమ్మనుడి పట్ల అభిమానం కూడా ఉండాలి. శాస్త్ర సాంకేతిక మైన, వేదాంత పరమైన పదాలను ఇంకో భాషలోకి తర్జుమాచేయాలంటే ఒదగక పోవచ్చు. తర్జుమాయే ఒక్కోసారి అందంగా కనిపించవచ్చు! వృషభవాహనుణ్ణి 'ఎద్దునెక్కి తిరిగెడివాడు' అన్నప్పుడు అదిమామూలు అనువాదం అవుతుంది. "గిత్తతత్తడి సామి" అంటే అందులో అచ్చ తెలుగుదనం అందంగా అమరి కనిపిస్తుంది.

పుట్టన పుట్టినాయన(వాల్మీకి)లాగానే జనంలో నానే నుడుల్నీ, జగంలో ఉన్న కథల్నీ ఏరి తెచ్చి, తెలుగమ్మకు మెతుకు చూపాలనుకోవటం (నైవేద్యం) ఇప్పుడు మన కవులకు అక్కర కావాలి! కబ్బాల(పుస్తకాలు) లోంచి ఊరే దాని కన్నా ఊరోళ్ళు వాడే దానిలో అచ్చతెనుగు తీపి ఎక్కువ. ✪

# అన్నమయ్య వంటకాలు

ఇందిర వడ్డించ నింపుగను/చిందక యిట్లే భుజించవో స్వామి
అక్కాళ పాశాలు అప్పాలు వడలు/పెక్కైన సయిదంపు పేణులును
సక్కెర రాసులు సద్యోఘృతములు/కిక్కిరియ నారగించవో స్వామి
మీరిన కెళంగు మిరియపు దాలింపు/గూరలు కమ్మనికూరలును
సారంపుబచ్చళ్ళు చవులుగ నిట్టే/కూరిమితో జేకొనవో స్వామీ
పిండివంటలును పెరుగులు/మెండైన పాశాలు మెచ్చి మెచ్చి
కొండలపొడవు కోరి దివ్యాన్నాలు/వెండియు మెచ్చవే వేంకటస్వామీ"

అన్నమయ్య వర్ణించిన వేంకటస్వామి దివ్యాన్నాల పట్టిక ఇది. వీటిని ఇందిరాదేవి ఇంపుగా వడ్డించి తినిపిస్తోందట. వాటిని చిందకుండా అంటే ఒక్క మెతుక్కూడా వదలకుండా భుజించవో స్వామీ...అంటున్నాడు అన్నమయ్య.

**అక్కాళ పాశాలు:** నేతి పాయసాలు

**అప్పాలు,వడలు:** బూరెలు, గారెలు

**పెక్కైన సయిదంపు పేణులు:** అనేక రకాల గోధుమ సేమ్యా వంటకాలు

**చక్కెర రాసులు, సద్యోఘృతములు:** పంచదారతో చేసిన క్రొన్నేతి వంటకాలు

**మీరిన కెళంగు మిరియపు దాల్నింపు గూరలు:** మిరియాల పొడి చల్లి వండిన తాలింపు కూరలు

**కమ్మని కూరలును సారంపుబచ్చళ్ళు:** కమ్మని కూరలు. చక్కని సుగంధ ద్రవ్యాలు వేసి చేసిన రోటి పచ్చళ్ళు

**చవులుగ నిట్టే కూరిమితో జేకొనవో స్వామీ:** ఇట్టే నోరూరే ఈ రుచుల్ని ఇష్టంగా తినవయ్యా స్వామీ

**పిండివంటలును పెరుగులు:** ఇంకా అనేక పిండివంటలు, **పెరుగుతో చేసిన వంటకాలు కిక్కిరియ నారగించవో స్వామి:** అన్నీ దగ్గరగా పెట్టుకుని ఆరగించవయ్యా స్వామీ!

వీటిని 500 యేళ్ళ క్రితం అన్నమయ్య కాలంలో దేవుడికి పెట్టిన నైవేద్యంగా భావించవచ్చు. 'ఋగ్వేద ఆర్యులు' గ్రంథంలో రాహుల్ సాంకృత్యాయన్ చెప్పినట్టు, తమ దేవుడికి దేన్ని నైవేద్యంగా పెట్టుకున్నారో అది ఆకాలం నాటి ప్రజల ఆహారం. అన్నమయ్య చెప్పిన వంటకాలను కూడా ఆనాటి ప్రజల ఆహారంగా భావించవలసి ఉంటుంది. బూరెలు గారెలు, నేతి స్వీట్లు, మిరియాలు వేసి వండిన తాలింపు

కూరలు, సుగంధ భరిత పచ్చళ్ళు, పెరుగు వంటకాలు, పాల వంటకాలూ వీటిలో ఉన్నాయి.

ఇవే గదా ఇప్పుడు మనం తింటున్నవీ...అని అడగొచ్చు. కానీ, ఇప్పటికీ అప్పటికీ చాలా తేడా ఉంది...! చింతపండు రసం కలిపినవీ, అల్లం-వెల్లుల్లి దట్టించినవీ, నూనె వరదలు కట్టేలా వండిన వేపుడుకూరలు, ఎర్రగా మంటెత్తే కొరివి కారాలు, ఊరుగాయల్లాంటి మనం తింటున్న భయంకర వంటకాలేవీ ఈ అన్నమయ్య వంటకాల పట్టికలో లేవు. 500 యేళ్ళ ఆధునికతలో చింతపండు, మిరప కారం, నల్లగా వేయించిన కూరబొగ్గుల్ని మాత్రమే సాధించామని అన్నమయ్య వంటకాలు మనల్ని వెక్కిరిస్తున్నాయి. యాంటీ బయటిక్సు లేకుండానే మన పూర్వులు కమ్మగా తిన్నారు, జీవితాన్ని ఆరోగ్యంగా ఆనందించారు.

మనది ముప్పొద్దుల భోజన సంస్కృతి. ఉదయాన్నే పెరుగు/చల్లన్నం తినటం మన ఆచారం. అది ఇప్పుడు నామోషీ అయ్యింది. దాని స్థానంలో ఇడ్లీ, అట్టు, పూరీ బజ్జీ, పునుగులు తినటం నాగరకం అయ్యింది. అన్నమయ్య కాలానికి మిరప కాయలు మనకింకా పరిచయం కాలేదు. ఇప్పటి ఆవకాయ, మాగాయలాంటి ఊరగాయలు అప్పటి ప్రజలకు తెలీవు. అల్లం, శొంఠి మిరియాల్నే కారపు రుచికి వాడుకునే వాళ్ళు. మిరపకారపు ఊరుగాయలు, చింతపండు పులుసు కూరలు ఎరుగరు. అదే వాళ్ళ ఆరోగ్య రహస్యం.

ప్రపంచీకరణం పాలిట పడ్డ మనకు పీజ్జాలు, బర్గర్లు పవిత్ర వంటకాలైనాయి. ఏడుకొండలవాడి దగ్గరికి సూటూ బూటూ వేసుకుని వెళ్ళి హాయ్ చెప్పి, ఐదు నక్షత్రాల చాక్లెట్లు నైవేద్యం పెట్టటం గొప్పగా భావించే రోజులు ఎక్కువ దూరంలో ఏమీ లేవు. ✪

# అమలిన శృంగారం

**సరస సాంగత్య సుఖ వికాసములకన్న**
**దుస్సహ నియోగ భరమె మధురము సకియ!**
**బాధ లేక వ్యసనరుచి బోధపడదు**
**చీకటులు లేక దీపిక చెలగ నట్లు.**

రాయప్రోలు సుబ్బారావు అనే ఇరవై ఏళ్ళ ఒక తెలుగు యువకవి 1912-13లలో శృంగారం అంటే ప్రేమేననీ, దాని పర్యవసానం పెళ్ళే గానీ సెక్సు కాదనీ, జంట కట్టేవాళ్ళు ప్రేమికులైన దంపతులు కావాలనీ ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దానికి అమలిన శృంగారం అని పేరు పెట్టి ఒక ఖండ కావ్యం వ్రాశాడు. దాని పేరు "తృణకంకణము". ఆ యువకుడే నవ్యాంధ్ర కవితా పితామహుడై ఒక వెలుగు వెలిగాడు. విశ్వనాథ, దేవులపల్లి, తల్లావఝుల, దువ్వూరి, వేదుల మొదలైన మహా కవులంతా ఆయన వెంట నడిచారు. రాయప్రోలు ప్రారంభించిన కవితా ప్రక్రియ ఆ నవ్య కవితోద్యమంగా అది ప్రసిద్ధి చెందింది.

ఒక వివాహిత తన పూర్వ స్నేహితుడితో కలయికను కోరినప్పుడు ఆ యువకుడు మృదువుగా ఆమెకు హితవు చెప్పి ఒప్పిస్తున్న సందర్భంలోది ఈ పద్యం."సరసాలు, సాంగత్యాలు, సెక్సు సుఖవికాసాల కన్నా, కష్టతరమైనప్పటికీ వియోగాన్ని భరించటంలోనే మాధుర్యం ఉంది సకియ! చీకటి లేకపోతే దీపం అవసరం తెలియనట్టే బాధ లేకపోతే సుఖం రుచి బోధపడదు" అంటాడతను. అతని హితబోధను ఆమె విన్నది. కామోత్సాహం చల్లారి పోయింది. తృణకంకణం కట్టించుకుంది.

"పట్టుతోరంబుపై నిల్చి కట్టువడిన చూపు లంతంతకును సాంధ్య శోభలట్లు వెనుదిరుగ, నొండొరుల జూచుకొనుచు వారునేగి రల్ల నల్లన దమ యిండ్లు సేర" తప్పు చేయకూడదనే నిర్ణయానికి వచ్చి ఆ యిద్దరూ ఎవరిళ్లకు వాళ్ళు ఒకరినొకరు చూసుకుంటూ, నెమ్మది నెమ్మదిగా వెళ్ళిపోయారని వర్ణిస్తాడు కవి.

ఆచార్య వెల్చేరు నారాయణ రావు కవితా విప్లవాల స్వరూపంలో ప్రతి కవితా ఉద్యమం తన పూర్వకవితా ఉద్యమాల పైన తిరుగుబాటుగానే వచ్చిందని వివరిస్తారు. భావకవుల తిరుగుబాటు వలన ప్రబంధ సాహిత్యంలోని నాయిక స్థానంలో నవ్య కవిత్వంలో ప్రేయసి కవితా వస్తువు అయ్యింది. మితిమీరిన స్వేచ్ఛా శృంగార వర్ణనల స్థానే నవ్య కవిత్వంలో వియోగం, విరహం ప్రధానాంశాలైనాయి. నీతి, ధర్మం,

దేశం, జాతి, వీటికి ప్రాధాన్యత పెరిగింది, దేశంలో స్వాతంత్రోద్యమం కూడా ఊపు అందుకోవటంతో దేశభక్తి కూడా ఈ కవులకు ప్రధానాంశం అయ్యింది . రాయప్రోలు వారే ఈ మార్పులక్కూడా ఆద్యుడు.

"ఏ దేశమేగిన, ఎందుకాలిడిన, ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురయిన, పొగడరా నీ తల్లి భూమి భారతిని, నిలుపరా నీజాతి నిండు గౌరవము"...చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్వలచరిత్ర, హృదయములు చీల్చి చదువుడో సదయులార!" "కలదయేని పునర్జన్మ కలుగుగాక, మధుర మధురంబయిన తెనుగు మాతృభాష" అని తెలుగువారిలో రాయప్రోలువారు రేకెత్తించిన స్వభాషాభిమానం ఎన్నటికీ మరువరానిది.

అధునాతన నాగరికతలో స్త్రీ పురుష సంబంధాలు సెక్సుకి అతీతంగా ఉన్నప్పుడే స్త్రీ పురుష సమానత్వం సాధ్యం అవుతుంది. ఇద్దరు మగ స్నేహితులూ, ఇద్దరు ఆడ స్నేహితుల్లా ఇద్దరు స్త్రీపురుషులు ఉండలేరా...? ఉండకూడదా? ప్రతి దానికీ సమాజాన్ని నిందిస్తుంటాం గానీ, సమాజ ఆమోదానికి లోబడిన స్త్రీపురుష సంబంధాల వలన సమాజానికి మేలే కలుగుతుంది. స్నేహం అనేది సమాన స్థాయిగల వారి మధ్యే ఉంటుంది. స్త్రీ పురుషుల మధ్య నిజమైన స్నేహం పురుషుడితో స్త్రీ సమానం అయినప్పుడే వర్ధిల్లుతుంది.

పురుషద్వేషం వలన స్త్రీ సమానత్వం వస్తుందనే అపోహ మనలో చాలామంది కుంది. ఆ మూసపదాల్లోంచి బయట పడితేనే కొత్త దారులు దొరుకుతాయి. పాశ్చాత్యుల్లో మహిళావాదం Feminism ఫెమినిజంః (స్త్రీపురుష సమాన వాదం) స్థానే ...ఫెమెనిజం-(Femenism స్త్రీలు,..-పురుషులు సమానంగా బాధ్యతలు పంచుకునే ఒక కొత్త ఉద్యమం నడుస్తోంది. Fe = స్త్రీలు, men = పురుషులు ఫెమెనిజం అంటే స్త్రీ పురుష సమానత్వం కోసమే పోరాటం. అమలిన శృంగార సిద్ధాంతం వందేళ్ళక్రితం కోరింది ఇదే!

ఇంతకన్నా ముందు, స్త్రీ పురుషుల మధ్య స్నేహం వుండటానికి సమాజ ఆమోదం వుండాలి. ఆమోదించేందుకు తగిన సూత్రాలు కూడా వుండాలి. ☆

# అమ్మానాన్నగిరీ

"అహరహరైధమాన శుభస్వయ వృద్ధికి సాధుబుద్ధికిన్
విహితము ప్రేమభావనకు విశృతకీర్తికి నున్కిపట్టునై
యిహపరసాధకంబగు కులేందుముఖిసుఖమెంత వానికిన్
బహుతర జన్మపుణ్య పరిపాకమునన్ ఫలియించు నెంచగన్"

క్రీ.శ.1670లలో మధుర నాయకరాజు తిరుమలనాయకుడి కాలంనాటి లింగనమఖి శ్రీకామేశ్వరకవి సత్యభామా సాంత్వనం కావ్యంలో వ్రాసిన పద్యం ఇది. ధర్మబద్ధంగా పెళ్ళిచేసుకున్న స్త్రీ పురుషుల మధ్య ఉండే సౌఖ్యానికి 'వెలమిటారు'ల వలన పొందే సుఖానికీ పొంతన లేదంటూ ఈ కావ్యంలో కొన్ని పద్యాలు చెప్పాడు. "వలపొకచో, పిలుపొకచో/బలుకులు వేఱొక్కచోట భావంబొకచో/వెలయించు వెలమిటారుల/వలకగపడి మోసపోవు వారలు గలరే?"అని ప్రశ్నిస్తాడు."జాలము మందుల పొందుల/జాలంబడజేసి తాళజాల నటంచున్/తేలింతురు వెలజంతులు/గాలింతురు చేతిసొమ్ముపడె వడిలోనన్" చేతిలో సొమ్ము పడేవరకూ వల వేస్తారు, మందులు వేస్తారు, పొందుల వలలో పడేలా చేస్తారు. నువ్వు లేకపోతే తాళజాల నంటారు. తేలిస్తారు, గాలిస్తారు! ఈ వెలయాళ్ళ వలన కుటుంబాలు నాశన మౌతాయి. పిల్లలు అమ్మానాన్నల ప్రేమకు దూర మౌతారు.

కులకాంతలు అంటే అగ్ని సాక్షిగా పెళ్ళాడిన ధర్మపత్నుల గురించి చెప్తూ, "మేలెంతురు కులకాంతలు/ తేలింతురు రతులగొంకు దీర్చినకొలదిన్/పాలింతురు కులధర్మము/తాలిమి పచరింతు రెంత తహతహయైనన్" కులకాంతలుమేలు కోరతారు. ప్రేమమీర రతులలో తేలిస్తారు, కులధర్మం పాలిస్తారు,ధైర్యంగా నిజాయితీగా వ్యవహరిస్తారు. అహరహం కుటుంబ అభివృద్ధినే కోరతారు.

ధర్మపత్నితో పంచుకున్న లైంగికత సంతానాభివృద్ధినీ, కుటుంబ అభివృద్ధినీ కలిగిస్తుంది. సుఖజీవనాన్నిస్తుంది.ఏ మగాడికైనా కులేందుముఖి పూర్వజన్మ సుకృతం వలనే లభిస్తుందనీ, ప్రేమభావనకు, విశృతకీర్తికీ ఉనికిపట్టుగా ఇహపర సాధకంగా ఆమె నిలుస్తుందనీ అంటాడు లింగనమఖి శ్రీకామేశ్వరకవి.

గాసటబీసట గాథలు అంటే, గాథాసప్తశతి, బృహత్కథల కాలం నుండీ మన సాహిత్యం అంతా 'పొరుగింటి పుల్లకూర' కోసం తహతహ లాడిన వాళ్ళతోనే

నిండి ఉంది. వాటి నెగెటివ్ ప్రభావం మన మనోఫలకాల మీద తప్పకుండా ఉంటుంది. 'గాథాసప్తశతి'లో ఓ కథ ఉంది. పరరుచి కోసం మోజు కొద్దీ సందె చీకట్లో సంకేత స్థలంలో రహస్యంగా కలుసుకోవాలని దూతికల ద్వారా చెప్పుకున్న ఓ అమ్మాయి, అబ్బాయి చీకట్లో తప్పు చేసి, చివరికి వెలుతురులో ఒకరి నొకరు చూసుకుంటారు. కొంపలు అంటుకున్నాయి- ఆ ఇద్దరూ నిజం భార్యాభర్తలే! ఇద్దరూ తప్పు చేసి ఒకరి ముఖం ఒకరు చూసుకోలేకపోయారు.

సెక్సుహక్కు, సెక్సునీతి, సెక్సుబాధ్యత, సెక్సుఆరోగ్యం, సెక్సుసభ్యత, సెక్సు ఆచారాలలో నిజాయితీ సాధ్యపడాలంటే కవులు మరింత బాధ్యతగా వ్యవహరించి ఉండవలసింది. ఒకవైపున నీతుల్నీ, ఇంకొక వైపున రతుల రీతుల్నీ విశ్లేషిస్తూ ఒక్కో కవీ సెక్సు సవ్యసాచినన్నట్టు రచనలు చేశారు. రేపటి తరం భవిష్యత్తు గురించిన ఆలోచనని కవులే చెయ్యకపోతే సామాన్య జనం గురించి చెప్పేదేవుంది? ఆరోగ్యకరమైన లైంగికతని నిలుపుకునేందుకు ప్రాతిపదికల గురించిన అవగాహన నేటితరానికి అందించటంలో పెద్దవాళ్ళం విఫలం అవుతున్నాం. యువతరానికీ పెద్దతరానికీ మధ్య ఒకప్పటికన్నా ఎడం ఎక్కువయ్యింది.

భార్యాభర్త లిద్దరూ ఒకరంటే ఒకరు అన్యోన్యంగా, ప్రేమగా ఎందు కుండాలంటే, పుట్టబోయే పిల్లలకు ప్రేమను పంచటానికే!'గాంధీగిరి' లాగే దీన్ని కూడా 'అమ్మానాన్నగిరి' అనాలి. 'parallel parenting', 'Shared parenting', 'equal parenting', 'involved parenting', 'co-operative parenting', ఇలా రకరకాల పేర్లతో 'అమ్మానాన్నగిరి'ని పిలుస్తుంటారు. తల్లిదండ్రుల ప్రేమను పంచుకుని, 'అమ్మానాన్న గిరీ' లో ఎదిగే హక్కు పిల్లలకుంది. తమ సుఖాన్ని తాము చూసుకునే తల్లిదండ్రులు 'అమ్మానాన్నగిరీ' బాధ్యత నెరవేర్చక పోవటాన్ని శిక్షార్హంగా పరిగణించాల్సి ఉంది. బిడ్డ సంరక్షణ విషయంలో అమ్మానాన్నల సమాన పాత్ర గురించి మనం మాట్లాడు కోవాల్సి ఉంది. 'అమ్మానాన్నగిరీ' సక్రమంగా నిర్వహించే ఇంట్లో లైంగికనీతి ఆరోగ్యవంతంగా వర్ధిల్లుతుంది. వ్యక్తిగత లాలస కన్నాపిల్లల లాలన, వాళ్ళ భవిష్యత్తే ముఖ్యం... ★

# అయ్యో! పాపం... ప్రవరుడు !

**తరుణి ననన్యకాంత నతి దారుణ పుష్పశిఖీముఖవ్యధా**
**భరవివశాంగి నంగభవు బారికి నగ్గము సేసి క్రూరుడై**
**యరిగె, మహీసురాధము డహంకృతితో నని రోషభీషణ**
**స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చె కషాయదీధితిన్**

బ్రహ్మదేవుడుకూడా నుదుటి వ్రాత వ్రాస్తాడు కాబట్టి ఆయనా రచయితే! వ్రాసేవాడికి పక్షపాతం ఉండాలి. రచన ఏదైనా రచయిత తాను ఎవరి పక్షం వహిస్తున్నాడో ముందుగానో స్పష్టం కావాలి. తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీల పక్షపాతివా, షాజహాను ప్రేమ పక్షపాతివా అనేది ముందు స్పష్టం చేయాలి! బ్రహ్మగారికి అలాంటి పక్షపాతాలుండవు. ఎవరి పక్షానికీ చెందకుండా తనపక్షమే వహించి వ్రాస్తుంటాడు. రచయితలుకూడా అలానే లోకపక్షాన్ని మానేసి వ్రాయటం మొదలెడితే బ్రహ్మవ్రాత లాగానే తమవ్రాత కూడా తగులడినట్టు ఉంటుంది.

వరూథినిని వద్దని 'అసలు ప్రవరుడు' తోసేసి పోయాడు. అది ఆమెపట్ల అతను చేసిన అత్యాచారంగా అల్లసాని పెద్దనగారు వర్ణించటాన్ని చూస్తే ఆయన కవిహృదయం తేలికగానే అర్థం అవుతుంది. తాను లైంగిక నీతిని ప్రబోధిస్తున్నట్టు కనిపించటానికి ప్రవరుణ్ణి ఒక లింకు పాత్రగా వాడుకున్నాడాయన ! తన కార్యంలో కర్మనిష్ఠకు బద్ధుడై, వరూథిని ప్రేమను తిరస్కరించి వెళ్ళిపోయిన ప్రవరుడి పక్షం వహించాలా...లేక, వలచి వచ్చి ఛీ కొట్టించుకున్న వరూథిని పక్షం వహించాలా? రచయితగా తాను ప్రవరుడే మంచి అంటే వైదిక కర్మనిష్ఠలను సమర్థించిన వాడౌతాడు. వరూథిని మంచి అంటే లోకనీతిని వ్యతిరేకించిన ముద్ర పడ్తుంది.

ఆమె తరుణి. అంటే యుక్తవయసులో ఉన్నది. ఆమె అనన్యకాంత. అంతకు మునుపు ఏ మగాడి పొందూ పొందనిది. ఆమెను అంగీకరించినట్టయితే ప్రవరుడికి కన్నెరతి భాగ్యం దక్కేది. అమాయకుడిలా కాదని కాళ్లదన్ని పోయాడు. కానీ వరూథిని సంగతి ఏమిటీ...? ఆమె మండుతున్న అగ్ని గోళంలా ఉంది. ఆమె పట్ల సానుభూతి చూపించే వాళ్ళే లేకుండాపోయారు. అప్పుడు ప్రకృతి ఆమెను ఓదార్చింది.

'ఓదార్పు'కి ఇప్పుడంటే అర్థాలు మారాయి గానీ, అప్పట్లో అయితే ఆమెకు అన్యాయం చేసిన వాడిపట్ల ఆగ్రహించటమే ఓదార్పు. పుష్పశిఖీ ముఖవ్యథాభరవి శాంగివ మన్మథుడి బాణాలకు ఆహుతై కాలిపోతున్న ఆ కోమలి ప్రేమించివస్తే

అన్యాయంగా వదిలేసి పోతాడా...అని సూర్యుడికి ఒళ్ళు మండిపోయింది. ఆయన ముఖ మండలం ఎర్రబారింది. ఈ ప్రవరుడు మహా క్రూరుడు. మహీసురాధముడు, అహంకారి అనుకున్నాడు.

అన్నింట్లోనూ లేడీస్ ఫస్ట్ కావచ్చు గానీ, ఐ లౌ యూ చెప్పే విషయంలో మాత్రం మగాడే ముందు చెప్పాలి. కొన్నాళ్ల పాటు చెప్పనియ్యాలి. అలా చెప్పేలాగా రెచ్చగొట్టి వాణ్ణి వెంట తిప్పుకోవాలి. ఇది సురక్షిత మార్గం. కానీ, వరూధిని తొందరపడి తనే ముందుగా ఐ లౌ యూ అనేసింది. అందుకనే తిరస్కరణకు బలయ్యింది. వనిత తనంత తానుగా వలచివస్తే 'సీను రివర్సు' అవుతుందని అనుభవం మీద ఆమెకు తెలిసొచ్చింది.

ఈ పద్యం పెద్దనగారు వ్రాసింది కాకపోవచ్చునని కొందరు విమర్శకులు అభిప్రాయ పడ్డారు. కర్మనిష్ఠ, వైదిక శ్రద్ధలను నిలబెట్టటానికే మనుచరిత్ర కావ్యం వ్రాసిన పెద్దన తన కావ్యంలో ప్రవరుణ్ణి తిట్టించటం ఏవిటీ... అని ఆశ్చర్యపడ్డారు. వరూధినే మంచిదైతే ఇంతకావ్యం వ్రాయటం దేనికీ అని ప్రశ్నించారు. పెద్దనపైన వాళ్లకు పెద్ద నమ్మకం. కానీ, శృంగార ప్రథానం అనేది ప్రబంధయుగ లక్షణం కదా... పెద్దనగారు దాన్ని దాచుకోలేకపోయారు. కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో అవకాశం ఉన్న చోటకూడా శృంగార వర్ణనలను సాధ్యమైనంత మేర పరిహరించటానికే ప్రయత్నం చేసినట్టు కనిపిస్తుంది. అది కవి ఇష్టాయిష్టాల పైన ఆధారపడి ఉంటుంది.

లోకసాక్షి అయిన సూర్యుడికే కాదు, ఈ కావ్యాన్ని చదివే పాఠకుడిక్కూడా వరూధిని పట్ల సానుభూతి కలుగుతుంది. అలా కలిగించటం పెద్దనగారి లక్ష్యం. కావ్యం చప్పగా ఉండకూడదు కదా! పాఠకుణ్ణి ఆ దిశగా నడుపుకు పోవటానికే ఈ సూర్యాగ్రహ సన్నివేశం కల్పించాడు.

కావ్యం వ్రాయనంతవరకూ కవి గారి భావాలు కవి స్వంతం. వాటిగురించి మనకు నిమిత్తం లేదు. కానీ, కావ్య రచన జరిగాక అది ప్రజల సొత్తు అవుతుంది. దాన్ని అనేకకోణాల్లోంచి తర్కించి చూసే విమర్శనా హక్కు ఎన్ని తరాల ప్రజలకైనా ఉంటుంది. ఎవరూ విమర్శకు అతీతులు కాదు. ☆

# అరచేతిలో వైకుంఠం

**"ఇంతింతై, వటుడింతయై, మఱియు దానింతై, నభో వీధిపై**
**నంతై, తోయద మండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై**
**నంతై, చంద్రునికంతయై, ధృవునిపై నంతై, మహర్వాటిపై**
**నంతై, సత్యపదోన్నతుం డగుచు, బ్రహ్మాండాంత సంవర్ధియై"**

కన్యాశుల్కం నాటకంలో శిష్యుడు తన గురువైన గిరీశం తక్కువవాడు కాదని చెప్పటం కోసం 'ఆయన సురేంద్రనాథ బెనర్జీ అంతటివా' డని చెప్తాడు. అది విన్న ఆ శిష్యుడి అక్కగారు అమాయకంగా "అతగాడెవర్రా?" అనడుగుతుంది. దానికి ఏం చెప్పాలో తెలియక, వాడు బుర్రగోక్కుని, అందరికన్నా గొప్పవాడు లెమ్మని సర్ది చెప్పేస్తాడు.

ఈ పద్యం కూడా అలాంటి ప్రయత్నమే చేస్తుంది. బలి చక్రవర్తిని వామనుడు తను వేయగలిగిన మూడడుగుల భూమి ధారాదత్తం పొందుతాడు, అక్కణ్ణించీ తన శరీరాన్ని పెంచటం మొదలెడతాడు. మొదట ఇంతయ్యాడు. ఇంతింతయ్యాడు. మళ్ళా తానింతయ్యాడు. ఆకాశం అంత అయ్యాడు. అ తరువాత దాని పైనంత అయ్యాడు. అక్కణ్ణించి తోయద మండలాగ్రానికి అంటే, మేఘమండలానికి అల్లంత దూరం అంత అయ్యాడు, మరింత పెరిగి, ప్రభామండలం అంటే, కాంతి లోకాల పైనంత అయ్యాడు. చంద్రుడి దాకా పెరిగాడు. దాటి ధృవమండలం పైనంత అయ్యాడు. ఇంకా పెరిగి మహర్లోకంపై దాకా పెరిగాడు. ఇలా సత్య పదోన్నతుడయ్యాడు. అంటే సత్యలోకం దాకా పెరిగాడన్నమాట.

ఆ విధంగా బ్రహ్మాండం అంత పెరిగి, ఒక కాలు భూమ్మీదా రెండో కాలుని ఆ సత్యలోకం పైదాకా లేపాడు. అక్కడ, ఆ పాదాన్ని బ్రహ్మదేవుడు కడిగాడు. 'బ్రహ్మ కడిగిన పాదం' అనే అన్నమయ్య పాట ఈ కథ ఆధారంగానే వచ్చింది. ఇంక మూడో అడుగు ఎక్కడ వెయ్యాలని అడిగి బల చక్రవర్తి నెత్తిన వేసి, అతన్ని పాతాళానికి తొక్కేశాడన్నది మనకు తెలిసిన కథే!

పెరిగీ పెరిగీ మధ్యలో మేఘమండలం, చంద్రమండలం వగైరా అన్నింటినీ దాటుకుంటూ అంతరిక్షంలోకి బ్రహ్మాండ లోకాల దాకా మొత్తం కలిపి ఎన్ని కిలోమీటర్లు ప్రయాణం...? ఒక లోకం నుంచి ఇంకో లోకానికి ప్రయాణానికి ఎంత కాలం పడుతుంది...? ఇలాంటి ప్రశ్నలు "కాలమూ-దూరమూ" పద్ధతిలో లెక్కలు కట్టి చెప్పవలసి ఉంటుంది. ఒక గ్రహం నుండి బయలు దేరిన కాంతికిరణం

ఒక సంవత్సరం పాటు అంతరిక్షంలో ప్రయాణిస్తే ఎంతదూరం వెడుతుందో దాన్ని ఒక కాంతి సంవత్సరం అంటారు. ఆకాశంలో మనం చూసే ఒక నక్షత్రం భూమికి ఎన్ని కాంతిసంవత్సరాల దూరాన ఉన్నదో, ఆ నక్షత్రం అన్ని సంవత్సరాల నాటిదన్న మాట. ఉదాహరణకు ఆర్ద్రా నక్షత్రం మనకు 250 కాంతి సంవత్సరాల దూరాన ఉన్నదనుకుంటే, ఆ నక్షత్రం నుండీ బయల్దేరిన కాంతికిరణం భూమ్మీదకొచ్చి మనకు కనిపించేసరికి ఇక్కడ బ్రిటిష్ ప్రభుత్వం, కాంగ్రెస్ ప్రభుత్వం అన్నీ పోయి మోడీ ప్రభుత్వం వచ్చేసిందన్నమాట. ఇప్పుడు వామనుడు ఎన్ని కాంతి సంవత్సరాల ఎత్తున పెరిగాడు...? సామాన్య మానవుడికి ఈ గణాంకాల వివరాలు బుర్రకెక్కవు. గిరీశం గారి శిష్యుడిలా చాలా ఎత్తుకి పెరిగాడని మాత్రమే చెప్పవలసి ఉంటుంది.

చాలా అనే మాట అనేక కాంతి సంవత్సరాల దూరాన ఉందన్న విషయం సామాన్యుడు గ్రహించటానికి, ఇంతింత పెరిగాడని చెప్పటం ఈ పద్యంలో ఒక గమ్మత్తు. ఇలా చెప్పటాన్నే అరచేతిలో వైకుంఠం చూపించటం అంటారు. ఈ మాటని ఇప్పుడు మనం 'లేనిపోని ఆశలు కల్పించటం' అనే అర్థంలో వాడుతున్నాం గానీ, అసలు భావార్థం అది కాదు. అరచేతిలో వేలుపెట్టి చూపిస్తూ, ఇది మేఘమండలం, ఇది కాంతిమండలం, ఆ తర్వాత అదిగో ఇదే వైకుంఠం... ఇలా చెప్పటమే అరచేతిలో వైకుంఠం చూపించటం!

రియల్ ఎస్టేట్ వాళ్ళు ఇక్కడ ఎయిర్‌పోర్టు, ఇక్కడ సీపోర్టూ, ఇక్కడ రాజధాని అంటూ అరచేతిలో చూపించేస్తారు కదా..., ఇవన్నీ మానవ సహజమైన విషయాలు. ఈ భాషనే తెచ్చి పోతనగారు ఈ పద్యం ద్వారా మనకు అరచేతిలో వైకుంఠాన్ని చూపిస్తారు. పోతన గారు వైకుంఠాన్ని అలానే నాలుగు పాదాల పద్యంలో చూపించారు.

మనం చూసే కళ్లని బట్టే ఏదైనా ఉంటుంది. ఇంతై, ఇంతింతై అనే మాటల్ని సెంటీ మీటర్లలోనో, కిలో మీటర్లలోనో కాకుండా కాంతి సంవత్సరాల్లో ఊహించుకుంటే గానీ, పోతన గారి కవి హృదయం బోధ పడదు. పద్యాలను ధారణ చేసే వాళ్లలో ఈ పద్యం నోటికి రాని వాళ్ళెవరూ ఉండరు. ఇంతై, ఇంతింతై, ఇంకా పైనంతై అంటూ కోట్లాది కిలోమీటర్ల దూరాన్ని ఒక్క గుక్కలో చెప్పేసిన అద్భుత పద్యం ఇది. 

# ఆకాశం చూపులు

"ఘన శైలంబు బొమ్మరాళ్లపగిది న్గనపట్టె జూపట్టె గొ
ప్ప నదుల్త్రాకెడు త్రాచుపాముల క్రియన్ భాసిల్లె నానా మహా
వనముల్ భూసతి మేన దోచిన గగుర్పాటుల్వలెన్ష్మ మించె బ్
త్తనము ల్చక్కని బొమ్మరిండ్లగతి నేత్ర ద్వంద్వ సంతుష్టిగన్"

చిలకమర్తి లక్ష్మీనరసింహం వ్రాసిన గయోపాఖ్యానం నాటకంలోది ఈ పద్యం. చిలకమర్తి లక్ష్మీనరసింహం (సెప్టెంబరు 26, 1867 – జూన్ 17, 1946) ప్రముఖ కవి, రచయిత, నాటక కర్త, పాత్రికేయుడు, సంఘ సంస్కరణవాది, విద్యావేత్త. తన ఇరవై రెండో యేట ఆయన వ్రాసిన ఈ 'గయోపాఖ్యానం' పద్య నాటకం లక్షకి పైబడి అమ్ముడు పోయి చరిత్ర సృష్టించిది. ఈ నాటకం కూడా అనేక వేల ప్రదర్శనలు పొందింది. టంగుటూరి ప్రకాశం పంతులు యువకుడిగా ఉన్నప్పుడు ఈ నాటకంలో అర్జునుడి వేషం వేసేవాడట.

గయుడు తన రాణి చిత్రరేఖనీ, తన మంత్రి పుష్పదంతుణ్ణీ వెంట బెట్టుకుని విమానం ఎక్కి ఆకాశంలో తిరుగుతూ కిందికి చూసినప్పుడు నేలమీద ప్రకృతి ఎలా కనిపిస్తుందో ఈ పద్యం వర్ణిస్తుంది.

విమానం యమునా నది మీంచి ఎగురుతోంది. ఆ సమయంలో కృష్ణుడు సూర్యుడికి అర్ఘ్యప్రదానం చేస్తున్నాడు. గయుడు విమానంలోంచి ఉమ్మేశాడు. అదొచ్చి తిన్నగా కృష్ణుడి చేతిలో పడింది. ఇదీ సందర్భం. అది చివరికి కృష్ణార్జున యుద్ధానికి దారి తీస్తుంది. యయాతి కూడా ఇదే తప్పు చేశాడు. అది రామాంజనేయ యుద్ధానికి దారి తీసింది. భగవంతుడికీ భక్తుడికీ చిచ్చుపెట్టి వ్రాసిన వైనప్పటికీ, ఇలాంటి నాటక రచనలు అధికార మదం బుర్రకెక్కిన వాడి చేష్టల్ని, వాటి పర్యవసానాలనూ హెచ్చరిస్తాయి.

అధికారంలో ఉన్నవాడు ఆటో ఎక్కి తిరుగుతాడా! విమాన విహారమే చేస్తాడు. విమానం ఎగిరినంత ఎత్తుకు తాను ఎదిగా ననుకుంటాడు. అధికార మైకం నిండిన కళ్లతో చూస్తే, ప్రతిదీ ఆకాశం లోంచి చూసినట్టే కనిపిస్తుంది. ఆకాశం చూపులతో గయుడు విమానంలోంచి చూసినప్పుడు మహా పర్వతాలు పిల్లలాడుకునే

లక్కపిడతల్లాగా, మహానదులు త్రాచుపాముల్లాగా, మహావనాలు భూదేవి ఒళ్ళుగగుర్పొడిచి నప్పుడు రోమాలు నిక్కబొడుచుకున్నట్టుగా, నగరంలో మేడలూ, మిద్దెలూ బొమ్మరిళ్ళుగా రెండు కళ్ళూ తృప్తి చెందేలా చూశాడట.

ఆకాశం చూపులున్నవాడికి నేల చూపులుండవు. ఎక్కడపడితే అక్కడ కిళ్ళీలు నమిలి ఉమ్మలేసే గయులూ, యయాతులూ ఈ నాటికీ ఉన్నారు. ఉమ్మేసేప్పుడు వెనకాముందూ చూసుకోవటం ఏమీ ఉండదు. స్వచ్ఛభారత్'లో బహిరంగ మలమూత్రాలను వద్దంటున్నారు గానీ, బహిరంగ ప్రదేశాల్లో ఉమ్మలేయ కూడదని చెప్పటం లేదు. గోడలకు తెల్లగా సున్నం కొట్టుకున్న మర్నాడే ఎవడో వచ్చి గోడలమీద ఎర్రగా ఉమ్మి పోతుంటాడు.

గయుడు జర్దాయే తిన్నాడొ, గుట్కాయే నమిలాడో తెలీదు, విమానంలోంచి ఉమ్మేశాడు. అది అతని హక్కు అనుకున్నాడు. అది వెళ్ళి అర్ఘ్యం వదుల్తున్న శ్రీ కృష్ణుని చేతిలో పడింది. ఆలాంటి ఉమ్మరాయుళ్లను ఏం చెయ్యాలి...?ఊరుమ్మడిగా వెళ్లి వాడి ముఖాన ఉమ్మేయాలి. కానీ, కృష్ణుడు జనానికా ఇబ్బంది దేనికని, తానే గయుణ్ణి చంపేస్తా నన్నాడు. గయుడు తాను కూడా కృష్ణుడి పార్టీలో వాణ్ణేనని బుకాయిస్తాడు. తన మీద కృష్ణుడి దాడి అన్యాయం అని వాదిస్తాడు. కృష్ణభక్తి ద్వారక మీద ఉన్నవాడైతే విమానం ఎగిరి వెడ్తున్నపుడు ఎక్కడైనా కృష్ణుడు కన్పిస్తాడేమో నని వేయికళ్ళతో వెదికి ఉండేవాడు. ఇలా ఉమ్మేసి పోయేవాడు కాదు.

ప్రజాభక్తీ, ప్రజాస్వామ్యం పట్ల అనురక్తీ, గౌరవం ఉన్న ప్రభువు విమానంలో అంత ఎత్తునుండి చూస్తున్నప్పుడు తన యావత్తు రాజ్యం ఒకేసారి కనిపిస్తోందని సంతోషిస్తాడు. భూకబ్జాదారుల ఆకాశం చూపులు అలాంటివి కావు. అదేదో సినిమాలో 'ఒక్కడుగు' అంటూ తన కాలు తీసి మ్యాపు మీద మోపుతాడు. ఈ ఏరియా అంతా తన రాజ్యం అని ప్రకటిస్తాడు. 'ఆకాశం చూపు'లున్న కబ్జా కళ్లు కిలోమీటర్లను ఇలా మిల్లీమీటర్లలో కొలుస్తాయి.

పర్వతాల్ని ఆటబొమ్మలనీ, మహానదుల్ని తాచుపాములనీ, నగరాల్ని బొమ్మరిళ్ళనీ అనుకునేవాడిని కబ్జాదారుడనే అంటారు. ఉమ్మలేసే రోత అలవాటు ఉన్న వీడికి కృష్ణుడు మరణ దండన వేశాడు. నేటికాలపు ప్రజలు ఓటు వేసే దాకా ఓపిక పట్టవలసి ఉంటుంది. ప్రజాస్వామ్యంలో ప్రజలు ఘనశైలాలే గానీ, లక్కపిడతలు కారు. 

# 600 యేళ్ళనాటి డ్రస్ కోడ్

**"పట్టే తిరుమణులును పట్టుకుళ్ళాయిలు**
**పట్టుదుప్పటు లఱచట్టలు మెఱయ**
**దిట్టలౌ విద్వాంసులు ధీరులౌ కవులు**
**పట్టభద్రుని కొలువుకు వచ్చిరావేళ"**

దక్షిణాది రాజ్యాలలో ఎక్కువ విదేశీ వర్తకులు దేశీయ వ్యాపారులు కవి పండిత కళాకారులూ ఎక్కువగా సందర్శించింది విజయనగర సామ్రాజ్యాన్నే! వాణిజ్యం పెంచుకునేలా రాజు పాలన చేయాలని కృష్ణదేవరాయలు స్వయంగా ఆముక్తమాల్యదలో చెప్పుకున్నాడు కూడా! అందుకని, కొన్ని ఆధునిక సాంప్రదాయాలను తప్పనిసరిగా పాటించవలసి వచ్చింది. రాజాస్థాన సందర్శకులకు డ్రస్ 'కోడ్ వాటిలో ఒకటి.

"కుళ్ళావెట్టితి కోకసుట్టితి మహా కూర్పాసముం దొడ్గితిన్" అని శ్రీనాథుడు ప్రౌఢదేవరాయ కాలంలో విజయనగర సామ్రాజ్య సందర్శనం చేసినప్పుడు తానుకూడా డ్రస్ కోడ్ పాటించినట్టు చెప్పుకున్నాడు. దాన్నిబట్టి, రాజ సందర్శనం కోరేవాడు ప్రత్యేకంగా నిర్దేశించిన వేషధారణలోనే రావాలని అర్థం అవుతోంది.

తరువాతి కాలంలో తంజావూరు మధుర రాజ్యాలలోని తెలుగు పాలకులు ఈ వేషధారణ విధానాన్ని కొనసాగించారు, నాయకరాజులు తాము స్వయంగా వ్రాసిన రచనల్లో వీటి వివరాలు కొన్ని మనకు తెలుస్తాయి. ఈ పద్యం'విజయరాఘవ కళ్యాణము' లోది.

**పట్టే తిరుమణులు:** తిరుమణి అంటే తెల్లటి నాము, తిరుచూర్ణం అంటే పసుపు, బియ్యప్పిండి కలిపిన పొడి. ఈ రెండింటినీ వైష్ణవులు నొసట బొట్టులా పెట్టుకుంటారు. రాజు వైష్ణవు డైనప్పుడు ఆయన మెప్పుకోరి వచ్చిన వాడు ఈ వైష్ణవ సాంప్రదాయాన్ని విధిగా పాటిస్తాడు. నుదుట బొట్టు లేని శూన్యలలాటాన్ని రాజు ఆదరించక పోవచ్చు కూడా! ఈ బొట్టుని పట్టె(పలకలా)లాగా పెడతారు. రాజు పట్టాభిషిక్తుడయ్యేప్పుడు పెట్టేబొట్టు ఈ 'పట్టె'

**పట్టుకుళ్ళాయిలు:** కుళ్ళాయ, కుళ్ళాయి అంటే పటరచిత మకుటం. పట్టుబట్టతో చేసిన తలపాగా. వీటిని మొదట్లో కుళ్ళాయిలనే అనేవారు. ఇది దొరల టోపీ కాదు. ముట్నూరి కృష్ణారావుగారి తలపాగా కూడా కాకపోవచ్చు. తిరుమల దేవాలయంలో కృష్ణ దేవరాయలు, అతని రాణులు విగ్రహాల్లో రాయలవారు వేంకటేశ్వరుని కిరీటం ఆకారంలో వుండే పొడవుగా వుంటే టోపీ పెట్టుకున్నట్టు కన్పిస్తాడు. కుళ్ళాయి అంటే ఈ ఆకారంలో వున్న పట్టు టోపీ కావచ్చు. తరువాతి

కాలంలో పాగా అనేది వ్యాప్తిలోకి వచ్చినట్టు నిడుదవోలు వేంకటరావుగారు వ్రాశారు. తమ కవితా ప్రతిభతోనో, కళా ప్రతిభతోనో రాజుగారి మెప్పుపొందిన వాళ్లకి రెండు శాలువాలు బహూకరించే సాంప్రదాయం ఉండేది. ఒకటి పైన కప్పి, రెండోది తలపాగాలాగా చుట్టి, గౌరవించే వాళ్లన్నమాట! శాలువాల జతని దౌశాలువా లేక దుశ్శాలువా అన్నారని పండితులు చెప్తారు. తలపాగా పెట్టుకొని కోటకెళ్ళటం, కోటలో తలపాగా పెట్టించుకు రావటం అనేవి రెండూ గొప్ప విషయాలే ఆ రోజుల్లో! కోటలో పాగా వేయటం అనే మాట ఇలానే పుట్టింది.

**పట్టుదుప్పటులు:** దుప్పటం అంటే ఖరీదైన సన్నపాటి వెడల్పు వస్త్రం, కవచం, ఉత్తరీయం, నిచోళం అని నిఘంటు అర్థాలు. వెడల్పు తక్కువ, పొడవు ఎక్కువగా ఉండే శాలువాని దుప్పటం అన్నారు. అది పట్టుదైతే ఖరీదు ఉంటుంది. కనుకనే దుప్పటిని కూడా దుప్పటం అనే అంటారు. దానికీ దీనికీ నేతలో తేడా ఉంటుంది. లేకపోతే దుప్పటి కప్పినట్టే ఉంటుంది. శాలువా లాగా ఉండదు.

**అఱచట్టలు మెఱయ:** అఱచట్ట ' వెయిస్టు కోటు వంటిది' అన్నారు శ్రీ నిడుదవోలు వేంకటరావు శ్రీనాథుడు తాను ప్రౌఢదేవరాయల సంస్థానానికి వెళ్ళినప్పుడు కోక చుట్టుకుని, మహాకూర్పాసకం తొడుక్కున్నట్టు వ్రాసుకున్నాడు. మహాకూర్పాసకం అంటే బాగా ఖరీదైన జరీ అంచులున్న ఈ అఱచట్టే! నెహ్రూ జాకెట్ లాంటిదన్నమాట. అది సాధారణంగా ఉంటే బనీను (లోగుడ్డ) లా ఉంటుంది. ఇదే జనవ్యవహారంలో అంగరకా లేదా అంగరఖా అంటే చొక్కాగా మారింది. క్రమేణా పై ఉత్తరీయం వాడకంలోంచి లేచిపోయింది.

పంచె కట్టుకుని, దాని మీద కోక చుట్టేవాళ్ళు. పంచెమీద బెల్టులాగా నడుము చుట్టూ బిగించి కట్టే వస్త్రాన్ని కోక అంటారు. యాగాది క్రతువుల్లో నడుము బట్ట కట్టుకోవటం అంటే దీక్షకు ఉపక్రమించటం అని అర్థం. కోకచుట్టటానికి అంత ప్రాముఖ్యం ఉంది. మిగతా వస్త్రధారణలు పాటించగలిగినా లేకున్నా, నడుముకు వస్త్రం కట్టటం వరకూ చేస్తే, గొప్ప గౌరవం ఇచ్చినట్టే భావించేవాళ్ళు. ఇవన్నీ దేవాలయాల నియమాలు రాజాస్థానాలక్కూడా వీటిని వర్తింప చేసుకున్నారు.

తంజావూరు నాయకరాజుల కాలంలో "తీరైన కనకపు కళ్ళజోడు దీపింపగా" రాజదర్శనానికి తరలి వచ్చినట్టు ఒక పద్యాన్ని నిడుదవోలు వారు ఉదహరించారు.

కళ్లకు అద్దాల గురించి మనకు 18వ శతాబ్దికి గానీ అందుబాటులోకి విజ్ఞానం రాలేదు. కాబట్టి బంగారపు కట్లున్న కళ్లజోడు వాడకం విలాసవంతమైన ఒక అలంకారం అయి వుంటుంది. ఇది అద్దాలున్న జోడా లేక ఉత్తుత్తి ఫ్రేము మాత్రమే ఉన్నదా, దాని ఆకారం ఎలా ఉండేది అనేవి మనకు తెలీవు. ఎక్కడైనా ఏ దేవతా విగ్రహానికో, రాజుగారి విగ్రహానికో కళ్ళజోడు ఉన్నది కనీసంగాని తీరైన కనకపు కళ్ళజోడు గురించి అవగతం కాదు. ★

# ఆలి'ని వదిలితే గాలి బతుకే!

ఆ యమ యున్నరోజులహహా! అనురాగఝరీ మరందవా:
పేయము లంగజేక్షుశరపీఠగుణశ్రుతిబద్ధ స్తథా
గేయము లాత్మశోకవినికృంతననిర్వృతికృద్వివిక్తి సం
ధ్యేయము లావృతిన్ వెలుగు లేచెడు రవ్వల పూలపొట్లముల్

డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ తాజాగా వెలువరించిన 'ధర్మభిక్ష' ప్రబంధ కావ్యంలో పద్యం ఇది! శ్యామలానంద తెలుగు సంస్కృత భాషలలో పరిశోధనా పట్టాలు పొందిన కవి పండితుడు. ఇంకా ఈ రోజుల్లో అంత పాండిత్యం సాధ్యమా అని ఆశ్చర్య పోయేంత వచో వైభవం ఉన్నవాడు. శతావధానాలు చేశాడు. తొలిసారిగా అచ్చతెలుగులో అష్టావధానం చేశాడు. లండన్ పార్లమెంటులో ఇంగ్లీషు వాళ్లకి ఆశువుగా పద్యాలు పాడి వినిపించాడు.

డా. శ్యామలానంద సామాజిక దృష్టి అధికంగా ఉన్న కవి. ఆయన నూనూగు మీసాల రోజుల్లో వ్రాసిన కావ్యం ఈ ధర్మభిక్ష. అప్పట్లో విశ్వనాథవారికి చదివి వినిపించి ఆయన చేత తప్పొప్పులు సరి చేయించు కున్నాడు. కవిసమ్రాట్ మరణం తరువాత ఆ కావ్యం పూర్తి కాకుండానే మూలపడింది. తరువాత పరిపూర్ణ యవ్వనంలో తన మిత్రుడు సినీకవి జొన్నవిత్తుల రామలింగేశ్వర రావు ప్రేరణతో దాన్ని పూర్తి చేశాడు. అది ఇప్పటికి అచ్చులో వచ్చింది. దాన్ని రామలింగేశ్వర రావుకే అంకితం ఇచ్చాడు.

ఎర్రనగారి భారతానువాదంలో ధర్మవ్యాధోపాఖ్యానం ఘట్టాన్ని తీసుకుని తనదైన రీతిలో వ్యాఖ్యానిస్తూ ఈ ధర్మభిక్ష ప్రబంధాన్ని వ్రాశాడు శ్యామలానంద. చిన్న కావ్యం ఇది. కానీ ఇప్పటి తరానికి అవసరమైన సందేశం ఇస్తోంది.

భర్త ఎంత మొండివాడైనా భార్యతో ఉన్నంతసేపే అతని ఆటలు సాగుతాయి. ఆమె లేనప్పుడు ఆమె అవసరం ఏమిటో తెలిసొస్తుంది. భార్య లేకపోతే, ఆ భర్త జీవనం ఎంత దుర్భరంగా ఉంటుందో, భార్యలను వేధించే భర్తలకు తెలిసొచ్చే సరికి చాలా అపకారం జరిగి పోతుంది.

ఈ పద్యంలో ఒక భర్తగారు భార్యని పుట్టింటికి పంపించేసి, అంటే, ఇప్పటి భాషలో వొదిలేసి, దేశ ద్రిమ్మరిలా తిరుగుతూ మనసులో అనుకుంటున్న మాటలివి:

"ఆహహా...ఎంత గొప్పవీ... ఆవిడతో కలిసి ఉన్నరోజులు... అవి అనురాగ ఝరీ మరందవా:పేయాలు...అంటే ప్రేమ అనే తేనెల ప్రవాహాలు, అంగజేక్షు శరపీఠగుణశ్రుతిబద్ధ స్మథా గేయాలు: మన్మథుడి చెరకు వింటి నారిని శ్రుతి చేసి పాడుకున్న కథా గేయాలు, ఆత్మశోకవినికృంతననిర్వృతికృద్వివిక్తి సంధ్యేయాలు: గుండ్రంగా శక్తికొలదీ తిప్పుతుంటే రాలిపడే మతాబాల పూలపొట్లాలు..." అని!. ఆ విషయాన్ని చాలా ఆలస్యంగా గ్రహించాడా భర్త.

అహంకారం అనేది ఉంది చూశారూ...అది తన తప్పుని ఒప్పుకోనివ్వదు. "అవునండీ...ఆమె ఎంత మూర్ఖురాలు కాకపోతే అన్నం వడ్డించి నెయ్యి వెయ్యకుండా భోజనం పెడుతుందా? నేను మాత్రం ఏమన్నాను... నెయ్యి వెయ్యి లేదేవిటీ... అన్నాను... ఆవిడ వెంటనే, "మీకు చాలా సార్లు చెప్పాను...ఇంటికి వచ్చేప్పుడు నెయ్యి తెండీ...అని! మీరు తీసుకు రాకుండా వచ్చి నన్నడుగుతా రేవిటీ అని రెట్టించింది. నాకు చిర్రుమంది. ఆడది భర్తతో అలా మాట్లాడితే ఎవడికైనా కోపం రాదా...? అది నన్ను బైట పెట్టి నా శిష్యుల ముందు చులకన చేయటం కాదటండీ... నిజంగా అది తలుచుకుంటే, ఎన్నాళ్లనుండో ఆ ఊళ్ళోనే ఉంటున్నాం కదా...ఓ చిన్న గిన్నెడు నెయ్యి అప్పు దొరకదా...? నేను తేలేదని ఎత్తి చూపటానికి కాకపోతే, కమ్మగా మొగుడికి అన్నం వడ్డిద్దాం అనే ధ్యాసే లేకపోతే ఎట్లా...ఆడాళ్లకి మొగుళ్ళని చులకన చేయటం అంటే మహా మోజు..." అనుకున్నాడా భర్త. ఆయనేమీ సీదా సాదా మొగుడు కాదు. కౌశికుడనే ఒక మహర్షి.

"మొగుడికి అన్నం వడ్డించాక నెయ్యి లేదని చెప్తుందా? కారణం చిన్నదే కావచ్చు... కానీ... కార్యం (తప్పు) పెద్దది. అందుకే నాకు అంత కోపం వచ్చింది..." అనుకున్నాడు కౌశికుడు. ఏమైతేనేం, ఆరోజు నుండీ కౌశికుడు భార్యలేనివాడై పోయాడు. ఆ విధంగా మూర్ఖురాలైన భార్యని శిక్షించాడనే అనుకుందాం... కానీ, ఊళ్ళో ప్రతి ఇంటికి వెళ్ళి, ఆ ఇళ్ళ ఇల్లాళ్ళని అమ్మా! తల్లీ! అని అడుక్కొంటున్నాడు కదా!... కౌశికా శిక్షించావా? శిక్షించబడ్డావా?

ఆఫీసులో 'ఆడబాసు' తో తిట్లు తిని, ఇంటి కొచ్చి భార్యమీద ఆ కసినంత చూపించే అభినవకౌశికులు చాలా మంది ఉన్నారు. భార్య అంటే తిట్లు పడాల్సిన ఒక వస్తువనే భావన లోంచి బయట పడకపోతే, ఉన్న ఇల్లాల్ని వదిలి, ఊరి ఇల్లాళ్ల దయమీద బతకాల్సి వస్తుందని ఇందులో సారాంశం. ★

# "ఇచ్చే చేతులు"

**"ఆతురుడై ప్రయత్నమున నబ్ధిజలంబుల నానువేళ, ఖ**
**ద్యోత సహాయుడయ్యును పయోదుడు నల్లగనౌను, పిమ్మటన్**
**ప్రీతిగ వర్షమున్ గురియు వేళల తెల్లగను, గ్రహీతకున్**
**దాతకు నంతరంబిదియె, తాదృశముల్ సుగుణాఢ్యవర్తనల్"**

సూర్యుడు ప్రభుత్వం చేస్తున్నాడు. తన ప్రభుత్వరంగ సంస్థలకు నిధులిచ్చి సమర్థవంతంగా నడిపిస్తూన్నాడు. చంద్రుడు చీకట్లో వెలుగులిచ్చే కార్యక్రమాలు నిర్వహిస్తూన్నాడంటే, మొక్కలు పత్రహరితాన్ని తయారు చేసే పనిలో ఉన్నాయంటే, సూర్యుడి వెలుతురు పథకాలతోనే లోకాన్సమస్తం పనులు చేస్తోందంటే, సూర్యపాలన గొప్పదని అర్థం. సూర్యుడి ఆదాన ప్రదాన పాలనా విధానం వలననే లోకం తన ధర్మాన్ని తాను నెరవేరుస్తోంది. ఆ ప్రభుత్వంలో "తన"వారు, "కల"వారు తేడాలుండవు. ప్రభుత్వ తోడ్పాటు అర్హులందరికీ సమానంగా ఉంటుంది. ఈ సృష్టి యావత్తూ ఆయన కనుసన్నల్లోనే కదులాడుతుంది.

సూర్యుడు రాని రోజుని దుర్దినం అంటారు. సూర్యుడు ప్రదాత కాగా, ఈ సృష్టి సమస్తం గ్రహీతగా ఉంది. ఇచ్చేవాడిది పైచేయి. అది, స్వచ్ఛంగా, నిర్మలంగా, తెల్లగా ఉంటుంది. పుచ్చుకునే చెయ్యి ఎప్పుడూ దిగువనే ఉంటుంది. గ్రహీతల్లో దేని రంగు దానిది. ఇచ్చేవాడికీ పుచ్చుకునే వాడికి ఇదే తేడా!

ఈ చిన్న సూక్ష్మాన్ని లౌకిక వ్యవహారాలకు ఆపాదిస్తూ 'సుగుణాఢ్య శతకం' పేరుతో ఇటీవల ఆచార్య అప్పాజోస్యుల సత్యనారాయణగారు ఒక పుస్తకం వెలువరించారు. ఇందులో పద్యాలు చాలా పటుతరంగా ఉన్నాయి. ఆ శతకంలోదే ఈ పద్యం. ఆచార్య అప్పాజోస్యులవారు విదేశాల్లో ఎలక్ట్రానిక్స్ శాస్త్రవేత్తగానూ, ఆచార్యులుగానూ ప్రసిద్ధులు. ఎందరో శాస్త్రవేత్తలకు గురువు. అజో విభో కందాళం ఫౌండేషన్ వ్యవస్థాపకుల్లో ఒకరు. తెలుగు భాషా సాహిత్యాలకు సేవలందిస్తున్న ప్రముఖుడాయన.

దాతకు గ్రహీతకు మధ్య తేడా వివరిస్తూ, ప్రభుత్వ నిధులు దిగమింగే బినామీ జేబు సంస్థల్లాగా సూర్యుడిచ్చే వెలుగుని వాడుకుని తిరిగి లోకోపకారం చెయ్యని వాటిపైన అందమైన చురక వేస్తారు కవి ఈ పద్యంలో. సూర్యుడిచ్చిన నిధులతో సముద్రజలాలు మేఘాలను సృష్టించే కార్యక్రమం నిర్వహిస్తూ ఉండగా, కొంటె

మబ్బులు కొన్ని దొరికిందే తడవు అన్నట్టు ఆబగా నీటిని కబ్జా చేసి, తిరిగి వానను కురిపించకుండా ఎగురుతుంటాయి.

కడుపునిండా నల్లడబ్బు దాచుకున్నవాడిలా, వర్షించని మబ్బులు నల్లగా ఉంటాయి. ఇది చూసి, పవనాలు, పర్వతాల్లాంటి ప్రభుత్వాధికారులు ఆ కారుమబ్బుల్ని గట్టిగా అడ్డుకుంటే, అప్పుడవి చచ్చినట్టు కురుస్తాయి. అలా కురిసీ కురవం గానే వాటి నలుపు విరిగిపోతుంది. డ్యూటీ దిగిన ఉద్యోగిలా తెల్లగా హాయిగా ఎగిరి పోతాయి. ఖద్యోతుడి అంటే సూర్యుడి పర్యవేక్షణ ఉన్నప్పటికీ కొన్ని కారుమబ్బులు ఇలా వ్యవహరిస్తూంటాయి. ఎప్పటికైనా వర్షాన్ని భూమికి దానం ఇస్తేనే మబ్బుకు పట్టిన కిలుము (నలుపు) వదుల్తుంది. పుచ్చుకున్న చేతులు నల్లగా ఉంటే, తిరిగి లోకానికి దానం ఇచ్చిన చేతులు తెల్లగాఉంటాయి. ఇచ్చే చేతులకూ, పుచ్చుకునే చేతులకూ అదీ తేడా!

కీర్తికి తెలుపు గుర్తు. కీర్తి, దానానికి ప్రతిఫలం. దాతకూ గ్రహీతకూ తేడా ఇదే నంటారు కవి. తన పనులు మానేసి, బిచ్చగాడి మాదిరి, ఉచిత పథకాల కోసం గ్రహీతలు చేతులు చాపుకుని కూర్చోకూడదని, పుచ్చుకున్న దానితో శక్తిని పుంజుకుని, తిరిగి ఇచ్చే స్థాయికి ఎదగాలనీ, అదే ప్రకృతి ధర్మం అనీ, గ్రహీత అయిన ప్రతివాడూ తిరిగి దాతగా మారాలనీ ప్రబోధిస్తున్నాడు కవి!

సూర్యుడి పాలన సృష్టి సమస్తం పరస్పర ఆధార ఆధారితంగా ఉంటుంది. పుచ్చుకుంటూ, పుచ్చుకున్న దాన్ని మెరుగు పరిచి తిరిగి ఇతరులకు ఇచ్చుకుంటూ ఈ సృష్టి గొలుసు కట్టు పద్ధతిలో నడుస్తోంది. గ్రహీతలందరూ శక్తిమంతులై తిరిగి దాతలు కావాలి. ప్రకృతి తరతరాలుగా రిసీవింగ్ ఎండ్‘లో పుచ్చుకునే స్థితిలోనే ఉండి పోకూడదు. సుగుణాఢ్య వర్తనం అంటే ఇచ్చే గుణం సహజ లక్షణం కావాలనేది కవి కోరిక.

తన ప్రజలను పోషకులుగా తీర్చిదిద్దటం సూర్యుడి పాలనా విధానం. ప్రజలను ఆధారపడే స్థితిలో పోషితులుగా, బిచ్చగాళ్ళుగా తయారు చేసేది మన పాలన! తన పార్టీ మాత్రమే పట్టెడన్నం పెట్టి బతికిస్తోందని చెప్పుకోవటం మన పాలకుల అలవాటు. ఇచ్చే చేతులుగా ప్రజలు ఎదిగే పరిస్థితి వుంటే ప్రభుత్వంతోనూ పాలకులతోనూ పనేం వుంటుంది. ప్రభుత్వాల భయం అదే ! 

# ఎండామండిత ప్రదేశం

"అతివృష్టిన్ మును వార్ధి గూర్చునెడ కా( దౌటన్ దమిన్ గూర్చున
న్మతి లంచంబుగ హేమటంకములు మింటన్ బొల్చు పర్జన్యదే
వతకీ నెత్తిన కేల నా( బొలిచె, నిర్వారిస్రవంతిన్ న్భయ
శ్ర్యుతి నమ్రచ్ఛద దృశ్య కర్ణికములై యున్నాళ నాళీకముల్"

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద కావ్యంలో వ్రాసిన పద్యం ఇది

వానలు బాగా కురిసేటువంటి ఆ రోజుల్లో, మనుషుల్లో కొద్దిగా నైనా పాపభీతి ఉండేది. మొక్కలు నరకటం, నీటిని వృధా చేయటం, అన్నం పారేయటం ఇలా చాలా విషయాల్లో పాపభీతి వెన్నాడేది. మనుషుల్లో మంచితనం వలన వానలు కొన్నయినా కురిసేవి. ఇప్పుడు మనకి ఎండాకాలం ఒక్కటే నడుస్తోంది. వాన కురిసినంత సేపే వానాకాలం! అపురూపమైన సమయం అది! అలాగే, చలి వేసిన ఆ కొద్దిసేపూ శీతాకాలం. మిగలిందంతా ఎండాకాలమే! మునిమాణిక్యం వారన్నట్టు మనది ఎండామండిత ప్రదేశం !

వానలు లేక అలా ఎండిన ఒక జలాశయంలో కృష్ణదేవరాయలు తామరపూలు వడలి పోతున్న ఒక దృశ్యాన్ని చూశాడు. అప్పటిదాకా నీళ్ళమీద తేలియాడిన తామర మొక్కల బతుకు బజార్న పడిందని అనిపించిం దాయనకి! మనుషుల్లో నిజాయితీ చచ్చిపోతే ప్రకృతి కన్నెర్ర జేస్తుందని పరోక్షంగా హెచ్చరించాలనుకున్నాడు.

తామరతూళ్ళు నిట్టనిలువుగా జొన్నదంటుల్లా నిలబడ్డాయి. అంతరిక్షంలో ఎగిరే పళ్ళాల్లాగా విహరించిన తామర పూరేకులు ఎండకు మాడి వడలి వాలి పోయాయి. తామరపూల మధ్యన ఉండే కర్ణికలు పచ్చగా పొడుచు కొచ్చినట్టు ఉన్నాయి. ఈ కర్ణికల్ని తామర దుద్దులు అంటారు. చెవులకు పెట్టుకునే బంగారపు దుద్దులు కూడా వీటిలానే గుబ్బలాగా ఉంటాయి కాబట్టి, వాటిని దుద్దులన్నారు. తామర పూల మధ్య అమ్మవారు ఈ మెత్తని దుద్దుమీదే కూర్చుంటుంది. ఆ దుద్దులు ఎండి వడిలి పోయాయి. ఇదీ అక్కడ కనిపించిన దృశ్యం

నదులు వెళ్ళి సముద్రంలో కలుస్తాయి. దీన్ని కవులు సాగర సమాగమం అని కూడా అంటారు. ప్రేయసీ ప్రియుల సమాగమం లాంటిదని! నదిని సముద్రంతో కలిపే వాడు పర్జన్యుడు. అంటే, ఉరిమే మేఘం! మామూలు భాషలో అమ్మాయిని అబ్బాయి దగ్గరకు చేర్చటాన్ని తార్చటం అంటారు. తమని సముద్రానికి తార్పులాడే మేఘుణ్ణి మంచి చేసుకోవటానికి నదులు సహజంగా ప్రయత్నిస్తాయి. అందుకు ప్రతిఫలంగా ప్రవాహాలు లంచం ఇచ్చుకున్నాయని రాయల వారంటారు. ఇప్పటి

భాషలో దాన్ని బ్రోకరేజీ, కమీషన్ అని గౌరవంగా పిలుస్తున్నారు. రాయలవారు దీన్ని లంచం అనే అన్నారు. దిగువ స్థాయిలో ప్రభుత్వ కార్యాలయాలు ఎలా పనిచేస్తున్నాయో నాకు తెలుసనే హెచ్చరిక రాయలు చేస్తూ ఉండవచ్చు కూడా! దీన్ని, ఇలాగే చెప్పి ఊరుకుని ఉంటే ఇందులో కవిత్వం ఏమీ లేదు. దీన్ని లోకానికి అన్వయించి చెప్పాలి. అది జనం మీద ప్రభావాన్ని చూపించాలి. కావ్య ప్రయోజనం అలా సిద్ధించాలని ఆశించాడు రాయలు. ఆముక్తమాల్యదలో ఈ దృశ్యాన్ని కవిత్వీకరించి చెప్పాలనుకున్నాడాయన.

మేఘుడి వాటా మేఘుడి కిచ్చేస్తే, బాగా వానలు కురిపించి తమని త్వరగా సాగరానికి చేరుస్తాడని నదుల ఆశ. అప్పటికే వడలిపోయిన తామర తూళ్ళు ఆ ఎండు జలాశయాన్ని చేతులుగానూ వాడి వాలిపోయిన తామర పూలను చేతివ్రేళ్ళుగానూ ఆయన భావించాడు. పూల మధ్యన ఉండే కర్ణికలు అంటే తామర దుద్దులు లంచం ఇవ్వటానికి అరచేతిలో పట్టుకున్న హేమటంకా(బంగారు నాణేలు)ల్లా ఉన్నాయంటాడు. కృశించిన తన చేతుల్ని బారచాచి, నది అరచేతుల్లో బంగారు నాణాలు చూపిస్తూ, 'ఇవి తీసుకుని వాన కురిపించవయ్యా' అని మేఘుణ్ణి అడుగు తున్నట్టుగా ఉందట. అవినీతి, లంచగొండి తనాలు ప్రపంచపరివ్యాప్తం.

వానలు కురవాలంటే మేఘాలకు లంచం మేపాలన్న మాట. ప్రభుత్వ కార్యాలయాలు లంచగొడితనంతో భ్రష్టుపట్టి పోయాయని, ప్రభుత్వ వ్యవస్థ బరితెగించిందని, అందుకు విరుగుడు అసాధ్యంగా ఉందనీ రాయలు గ్రహించాడు. దానికి తగ్గ నివారణ చర్యలు ఆయన తీసుకున్నాడనడానికి రాయలనాటి వజ్రాల పరిశ్రమ సాక్ష్యం చెప్తుంది.

ఆ కాలంలో 'అంగట్ల రతనాలు పోసి అమ్మినారట ఇచట...' అనే మాట/ పాట కూడా నిజమేనని చరిత్ర వేత్తలు అంగీకరిస్తున్నారు. అంగట్లో అమ్మిన ఆ నాటి వజ్రాలు ప్రైవేట్ సంపద కాదు. పూర్తిగా ప్రభుత్వ సంపద! ఆయన వజ్రాల గనుల్ని ప్రైవేటీకరించి కబ్జాదారులకి గుత్త కివ్వలేదు. కఠోరమైన నియమాల మధ్య వజ్రాలు తవ్వించి, పదును పెట్టించి బజార్లో పెట్టి అమ్మించాడు. తగిన ఆధారం లేకుండా ఎవ్వరి దగ్గరైనా పెద్ద వజ్రం ఉన్నదంటే అది తస్కరించబడినట్టే లెక్క! అందుకు శిక్ష ఘోరంగా ఉండేది.ఆ రోజుల్లో కోహినూరు వజ్రం అంతటి వజ్రాన్ని రోడ్డుమీద పారేసినా ఎవరూ ఎత్తు కెళ్లటానికి ధైర్యం చేసేవాళ్ళు కాదు.

లంచగొండి వ్యవస్థ గురించిన స్పష్టమైన అవగాహన రాయలవారి కున్నదన్న మాట! అది ఆముక్తమాల్యదలో ఈ పద్యంలో ప్రతిఫలించింది. లంచగొండుల్ని ఒక కంట కనిపెడుతూనే, ప్రభుత్వ యంత్రాంగాన్ని నడప గలిగాడంటే రాయల వారి అవగాహన గొప్పదనే అర్థం. నేటి పాలకులకు ఇలాంటివి పట్టాలి ! ఇంతకన్నా ముఖ్యం– 'అవినీతి అనాది' అనీ, దాని మూలాలు బలమైనవని గ్రహించాలి ! ☆

# 'ఎడమ కాలి పరిష్కారం'

**జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన**
**ర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిరమచ్చో, వామ పాదంబునన్**
**దొలగం దోచె లతాంగి యట్లె యగు నాథుల్ నేరముల్ సేయ, బే**
**రలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?**

ఒకప్పుడు, భార్యలకు కోపం వస్తే, తలగడ మంత్రం చదివేవాళ్ళట! అంటే, మంచం ఎక్కి పడుకుని ముఖం మీద తలగడ అడ్డుపెట్టుకుని తనకి జరిగిన అన్యాయాన్ని ఏకరువు పెడ్తూ ప్రదర్శించే అలుక. సాధారణంగా పడగ్గది ఇందుకు అనుకూలంగా ఉంటుంది. ప్రేమనైనా కోపాన్నైనా ఈ గదిలోనే ప్రదర్శించాల్సి ఉంటుంది. కోపం ప్రదర్శించటానికి ఇదే కోపగృహం. ప్రేమకైతే ఇదే శృంగార మందిరం. కోపం కూడా శృంగారంలో ఒక భాగమేనని కదా వాత్స్యాయనుడు చెప్పింది...!

కృష్ణుడు సత్యభామని వెదుక్కుంటూ పడగ్గదిలోకి వెళ్ళినప్పుడు అతనికి అర్థం అయ్యింది, జరగబోయేది రాగుంజు పోగుంజులాట అని! భార్యాభర్తల మధ్య కీచులాట వచ్చినప్పుడు భార్యలు తలగడ మంత్రం చదివితే, దాన్ని భర్తలు పెద్దగా పట్టించుకోక పోవచ్చు. కానీ, భర్తలు తప్పు చేసి ఆ రహస్యాలన్నీ భార్యలకు తెలిసిపోయి దొరికిపోయినప్పుడు, ఆ భర్త ఎంతటి వాడైనా పాదాక్రాంతుడు కాక తప్పదు. పారిజాతాపహరణం కథలో ప్రత్యేకత ఇది! భార్య తప్పుచేసిందనే అనుమానంతో అగ్నిప్రవేశం చేయించటం, శిలవైపొమ్మని శపించటం లాంటి కథలు పురాణాల్లో చాలా చదివాం. కానీ, ఇలా తప్పు చేసిన భర్త తన భార్యకు దొరికిపోయి నానా అగచాట్లు పడటం ఎక్కడా కనిపించదు. పారిజాతాపహరణం కావ్యం సాక్షాత్తూ కృష్ణుడికే ఆ పరిస్థితి కల్పించి, మగ పండితులెవ్వరూ నోరెత్తకుండా చేసింది. మగాడు తప్పుచేస్తే, వాడు మ"గాడిదే" ననే సిద్ధాంతాన్ని ప్రకటించిందా కావ్యం. ఇంత గొప్ప ఊహ చేసింది నందితిమ్మన. ప్రథమాశ్వాసంలోనే ఈ పద్యం ఉంది.

'నీటిలో పుట్టిన పువ్వు(పద్మం)మీద కూర్చుని ప్రకాశించే బ్రహ్మ దేవుడు లాంటి దేవతలు ఎప్పుడూ కొలిచేటి పరమాత్ముడు మొక్కల తీగలనే విల్లుగా చేసుకున్న మన్మధుడి కన్నతండ్రి అయిన ఆ విష్ణుమూర్తి తలకాయిని అయ్యయ్యో.. తన ఎడమకాలితో తొలగేలా పక్కకి తోసింది ఆ లతాంగి... అని పద్యభావం.

ఎవరా లతాంగీ...? సాక్షాత్తూ సత్యభామ! చూస్తూ చూస్తూ మొగుణ్ణి ముఖం పక్కకు తిరిగేలాగా ఎడమకాలితో తోసిందని ఎంతో మర్యాదగా చెప్పాడు తిమ్మన

కవి. అంతేగానీ, కాలితో చాచి తన్నిందని వ్రాయలేదు. మగపక్షపాతులైన కవులూ, సినిమా వాళ్ళు జమున లాంటి నటీమణులతో చాచి తన్నినట్టే చూపించారు. తన్నినా, నెట్టినా రెంటికీ పెద్ద తేడా లేకపోయినప్పటికీ ఆమె తన్నింది ఎడమకాలితో కాబట్టి, అది పెద్ద చర్చనీయాంశం అయ్యింది. నిజానికి చేత్తో కొట్టినా, కాలితో తన్నినా ఒకటే! కానీ, భారతీయులకు కాలు అపవిత్రమైనది. అందులో ఎడమకాలు మరీ అపవిత్రమైంది. ఆ దెబ్బేదో చేత్తో ఒక్కటిస్తే జన్మజన్మాలకూ బుద్ధొచ్చేదేమో. కానీ, ఎడం కాలి ప్రయోగం అనే సరికి మగాళ్ళ మనసు గాయపడింది. మనోభావాలు దెబ్బతిన్నాయి. ఇదా దాంపత్యం అంటే...? ఇదా ప్రేమంటే...?

ఇల్లాలికి ఒళ్ళు మండితే పడగ్గదులన్నీ నక్సల్ బరీ లౌతాయన్నది నంది తిమ్మన గారి హెచ్చరిక.

మొగుడు తప్పు చేసి ఏ అర్ధరాత్రో పిల్లిలా ఇంట్లోకి జొరబడ్డి మెల్లగా నక్కినక్కి వస్తే ఏ ఆడదైనా ఊరుకుంటుందా...? మర్యాదస్తురాలైతే, ఛడామడా కడిగి పారేస్తుంది. చండీరాణి లాంటి దైతే, చేతికి పని చెబ్తుంది. కానీ, సత్యభామ రెండూ చెయ్యదు. ఆవిడ రూటే సెపరేటు.

మంచం మీద బాపూ గారి బొమ్మలాగా వయ్యారంగా పడుకుని ఉన్న ఆ సత్య భామను చూసి, కృష్ణుడు ఆమె కాళ్ళు పుచ్చుకుని ప్రాథేయపడుతూ 'సత్యా' అని పిలిచాడు. సత్య ఆ గొంతు విని కోపంగా తన కాళ్ళ మీద తలను ఉంచిన కృష్ణుణ్ణి ఆ తలతో సహా ఎడం కాలితో అవతలకు నెట్టేసింది.

"యట్లె యగు నాథుల్ నేరముల్ సేయ" ఇట్లాగే తిక్క కుదరాలి, తప్పుడు పనులు చేసి కొంపకు వచ్చిన మగాళ్లందరికీ... అంటాడు కవి. " బేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?" అలుక బూనిన స్త్రీలు ఉచితానుచితాలు మరిచిపోయి ఆ కోపం మీద ఎవరూ ఏవిటీ అని చూడకుండా చాచి తన్నేస్తారంటాడు. "తప్పు చేసినవాడు పరమాత్మ అయితే ఏంటటా...?" అన్నట్టు వర్ణించాడు తిమ్మన!

ఇది 16వ శతాబ్దినాటి కథ. దీని వెనుక మహిళా తీవ్రవాదం ఉంది. సమస్యకు పరిష్కారం ఉంది. ఆచరణీయ యోగ్యత ఉంది. లతగారి నవలల్లో ఇలాంటి ముగింపులు చాలా వున్నాయి. వినాయకరావు అనే శాడిష్టు మొగుణ్ణి తులసి అనే ఇల్లాలు వీధిలో పడేసి కాళ్ళతో తన్నుకుంటూ వెళ్ళినట్టు వ్రాస్తుందామె! నందితిమ్మన కాలానికే ప్రారంభమైన ఈ మహిళా ఉద్యమం ఇప్పుడు బలంగా వుంది.

గృహ హింస చట్టం అమలయ్యేది కష్టం కాబట్టి ఆడదానికి ఎడమకాలే 'అణ్వాయుధం' ఎప్పటికైనా !

★

# 800 యేళ్ళ నాటి తెలుగు రుచులు

"మరీచి ధూళీ పాం పరిచితంబులు మాణి/బంధాశ్మ లవణ పాణింధమములు
బహుళ సిద్ధార్థ జంబాల సారంబులు/పటురామఠామోద భావితములు
తింత్రిణీక రసోపదేశ దుర్ధురములు/జంబీర నీరాభి చుంబితములు
హైయంగవీన ధారాభిషిక్తంబులు-లలిత కస్తుంబరూల్లంఘితములు
శాకపాక రసావళీ సౌష్టవములు
భక్ష్యభోజ్య లేహ్యంబులు పానకములు
మున్నుగా గల యోగిరంబులు సమృద్ధి
వెలయగొని వచ్చె నొందొండ విధములను"

గుణనిధి భ్రష్టుడయ్యాడు. ఉన్న ఊరు వదిలేసి పారిపోయాడు. దారిలో ఓ శివాలయం కనిపించింది. అక్కడో భక్తుడు తెల్లవారుఝామున నైవేద్యం పెట్టటానికి ఘుమఘుమల వంటకాలు సిద్ధంగా ఉంచాడు. నైవేద్యం పెట్టే సమయం అవుతోంది. ఒకవైపు శివభజన జరుగుతోంది. గుణనిధి కాసేపు భజనలో కూచున్నాడు. ఆకలి మీద ఉండటంతో, సందు చూసుకుని ఆ వండిన పదార్థాలు దొంగతనం చేద్దామని గర్భాలయంలో దూరాడు. అక్కడ దీపం వత్తి కొండెక్కుతోంది. తన బట్ట చింపి వత్తిని చేసి వెలిగించాడు. ఆ వెలుగులో కనిపించిన వంటకాలను ఈ పద్యంలో వర్ణించాడు శ్రీనాథుడు:

**మరీచి ధూళీ పాల పరిచితాలు:** మిరియాలపొడి చల్లి తయారు చేసిన ఆహార పదార్థపు పోగు.

**మాణిబంధాశ్మ లవణ పాణింధమములు:** మాణిబంధం అంటే సైంధవలవణం.

దాన్ని ఇంకా నొక్కి చెప్పటానికి 'అశ్మలవణం' అని కూడా అన్నాడు.

పాణింధమం అంటే చేతులతో నొక్కి చేసిన పిండివంట. బియ్యప్పిండి లేదా జొన్నపిండిలో తగినంత ఉప్పు వేసి ముద్దగా కలిపి, అందులో శనగపప్పు లేదా పెసరపప్పు నానబెట్టి కలిపి తప్పాల మీదగానీ, పెనం మీద గానీ చేతులతో వత్తి కాల్చిన అట్టుని తప్పాలచెక్క అంటారు. దాన్నే పాణింధమం అన్నాడు శ్రీనాథుడు.

**బహుళ సిద్ధార్థ జంబాల సారంబులు:** సిద్ధార్థం అంటే ఆవాలు. జంబాలం అంటే అడుసు. ఈ పదాన్ని ఇక్కడ కూరల్లో గ్రేవీ అంటామే దానికి అన్వయించి ఉంటాడు శ్రీనాథుడు. బహుళ సిద్ధార్థ జంబాల సారాలు అంటే ఆవపిండి గ్రేవీ ఎక్కువగా ఉండే ఆవడల్లాంటి అనేక వంటకాలు.

**పటు రామఠామోద భావితములు:** ఇంగువ చెట్టు పాలను ఎండిస్తే జిగురుగా వుండే ఇంగువ అవుతుంది. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ పరిసర ప్రాంతాల్లో ఇంగువ చెట్లు పెరుగుతాయి. రామఠం, బాహ్లీకం అంటూ దేశాల పేర్లతోనే ఇంగువను పిలుస్తారు. పటు రామఠామోద భావితములు అంటే, బాగా నాణ్యమైన ఇంగువ ఘుమాయించే వంటకాలు అని!

**తింత్రిణీక రసోపదేశ దూర్ధరములు:** చింతపండు రసం బాగా కలిపి చేసిన మెండైన వంటకాలు

**జంబీర నీరాభి చుంబితములు:** నిమ్మరసం పిండిన వంటకాలు

**హైయంగవీన ధారాభిషిక్తంబులు:** హైయంగవీనం అంటే తొలిఈత ఆవుపాల వెన్నని కరిగించిన నెయ్యి అని కొందరు, ఏరోజు పెరుగు ఆరోజే చిలికి తీసిన వెన్నను కరిగించిన నెయ్యి అని మరికొందరూ చెప్తారు. సద్యోఘృతం లేదా తాజా నేతిని ధారగా పోస్తే, ఆ నేతిలో మునిగితేల్తున్న వంటకాలు

**లలిత కస్తుంబరూల్లంఘితములు:** లలిత కస్తుంబరు అంటే లేత కొత్తిమీర. బాగా పరిమంళించేలా కొత్తిమేర కలిపిన వంటకాలు.

**శాకపాక రసావళీ సౌష్టవములు:** సౌష్టవం కలిగిన కూరగాయలతో చేసిన రుచికరమైన కూరలు.

**భక్ష్యభోజ్య లేహ్యంబులు పానకములు:** భక్ష్యాలు (కొరికి తినవలసిన పిండివంటలు), భోజ్యాలు (నమిలి మింగవలసిన అన్నమూ, కూరలు వగైరా), లేహ్యాలు (చప్పరిస్తూ తినవలసిన హల్వా, కేసరి లాంటివి), చోష్యాలు (చూష్యాలు-పీలుస్తూ సేవించే పులుసు చారు వగైరా), పానీయాలు(పాయసాలు, కీరు,సూపు వగైరా) ఇలా ఐదు రకాల ఆహార పదార్థాలు.ఇవన్నీ మహానివేదన కోసం సిద్ధంగా ఉన్నవి.

ఇవి తెలుగువారి రోజువారీ వంటకాలు. శ్రీనాథుడు ఉల్లంఘితములు, అభిచుంబితములు, దూర్ధరములు లాంటి పదాలను అవలీలగా ప్రయోగించేశాడు.

తెలుగు భోజనంలో గొప్పతనం గురించి రకరకాల కొత్తవంటకాల గురించి శ్రీనాథుడు చాలా విషయాలు చెప్పాడు. వాటిని ఇప్పటికీ మనం పేర్లు మార్చుకుని వాడుకుంటున్నాం.శ్రీనాథుడి కారణంగా తెలుగు వారి ఆహార సంస్కృతిలోని ప్రత్యేకత పదిలంగా కనిపిస్తోంది. ✪

# కక్కురితి వ్యామోహాలు

"ప్రాము జఠరాగ్నిచే "గింకరోష్మి" యనుచు
నదరు వేదనచే "గ్వ యాస్యామి" యనుచు
విస్మయపు మూర్ఛచే "నాహతో" యనుచు
బలువరింపగ సాగె నబ్బక్క నక్క"

ఇది కక్కుఱితిపడి చచ్చిన ఒక నక్క కథ. అయ్యలరాజు నారాయణామాత్యుడి హంసవింశతి కావ్యంలో ఓ శ్రోత్రియుడి భార్య రాజసంయోగం కోసం వెంపర్లాడుతున్నప్పుడు, అది తగదని హంస హితబోధ చేస్తూ చెప్పిన ఓ బక్క నక్క కథ !

తీక్షణమైన ఆకలి బుర్ర పనిచేయకుండా చేస్తుంది. 'ఆకళ్ళు' చాలా ఉన్నాయి. మన కవులు "క్షుధాతురాణాం న తీపి ర్నపులుపు, కామాతురాణాం న ముసలి ర్నపడుచు, నిద్రాతురాణాం న మిట్ట ర్నపల్లం" అంటూ పేరడీ చెప్పే వాళ్ళు. అన్నం ఆకలితో అలమటించే ఒక నక్క, కామం ఆకలితో అలమటించే ఒక అమ్మాయి...ఈ ఇద్దరి ఆ కళ్ళనూ కలిపి అల్లిన కథ ఇది.

పుట్టలు, దిట్టలు, చెట్లు, బొట్లు, గట్లు, వంకలు, డొంకలు బీళ్ళు, రాళ్ళ కుప్పలు, తిప్పలు, మళ్ళు, గుళ్ళు, ఊళ్ళు తిరిగీ తిరిగీ ఆహారం దొరక్క అలిసిపోతోంది. ఒక నక్క. కామం ఆకలితో గింజుకుంటోంది అమ్మాయి !! ప్రాణాలు కంఠంలో పెట్టుకుని, నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ ఓ నూతి దగ్గరకు వచ్చింది నక్క. నూతి ఏతానికి బలంగా కట్టిన చర్మపు వారు (త్రాళ్ళు) కనిపించింది. ఆ పూటకు ఆ త్రాళ్లు తిని కడుపు నింపుకోవాలనుకుంది. గడప దాటటానికి సిద్ధమైన సుందరి కూడా అంతే! దాటేయాలనే ఆశలో ఇంకేం ఆలోచించలేదు.

ఆకలి మీదున్న బక్కనక్క ఏతాము దూలం (ముంగిసమ్రాను) పైకి ఎక్కి వెదురులకు కట్టిన చర్మపు తాడుని పుటుక్కున కొరికింది. అంతే! వంగి ఉన్న వెదురు బద్ద బలంగా తగిలి, తాటి చెట్టంత ఎగిరి నాలుక నడుముకు కరుచుకునేలా వెన్ను విరిగి ఆ నూతిలో పడి చచ్చింది.

గడపకు తెలీకుండా గడప దాటగలిగిన ఇంతి కూడా ముందు వెనుక చూసుకోక పోతే ఆమె గతీ అంతే అవుతుందనేది ఈ కథలో కనిపించే పోలిక. "కామం కమ్మినప్పుడు వెనకాముందు చూడక పోతే నక్క గతే పడ్తుంది. ఆకలి కొద్దీ

నక్క ఆహారాన్ని చూసిందే గానీ, తన చేటు తెలుసుకోలేకపోయింది. రాజసంయోగం కోరి, నువ్వుకూడా ఉపద్రవాలు ఆలోచించట్లేదు. చిత్తంబున తత్తరంబు లేక తెలిసి మెలగా" లని హంస నయోక్తులుపలికింది.

అమెరికా అంత గొప్ప అయిపోవాలి, దుబాయంత డబ్బు కావాలి, సింగపూరంత రాజధాని కావాలి... ఇలాంటి కోరికలు కూడా అలాంటి ఆ కళ్ళే వెనకా ముందు చూసుకోవటం అనేది అవసరం. అమెరికాలో పీజ్జాలు, బర్గర్లు తింటారు... మనమూ తినాలి! ఆస్ట్రేలియాలో చొక్కాలు విప్పుకు తిరుగుతారు. మనమూ తిరగాలి! పారిస్‘లో శృంగారం విచ్చలవిడి. మనమూ కానివ్వాలి...అనే ‘ఆకలి’ మనకూ పెరుగుతోందీ మధ్య.

‘దేశాభిమానం మాకు కద్ద’ని గట్టిగానే చెప్పుకునే పార్టీ అధికారంలోకి వచ్చాక ఈ విదేశీ వ్యామోహం వీసమెత్తయినా తగ్గుతుందని ఆశించిన వాళ్లకు ఆశ్చర్యం మాత్రమే దక్కింది. అది గతంలోకన్నా మితిమీరుతున్న దాఖలాలు కనిపిస్తున్నాయి.

ఈ విధమైన పాశ్చాత్యుల దాడి ‘మతం’ మీద కాదు, అది మన సంస్కృతి మీద మోహరించి జరుగుతోంది. అందుకు మనలో నిబిడంగా ఉన్న కక్కురితే కారణం. దానికి ఆధునికీకరణం, నాగరీకరణం, సంస్కరణం లాంటి పేర్లు ఎన్ని పెట్టినా అది కక్కురితే! మనది కానిదాని కోసం, మనకు తగని దాని కోసం వెంపర్లాట...

విదేశీ మోహరింపు మొదట మన భాష మీద లగ్నం అయ్యింది. మనం విద్యావ్యవస్థను బలిచేసుకున్నాం. తర్వాత మన ఆహారం మీద దృష్టి పెట్టింది. మనం రంగు రసాయనాలు, పురుగుమందులు కలిసిన విషం నీళ్ళ కూల్ డ్రింకుల్ని ఆబగా తాగటం మొదలు పెట్టాం. రంగు బిస్కట్టులు, కొవ్వు రొట్టెలు, సీసం కలిసిన నూడిల్సూ గొప్పవంటూ తెచ్చి పిల్లలకు పెట్టి అమెరికా వాళ్ళమై పోయినంత సంబర పడ్డాం. ముప్పొద్దుల భోజన సంస్కృతినీ, ఆరు రుచుల ఆహార సంస్కృతినీ చెడగొట్టు కుని విదేశీకరణం కోసం ఆబగా ఎదురుచూస్తున్నాం... బక్క నక్క భావావేశంతో !

హంసవింశతి కావ్యంలో రాజుగారు విష్ణుదాసుడి ఇల్లాలిని కోరాడు. రాజంతటి వాడు కోరితే కాదనటమా అనుకున్నదా అమాయకపు అందగత్తె. అంతలో అదృష్టం కలిసొచ్చినట్టు విష్ణుదాసుడు విదేశాలకు వెళ్ళాడు. ఇల్లాలు గడప దాటేందుకు సిద్ధంగా ఉంది. చీకటి పడ్తోంది. చంద్రోదయం అవుతోంది...సరిగ్గా ఆ సమయంలో ఎక్కడినించి వచ్చిందో ఓ హంస. ఆ హంస పరమహంస లాంటిది. భర్త తిరిగి వచ్చే వరకూ రాత్రి పూట ఆ ఇల్లాలిని కూర్చోబెట్టి కక్కురితి మంచిది కాదంటూ ప్రతిరాత్రీ ఒక కథ చెప్పి రోజులు గడిపించింది.

సంస్కృతి వికాసాల గడప దాటనీయని పరమహంసల కోసం ఎదురు చూద్దాం. ✯

# కనిపించనివే గొప్ప

"వరబింబాధరమున్,పయోధరములున్ వక్రాకకంబుల్ మనో
హర లోలాక్షులు చూప కవ్వలి మొగంబైనంత యేమాయె, నీ
గురు భాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుంజాలదె గంగ క
ద్దరిమే లిద్దరి కీడునున్ గలదె యుద్య ద్రాజబింబాననా!"

తెనాలి రామకృష్ణుడు ఏ కూరగాయలు కొనుక్కోవటానికో మార్కెట్టుకు బయల్దేరాడు.కొంటెవాడు కాబట్టి అక్కలవాడగా పిలువబడే రెడ్'లైట్ ఏరియా మీదుగా నడిచి వెడ్తున్నాడు. ఏ అమ్మాయి కళ్లలోనైనా పడకపోతానా...అని అటూ ఇటూ వెదకులాడు నడుస్తున్నాడు. ఓఇంటి ముందు తనకు తగ్గ ఓ సుందరి కనిపించింది. ఆమె అతన్ని చూసింది. అతని భయంకరమైన పళ్ళు చూసి భయపడిందో లేక అతని ముగ్ధ మోహనరూపానికి అచ్చెరువొందిందో గాని... ఠక్కున తలుపు చాటుకు ముఖం దూర్చేసింది. నడుముకు పైభాగం అంతా తలుపు వెనకాల ఉండగా, నడుముకు కింది భాగం అంతా తలుపుకు ఇవతలవైపున ఉంచి గుమ్మంలో వయ్యారంగా నిల బడింది. అతను మాత్రం ఆమె తనను చూసి సిగ్గుతోనే అలా చేస్తోందని అనుకున్నాడు.

ఉదయిస్తున్న నిండు పున్నమి చంద్రుడు మబ్బు చాటున నక్కి చూస్తున్నట్టు, సగం శరీరాన్ని మాత్రమే చూపిస్తూ నిల్చున్నదానా...అని ఆమెను "ఉద్యద్రా జబింబాననా" అని పిలిచాడు.

కనిపించిన వాటికన్నా కనిపించని వేవో గొప్పవనే దురాశ రామకృష్ణ కవికి లేదు. చాలా పెద్దదైన ఆ నడుముని చూసి ఆమె వక్షోజాల పరిమాణాన్ని ఊహించుకున్నాడు. నీ జఘనం ఘనంగా ఉంది. నీ క్రొమ్ముడి అంతకంటే సౌకర్యవంతంగా ఉంది. ఇటువైపు కనిపించే సోయగాల్ని బట్టి అటువైపు దాక్కున్న సోయగాలు కూడా ఘనంగానే ఉంటాయి...అని ఊహించాడు. మొత్తం మీద ఆమె అందగత్తెనని నిర్ధారించుకున్నాడు.

మబ్బుచాటున సగం దాగిన చంద్రబింబమా! నీ ఎర్రని పెదాల్ని చీకట్లోకి తిప్పేశావు, ముఖంలో శృంగార చిహ్నాలైన అలకల వంటివి కనిపించకుండా దాచేశావు. చూడగానే ఐస్సైపోయే నీ కళ్ళని ఆ వైపే ఉంచేశావు! ఇంక నీ వక్షోజాల గొప్పతనం చెప్పనవసరంలేదు. వాటిని కూడా ఆ వైపే అట్టేపెట్టేశావు" అన్నాడు. ఇది ఒకవిధమైన నిందా స్తుతి! బావున్నవంటూ పొగుడ్తూనే సరిగా చూడనివ్వలేదని ఎత్తిపొడుపు ఆయన మాటల్లో స్పష్టంగా ఉంది! ఆమాటలకు ఆమె నవ్వుకునే ఉంటుందని భావించాడు. ఆ అక్కలవాడ చిన్నదానికి ఈ మహాకవి మాటలు అర్థం అయి అది నిజంగానే నవ్వుకుందా లాంటి ప్రశ్నలు అప్రస్తుతం. రసపట్టులో తర్కం కూడదు.

ఆ తలుపుని గంగా ప్రవాహంతో పోల్చాడు. ఆ తలుపుకు ఇటు వైపున ఉన్న 'శరీర దిగువ భాగం' నదికి ఈవలిగట్టు అయితే, తలుపుకు అవతలి భాగాన దాగున్న చంద్రబింబం లాంటి ముఖమూ, వక్షోజాలు వగైరా ఆవలి గట్టుగా భావించాడు. నదికి ఇటు గట్టు ఎలాంటిదో అటు గట్టూ అలాంటిదే! 'గంగకద్దరి మేలిద్దరి కీడునున్ గలదె..." గంగానదికి అటు గట్టు మేలు, ఇటు గట్టుకీడు అనేది ఉంటుందా...? అని ప్రశ్నించుకున్నాడు. ఇటు వైపు కనిపించే జఘనాదులు తనకు చక్కగా సరిపోయేవే కాబట్టి, నడుము పైభాగాన ఉండే వక్షోజాదులు కూడా చాలినవే అయిఉంటాయని ఆశించాడు. ఇవతలి గట్టు మీద ఎక్కువ ప్రేమ, అవతలి గట్టు మీద తక్కువ ప్రేమా ఉండవు కదా అని తనను సమాధానపర్చుకున్నాడు. ముఖ వక్షోజాలు, నడుము దిగువ భాగాలూ రెండింటి మీదా తనకు సమాన ప్రీతే ఉందని చాటుకున్నాడు.

ఈ పద్యంలో అసలు గమ్మత్తంతా "గురు భాస్వజ్జఘనంబు" అనటంలో ఉంది. సాధారణంగా అందమైన ఆడపిల్ల నడుముని సన్నగా నాజూకుగా ఉండే వాటితో పోలుస్తారు ఎవరైనా! కానీ రామకృష్ణ కవి గురు భాస్వజ్జఘనంబు-ఆమె చాలా లావైన నడుము కలదనీ, ఆ నడుము తనకు చాలినదేననీ ఘనంగా చెప్పుకున్నాడు. దాన్ని బట్టి తెనాలి కవివరేణ్యుడి ఆకారాన్ని ఎవరైనా ఊహించుకోవచ్చు! ఆమె లావైన నడుము ఈయన లావైన పొట్ట బరాబరు అన్నమాట.

ఆ పిల్లలో ఏం నచ్చిందని ప్రేమించావురా అని ఎవరూ వికారంగా ఉండేవాణ్ణి అడగరు కదా! గంతకు తగ్గ బొంతనే ఎంచుకున్నాడు ఈ చాటు కవి. ఇది రామకృష్ణుడి పద్యమేనని పండితుల భావన. ఒకవేళ అదే అయితే, తెనాలి రామకృష్ణుడు లేదా రామలింగడు అక్కినేని నాగశ్వరావేమీ కాదని మనం కచ్చితంగా నమ్మవచ్చు. మనసులోని మర్మాన్ని దాచుకోలేక కవి తన రచనలలో ఏదో ఒక రూపంలో బయట పెట్టుకుంటాడు. దాన్ని బట్టే విశ్లేషకులు కవుల జీవిత చరిత్రలు తయారు చేస్తారు.

తెనాలి రామకృష్ణుడి పాత్రని తెలుగు సినిమాల్లో వేశారు కాబట్టి రామకృష్ణ కూడా అలాగే అందమైన వాడని ఊహించుకుంటాం.

నిజానికి తెనాలి రామకృష్ణ లేదా రామలింగడు భీకరమైన ఎత్తుపళ్ళ వాడనీ, కృష్ణదేవరాయలు పొట్టిగా పీలగా ఉంటాడనీ, ముఖం స్ఫోటకం మచ్చలతో వికారంగా ఉంటుందనీ కొందరు పరిశోధకులంటారు. కానీ, జాతి హీరోలుగా మన భావాల్లో నిలిచిపోయిన వాళ్ళని అలా అందమైన రూపాల్లో ఊహించుకో గలగటమే శ్రేయస్కరం. రామకృష్ణుడు అందగాడేనని మనం నమ్మితే వచ్చే అపకారం ఏమీ లేదు. కాదని నిరూపించేందుకు కసరత్తు చేయటం వృథా ప్రయాస. ఈ చాటు పద్యానికి ఎవరో ఊబకాయుడే కర్త కావచ్చు. ☆

# కప్పల పెళ్ళి

**"అంకిలి సెప్ప లేదు, చతురంగ బలంబుల తోడ నెల్లి యో**
**పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి, నా**
**వంకకు వచ్చి, రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే**
**యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము! వచ్చెదన్"**

ఇది పోతన గారి పద్యం. ప్రపంచం లోనే తొలి ప్రేమలేఖగా విశ్లేషకులు భావించే రుక్మిణి 'ప్రేమలేఖ'లో ముఖ్యమైన పద్యం ఇది.

శ్రీకృష్ణుడికి ఒక స్పష్టమైన యాక్షన్ ప్లానుతో లేఖ వ్రాసి ఓ పెద్దాయన చేతికిచ్చి పంపిస్తుంది రుక్మిణి. "పద్మనాభుడవూ, పురుష సింహానివీ అయిన ఓ కృష్ణా! నా ప్రతిపాదనకి నువ్వు అడ్డు చెప్పేందుకు ఏమీ లేదు. రథ, గజ, తురగ, పదాతి చతురంగ బలాల్తో వచ్చి, శిశుపాల జరాసంధుల్ని ఓడించి, రాక్షస వివాహ పద్ధతిలో నన్ను పరిగ్రహించు. నేను నీ వెంట వస్తాను" అంటుంది.

మూలభాగవతంలో తనను రహస్యంగా వచ్చి తీసుకెళ్ళాలని రుక్మిణి కోర్తుంది. పోతనగారికి అది నచ్చినట్టు లేదు. చతురంగ బలాల్తో బాహాటంగా వచ్చి తనను గెలుచుకోవాలని తెలుగు రుక్మిణి అనడం వలన ఆమె ఔన్నత్యం నిలబడింది.

పెద్దనగారు తన కావ్యనాయిక వరూధినికి ఈ విధమైన గౌరవాన్ని ఇవ్వలేక పోయాడని కొందరు పండితుల్లో అసంతృప్తి ఉంది. వరూధిని ప్రవరుడి మీద పడి గోలగోల చేసింది. వనితలు పలచి వస్తే లోకువా...అని ఈసడించింది. అల్లరి చేసి, తను అల్లరయ్యింది. వీణనో, అద్దాన్నో పుచ్చుకుని వయ్యారాలు పోవటం, చిలక నెత్తుకుని ఆడిస్తూ దానితో పనికిరాని ఊసులాడటం తప్ప పెద్దనగారి కాలానికి చెందిన కావ్యనాయకులకు రుక్మిణి కున్నంత తెగింపు కనిపించదు. పైగా క్షత్రియ వీరుడితో నడపాల్సిన కథని పెద్దన భూసురోత్తముడితో నడిపించాడు. దాంతో, 'డామిట్! కథ అడ్డం తిరుగు'తుంది.

కావ్య నాయికల విషయంలో ఇలాంటి అసంతృప్తులు లేకుండా జాగ్రత్త పడాలని తెనాలి రామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యం కావ్యంలో కొంచెం ఎక్కువ జాగ్రత్త తీసుకున్నాడు. "కందుకము గాదు కేళీశుకంబు కాదు, పల్కువీణియ గాదు, దర్పణము గాదు, వర్షపిశునంబు బట్ట బల్వరుస జనిరి చంచలాక్షులు చపల ప్రచారలెందు"అనే పద్యంలో నర్మగర్భంగా కావ్య నాయికలను ఎద్దేవా చేయటం కూడా కనిపిస్తుంది.

షుమారుగా 70,80 యేళ్ళ క్రితం వరకూ కూడా పెళ్ళికాని ఆడపిల్లల్ని ఓ 'హార్మోనియంపెట్టె' ముందు కూర్చోబెట్టి ఫొటోలు తీయించే వాళ్ళు. మధ్యతరగతి మందహాసాలలో ఈ "హార్మోనీ పెట్టె ఫోటో"ఒకటి! కంప్యూటరు ముందు కూచున్న ఫోటోల్లాగానే ఆ రోజుల్లో "హార్మోనియం పెట్టె ఫోటో"లుండేవి. పెళ్ళికి సిద్ధంగా ఉన్న పిల్ల ఫోటో' అని చూడగానే స్ఫురిస్తుంది.

మధ్యయుగాల్లో కావ్యనాయికలు వీణవాయిస్తూన్నట్టూ, గోడకో, స్తంభానికో ఆనుకుని ఒక కాలు వెనక్కి ఆన్చి ఒక చిలుకని పట్టుకొని వయ్యారంగా నిలబడ్డట్టు, 'చేతిఅద్దం'లో చూస్తూ ముంగురులు సరిచేసుకుంటున్నట్టు, తామర పూవు పుచ్చుకుని సుతారంగా ఛాతీ పైన ఆన్చి ఎదురు చూపులు చూస్తున్నట్టు ...ఇలాంటి దృశ్యాలు ఎక్కువగా కనిపించేవి! గిరిక, వరూధిని లాంటి నాయికలు మధురంగా వీణ వాయించగల నేర్పరులు. రతి సంసిద్ధతనీ, ప్రేమను చెప్పుకోవటానికీ వాళ్ళు వీణను ఉపయోగించేవారు. తెలుగు సినిమాల్లో నిన్న మొన్నటిదాకా వీణపాటలు ఇందుకు ఉపయోగపడ్డాయి.

తెనాలి రామకృష్ణ ఒక భిన్నమైన నాయికని సృష్టించా లనుకున్నాడు. అందుకోసం పాండురంగ మహత్మ్యం కావ్యంలో అయుతుడి కథని సృష్టించాడు. అయుతుడు శాపవశాత్తూ ఒక కప్పగా మారిపోతాడు. ఆ కప్పని పట్టుకోవాలని కన్యాకుబ్జ రాకుమారి, ఆమె చెలికత్తెలు ప్రయాసపడుతుంటారు. కావ్యనాయిక ఒక కప్పని చేత్తో పట్టుకుని విలాసంగా నిలబడ్డట్టుగానో, కందుక క్రీడలాడినట్టుగానో వర్ణిస్తే పరమ అసహ్యంగా ఉంటుంది. అది, చేతిమీదకు ఎక్కించుకునే చిలుక గానీ, వాయించేందుకు పనికొచ్చే పలుకుతేనెల వీణ గానీ, నిమిషానికోసారి ముఖం చూసుకునే 'చేతిఅద్దం' గానీ కాదు! అద్దం పట్టుకునే వయ్యారి కన్నెలకు కప్పని పట్టుకోవటం సాధ్యమా...అని తెనాలి కవి యద్దేవా చేస్తాడు.

కప్పను ప్రేమించిన నాయిక తనూ శాపం పొంది కప్పలాగా మారిపోతుంది. కప్పనాయకుడు, కప్పనాయికా చూడముచ్చటగా ఏకం అవుతారు. రుక్మిణికన్నా, వరూధినికన్నా, ఈ కప్పనాయికలో ఎక్కువ తెగింపు కనిపిస్తుంది! భర్త అడవులకు పోవాల్సి వస్తే, భార్య కూడా అడవులకు పోయినట్టే, ప్రియుడు కప్పగా మారితే ప్రియురాలూ కప్పగా మారి పెళ్ళాడటం ఆదర్శవివాహం! వరూధిని ప్రేమ కన్నా, ఫేసుబుక్కు ప్రేమ కన్నా ఈ 'కప్పప్రేమ' గొప్పది! ☆

# కలవనేవి 'కల'వు

"కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణముల పాలం
కలడందురన్ని దిశలను
కలడు కలండనెడి వాడు కలడో లేడో"

బండి నల్లేరు మీద పరిగెడుతున్నంత సేపూ ఉన్నాడో లేడో అనే మీమాంసే ఉండదు. తనబలహీనత బయటపడి, విసిగి వేసారినప్పుడు కలడు కలండనెడివాడు కలడో లేడో అనే సందేహం తప్పకుండా పుడుతుంది.

తనకొచ్చే ప్రతీ కష్టానికీ ఎవరో ఇతరులు కారణం అనుకోవటం అనేది మానవ సహజ లక్షణం! దైవం అనుకూలించ లేదంటాడే గానీ, తన ప్రయత్నం లోపించిందని ఒప్పుకోడు. "మార్కులు తక్కువొచ్చా యేమిటని అడిగితే మిస్సుగారు సరిగా పాఠం చెప్పలేదనే అంటాడు విద్యార్థి! ఇలా ఎవరి మీదకూ నెట్టేందుకు అవకాశం దొరకనప్పుడు దైవం అనుకూలించ లేదని చెప్పుకుంటాడు. అలా చెప్పుకోవటం చాలామందికి ఒక 'తుత్తి'. అక్కడిదితో ఆగడు... దీనులకోసం కలడు, పరమయోగుల కోసం కలడు, అన్ని దిక్కుల్లోనూ కలడు...ఇలా కలడు కలడు అంటున్నారు, ఆ కలడనే వాడు నిజంగా కలడా... లేడా... అనడుగుతాడు. గజేంద్రుడికి కూడా ఇలానే సందేహం వచ్చింది. మొసలి పట్టుకునే సరికి గజేంద్రుడు విష్ణువుకు మొరపెట్టు కున్నాడు. ఆయన వచ్చి విడిపించలేదు. ఎంత మొత్తుకున్నా రాలేదు. దేవుడు ఉన్నాడా అనే సందేహం కలిగింది గజరాజుకి..

నిజానికి ఇది క్షీరసాగరానికి సంబంధించిన కథ. ఆ సముద్రంలో త్రికూటాచలం అనే పెద్ద కొండ ఉంది. దానికి బంగారం, వెండి, ఇనుము తాపడం చేసిన మూడు శిఖరాలున్నాయి. ఆ పర్వతం మీద ఏనుగుల మందలు ఎక్కువ. ఆ ఏనుగుల రాజు కొన్ని ఏనుగులతో కలిసి దారి తప్పాడు. చాలా దూరం తిరిగాడు. దప్పిక అయ్యింది. నీటి కోసం చాలా చోట్ల వెతికాడు. చివరకు ఒక అద్భుత సరోవరం కనిపిస్తే. తన పరివారంతో సహా నీళ్ళలోకి దిగాడు. అప్పుడు ఆ గజరాజుకి ఓ చిలిపి ఆలోచన వచ్చింది. తొండం నిండా నీళ్ళు గట్టిగా పీల్చాడు. ఆ నీటిలో వున్న చేపలు, మొసళ్ళు, పీతలు అన్నీ తొండంలోకి వెళ్ళిపోయాయి. తొండాన్ని పైకెత్తి నీళ్ళను ఆకాశం మీదకి చిమ్మేసరికి తొండంలో వున్న చేపలన్నీ మీన రాశిలోకీ,

పీతలన్నీ కర్కాటక రాశిలోకీ మొసళ్ళు మకరరాలోకీ వెళ్ళిపడ్డాయి. అలా ఏనుగులందరూ కలిసి సరోవరంలో నీళ్ళు చిమ్మేస్తున్నారు, తొండంతో కొట్టేస్తున్నారు. కనపడిన చిన్న మొసళ్ళను తొక్కి చంపేస్తున్నారు. పావుగంట అయేసరికి నీరు బురద బురద అయిపోయి అంతా కల్మషం అయిపోయింది. ఇంత అల్లరి చేస్తుంటే, ఇన్ని ప్రాణులు చచ్చిపోతుంటే ఆ నీటిలో ఉన్న ఒక పెద్ద మొసలి చూసింది. ఈ ఏనుగుల అల్లరి మితిమీరిందని దానికి కోపం వచ్చింది. నీటి లోపల్నించి వెళ్ళి గజరాజు కాలు పట్టేసుకుంది. అదీ కథ.

"అకారణంగా నీళ్ళలోకి దిగాననే పశ్చాత్తాపం అప్పుడు కలిగింది గజరాజుకి! వెనకాల అంతమంది పరివారం ఉన్నారు. ఒక్కడూ సాయపడక పోవటం ఈ కథకు కొసమెరుపు. కలడు కలండనెడివాడు కలడో లేడో... అని అప్పుడు సందేహం వచ్చింది.

మనక్కూడా ఇలా చాలా 'కలవు'. ఆ కలవనేవి కలవో లేవో తెలియనన్ని కలవు. 'కలవాటి'లో ప్రజాస్వామ్యం ఒకటి. పరిపాలనలో స్వచ్ఛత ఒకటి. అవినీతి నిర్మూలన ఒకటి. రుణాల మాఫీ ఒకటి. తెలుగు భాషాభివృద్ధి ఒకటి. ఒకటేమిటీ ఇలాంటి 'కలవు'లు చాలా 'కల'వు. వాటిని నమ్ముకున్న గజరాజులు ఋణమాఫీ అవుతుంది లెమ్మని ఉన్న నగలు తాకట్టు పెట్టి అవసరం లేకుండా అప్పులు చేసి ఉప్పుపప్పులకు ఖర్చు పెట్టేశారు. ఇప్పుడు బాకీల మొసళ్ళు పట్టుకుంటే కలడు కలండనెడి వాడు కలడో లేడో అని ఎదురు చూసే స్థితిలో పడ్డారు.

కలవాడికీ, ఇలాంటి 'కలవు'లు కలవాడికీ తేడా ఉందన్న సంగతి మన'జన గజరాజులకు తెలీలేదు. తెల్సినా ప్రయోజనం లేదు. కలం మరిచిపోయి పరిక్షల కొచ్చిన స్టూడెంట్ లాగా ఆయుధాలు లేకుండా విష్ణుమూర్తి వచ్చి ఈ గజాలకు సాయం చేయగలిగిందీ లేదు.

గజాల లెక్కలో భూమిని ఇచ్చి, అడుగుల్లెక్కల్లో బదులు తీసుకోవటమే అసలైన గజేంద్ర మోక్షం. 'గ' అంటే గచ్ఛతి-రావటం. వస్తే ఓ అడుగు వస్తుంది. 'జ' అంటే జాయతే-పోవటం పోతే, ఓ గజం పోతుంది. రావటాలు పోవటాలకు మధ్య సంధి గ-జ- మోక్షం. ☆

# కవిత్వంలో సంక్షిప్త శబ్ద చిత్రాలు

"దండిగ చీమలెన్నొ తన దాపుకు జేరగ మధ్య శర్కరా
ఖండము నిల్చియున్న గతి గాంచెను వానరమూర్తి రాక్షసీ
తండక మధ్యమందు కల తల్లిని, కప్పల దొర్వులో తిరం
బుండిన తామరాకు, నెగడోదిన చక్కని నీటి బొట్టునున్"

నీళ్ళున్న చోట కప్పలు చేరినట్టు, బెల్లం చుట్టూ చీమలు చేరినట్టు, సంపదలున్న చోట బంధుజనులు చేరటం సహజం. కానీ, ఈ పద్యంలో పరిస్థితి వేరు. రావణుడు సీతను ఎత్తుకొచ్చాడు. ఆవిడ చుట్టూ కొందరు స్త్రీలను కావలి పెట్టాడు. వాళ్ళు బెల్లం చుట్టూ చీమల్లా ఆమె చుట్టూ చేరారని శ్రీ పదచిత్ర రామాయణంలోని ఈ పద్యంలో కవి శ్రీ విహారి చెప్తున్నారు.

ఆధునికుల్లో విశ్వనాథ మాదిరే పద్యాల్లోనూ, వచనంలోనూ రామాయణాన్ని వ్రాసిన వారంతా తమ ఆనందం కోసం, తమ తృప్తి కోసం, తమ భక్తి కొద్దీ వ్రాస్తున్నట్టే పేర్కొన్నారు. కానీ, శ్రీ విహారి తాను పదచిత్ర రామాయణం వ్రాయటానికి కారణాన్ని భిన్నమైన పద్ధతిలో చెప్పుకున్నారు. మనో భావాలను కవిత్వీకరించకుండా, 'అందరూ రాసేశారుగా' అని మౌనంగా తాను ఉండలేక ఈ పదచిత్ర రామాయణం వ్రాస్తున్నా నంటారాయన, "కేవలం మోనమోల కవికిం దగునే ఇది?" అనడుగుతాడు. లోలోపల్లోంచి ఉబికి వస్తున్న ఆలోచనా స్రవంతిని మౌనంగా దిగమింగుకోగలడా కవి...? అని!

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి 'విహారి'గా ప్రసిద్ధుడు. విమర్శకుడిగా, కథకుడిగా, నవలాకారుడిగా, కవిగా, విశ్లేషకుడిగా, ఆయన ఈ తరం పాఠకులకు బాగా తెలిసినవాడు. శాలివాహనతో జంటగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి పొందారు. ఎన్నో అభ్యుదయ కావ్య రచనలు, కథా రచనలు, నవలలు వ్రాసినప్పటికీ, అవి అన్నీ ఒక ఎత్తుగా రామాయణ రచన ఒక్కటీ ఒక ఎత్తుగా ఆయన కృషి చేశారు. విహారి రామాయణంలో రామభక్తి కన్నా తన ప్రతిభతో కథను కళ్ళకు కట్టించే కవితాతృష్ణ ఎక్కువగా కనిపిస్తుంది.

ఆయన మొదటగా 'శ్రీ పదచిత్ర రామాయణం' బాలకాండ ప్రకటించినప్పుడు ఈయన రామాయణం వ్రాశారేమిటా అని ఎరిగిన వారంతా ఆశ్చర్య పోయారు. ఒక రచనను కవి తన అనుభూతి కొద్దీ మాత్రమే చేయ గలుగుతాడు. పదచిత్రాలతో కావ్య రచన చేయాలనేది విహారి సంకల్పం. బలమైన ఇతివృత్తం కాబట్టి, అందుకు

రామాయణాన్నిఎంచుకున్నారు. కథ అందరికీ తెలిసిందే కనుక దృశ్యాలను కళ్ళ ముందు సాక్షాత్కరింప చేయటం లక్ష్యంగా పెట్టుకున్నారు. 'చీమ సైత మొక భూజము నెక్కు ప్రయాస మోర్చుచున్' చీమ కూడా ప్రయాసతో ఒక మహావృక్షాన్ని ఎక్కాలని ప్రయత్నిస్తుంది కదా!" అంటాడాయన. తన రామాయణ రచనా ప్రయాస శక్తికి మించిన దనటానికి, తనకు మించిన బరువును భుజాన వేసుకుని బాహుబలిలా 'చెట్టునెక్కే చీమ' దృశ్యం కళ్లలో మెదిలేలా చేసారాయన.

చీమలంటే ఆయనకు కొండంత సానుభూతి. అశోకవనిలో పటికబెల్లం చుట్టూ మూగిన చీమల్లా ఉన్నారట శోకమూర్తిలా ఉన్న సీతకు కావలి ఉన్న రాక్షస స్త్రీలు! త్రిజట లాంటి స్త్రీలంతా అక్కడ పేరుకు రాక్షసులే గానీ, వాళ్ళకన్నీ చీమల లక్షణాలే! యజమాని ఆజ్ఞను పాటించాలి కాబట్టి, కావలి ఉన్నారు. యజమాని దోషాలన్నీ ఔదల దాల్చి ఆయన్ని భరిస్తున్నారు. ఆయన అటు తిరగ్గానే సీతకు ఎలాంటి అపకారం తలపెట్టకుండా కప్పల్లా పక్కకు దూకేస్తారు. అలాంటి కప్పల చెరువులో స్థిరంగా ఉన్న తామరాకులా కూర్చున్న సీతను చూశాడట హనుమంతుడు. రావణుడి హుంకారాల్లా తామరాకు మీద నీటిబొట్టులా నిలిచేవి కావు కదా! అందుకని, కప్పల దొరువులో స్థిరంగా ఉన్న తామరాకుతో సీతను పోలుస్తున్నాడు కవి. పదచిత్రం అంటే ఇది. దృశ్యం కళ్లకు కట్టాలి. అది సంక్షిప్త శబ్దచిత్రంలా మన కంటికీ, చెవులకు, మనసుకూ ఒకేసారి తాకాలి.

రావణుడి రాజ్యంలో ప్రజలకు రావణ దుశ్చర్యల పట్ల ఏహ్యాభావమే ఉంది. విభీషణు డొక్కడు ధైర్యం చేసి 'తప్పన్నా!' అనగలిగాడు గానీ, తక్కిన వాళ్ళు నోరు మెదపలేక పోయారు. వాళ్ళు చీమల్లా తమ శక్తికి మించి దుష్ట చక్రవర్తిని భరిస్తున్నారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆరున్నర దశాబ్దాలుగా మనం చేస్తున్నదీ అదే!

"బలవంతుడ నాకేమని పలువురతో నిగ్రహించి పలుకుట మేలా బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదే! సుమతీ!" అని సుమతీ శతకకర్త అన్నాడు. కానీ, 'బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదే...?' అనేదే ప్రశ్న! సద్వినియోగం చేసుకున్నా చేసుకోక పోయినా మనకు ఓటు అనే ఆయుధం అయినా ఉంది. రావణరాజ్యంలో అది కూడా లేదు.

పార్టీలు మారే ఈనాటి కుతంత్రం గాళ్ళని విభీషణుడితో పోల్చటం అన్యాయం. విభీషణుడి మాదిరే ఇతర రావణ వ్యతిరేకులు కూడా ఎదురు తిరిగి ఉంటే రావణుడి కథ వేరుగా ఉండేది. మనమూ అంతే, చీమల్లా ప్రయాసను మోస్తున్నాం గానీ, ప్రశ్నించం. ఐదేళ్ళ పాటు తప్పులు చేయనివ్వాలని మనకు మన రాజ్యాంగం నిర్దేశిస్తోంది కదా! ✯

# కా... కా... కవులు

**"నింబ వృక్షమునందు నెగడు కాకములట్లు**
**పల్లెలయందూర బందులట్లు**
**అవివేకులగు నరపతుల చెంత బందలగు పండితులు**
**గొందఱుందురట్టి వారికిని జేయుదును గొన్ని వందనములు"**

పూర్వకవులు తమ కావ్యాలలో ఉపోద్ఘాతాలు వ్రాసేప్పుడు మంచి కవుల్ని పొగుడుతూ (సుకవిస్తుతి), చెడ్డకవుల్ని తిడుతూ (కుకవినింద) వ్రాయటం ఒక ఆచారంగా పాటించేవారు. తాను మంచికవుల కోవలోకి వస్తానని చెప్పుకోవటం కూడా కొందరి ఉద్ధేశం కావచ్చు. అడగందే అమ్మైనా పెట్టనట్టు చెప్పుకోనిదే తెలియదనే భావన కూడా ఉండవచ్చు.

19వ శతాబ్దినాటి 'భరతాభ్యుదయం' కావ్యంలో మాడభూషి వేంకటాచార్య కవి చేసిన 'కుకవినింద' పద్యం ఇది. ఆనాటి బ్రిటిష్'యుగంలో తెలుగు కవుల పరిస్థితికి, ఆరున్నర దశాబ్దాల స్వతంత్ర భారతంలో తెలుగు కవుల పరిస్థితికి ఏమీ తేడా లేదని ఈ పద్యం చదివితే అర్థం అవుతుంది.

**నింబవృక్షమునందు నెగడు కాకములట్లు:** వేపచెట్టు మీద చేరిన కాకుల్లాగా కొందరు కవులు ఉంటారు. **పల్లెలందూరబందులట్లు:** పల్లెల్లో మురుగ్గుంటల్లో దొర్లే ఊరపందుల్లాగా ఇంకొందరుంటారు **అవివేకులగు నరపతులచెంత బందలగు పండితులు గొందఱుందురు:** జమీందార్లు, వ్యాపార్లు, దబ్బున్నఆసాములు, వీళ్ళకి సాహిత్యం గురించి ఏమీ తెలియక పోయినప్పటికీ కాకా ఘనులైన కొందరు వాళ్లని ఆశ్రయించి బతుకుతుంటారు.

అలాంటి కా...కా... కవులకు వందనం చేస్తున్నాను...అంటాడు కవి.

బ్రిటీష్ యుగంలో జమీందార్లు, భూస్వాములూ, రాజా బిరుదు కోసం తాపత్రయపడే వాళ్ళూ చాలా మంది అపర భోజుడనిపించుకోవాలనే తపనతో కవులకు, కళాకారులకూ ఎంగిలి చెయ్యి విదిల్చి, కన్నీటి తుడుపు సాయం చేసే వాళ్ళు. నాలుగు 'పొగడుబోతు పద్యాలు' ఆశువుగా దట్టించి, ఇచ్చింది పుచ్చుకు పోయే 'వసూలు కవిరాజుల్ని వేపచెట్టు మీద కాకులతోనూ, బురదలో పోర్లే పందులతోనూ పోల్చాడు కవి !

స్వాతంత్ర్యం వచ్చాక ఈ పరిస్థితి ఘోరంగా మారింది. వేపచెట్లూ, వాటి మీద కాకులూ... బురదలూ, వాటిలో పొర్లే పందులూ... మరింత అసహ్యంగా

కొనసాగుతున్నారు. రాజాలూ, జమీందార్లు పోయి కవుల్నీ కళాకారుల్ని పోషించే బాధ్యతని అకాడెమీలూ, సాంస్కృతిక శాఖలు, వ్యాపారం చేసుకునే ఇతర సాహితీ సాంస్కృతిక సంస్థలూ స్వీకరించాక వాటికి విలువ కూడా తగ్గి పోయింది.

నార్లవారితో వేసిన కమిటీ అకాడెమీల రద్దును సూచించింది. కానీ, ఆ తరువాత కాకా బాకాల ప్రాధాన్యత పెరిగిందే గానీ తగ్గలేదు. పైగా వీళ్ళ వలన జరిగే నష్టం పావలా అయితే, అకాడెమీలను రద్దు చేసినందు వలన కలిగిన నష్టం రూపాయి అయ్యింది. అది ఇప్పుడు పూడ్చ లేనిది కూడా!

చిన్న చిన్న సంస్థలనుండి, రాష్ట్ర స్థాయి, జాతీయ స్థాయి సంస్థల వరకూ ఇచ్చే పురస్కారాలు, పుస్తక ప్రచురణ సహకారాలు అర్హులకు చేరటంలో దారుణమైన అన్యాయం జరుగుతోంది.

తంజావూరు నాయకరాజు అచ్యుతప్ప నాయకుడు 16వ శతాబ్దిలో తెలుగు యక్షగాన మేళా కోసం కళాకారులకు జీవనభృతిని కల్పిస్తూ 'మేలట్టూరు' అనే ఊరు ఏర్పరిచాడు. అలాగే శాహాజీ అనే తంజావూరు మరాఠారాజు తన రాజ్యం లోని తెలుగు కవులందరి కోసం 'తిరువశ వల్లూరు' లేదా శాహాజీ పురం గ్రామాన్ని ఇచ్చాడు. భాగవతులైన నాట్య కళా కారులకు తానీషా ప్రభువు కూచిపూడి అగ్రహారాన్ని ఇచ్చాడు. అందుకే, వాళ్ళు జనం నాలుకలమీద బతికున్నారు. ఇవ్వని వాణ్ణి తలచుకునేదేం ఉంటుందీ...?

తిరుపతి వెంకటకవులకు బహుమానం ఇద్దామని ఆత్మకూరు జమీందారు అనుకున్నాడు. ఆయన దగ్గర పనిచేసే ఒక అధికారి(అధిక + అరి)అడ్డుపడి, వాళ్ళు సొల్లు కవిత్వం చెప్తారనీ, పండితులు కాదనీ, ఇలాంటి కానుకలు పండితుల కిస్తే పుణ్యం వస్తుందనీ అన్నాడట. దాంతో జమీందారుగారు తన ప్రయత్నం విరమించుకున్నాడు. అది తెలిసి తిరుపతి కవులు 'శనిగ్రహం' అనే పేరుతో ఆ అధికారి మీద 27 పద్యాల చిన్న పుస్తకం వ్రాశారు. "కుంకా! పాపమటంచు నెంచక వృథా కొండెమ్ములన్ రాజుతో బింక మొప్పగ జెప్పి యాతని మదిన్ ద్వేషమ్ము పుట్టించి తీవింకం జేసెడిదేమి లేదు కద? నిన్నేమందుము? ఈ పైన మా చంకన్నాకు చండాల! శనిగ్రహంబ..." అని తిట్టారు.

పదవిని అడ్డం పెట్టుకున్న శనిగ్రహాలకు తిరుపతి కవుల 'చంకన్నాకు చండాలా' తిట్లు తగులుతాయి. అలాగే డబ్బులు తీసుకుని సన్మానాలు చేసే సాంస్కృతిక సంస్థల వాళ్ళకి మాడభూషి వారి బురదలో దొర్లే పందులు, వేచెట్టెక్కిన కాకుల తిట్లు తప్పక తగులుతాయి.



# కాపీ "రైట్"

**సంతి శ్వాన ఇవా సంఖ్యా జాతిభాజో గృహేగృహే!**
**ఉత్పాదకా న బహవః కవయ శ్శరభా ఇవ!!**
**ప్రాయసః కుకవయో లోకే రాగాధిష్ఠిత దృష్టయః !**
**కోకిలా ఇవ జాయన్తే వాచాలాః కామకారిణిః !!**
**అన్యవర్ణ పరావృత్త్యా బంధచిహ్న నిగూహనైః !**
**అనాఖ్యాతః సతాం మధ్యే కవి శ్చోరో విభావ్యతే!!**

బాణభట్టు క్రీ.శ. 7వ శతాబ్ది వాడు. హర్షుడి ఆస్థాన కవి. కాదంబరి గద్య ప్రబంధాన్ని, హర్షచరిత్రనీ వ్రాసిన వాడు. కవికీ, కవి కానివాడికీ తేడాని ఆయన ఈ శ్లోకాలలో వివరించాడు.

1400 యేళ్ళ క్రితం నాటి సమాజంలో సాహిత్య పరమైన వ్యక్తుల వ్యక్తిత్వాలలోని గుణగణాలను ఈ శ్లోకాలలో ఆయన విశ్లేషించాడు. బాణుడి వంటి కవులు కుకవి నిందల్నీ, సుకవి స్తుతుల్నీ ఎన్ని చేసినా కవుల వ్యాప్తి ఇంకా కొనసాగుతూ ఉండటం కూడా ఒక విశేషమే! బాణుడి విశ్లేషణ ఇలా సాగుతుంది.

(1) కొంతమంది సాహితీ వేత్తలుంటారు. పరమ నీరసమైన సాహిత్య సృష్టికర్తలు. ఇలాంటి వాళ్ళు కవి అనే పేరుతో ప్రతి ఇంట్లోనూ కుక్కల్లాగా అధిక సంఖ్యలో కనిపిస్తారు. ఉత్పాదకత ఏమాత్రం ఉండదు. కవి సమ్మేళనాల్లో ఎప్పుడు చూసినా చదివిందే చదివే వాళ్ళు, స్వంతంగా అక్షరం ముక్క రాయని వాళ్ళు, దెయ్యాల్ని పెట్టి వ్రాయించి తమదిగా చెప్పుకునే వాళ్ళు, ఫలానా వారు నాకు సన్మానం చేశారంటూ గొప్పలు చెప్పుకు తిరిగే వాళ్ళు, ఫలానా వాళ్లు తెలుసంటూ ఫోటో ఆల్బమ్ములు చేత్తో పుచ్చుకు తిరిగే (నేమ్ డ్రాపర్స్) వాళ్ళు ఎక్కువమంది ఉండగా, వెయ్యికీ రెండు వేలకూ జీవన సాఫల్య పురస్కారాలిచ్చే సంస్థలు వీళ్ళని సంతృప్తి పరుస్తూ ఉంటాయి. సాహిత్య సమాజానికి ఇలాంటి కవులూ అలాంటి, సేవా సంస్థలూ రెండూ అపకార కారకాలే!

కవుల కీకారణ్యంలో సృజనశక్తి ఉన్న సాహితీ మూర్తులు శరభమృగాల్లా దొరుకుతా రంటాడు బాణుడు. కవులలో మహాకవులు అపురూపం అనేది సారాంశం.

(2) ఇంకొంతమంది సాహిత్య పరులుంటారు. వీళ్ళకు రాగద్వేషా లెక్కువ. తమ వ్రాతల్లో వాటిని ప్రదర్శించటానికి జంకరు. ఎర్రని కళ్ళున్న కోయిల లాగా ఉత్తవాచాలత్వమే గానీ జనం మీద వీళ్ళ ప్రభావం ఏమీ ఉండదంటాడు బాణుడు. ఇతరులకు ఏమీ తెలీదన్నట్టు, తమకు తట్టిందే సిద్ధాంతం అన్నట్టు అతి ప్రసంగాలు చేసేవాళ్లని, నోరుపెట్టుకుని అరిచేస్తే నిజం అయిపోతుందనుకునే వాళ్లనీ, లోకాన్ని తిట్టటమే ధ్యేయంగా రచనలు చేసేవాళ్లనీ అనునిత్యం చూస్తూనే ఉంటాం. బాణుడి బాణాలు తగిలే ఇలాంటి వాళ్ళు చాలా మందే కనిపిస్తారు. బురద జల్లటం, భిన్నాభిప్రాయాలున్న వారి పైన లేని ముద్రలు వేయటం, దేశభక్తికి అభ్యుదయానికీ హక్కుదారుల మన్నట్టు మాట్లాడటం వీళ్ళకు అలవాటు. భయపెట్టి పబ్బం గడుపుకోవాలని చూస్తుంటారు. కవుల్లో ఇలాంటి కుకవుల్ని 'కామకారులు' అన్నాడు బాణుడు. బహుశా ఈ మాట యెల్లో జర్నలిస్టులకూ, యెల్లో రచయితలకు, యెల్లో ప్రసంగీకులకు, వితండవాదులకు వర్తించవచ్చు.

(3) ఇంక మూడో వర్గం కవులున్నారు. వీళ్ళు సాహితీ వేత్తల్లో మాఫియాలంత ప్రమాదకరమైన వాళ్ళు. ఎవరో రాసినదాన్ని దుర్మార్గంగా స్వంతం చేసుకుంటారు. అక్కడక్కడా రెండు మూడు మాటలు మారుస్తారు. కాసింత తెలివి ఉంటే శైలిని కూడా మార్చాలని చూస్తారు. లేదా ఆ పనిని కూడా ఇంకెవరితోనైనా చేయిస్తారు. వీళ్ళని బాణుడు కావ్యచోరులన్నాడు. భారత దేశంలో ముఖ్యంగా తెలుగునాట కాపీ కొందరికి రైటు! మూల రచయిత గుడ్లప్పగించి చూడటం తప్ప ఏమీ చేయలేని స్థితి. నిస్సిగ్గుగానే జరుగుతున్న వ్యవహారం ఇది!

పురస్కార ప్రియత్వాలకు, కాపీ రాగ రాగాలకూ నిలయమైన వాళ్ల మధ్య కావ్యమనుగడ సాగుతోందీనాడు. ఏనుగును తడిమిన ఐదుగురు గుడ్డివాళ్ళ చేతుల్లాగా, తాము పట్టిన కుందేలి నాలుగో కాలులాగా కలాన్ని గళాన్ని ఉపయోగించే వారికి వచ్చినంత మర్యాద మన్ననలు కావ్యవస్తువుకీ, లోకవస్తువుకీ మధ్య వారధిలా నిల్చున్నవారికి దక్కటం లేదనే బాధ భట్టబాణుడి మాటల్లో ద్యోతకం అవుతోంది.

"అల్లాటప్పా/ రాతలు రాయడమే/ చెప్పుకో తగ్గ గొప్పా/ఒప్పుకో తగ్గ మెప్పా?" అని శ్రీశ్రీ అన్నట్టే ఉంది నేటి దుస్థితి. ★

# కాలానికి నిలిచే విమర్శ

**"ఈ రాజన్యుని మీద నే గవిత సాహిత్య స్ఫురన్మాధురీ**
**చారు ప్రౌఢిమ జెప్పి పంప, విని మాత్సర్యంబు వాటించి, నత్కీరుం**
**దూరకె తప్పు పట్టెనట-యేదీ! లక్షణంబో యలం**
**కారంబో పదబంధమో, రసమొ? చక్కంజెప్పుడీ తప్పునన్"**

తెలుగువారికి విమర్శను సహృదయంగా స్వీకరించే గుణం ముందునుండీ లేనట్టుంది. అందుకని, తెలుగు కావ్యాలలో పాత్రలు కూడా విమర్శనా అసహిష్ణుతనే ఎక్కువగా ప్రదర్శిస్తుంటాయి, సాక్షాత్తూ పరమేశ్వరుడైనా అంతే!

పూటగడవని ఓ పూజారి మీద జాలిపడి శివుడు ఓ పద్యం వ్రాసిచ్చి, "దీన్ని రాజకొలువులో చదివి వినిపించు. రాజు గారు మెచ్చుకొని ఆదరిస్తా"రని పంపించాడు. ఆ కొలువులో నత్కీరుడు కూడా ఉన్నాడు. ఆయన లేచి, "కవితా పద్ధతులకీ కవిసమయాలకీ నువు చెప్పిన కవిత్వం ఒప్పదు. కవిత్వం ఇలా వ్రాయకూడదు" అన్నాడు. పూజారి నిరాశగా వెళ్ళి శివుడితో 'భలే కవిత్వం చెప్పావయ్యా ఛీ కొట్టి పంపారు" అని బావురుమన్నాడు. దాంతో శివుడికి కోపం వచ్చింది. ఆ పూజారిని వెంటబెట్టుకుని, రాజకొలువుకు వెళ్ళితిట్టిన వాణ్ణి నివే సందర్భంలో ధూర్జటి కాళహస్తి మహత్త్యం కావ్యంలో చెప్పిన పద్యం ఇది.

"ఈ రాజుమీద నేనో కవిత చెప్పి పంపాను. నత్కీరుడనేవాడు ఎవడో మాత్సర్యంతో నా అందమైన పద్యాన్ని తప్పు బట్టాడట. ఏదీ నాముందు చెప్పమనండి. నా కవితలో చందో వ్యాకరణ, అలంకార దోషాలున్నాయా? పదబంధాలు సరిగా లేవా? రసభంగం అయ్యిందా?" అంటూ నిలేసి అడిగాడు.

కుందుర్తి గారు ఎప్పుడూ అనేవాడు- "రచయితలు పాఠకుడికన్నా ఒకమెట్టు పైన ఉన్నాననుకునే రచనలు చేయాలి! విమర్శకుడు రచయితకన్నా ఒక మెట్టు పైనే ఉన్నాననుకుని విమర్శించాలి" అని ఈ విమర్శ శ్రుతి మీరిన ఘటనలూ ఉన్నాయి. అంతమాత్రాన విమర్శకు గురైన వాళ్ళంతా ఇలా సభల్లో హుంకరించలేదు. రచయిత విమర్శను గౌరవించాలి. విమర్శకుడు కూడా తన కళ్ళతో కాకుండా వేరే సిద్ధాంతాల కళ్లజోళ్ళలోంచి చూస్తూ రచయితల మీద ఒంటికాలుతో లేవటమూ ధర్మం కాదు. ఒక రచన మంచీ చెడుల్ని ఫలానా విమర్శకుడి కన్నా కాలం ఎక్కువగా నిగ్గు తేలుస్తుంది. కాలానికి నిలిచిన విమర్శలు ఎన్ని ఉన్నాయన్నదిప్రశ్న.

ఇంతకీ, నత్కీరుడు పట్టిన తప్పు విలువైనదే! "సిందురరాజ గమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు" సిందురం అంటే ఏనుగు. సిందురరాజ గమనం అంటే గజగమనం కలిగిన ఆమె 'ధమ్మిల్లబంధం' అంటే జుట్టుముడి సహజ సువాసనతో విలసిల్లుతోందని దాని భావం. సాంబ్రాణీ లాంటి సుగంధ ధూపాలు గానీ, సంపెంగ లాంటి సువాసనలున్న తైలాలు గానీ తలకు పట్టించక పోతే జుట్టుకు సహజగంధం ఎక్కడిదనేది నత్కీరుడి ఆక్షేపణ. దాంతో శివుడు నాలుక కరచుకుని 'మా ఆవిడ పార్వతి పొడవైన జుత్తుకి సహజ గంధమే ఉంది' అన్నాడు.

"మీ ఆవిడ సంగతి మా కెందుకయ్యా! లోకంలో ఎవరి ఆవిడ జుత్తుకీ ఇది వర్తించదు. లూలా మాటలు చెప్పకు పో" మ్మన్నాడు నత్కీరుడు. శివుడి అహంకారం దెబ్బతింది. తన నిజ రూపం చూపించాడు. అయినా నత్కీరుడు పట్టు విడవ కుండా నుదుటి కన్నే కాదు, తలచుట్టూ కళ్ళున్నా సరే, వాటిని తెరిచినా సరే, నీ తప్పు ఒప్పవదని ఎదురు తిరిగాడు. విమర్శకుడికి అంత అహంకారం పనికి రాదని శివుడు నత్కీరుడికి కుష్టువ్యాధి వచ్చేలా శపిస్తాడు.

"అది అసంభవం కాదు, మా ఆవిడే సాక్ష్యం" అని రచయిత మొత్తుకున్నా విమర్శకుడు వినిపించుకోకపోవటమూ తప్పే కదా! తనకు తెలీనిది లోకంలో లేదనటం విమర్శకుడి లక్షణం కాకూడదు.

ఈ కథలో సార్వజనీనమైన ఒక లోకనీతి ఉంది- రచయిత ఒళ్ళు దగ్గరపెట్టుకుని వ్రాయాలి, విమర్శకుడు నోరు దగ్గర పెట్టుకుని విమర్శించాలని! లోకంలో రచయితలంతా ఇలా శపిస్తే విమర్శకులంతా డెర్మటాలజీ క్లినిక్కుల చుట్టూ తిరగాల్సి రావటం, విమర్శకుడి దాడితో రచయితకి హార్ట్ ఎటాక్ రావటం రెండూ సమంజసం కాదు.

ప్రస్తుతం తెలుగులో విమర్శకీ, సమీక్షకీ, పుస్తక పరిచయానికీ, పుస్తకాల ముందుమాటలకీ తేడా లేని ఒక విచిత్ర పరిస్థితి నడుస్తోంది. చాలా పత్రికలు సమీక్ష పేరుతో పుస్తక పరిచయాలే వేస్తున్నాయి. సంచలనాల పేరిట 'తిట్టటమే విమర్శ' అనే ఒక అభిప్రాయం కొందరిలో బలంగా ఉంది. తమ వర్గానికి చెందిన వారిని మహాకవులుగా చిత్రించటమే 'వర్గ దృక్పథం'గా చెలామణి అవుతోంది. దీనికి ప్రాంతీయత కూడా తోడవుతోంది.

రాసినవాడు శివుడూ, విమర్శించిన వాడు నత్కీరుడూ కాని స్థితిలో ఒక్కో రచన, ఒక్కో విమర్శ చదువుతుంటే కుష్టు రోగి పుళ్ళే గుర్తుకు వస్తుంటాయి. సాహిత్యాన్ని ఆరోగ్యదాయకం చేసే విమర్శ కావాలి. లోకంలో కుష్టును కడిగే రచనలు కావాలి. కాలానికి నిలిచే విమర్శ కావాలి!! 

# కులపాట్లు

"తెలిసి యపచార మిసుమంత సలుపకుండ
జపము( జేసుకొనుచునుండు సాధువులను
బట్టి వర్ణా[శమాచార పాలనంబ(
టంచు( బరిమార్పగావచ్చె నక్కటకట!"

త్రిపురనేని రామస్వామి చౌదరి గారి శంబుకవధ నాటకంలో శ్రీరామచంద్రుడి ఆత్మ(ని)వేదన ఇది. వర్ణవ్యవస్థలోని నాలుగో వర్ణం వారు లేదా ఐదోవర్ణం వారికి చెందిన శంబుకుడు తన'ఆత్మాచారాలు' వదిలేసి సాధువులా జపం చేస్తాననే సరికి మొదటివర్ణం వారికి కోపం వచ్చింది. 'జపం చేసుకోవటం మా హక్కు అనీ, ఇతరులుచేస్తే పెద్ద అపచారం జరిగిపోతుందనీ అన్నారు.

రెండో వర్ణానికి చెందిన శ్రీరాముడు మొదటివర్ణం వాళ్ల కొమ్ముకాశాడు. వర్ణాశ్రమ వ్యవస్థను కాపాడటం రాజధర్మం అని రాజగురువు ఆయనకు నూరిపోశాడు. కానీ, రాముడి మనసులో కొన్ని సందేహాలు లేచాయి. "నాకు గురువెన్ని స్మృతులు క్రోడీకరించి చెప్పినను ధర్మమిది యంచు జిత్రమేమొ సంశయాత్ముడనైతినీ" అని రాముడు ఆలోచనల్లో పడతాడు. తత్త్వజిజ్ఞాసువులైన సాధువులకు కొంచెం అయినా ఉపచారం చేయకుండా వర్ణాశ్రమాచారం పేరుతో వాళ్ళని నేరస్థులని వధించటం తప్పనిపించి రాముడు మథన పడే సన్నివేశంలోదీ పద్యం.

త్రిపురనేని వారి రాముడు వాల్మీకి రాముడికి భిన్నంగా ఆలోచించే 'మనిషి' "ఇందుచేతనే తొల్లింటి పుణ్యమూర్తులగు ఋషులు 'రాజ్యాంతే నరకమ్ ధ్రువమ్' అని నుడివిరి. రామరాజ్యమునందే యిట్టి చిత్రములు జరుగవలయునా? శంబుకుని శిక్షింపకున్న యెడల వంశగురువున కేమి యలకవచ్చునో కదా!" అనుకుంటాడు.

"ప్రభుత్వం నడిపేవాడు నరకానికే పోతాడనేది ఇందుకే! కులాల కుమ్ములాటల్లో ప్రభువు తలదూర్చకా తప్పదు, దూర్చి కులసెగలు, పగలు, ద్వేషాలు ఎగదోయకా తప్పదు. చివరికి నరకానికి పోకా తప్పదు"అనుకుంటాడు. "తత్త్వజిజ్ఞాసుల కంఠనాళ ములను గోసి రాజ్యము( జేయ బోవలేను" అని మొదటి వర్ణం వారి తరహాలో తపస్సుచేసుకునే అధమకులస్థుణ్ణి చంపటానికి వ్యతిరేకిస్తాడు.

'తపస్సు చేసుకోవటం గొప్ప' అనుకునే ఆ రోజుల్లో, ఇతరులు తామూ తపస్సు చేసుకుంటాం అనే వాళ్ళు. చదువుకోవటం గొప్ప అనే ఈ రోజుల్లో

వెనకబడినవాళ్ళు, అట్టడుక్కి తొక్కబడిన వాళ్ళు తాము చదువుకొంటాం అంటారు. తామూ ఉద్యోగం చేస్తామంటారు. తమకూ రాజ్యాధికారం కావాలంటారు. ఇది ఆదినుండీ ఉన్న వ్యవహారమే! అలా అడిగాడనే శంబుక వధ జరిపించారు. సర్వకాల సర్వావస్థలందూ ప్రతి సమస్యకీ రామాయణంలో ఒక పరిష్కారం ఉందనే వాళ్ళు ప్రభుత్వాన్ని లేదా సంఘాన్ని కులచిచ్చు చుట్టుముట్టినప్పుడు రాముడు చేసినట్టే శంబుక వధ చేయటమే పరిష్కారం అనగలరా?

ఆ కులం వాళ్ళు ఏమనుకుంటారోననీ, ఈ కులం వాళ్ళు ఏమంటారో ననీ, ఈ కులం వాళ్ళ మెప్పు పొందటానికి ఆ కులం వాళ్ళని కోయాలని, ఆ కులం వాళ్ళను తెచ్చి ఈ కులం మీదకు వదలాలనీ, ప్రభువు ఆలోచించవచ్చునా?

ఒక వర్ణానికో ఒక వర్గానికో రాముడనే రాజు కొమ్ముకాయవచ్చునా?

కులం పేరు చెప్పి పాలన చేయవచ్చునా? కులం అనేది ఒక 'దురద జబ్బు'. కులరాజకీయాలు గోకుతున్నకొద్దీ గోకాలనిపిస్తాయి. గోకుడు తీవ్రం అయితే, చర్మం పుళ్ళు పడి రసికారుతుంది.

కులం తప్ప కొలమానాలు వేరే ఏమీ లేని స్థితిని ప్రభువులు పెంచిపోషిస్తే, రాముడి లాగానే, ఒకవర్ణం కొమ్ముకాసి మరో వర్ణానికి అన్యాయం చేసే దుస్థితి ఏర్పడుతుంది.

"ఈ వర్ణాలూ, కులాలేవీ నాకు కొలబద్ద కాదు. మనిషిని మనిషిగా గౌరవించటం నా ధర్మం. అదే రాజ ధర్మం" అని శంబుక వధ కథలో రాముడు అనలేకపోయాడు. వర్ణ వ్యవస్థని కాపాడటానికే రాముడు రాజయ్యాడనే అపప్రథ మూట గట్టుకున్నాడు. కులాలతో చెలగాటం నిప్పుతో చెలగాటమే ఎప్పటికైనా! రాముడంతటి వాడిక్కూడా మాట తప్పదు. ✩

# ‘గిట్టు’బాట

**“సర్వేక్షయాంత నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః**
**సంయోగా విప్రయోగాన్తా మరణాంత చ జీవితమ్”**

“ఒక్కసారి మంత్రి చేసి చూడు గణనాథా! నువ్వు ఓడకుంటే ఒట్టు పెట్టు గణనాథా!” అని పాట ఉంది. మంత్రి పదవి వచ్చినవాడు మళ్ళీ ఎన్నికల్లో తిరిగి గెలవటం అరుదు. రోజులు మారాయి. ఇప్పుడు “ఒక్కసారి యమ్మెల్లేచేసి చూడు గణనాథా!” అని పాడాల్సి ఉంది. యమ్మెల్లేల దాకా ఎందుకు...వార్డు మెంబర్లదీ అదే పరిస్థితి. ఈ సంగతి ప్రజల కన్నా గెలిచిన వాడికి ఎక్కువ తెలుసు. అందుకనే దీపం ఉండగానే ‘గిట్టుబాటు’ చూసుకుంటారు.

భార్య శీలం గురించి అందరికన్నా ఆఖరికి తెలిసేది భర్తకేనని ఆంగ్లసామెత. గెలిచినవాడి అసలు రూపం గురించి అందరికన్నా ఆఖరికి తెలిసేది ఓట్లేసిన వాళ్లకే! ఇది ఆధునిక తెలుగు సామెత.

రామాయణం అయోధ్యకాండ (105-16)లో ఈ శ్లోకం చాటుతున్న సత్యం ఇదే! ఎంత పోగుచేసినా డబ్బు చివరికి నశించే స్వభావాన్నే కలిగి ఉంటుంది. పదవి కూడా అంతే ! ఎంత ఉన్నత పదవి పొందిన వాడైనా పతనం కాక తప్పదు. పుట్టినవాడు గిట్టకా తప్పదు... అని !

ఈ శ్లోకంలో మొదటి భాగం డబ్బు గురించి చెప్తుంది. డబ్బు పోగు చేయటానికీ, పొదుపు చేయటానికీ చాలా తేడా ఉంది. పోగు చేసింది డాబు. అది అశాశ్వతం. పొదుపు చేసింది శక్తి. శక్తి నశించదు. ఒకరూపంలోంచి ఇంకో రూపంలోకి మారుతుంది. పొదుపు చేసిన డబ్బుతో ఇల్లు కొనుగోలు, అమ్మాయి పెళ్ళి... ఇలా మరో రూపంలోకి శక్తిగా మారుతుంది. కాబట్టి పొదుపు శాశ్వతం.

మహాభారతం శాంతి పర్వంలో

**“లోకము చందము గనికొని**
**యీ కానగనగు ధనాదులెల్లను గాల**
**వ్యాకులత బొంద గలయవి**
**గాకుందమి యెఱిగి విడుపు గడు జదురెందున్”** అనే పద్యం ఉంది. మొదట మనం లోకం తీరుతెన్నులు తెలుసుకోవాలి. ఈ కనిపించే డబ్బూ, దస్కం ఇవన్నీ ‘కాలవ్యాకులత’ పొందేవే! అంటే కాలక్రమంలో నశించేవే! ఈ సంగతి తెలుసుకుని డబ్బుజబ్బు లోంచి బయటపడాలని దీని భావం.

వ్రాసినంత తేలికదిది ! డబ్బు సంపాదించవద్దని ఈ పద్యం చెప్పటం లేదు. దానికోసం ఉచ్చనీచాలు మరిచి వెంపర్లాడటాన్ని ఈ పద్యం ప్రశ్నిస్తోంది. ఈ వెంపర్లాటనే డబ్బుజబ్బు అంటారు. డబ్బుజబ్బు చేసినవాడు డబ్బు పోగు చేస్తాడు. డబ్బు ఆరోగ్యం కావాలనుకునేవాడు డబ్బు పొదుపు చేస్తాడు.

పోగయిన డబ్బుని పెనుధనం అనీ, పొదుపయిన ధనాన్ని జనధనం అనీ పిలవొచ్చు. పెనుధనం పెనుచీకటి (పెంజీకటి) లాంటిది. ఈ చీకటి డబ్బునే నల్లడబ్బు అంటున్నాం. పెనుధనం లాంటిదే పెనుపదవి కూడా! ప్రభుత్వ పదవి అనడంలోనే అంతో ఇంతో 'ఆమ్యామ్యా' ఉంటుంది. ఈ పదవుల్లో పరాకాష్ఠ అనదగిన పదవిని పెనుపదవి అనవచ్చు. పెనుపదవి పొందిన వాడు తిరిగి గెలవటం అరుదు.

దీన్ని, 'పుట్టినవాడు గిట్టక తప్పదు' అనటం'తో పోలుస్తాడు కవి. పోగేసిన డబ్బు గిట్టినట్టు, పైరవీలతో పదవి పొందిన వాడు తిరిగి గెలవకుండా గిట్టక తప్పదని ఈ రామాయణ శ్లోక సారాంశం. "మరణాంత జ జీవితం" గురించి ఆలోచించ మంటుంది ఈ శ్లోకం. గిట్టక తప్పదు కాబట్టి, పుట్టుక అనవసరం అనలేము కదా! మంత్రి పదవి వస్తే మళ్ళీ గెలవటం కష్టం అని, మంత్రి పదవి వద్దనగలరా...డబ్బువద్దనగలరా...ఎవరైనా?

గిట్టే పుట్టుకకు గిట్టుబాటు దక్కాలంటే గిట్టిన తరువాత కూడా బతికే ఆలోచన చేయాలి! మరణాంతర జీవితం అనేది మనం చేపట్టే గొప్ప పనుల వలన సాధ్యం అవుతుంది. మరణించబోయే ముందో, మరణించగానేనో చేసే అవయవ దానాలు కూడా మరణాంతర జీవితం ప్రసాదిస్తాయి. అది అవయవ దానం పొందిన వ్యక్తుల వ్యక్తిగత విషయం. కానీ, పదవీ యోగం పొందిన వాడు 'పనిదానం' చేస్తే, లోకానికి మేలు కలుగుతుంది.

పదవి కోసం పెట్టిన ఖర్చుకు గిట్టుబాటు చూసుకోవటానికే కాలం చాలని వాడికి మరణాంతర 'గిట్టు'బాటు గురించి ఆలోచించే తీరిక ఎక్కడుంటుంది...?

★

# జాతి లక్షణాలు

**"మలకలు మాప్రచారములు మా ముఖము ల్విషవహ్ని ఘోరముల్**
**ఖలులము రోషజాతులము గర్వుల మేమొక మంచివారమే**
**నలిన దళాక్ష ప్రాణులకు నైజగుణంబు మాన్ప వచ్చునే**
**వెలయగ మా వికారములు చేయును నెంచగనేల భూవరా!"**

పోతనగారి పద్యం ఇది. కాళీయ మర్దనం తరువాత కాళీయుడి భార్యలు వచ్చి కృష్ణుడితో పలికిన మాటలివి. "మా నడకే మలకలుగా(వంకర టింకరలుగా) సాగుతుంది. తిన్నగా పోవటం అనేది మా జన్మలో లేని విషయం. ముఖాల్లో ఘోర విషం పెట్టుకు తిరుగుతుంటాం. మా అంత దుర్మార్గులు లేరు. కోపం మా జాతి లక్షణంనైజ గుణాన్ని మార్చుకో అంటే అయ్యే పనేనా? అందుకే అలా ప్రవర్తిస్తుంటాం. మా తప్పొప్పుల్ని ఎంచకయ్యా...?" అని నాగకాంతలు కృష్ణుడితో మొత్తుకొన్నాయట.

కృష్ణ దేవరాయల చేతిలో ఓడిన సుల్తాన్లొచ్చి కుర్నీశులు(సలాములు) చేసుకుని ఈ పద్యాన్ని చెప్పుకుని చెంపలేసుకున్నారని వర్ణిస్తాడు రాయవాచకం గ్రంథంలో విశ్వనాథ నాయనయ్యవారి స్థానాపతి.

గుంటూరు మిత్రమండలి పక్షాన బొమ్మిడాల శ్రీ కృష్ణమూర్తిగారి సహకారంతో రాయవాచకాన్ని పునర్ముద్రించారు. గతంలో ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ వేసిన ఈ పుస్తకంలో కొల్లలుగా అచ్చుతప్పులున్నాయి. మోదుగుల రవికృష్ణ సంపాదకుడిగా వాటిని పరిహరించి, అనేక పదాలకు విశేష వ్యాఖ్యానాలు చేర్చి చక్కగా పునర్ముద్రించారు.

"...రాయలు బయలుదేరి వచ్చినప్పుడు, గోల్కొండ, విజయాపురం(బిజాపూర్), అహముదా నగరం యేలే ముగ్గురు దునేదార్లున్ను విని యిఖను రాయల దేవునితో యెదిరించ్చి కత్తి కట్టేది కార్యం కాదు, అని యోచన చేసి, భేటి శేసుకోవలెనని (కూర్చుని మాట్లాడి సంధి చేసుకోవాలని) నిశ్చయించి అంద్దుకు అయిన సంవిధాన పురస్సరముగా..." వచ్చారట... కాళ్లబేరానికి వచ్చేవాడు యెలా వస్తాడో అలా వచ్చారని దాని భావార్థం. ఆ సందర్భంలో ఈ పద్యాన్ని ఉదహరిస్తాడు. . మాజన్మ అలాంటిది కాబట్టి, అలాంటి తప్పులు చేశాం యెంచవద్దని వేడుకున్నారట.

ఆ విష జీవులే నయం... తమ తప్పులు తెలిసి అవి తప్పులేనని అనగలిగే ధైర్యం వాటికుంది.

ఈ యుగంలో ప్రజలు సున్నా సీట్లకు దిగజార్చి, గోళ్ళూడగొట్టి పదవిలోంచి ఒక్క తన్ను తన్నగా, ఓడిన పార్టీ ఏనాడైనా ఇలా 'సారీ' చెప్పుకున్న దాఖలా ఉన్నదా! అవినీతి నిరోధక శాఖ వలలో చిక్కిన పెద్ద చేపగానీ, ఆ చేప కుటుంబీకులు గానీ ఏ నాడైనా ఇలా అన్నారా...ద్వాపరంలో ధర్మం రెండు కాళ్లమీదో మూడు కాళ్ళమీదో నడిచింది కాబట్టి, ఆ రోజుల్లో పరమ దుష్టులు కూడా పశ్చాత్తాపాలు ప్రకటించే వాళ్ళు.

కలియుగంలో కాళ్ళు లేని ధర్మానిది కదల లేని స్థితి. ఈ యుగంలో ఒక అవినీతి పరుడు దొరకగానే, అతని కులస్థులైన సమాజ సేవకులు వెంటనే లేచి, మా కులం వాడిమీద ఫలాన కులస్థుడైన ముఖ్యమంత్రి చేసిన దాడిగా దాన్ని చిత్రిస్తారు. దానికి బదులుగా ముఖ్యమంత్రి వర్గీయులు, తమ పార్టీలో ఉన్న అవినీతి పరులకన్నా ఎదురు పార్టీలో ఎక్కువ మంది అవినీతి పరులు పట్టుబడ్డారని గణాంక వివరాలు ప్రకటిస్తాడు. చివరికి అసెంబ్లీలో 'రారా చూసుకుందాం' దాకా వెడుతుంది. అదంతా ప్రజా సేవకోసం శాసన సభ్యులు చేస్తున్న సాహస కార్యంలా పత్రికలు చిత్రిస్తాయి. వార్త అలా పక్కదారి పడుతుంది. ఈ సందట్లోపడి అసలు నేరం గురించి జనం మరిచి పోతారు. మరిచి పోయేది జనం కాదు, ఇంక ఆ విషయం గురించి పత్రికలే వార్తలు రాయటం ఆపేస్తాయి. పత్రికల్లో వార్త లేకపోతే కేసు లేనట్టే! ఇది నేటి న్యాయం.

అసెంబ్లీలో ఒక్కసీటు కూడా గెలవని పార్టీ ఓడిన రోజున " మా ఫలానా తప్పుల వలన ఓడాము, ఆ తప్పుల్ని సరి చేసుకుంటాం" అని ప్రకటించిన దాఖలా ఎందుకుండదంటే "వచ్చేసారి వీణ్ణి ఓడ గొట్టి తననే ఎక్కిస్తారు... ఈ జనానికి ఇంకో గతిలేదు..."అని లోకువ! ప్రతిపక్షం ఆ ఆశ మీదే బతుకుతుంది...ఎల్లకాలం. కానీ, 2016 నాలుగు రాష్ట్రాల ఎన్నికల్లో రెండు రాష్ట్రాల్లో ప్రతిపక్షాల ఆశ నెరవేరగా, తమిళనాడు బెంగాల్లో ప్రతి పక్షాలు వున్న గోళ్ళు కూడా ఊడ గొట్టించకన్నాయి. అయినా, మళ్ళీ ఎన్నికలనాటికి పుంజుకోకపోతామా ... అనే ఆశ ! ఆశ శాశ్వితం కదా !!

ఫలానా ప్రతిపక్ష పార్టీని నామరూపాలు లేకుండా చేస్తాననే అధికార పార్టీ తన నామరూపాల్లోనే ఎన్నాళ్ళుంటుందో ఎవరి కెరుక? ఫలానా తప్పు చేసినందు వలననే తాము ఓడామనే గ్రహింపు కాల సర్పాలకుంటుంది. వాటికి ముఖంలో మాత్రమే విషం కాబట్టి! కాలకూట విషాన్ని నిలువెల్లా నింపుకున్న వారి కెందుకుంటుంది...? ✯

# జాతికూళ్ళు

"గురుగుం జెంచలి దుమ్మి లేదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడ బొరంటి నూనియలతో గట్టారు కుట్టారుకో
గిరము ల్మెక్కి, తమిం బసుల్పొలము వో గ్రేపు ల్మెయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్""

గురుగుకూర, పులిచెంచలికూర, తుమ్మికూర, లేత గరిసాకు, చింత చిగురు... బహుశా ఈతరం వాళ్ళకి ఈ ఆకుకూరలు పెద్దగా తెలియకపోవచ్చు. చింతచెట్లు ఆంధ్రప్రాంతానికి 'బాటచెట్లు'గా ఉన్నా, చింతచిగురు అత్యంత ఖరీదైన ఆకుకూరయ్యింది. చెట్టెక్కి కోసేవాళ్ళు లేకపోవటం...ట కారణం !

వర్షాకాలంలో రెడ్డి దొరలు ఇలాంటి ఆకుకూరలతో ఆధరవులు వండుకునే వారంటాడు కృష్ణదేవరాయలు ఈపద్యంలో! అదేమీ పేదకూడు కాదు, ఆనాటి ధనిక మధ్య తరగతి ప్రజల ఆహారం. ఆకుకూరని ఉడకబెట్టి నీళ్ళు పిండేసి, ఉడికించిన పెసరపప్పుని కలిపి, నూనె వేసి పొరటిన పొడికూర గురించి ఈ పద్యంలో వర్ణించాడు. అలా వండటాన్ని కూర పొరటు" అనేవాళ్ళు రాయలు.

రాయలవారు ఇన్ని ఆకు కూరలు చెప్పాడు గానీ ఇందులో గోంగూర గురించి లేదు. వీటిని వండుకోవటానికి చింతపండు, మిరపకాయలు కూడా చెప్పలేదు. రాయల వారి కాలం తర్వాతే ఈ మూడూ తెలుగు వంటిళ్ళను ఆక్రమించాయి. మన వంటకాల స్వరూప స్వభావాలను మార్చేశాయి.

తెలుగు వారి ఆహార చరిత్రను మిరపకారానికి ముందు యుగం, తరువాతి యుగం అని రెండు యుగాలుగా విభజించ వలసి ఉంటుంది. మిరపకాయలకు తెలుగువారు బాగా అలవాటుపడ్డాక, డచ్చి, పోర్చుగీసులు ఆనాటి తెలుగు వాళ్ల చేత రకరకాల ఊరగాయల్ని, నిలవుండే ఇతర వంటకాల్ని తయారు చేయించి, అమెరికా తదితర దేశాలకు ఎగుమతి చేసే వాళ్లు. అలా, మిరపకాయల కారంతో పెట్టే ఊరుగాయలను తెలుగువారు స్వంతం చేసుకున్నారు. క్రమేణా, తెలుగు వంటకాలు మిరపకాయల చుట్టూ, చింతపండు చుట్టూ పరిభ్రమించాయి. ఆవకాయ లేదా ఈనాటి ఊరుగాయ చరిత్ర ఇలా ప్రారంభమయ్యింది. గోంగూర కూడా అలానే తెలుగుదనానికి పర్యాయం అయ్యింది.

మిరపకారాన్ని, చింతపండునీ ఉపయోగించి రకరకాల ప్రయోగాలు చేసి ఊరుగాయల్ని, ఊరు పళ్లనీ తయారు చేయటం నేర్చారు. టమోటా, దోస, ఉసిరి

వగైరా పళ్లతో పెట్టే వాటిని ఊరుపళ్ళు అన్నారు. ఈ మిరపకాయలు లేని రోజుల్లో చాలా స్వల్పంగా మిరియాలపొడి, శొంఠి, పిప్పళ్ళు వగైరా కారపు ద్రవ్యాలతోనే తెలుగు వంటకాలు తయారయ్యేవి! మిరప రాకతో అవన్నీ వంటగదిలోంచి అదృశ్యం అయిపోయాయి.

రాయలవారు చెప్పిన ఈ పద్యం జడివానలు కురిసే వానాకాలంలో ధనికులైన రెడ్లు ఎంత నిశ్చింతగా జీవించారో, చెప్తుంది. ఈ పద్యం రెండో భాగంలో **"కట్టారు కుట్టారు కోగిరముల్మెక్కి"** అంటాడు. ఆరికలు అనేవి ఒక రకమైన తృణధాన్యం. వాటిలో ఖనిజాలు, లవణాలు బాగా ఉన్నాయి. బియ్యం కన్నా బలకరంగా ఉంటాయి. ఆరోగ్యకరమైనవి. వీటిని కొండలు గుట్టల మీద పోడు వ్యవసాయం చేసి పండించారట. 'గుట్ట ఆరికలు' "అన్నాడందుకే! కట్టారు గుట్టారికల అన్నాన్ని జడివాన కురుస్తున్నప్పుడు రెడ్లు తృప్తిగా తిన్నారట.

ఇది మనకు ఉపయోగపడే సమాచారమే! పెద్ద పచారీ కొట్లలో ఇప్పటికీ ఆరికలు దొరుకుతున్నాయి. వాటితో అన్నాన్ని వండుకోవచ్చు. లేదా మరపట్టిన పిండితో రోటీలు చేసుకోవచ్చు.

ఆరోజుల్లో ఆరికల్ని ఇంకో కూడు గతిలేక తిన్నారేమో గానీ, నేటి రోజుల్లో షుగరు, స్థూలకాయం తగ్గటానికి తప్పకుండా తినవలసిన ధాన్యం అయ్యాయి.

పశువులు పొలానికి పోగా దూడలు మాత్రం రైతుల పెరళ్ళలో తిరుగుతూ మంచం ఎక్కి పడుకున్న రెడ్డి దొరగారి పాదాలను నాకుతున్నాయట. ఆమంచం కూడా కుంపట్ల మంచం. వేడి కోసం కుంపట్లో ఎండు మేకపెంటికల్ని ఉంచి, వెలిగించి మంచం కింద పెట్టుకుని పడుకునే వారట.

ఆహారానికి పేదా ధనిక భేదం లేదు. అతీగతీలేని పరిస్థితులో తినేతిండి. ధనికులకు ఎక్కువ దొరకుతాయి. పేదలకు తక్కువ దొరకుతాయి.

ఉప్పుకూడా కొనలేని పేదవాడు కేవల కారపు అన్నాన్ని తింటాడు దాని 'గొడ్డు కారం' అంటారు.

ధనికులు తినే ఆహారంలోనూ గొడ్డుకారం, గొడ్డు పులుపు, గొడ్డు ఉప్పు కూడా ఉంటాయి. ఇది వ్యామోహం కొద్దీ చేసుకున్న అలవాటు. అదీ తేడా!

పేద కూళ్ళలో కనిపించే దేశీయత, జాతీయత అనేవి సంపన్న భోజనంలోనూ ఉన్నప్పుడే అది 'జాతికూడు' అవుతుంది. ★

# జాణ తెనుగు

**"నీతో సైతము చెప్పిపోవుటకుంగానీ వచ్చితిన్నాగ, "నౌ**
**నాతో జెప్పగనేల? నేనెవరితో నస్వామీ! చెప్పన్ వలెన్?**
**మీ తల్లింగని మీరు చెప్పితిరి స్వామీ! నాకు లేదా భయం**
**బే తీర్థంబులు, నే వనంబులునుగా వెందేని నా తల్లియే"**

రాముడు అరణ్యవాసానికి బయల్దేరాడు. తను అభిమానించే వాళ్లనీ, తనను అభిమానించే వాళ్ళనీ కలిసి 'వెళ్ళొస్తాలు' చెప్తున్నాడు. వాళ్లమ్మని కలిసి వచ్చాడు.' ఇప్పుడు నీతో కూడా చెప్పిపోదామని వచ్చానంటున్నాడు సీతతో!

ఇంగ్లీషువాడు "బాయ్" అన్నంత తేలిగ్గా వెళ్ళొస్తానంటాడేమిటీ ... అనిపించింది సీతకి. 'వావ్! విష్యూ ఎ హ్యాపీజర్నీ' అని అందరూ అనేయాలని కోరుకుంటున్నాడా రాముడు? ఆయన అనుకున్నంత తేలికా తన మానాన తాను అరణ్యవాసానికి వెళ్ళటం?

"నాతో జెప్పగ నేల?"అనడిగింది సీత. నీక్కాక ఇంకెవరికి చెప్పాలన్నట్టు ఆశ్చర్యంగా చూశాడు రాముడు.

"మీ తల్లింగని మీరు చెప్పితిరి" మీరైతే వెళ్ళి మీ అమ్మకి మీ హితులకీ, సన్నిహితులకీ అందరికీ చెప్పి వాళ్లందరినీ ఒప్పించాలి. "స్వామీ! నాకు లేదాభయం" నాకు అలాంటి భయం లేదు. అంత శ్రమ అవసరం లేదు.

"ఏ తీర్థంబులు, నేవనంబులును గావెందేని నాతల్లియే"నేనుభూమిపుత్రిని. భూమిలేని చోటు ఎక్కడుంది? ఏ తీర్థాలైనా (పుణ్యనదులు), ఏ వనాలైనా (పుణ్య క్షేత్రాలు) ఎందులో నైనా నా తల్లే ఉంది. కాబట్టి నేను ప్రత్యేకంగా వెళ్ళి మా అమ్మకు చెప్పుకోవాలనే భయం నాకేమీ లేదు" అంటుందిసీత.

సుదీర్ఘమైన సంభాషణలను తగ్గించి. మూడుముక్కల్లో చెప్పేసే నేర్పు ఈ పద్యంలో కనిపిస్తుంది. దీని తరువాత సంభాషణ కొంత జరుగుతుంది. 'అబ్బో! అడవులంటే చాలా ప్రమాదకరంగా ఉంటా'యని రాముడంటే, 'అంత ప్రమాదకరమైన చోటుకు నిన్ను వంటరిగా వెళ్ళనిస్తానా?'అని సీత ఎదురడుగుతుంది. వానలో వెడుతూ గొడుగుని ఇంట్లో వదిలి, వెడతానంటావు...అదేమిటయ్యా?" అని నిలదీస్తుంది. తల్లి తర్వాత తల్లి తరుణి (ఇల్లాలు)ని వదిలి ఎలా వెడతావంటుంది.

పురాణేతి హాసాలను వ్రాస్తున్న, మానవ స్వభావాలు పాత్ర చిత్రణలో కొట్టొచ్చినట్టు కనిపించినప్పుడు ఒక దేశీయత, తద్వారా ఒకతాదాత్మ్యత ఆ కావ్యానికి కలుగుతాయి.

విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షంలో పద్యం ఇది. మళ్ళీ రామాయణం దేనికంటే తనదైన పద్ధతిలో కథని చెప్పుకోవటానికని గడుసుగా చెప్పుకున్నవాడు విశ్వనాథ. ఆయనకవిత్వం ఆయనలాగే అర్థం కానిదిగా ఉంటుందని పెద్ద పేరుంది గానీ, ఇంత చక్కని లలిత తేటతెలుగు పదాలతో అల్లిన పద్యాలు క్లిష్టమైన, ఉద్వేగ భరితమైన సన్నివేశానికి నప్పటమే విశేషం.

వన జీవితంలోని ప్రమాదాలు, క్రూరమృగాలతో సహజీవనం, దారీ డొంకా లేని ప్రయాణం, కస్సున దిగే ముళ్ళూ, బుస్సున లేచే పాములు అంటూ సీతని బెదర గొట్టటానికి భయానక రౌద్ర రసాలు ధ్వనించటం కోసం భీకర సంస్కృత సమాసాలు వేయవలసినచోట విశ్వనాథ తననుతాను నిగ్రహించుకున్నట్టు కనిపిస్తుంది. కరుణ, జాలి, దయలాంటి భావావేశాలు చిత్రించటానికి సంస్కృతం కన్నా జానుతెలుగు ఎక్కువ ఉపయోగ పడ్తుందని దీన్ని బట్టి అర్థం అవుతుంది.

అమిత పదాడంబరం డబ్బాలో రాళ్ళు పోసి గిలకొట్టినట్టు ఉంటుంది. గడగడా అలాంటి పద్యాలను అప్పచెపితే, మయసభ ఏకపాత్రాభినయం లాగా ఒక్క ముక్క అర్థం కాకపోయినా శ్రోతలు చప్పట్లు కొట్టేస్తారు. కానీ, దాన్ని చదివే పాఠకుడు ఆ కవిత్వంలోని స్వారస్యాన్ని పొందేందుకు అందులో ఏమీఉండదు. అందుకే, తెలుగు మాటల కిన్నెరసాని ప్రవాహాన్ని ఆయన తన కల్పవృక్షంలో చాలా చోట్ల ఉపయోగించు కున్నాడు. ఎంతటి భావగర్భితమైన సన్నివేశానికైనా జాను తెలుగు దేశీయత సొబగులి స్తుందని మరో సారి గుర్తుచేసిన పద్యం ఇది. అచ్చతెలుగులోనే అందమైన కవిత పుడుతుంది !



# జారిపోయిన బాల్యం

వాతెఱ తొంటి కైవడి మాటలాడదు
కుటిల వృత్తి వహించె గుంతలంబు
లక్షులు సిరులు రా నఱ చూడ్కి గనుకొనె
నాడించె బొమ గొని యాననంబు
చనుగొమల్మెగయ వక్షము పేక్ష గడకొత్తె
బాణి పాదలెల్లవాఱ దొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యముల జెప్పె
ఱొచ్చెర్వకిటు లోగ జొచ్చె మేను
వట్టి గాంభీర్య మెక్కుదు వెట్టుకొనియె
నాభి, నానాటికీ గతి నాటిపొందు
చవుక యైనట్టి యిచ్చట జనదు నిలువ
ననుచు జాఱిన కరణి బాల్యంబు జాఱె.

'మనిషి యవ్వనంలోకి రావడం అంటే బాల్యాన్ని చులకన చేసి అవమానించి చేజార్చుకోవటమే' అనటం ఓ గొప్ప ఆలోచన. ఈ ఆలోచన చేసినవాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలు.

ఆయన రాజకీయ విజయ జీవితం అంతా ఒకెత్తయితే, ఆముక్తమాల్యద కర్తగా ఆయన సాహితీ జీవితం ఇంకొక ఎత్తు. అందుకు ఈ పద్యమే సాక్షి. ఈ పద్యంలో కనిపించే పడుచు గోదాదేవి. శ్రీవిల్లిపుత్తూరులో రంగనాథుడి దేవాలయం పక్కన పూలతోట ఆమె కార్యక్షేత్రం. అప్పుడప్పుడే ఆమె బాల్యం లోంచి యవ్వనంలోకి వస్తోంది. ఔచిత్యం తెలిసినవాడు కాబట్టి, రంగనాథుడికి కాబోయే భార్య ఆ శ్రీరంగనాయకి యవ్వనాంకురాల్ని రాయలవారు ఎంత నిగ్రహంతో వర్ణించాడో ఈ పద్యంలో మనం చూడవచ్చు.

గోదాదేవికి కొత్తగా వచ్చిన యవ్వనం అప్పటిదాకా ఉన్న బాల్యాన్ని కించపరిచి జార్చేసిందట. రోజురోజుకీ బాల్యం పలుచనైపోయి, ఇప్పుడామెకి బాల్యంతో స్నేహం అనేది లేకుండా పూర్తిగా చవకై పోయిందంటాడు. చవకైపోయిందంటే విలువలేకుండా పోయిందని! దాంతో బాల్యం చిన్నబుచ్చుకుని, ఈ అవమానాలు భరించలేక

మౌనంగా వెళ్ళిపోవటమే మంచిదని ఇక్కడ ఉండటం మంచిది కాదని వెళ్ళి పోయిందట. యవ్వనం వచ్చాక బాల్యానికి జరిగిన అవమానాలేవిటీ? చాలా ఉన్నాయి.

బాల్యంలో వాక్కాయిలా ఉన్న వాతెరలు (పెదిమలు) ఇంతకు మునుపులాగా మాట్లాడకుండా మితభాషిత్వం పాటిస్తున్నాయి. మాట్లాడేవాళ్ళు లేకపోతే ఎవరైనా అక్కడుంటారా?

ఆమె ముంగురులు తిన్నగా (రుజువుగా) ఉండేవి ఇప్పుడు అవికూడా వంకరలు తిరిగి కుటిల వృత్తిని నేర్చుకున్నాయి. కుటిలమైన వాతావరణంలో ఎవ్వరైనా ఉండగలరా?

పూర్తిగా విప్పారేలా తెరిచి సూటిగా చూసే కళ్ళూ అరచూపులు అలవాటు చేసుకుని క్రీగంట మాత్రమే చూస్తున్నాయి.

యవ్వనం వలన శరీరంలో కొత్తగా వచ్చిన సిరిసంపదల వలన ఆమె కళ్ళలో కొత్త కాంతి తళుక్కు మంటోంది.

కనుబొమల్ని ఆడిస్తోనే అందరినీ అదిలిస్తోంది. మితభాషికదా!

బాల్యంలో ఉన్నప్పుడు వక్షస్థలం గురించి ఆమెకి పట్టింపే ఉండేది కాదు. ఇప్పుడు దాన్ని కొంగుతో కప్పుకోవటం చేస్తోంది. "చనుగొమల్నెగయ వక్షముపేక్ష గడకొత్తె" చనుగొమలు అంటే అగ్రాలు నెగయటం వలన ఒకనాడు ఆ వక్షస్థలం అంటే ఉండే ఉపేక్ష ఇప్పుడు కడకొత్తిందట. అంటే, కడదాకా తోసేసిందని! పాణిపాదాలు ఎర్రవారాయి. బాల్యంలో మట్టిలో ఆడుకున్న కాళ్ళూ చేతులు యవ్వనం లో శుచిని పాటించటం వలన ఎర్రబారి ఆమెలో సౌకుమార్యాన్ని పెంచాయి.

'సారెకు మధ్యంబు దారిద్ర్యముల జెప్పె' శరీరానికి మధ్యభాగం అయిన నడుముకి ఏదో దారిద్ర్యం వచ్చినట్టు మరీ సన్నబారిపోయిందట. 'రొచ్చోర్వకిటు లోగ జొచ్చె మేను' బాల్యం అంటే మట్టి, బురదే కదా ఆ రొచ్చును శరీరం ఓర్వలేకపోతోంది. దాని స్థానంలో అలంకారాల మీద ప్రేమ పెరుగుతోందన్నమాట.

ఇంత జరుగుతుంటే బాల్యం వెళ్ళి ఎవరితో మొరపెట్టుకుంటుందీ... ఆమె నాభికి చెప్పుకుందా మనుకుంటే, అది లోతైన గాంభీర్యాన్ని ప్రదర్శిస్తోంది. అందుకని 'చవుక యైనట్టి యిచ్చట జనదు నిలువననుచు జాఱిన కరణి బాల్యంబు జాఱె' బతుకు చవుకైనచోట ఉండలేక బాల్యం ఆమె శరీరం లోంచి చేజారి పోయిందట.

యువతి యవ్వనాన్ని పొగడకుండా, ఆమె కోల్పోయిన బాల్యం పట్ల సానుభూతి చూపించటం ఔచిత్యం తెలిసిన కవి చేయ దగిన గొప్ప రచన. ✯

# 'డబ్బుజబ్బు'

**దబ్బొక వింత రోగము, హఠాత్తుగ మాటలు మాయమౌను, మే**
**నుబ్బును, నవ్వు కృత్రిమము, ఊగుచునుండును కాలిమీద కా**
**లబ్బదు విద్య అక్షరము, ఆప్తులు చుల్కన యౌదు, రెప్పుడో**
**డబ్బుల లెక్కలో కటకటంబడి ప్రాణము వీడు, నక్కటా!**

ప్రముఖ కవి, మహాసహస్రావధాని డా.గరికపాటి నరసింహారావు వ్రాసిన "సాగరఘోష"లోది ఈ పద్యం. డబ్బుతో కొండ మీద కోతినైనా తేవచ్చనేది డబ్బు లేని వాళ్ళమాట కాదు. దబ్బున్నవారి మాట కూడా కాదు. డబ్బు అనే వింత జబ్బు చేసిన వారి మాట.

ఈ జబ్బు రాగానే మనిషిలో కొన్ని విచిత్ర లక్షణాలు కనిపిస్తాయంటారు గరికిపాటి. అప్పటిదాకా అన్నయ్య బావా, మామా, అక్కయ్య, వదినా అని ఆత్మీయంగా పలకరించే వాడు డబ్బు రాగానే అన్నీ మరిచి పోతాడు. మాయమైపోతదమ్మా ... మనిషన్నవాడు" అన్నట్టు, మనిషిలో మానవుడు మాయమై పోయి, నరుడు బయటకొస్తాడు. స్నేహం కలికాని క్కూడా కనిపించకుండా పోతుంది. శరీరం ఉబ్బుతుంది. తనంత వాడు లేనట్టు పొంగిపోతాడు. పెదిమలను ఈ కొస ఈ చెవిదాకా, ఆ కొస ఆ చెవి దాకా లాగి కుట్టించుకున్నట్టు కృత్రిమంగా నవ్వుతాడు. కాలి మీద కాలు ఊగుతుంటుందిట. అలాగని మహా మేధావి అనుకుందామా అంటే, పొట్ట కోస్తే అక్షరం ముక్క కనిపించదు. ఆప్తుల్ని చులకనగా చూస్తాడు. వాళ్ళంతా డబ్బు కోసం తన చుట్టూ మూగుతున్నారని అనుకుంటాడు. ఇరవై నాలుగ్గంటలూ వెర్రెత్తినట్టు డబ్బులు లెక్క పెట్టుకుంటూ ఉంటాడు. చివరికి అలా డబ్బు లెక్కతేలకే జనాభా లెక్కలోంచి తప్పిపోతాడు" అనే ఈ పద్యంలోని సారాంశం.

మనిషికి ఇతర జబ్బులకన్నా ముందు మొట్టమొదటగా "డబ్బుజబ్బు" సంక్రమించింది. జబ్బుల్లోకెల్లా పురాతనమైంది డబ్బుజబ్బు.

డబ్బుల్లేక రోగాల పాల్పడే వారు కొందరైతే, డబ్బు ఎక్కువై కొనితెచ్చుకునే జబ్బుల పాలిట పడేవాళ్ళు మరికొందరు. కాగా, దబ్బే ఒక జబ్బు మరికొందరికి కొత్తగా ధనవంతులైన వారిలో (neo-rich) ఇది ఎక్కువగా కనిపిస్తోంది.

'డబ్బుజబ్బు'కు వేల సంవత్సరాల చరిత్ర ఉంది. ఆహార పదార్థాల్లో వ్యాపారులు డబ్బుకోసం కల్తీలు చేయటం గురించి చరక సుశ్రుతాది అపూర్వ వైద్యులు 2,500

యేళ్ళ క్రితమే హెచ్చరించారు. అప్పటికే తక్కువగా దొరికే విలువైన బంగారం, వెండి, ఆల్చిప్పలు, గవ్వలు, ఉల్లిపాయలు, మొదలైనవి డబ్బుగా చలామణి అయ్యాయి.

అనతికాలం లోనే టంకశాలల్లో ముద్రించిన నాణేల ద్వారా వాణిజ్య వ్యవహారాలు మొదలయ్యాయి. కాగితం కనుక్కొన్నాక చైనాలో కరెన్సీ ముద్రణ వచ్చేసింది. కరెన్సీ వచ్చాక 'డబ్బుజబ్బు' బాగా ముదిరింది. ఇప్పుడు ఇంటింటా డబ్బురోగులు అధిక సంఖ్యలో ఉంటున్నారు. నివారణ, నిర్ధారణ, నిర్మూలనలు అసాధ్యం అయిన జబ్బు ఇది.

"ధనమూలం ఎదవ జగత్" అని సరదాగా అంటుంటారు మనవాళ్ళు. నిజమే! డబ్బే ప్రధానంగా ఉండేది వెధవ జగత్తే! డబ్బున్నవాడికీ, డబ్బు జబ్బున్నవాడికీ మధ్య తేడా ఈ "మేనుబ్బు"లో ఉంది.

యుద్ధంలో ఓడిపోయినవాళ్ల డబ్బు నేరుగా జయించినవాడి సొంతం అవుతుంది. డబ్బు అంటే భార్యాబిడ్డలు, పశువులు, విలువైన ఆభరణాలూ అన్నీ! యుద్ధంలో గెలిచినవాడి పక్షాన వుంటుంది కాబట్టి ధనాన్ని యుద్ధం అని కూడా అంటారని పండితులు చెప్తారు. ధనంజయుడంటే యుద్ధంలో జయించినవాడనే అర్థం.

వాత పిత్త కఫాలనే త్రి దోషాలకూ అదనంగా డబ్బు అనే నాలుగో దోషం చేరటం వలన కొత్త జబ్బులొస్తున్నాయి. డబ్బు వలన వచ్చే వింత జాడ్యానికి చికిత్స లేదు. వ్యాధులు సాధ్యం, కష్టసాధ్యం, అసాధ్యం ఇలా అనేక స్థాయిల్లో ఉంటాయి. డబ్బు జబ్బు అసాధ్య వ్యాధుల్లో ఒకటి. దానికి 'నిదాన పరిమర్జనం' అంటే రోగ కారణాలను తొలగించటం ఒక్కటే చికిత్స. ఏ పాపం చేయని వాడే ఆ చికిత్స చేయగలడు.

డబ్బు శాస్త్రాన్ని అర్థశాస్త్రం అంటారు. డబ్బు అవసరమైన వాడికి చేరే ఉపాయం చెప్పలేక పోతోంది కాబట్టి దాన్ని అర్ధ (సగం) శాస్త్రం అనటంలో తప్పులేదు. ప్లాస్టిక్ మనీ వచ్చాక క్రెడిట్ కార్డులతోనే మార్కెటింగ్ వ్యవహారాలన్నీ జరిగి పోతుండటంతో జేబుదొంగల సమస్యకు కొంత నివారణ దొరికింది. కానీ నల్లడబ్బు సమస్యకు అలాంటి నివారణ లేదు.

దుర్గానంద్ అనే కవి డేటెడ్ కరెన్సీ నోట్లు కావాలనీ, నోట్లకు తక్కువ కాలపరిమితితో ఎక్స్‌పైరీ డేట్ ఉండాలనీ 1970ల్లోనే ఒక రచనలో కోరాడు. 2005 కన్నా ముందునాటి నోట్లను రద్దు చేస్తున్నామన్నారు. అది అమలైందో లేదో తెలీదు. పాత నోట్లు చెలామణిలోనే ఉన్నాయి.

ఇంట్లోనూ, ఒంట్లోనూ ఎక్కువ కాలం డబ్బు మూలగకూడదు. డబ్బు మూలగటం కూడా డబ్బు జబ్బుకు మూలమే! ✪

# తక్కువ పాపికే ఓటు

"ఒకటికి రోయకుంట గను మున్నవియున్, ద్రుపదుండు మారణే
ష్టికి( బసిజూపి వేద- మునిసింహు డొకండు "తమన్న వేల్పు( బం
దొక డపవిత్ర భూమి గని యే జనదా గ్రహించె రో
యకొనియె, గాన నట్లెఱుగనౌ జను, సర్వము(గా నశక్యమె?"

వీడు మంచివాడా? చెడ్డవాడా? ఎలాంటి నీచానికైనా దిగజారతాడా? అని ఆ వ్యక్తి గురించి తెలుసు కోవాలంటే 'ఉన్నవి తెలుసుకోవా'లంటాడు కృష్ణదేవరాయలు. ఆయన గొప్ప రాజుగారు. మూడు సముద్రాలూ ఆయన అధికార పరిధిలో ఉండేవి. ఆ స్థాయిలో ఉన్న వాళ్లకి ప్రతి ఒక్కడి ప్రొఫైలూ విడివిడిగా పరిశీలించి, ఎవడెలాంటి వాడో నిర్ధారించటం సాధ్యం కాదు. అందుకని, వ్యక్తులు చేసే చిన్నపనుల్ని బట్టి, వాళ్లని అంచనా వేయాలన్నాడు. ఉన్నవి తెలుసుకోవటం అంటే అది!

"ఒకటికి రోయకుంట గను మున్నవియున్"అంటే, అసహ్యమైన పని చేయటాన్ని అసహ్యించు కోకుండా చేసే తత్వం ఉన్న ఒకడికి 'ఉన్నవేమిటో (బుద్ధులు)' తెలిసిపోతుంది. ఎలాగంటావా..? ఒక ఉదాహరణ చెప్తాను.

ఒకప్పుడు ద్రుపద మహారాజు (ద్రౌపదితండ్రి) 'మారణేష్టి' అనే యజ్ఞం తలపెట్టాడు. తన శత్రువులందరూ చచ్చిపోవాలనే కోరికతో చేసే యజ్ఞం అది! ఇప్పటి రోజుల్లో అయితే అధికారంలో ఉన్నవాడు సి బి ఐని ఉపయోగించుకున్నట్టే అప్పటి రాజులు ప్రతిపక్షం మీదకు ఇలాంటి యాజ్ఞాలను ప్రయోగించే వారన్నమాట! శత్రుమారక యజ్ఞాన్ని చేయించటానికి బ్రాహ్మలెవరూ ముందుకు రాలేదు. వందల సంఖ్యలో ఆవులు ఇస్తానని ఆశ చూపించాడు. కానీ, ఎవరూ కదల్లేదు. చివరికి ఎక్కడో అడవుల్లో తపస్సు చేసుకుంటున్న ఓ 'మునిసింహం' గురించి విని వెదుక్కొంటూ వెళ్ళాడు.

ఆ మునిసింహం ద్రుపదుడి కోరిక వింటూనే అసహ్యించుకున్నాడు. ఇలాంటి ఆలోచనలున్న వాడివి కాబట్టే, నీకు అంతమంది శత్రువులు ఏర్పడ్డారు. శత్రు భయం నిన్ను పీడిస్తోంది. మంచి తనంతో శత్రుత్వం తగ్గించు కోవాలి గానీ, శత్రువుల చావు కోరుతో యజ్ఞం చేయాలనుకోవటం నీచం.. అని మందలిస్తాడు.

రాజు బతిమాలుకుంటే "మా అన్న ఒకడున్నాడు.. వెళ్ళి ఆయన్ని కలుసుకో! వాడైతే ఇలాంటివి అవలీలగా చేయిస్తాడు.. అంత గ్యారంటీగా ఎలాచెప్తున్నా

నంటావా...? ఒకసారి మేవిద్దరం కలిసి వెడుతున్నాం. ఒక పండు చెట్టుమీంచి రాలి పడింది. ఇద్దరికీ ఆకలిగా ఉంటుందో చెరి సగం తినాలనుకున్నాం. తీరాచూస్తే, ఆ పండు అశుద్ధం పైన రాలింది. నాకొద్దులే అని చెప్పి నేను వెళ్ళి పోయాను. మావాడు ఆ పండునే తుడుచుకుని తినేశాడు. వాడికి ఉచ్ఛనీచాలు లేవు. ఎంత నీచానికైనా రోయడు. నువ్వు అడిగింది చేయటానికి వాడే సమర్థుడు.." అని!

యమునాచార్యుడిచేత కుమారుడికి రాజనీతిపాఠాలు చెప్పించే సన్నివేశాన్ని సృష్టించి కృష్ణదేవరాయలు ఈ పద్యాన్ని వ్రాశాడు.

ఆముక్తమాల్యద 600 యేళ్ళ నాటి కావ్యం. అవి సత్తెకాలపు రోజులు. ఇప్పు డలాంటి సీను లేదు. పేడ మీద పడ్డవి ఏరుకు తినేవాణ్ణి తెచ్చి అందలం ఎక్కించటానికి వెనుకాడని కాలం మనది! నీతి కూడు పెడుతుందా? నిజాయితీ ఐశ్వర్యాన్ని ఇస్తుందా? ఆదర్శం అందలం ఎక్కిస్తుందా? అని వాళ్ళు ఎదురు ప్రశ్నిస్తున్నారు. 'ఇన్నాళ్ళూ వాళ్లు తిన్నారు, ఇప్పుడు నేను తింటే తప్పొచ్చిందా?' అని బహిరంగం గానే అడుగుతున్నారు. ఈ ప్రశ్నలకు ప్రజల దగ్గర సమాధానం లేదు.

తాగిన మైకంలో అర్ధరాత్రి ఇష్టారాజ్యంగా కారు నడుపుతూ ఒక డ్రైవరు, ఫుట్‌పాత్ మీద అలిసి పడుకున్న వాళ్లపై నుండి దూసుకు పోయాడు. ఒకడు చనిపోయాడు. కొందరికి గాయాలయ్యాయి. ఆ డ్రైవరు మామూలు మానవుడైతే, పందొమ్మి దేళ్ళు విచారణ లేకుండా జైల్లోనే ఉంచేవాళ్లు. కానీ, అదే నేరాన్ని ఒక సినిమా నటుడు చేశాడు. దాంతో సీను మారింది.

తీర్పు వ్యతిరేకంగా వచ్చినా, ఘడియలూ విఘడియలూ గడవ కుండానే అసాధారణ రీతిలో జైలు తప్పించి బైలు ఇప్పించి, దేవుడి లాంటి మనిషి జైల్లో పడకుండా కోర్టులు దేశం పరువు నిలబెట్టాయి.

రాయలవారు తన రాజనీతి పాఠాల్లో 'ఉన్నవి తెలుసుకో' అని చెప్పాడు గానీ, తెలుసుకుని ఏం చేయాలో చెప్పలేదు. రాజకీయ, సామాజిక, వాణిజ్య, పారిశ్రామిక, సినీ రంగాలకు చెందిన సెలెబ్రిటీలనదగిన వారిలో ఇలాంటి "ఉన్నవి" చాలా ఉన్నాయి. తెలిసీ... తెలిసి తెలిసీ...ఎక్కువ పాపికన్నా తక్కువ పాపి మేలనే భావనతో ఓట్లేసి ఊరక చూచుచుండటం తప్ప జనం చేసేదేమీ లేదని ఆయనకు తెలుసు.

☆

# తిట్టు లాభాలు

సీ. అందలంబెక్కుట నవని బ్రశస్తమా, బ్రూనెక్కి నిక్కదే మర్కటంబు
తొడవులు దొడుగుట దొడ్డ సౌభాగ్యమా, కడుసొమ్ము లూనదే గంగిరెద్దు
విత్తంబు గూర్చుట విమల ప్రచారమా, బహు నిధుల్ గావదే భైరవుండు
ప్రజల దండించుట పరమ సంతోషమా, ప్రాణులనెల్ల నేపడె జముండు
గీ. దొరతనంబున కివిగావు వరుస లరయ,
సాహసౌదార్య ఘన పౌరుషములుగాని, భూతను విలాస!
పీఠికాపుర నివాస! కుముత హితకోటి సంకాశ! కుక్కుటేశ!

18వ శతాబ్ది నాటి కూచిమంచి తిమ్మకవి బహుగ్రంథ కర్త. రసికజన మనోభిరామం, వేణుగోపాల శతకం, కుక్కుటేశ్వర శతకం వంటి గ్రంథాలు వ్రాశాడు. పిఠాపురం దగ్గర కందరాడ గ్రామం ఈయన ఊరు. భక్తి వైరాగ్యాలతో పాటు, సున్నితమైన నిందా హాశ్యాన్ని వ్రాసేవాడు. సాంఘిక దురాచారాల మీద విశేష రచనలు చేశాడు.

రాజకీయ నాయకుల మీద సూటిగా తగిలే వ్యంగ్య బాణాలెన్నో ఈయన తన రచనలలో ప్రయోగించాడు. కొన్ని చదువుతుంటే ఇది ఈనాటి ఫలానా నాయకుడికి వర్తిస్తుందని పాఠకులకు తప్పక అనిపిస్తుంది. భూస్వామ్య యుగం నుండి కుహనా ప్రజాస్వామ్య యుగం దాకా రాజకీయ నాయకుల్లో ఎంచి చూడగ మంచి కొంచెమే కావటం అందుకు కారణం. మేం ఫలానా రూలింగు పార్టీ వాళ్ళం అనే 'రుబాబు బాబు'లు తరచూ వార్తల్లోకి ఎక్కుతూనే ఉంటారు. అందుకే తిమ్మకవి గారు ఈ పద్యం చెప్పాడు.

**అందలం బెక్కుట నవని బ్రశస్తమా, బ్రూనెక్కి నిక్కదే మర్కటంబు:** అందలం (సింహాసనం) ఎక్కటంలో గొప్పతనం ఏముందీ...అంతకన్నా పెద్ద చెట్టెక్కి ఫోజులివ్వగలదు కోతి.

**తొడవులు దొడుగుట దొడ్డ సౌభాగ్యమా, కడుసొమ్ము లూనదే గంగిరెద్దు:** తొడవులు అంటే భుజకీర్తులు, భూషణాలు వీటిని తొడగటంలో గొప్ప సౌభాగ్యం ఏవుందీ.. .గంగిరెద్దు కూడా అలంకరించుకుని తిరుగుతుంది.

**విత్తంబు గూర్చుట విమల ప్రచారమా, బహు నిధుల్ గావదే భైరవుండు:** ప్రచారం అంటే వ్యవహారం. డబ్బు దాచి పెట్టటమే గొప్ప వ్యవహారమా? కుక్కకూడా ఇంతకంటే ఎక్కువ డబ్బుకి కాపలా కాస్తుంది.

**ప్రజల దండించుట పరమ సంతోషమా, ప్రాణులనెల్ల నేపదె జముండు:** ప్రజల్ని హింసపెట్టమే పరమ సంతోషం అనుకోవద్దు. అన్ని ప్రాణుల్నీ హింసపెట్టే యముడు నీకన్న గొప్పవాడు.

**దొరతనంబున కివిగావు వరుసలరయ సాహసౌదార్య ఘన పౌరుషములుగాని:** నిజమైన దొరతనం చెలాయించటం అంటే ఇది కాదు, పాలించటానికి సాహసం కావాలి, ఔదార్యం కావాలి, ఘన పౌరుషం ఉండాలి. దమ్ములుండాలి అంటామే అది కావాలంటాడు తిమ్మకవి గారు.

దమ్మున్నవాడు జనం నాలుకలమీద నిలుస్తాడు. తక్కిన వాళ్ళంతా కాళనాళికల్లో కలిసి పోతారు. కబళించిన ఆస్తులు, కబ్జా చేసిన భూములు దొరతనానికి చేదుగుర్తులు. ఒక పద్యంలో తిమ్మకవి "నిక్కి మిక్కుటమైన యాదొక్కి బొక్కి, టక్కరి నృపాలకుల కీర్తి దక్కునొక్కొ" అని అడుగుతాడు. నిక్కులూ టెక్కులూ బొక్కుల్లే పరమావధిగా ఉండే టక్కరి నాయకులకు కీర్తి దక్కుతుందా...అని!

కుక్కుటేశ్వర శతకాన్ని నూనూగు మీసాల నవయవ్వన కాలంలోనే వ్రాశాడు తిమ్మకవి. ఇతని తమ్ముడు కూచిమంచి జగ్గకవి (1700-65) కూడా తిట్టుకవిత్వంలో ప్రసిద్ధుడే! ఇప్పటి వాళ్ళకు రుచించేలా తన రచనను సవరించి ప్రకటించ వలసిందిగా కాళ్ళకూరి గోపాలరావు గారికి కలలో కన్పించి చెప్పాడని రావుగారు తన పీఠికలో చెప్పుకున్నాడు. ఇప్పటి కాలంలో ఇప్పటి ఇతివృత్తాలను ఇప్పటి వాళ్ళకోసం వ్రాయాలను కోవటం సాహిత్యం అసలు ప్రయోజనం.

తిమ్మకవి, జగ్గకవి ఇద్దరూ గ్రామ్యభాషని తిట్టుకవిత్వానికే ఎక్కువ ఉపయోగించుకున్నారు. వెనకటికి ఒక సినిమాలో చెప్పినట్టు ఒరే అడ్డగాడిదా అంటే జనానికి అర్థం అయినట్టు ఓరీ గార్ధభా అని తిడితే తిట్లు తిన్నవాడికి అర్థం కాదు అందుకని పగలబడి తిట్టటానికి గ్రామ్యభాష అనువుగా ఉంటుంది. ఎవణ్ణి తిడుతున్నామో వాడికి అర్థం అయినప్పుడు సాహిత్య ప్రయోజనం నెరవేర్తుంది.

తిడితేనే కొన్ని చర్మాల వాళ్ళకి బుర్రకెక్కుతుందని చౌడప్ప సహా చాలా మంది తిట్టు కవులు తిట్టుదారుల్ని ఎంచుకున్నారు. ఎవడబ్బ సొమ్మని కులుకుతు తిరిగేవు అని రామదాసుగారు కూడా బాగానే తిట్టాడు. తిట్టుకవులు తిట్టిన తిట్లన్నింటినీ ఒక చోట చేరిస్తే చక్కని తెలుగు తిట్టు పదబంధ కోశం తయారౌతుంది.

ఇంత తిట్టాక కూడా ప్రభువులు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతులమీద దృష్టి సారించకపోతే సదరు ప్రభువుల వారి చర్మం మందాన్ని కొలిచేందుకు కొత్త స్క్రూ గేజీ అవసరం అవుతుంది. ★

# తినేవాడిదే డబ్బు

"ప్రాయికందు జెట్టు పాతువాడొకండు/ వరుస బండ్ల మెక్క వాడొకండు
కష్టపడి గృహంబు గట్టువాడొకండు/ వసతిగ నివసించు వాడొకండు
ఆస్తికై వ్యాజ్యంబు లాడువాడొకండు/ వచ్చినది మ్రింగు వాడొకండు
కోరి ముండను బెట్టు కొనెడివాడొకండు/ వలపు కాండ్రై పొందు వాడొకండు
అట్లే, ధనము కూర్చునట్టి వాడొక్కండు/ పడిగం దగుటబెట్టు వాడొకండు
ఇది ప్రపంచధర్మ మీ నాదు పుట్టిన/ లీలగాదు దీని కేల గోల?

లోకరీతిని ఎత్తిపొడుస్తూ, కాళ్లకూరు నారాయణరావు గారు తన వరవిక్రయం నాటకంలో వ్రాసిన పద్యం ఇది. "సమస్త అనాచారాలూ లోకంలో పెరిగిపోతున్నాయి. అనవసరంగా గగ్గోలు పెట్టాల్సిన పని లేదు ఇది ప్రపంచ ధర్మం". ఒకడు చెట్లు నాటుతాడు. వరుసగా తర్వాతి తరాల వాళ్ళు పళ్ళు మెక్కుతారు. ఒకడు నానా యాతనా పడి ఒక ఇల్లు కడతాడు. కానీ అందులో ఉండేది వేరే వాడొతాడు. ఆస్తుల కోసం వ్యాజ్యాలు కబ్జాలు, ఇతర మోసాలకు తల పడేవాడు ఒకడు. అలా వచ్చిన సొమ్మునంతా కూర్చుని తినేవాళ్ళు ఇంకొకళ్ళు, కావాలని ముండని (వేశ్యని) తెచ్చి నెత్తిన పెట్టుకునేవాడు ఒకడు. దాన్ని తగులుకొనే వలపుకాడు ఇంకొకడు. అట్లాగే, డబ్బు కూడబెట్టేవాడు ఒకడైతే, తగలబెట్టేవాడు ఇంకొకడు. ఇది ప్రపంచ ధర్మం. ఇవ్వాళ పుట్టింది కాదు. దాని కోసం ఈ గోల దేనికీ...అనేది కాళ్లకూరి నారాయణరావు వరవిక్రయం నాటకంలో సింగరాజు లింగరాజు పాత్ర అడుగుతోంది మనల్ని.

డబ్బు దయ్యం పట్టిన సింగరాజు లింగరాజుది పాత్ర. పేరుకు అది హాస్యపాత్రగా కనిపించినా బహుశా, తెలుగువాళ్ళు అంతగా అసహ్యించుకునే పాత్ర ఆధునిక తెలుగు నాటకాలలో మరొకటి లేదేమో!

ప్రొద్దున్నే నిద్ర లేస్తూనే డబ్బు నామస్మరణ మొదలుపెట్టి రాత్రి పడుకోబోయే వరకూ కొనసాగిస్తూ ఉంటాడు. 'భగవతీ! భాగ్యలక్ష్మీ, ప్రణామంబు, నీ దాసాను దాసుండ, నీ పాదముక్తుండ, నీ దివ్య రూపంబె నిత్యంబు భావింతు నీ దివ్య నామంబే నిక్కంబుగా నిద్రలో గూడా జపింతు, నాదిక్కు, నా మొక్కు, నాయండ, నా దండ నీవే సుమా! భార్య్యయుం, గీర్యయుం, బిడ్డలుం, గిడ్డలు, దేవుడుం, గీవుడన్, మోక్షముం, గీక్షమున్, సర్వమున్నీవే! సత్యంబు, నీకై నిరాహారినై యుందు, నీకై నిశలు నిద్ర మేల్కొందు, నీకై శరీరాభిమానంబు వర్జింతు నీకై యసత్య

ప్రమాణంబు లెన్నేనియుగావింతు నీయాన! ఈ పెట్టెయే నీ పవిత్రాలయం, నేనే నీయర్చకుండన్, యదార్థంబుగా నాదు ప్రాణంబులే నీదు పూజాసుమంబుల్ శరీరంబే నైవేద్య కుంభంబు, నా ఇంటనే యుండి, నీ పూజం గొంచు నే ఇంటికి పంపినం బోయి, యా ఇల్లు మట్టంబు గావించి, నా ఇంటికి దెచ్చి నాకిచ్చు చుండంగదే కన్న తల్లి! నమస్తే, నమస్తే నమః" అని ధనదేవతా స్తుతితో అతని దిన చర్య మొదలౌతుంది. ఏ ఇంటి మీదకు అతని కన్ను పడిందో ఆ యింటికి తన ధనదేవతను పంపి ఆ యింటివాణ్ణి సర్వనాశనం చేసి, వాడి ఇంటిని నేలమట్టం చేసి వాడి సంపదనంతా తెచ్చి తనకివ్వాలని దేవతలను వేడుకునే పాత్ర అది.

అల్లా ఉద్దీన్ అద్భుత దీపం కథలోలాగ భూతం వచ్చి తనకు ఊడిగం చేస్తూ....సమస్త సంపదలూ తెచ్చి ఇవ్వాలని అతని కోరిక. ఈ మాత్రం కోరిక అందరికీ ఉంటుంది. కానీ, అవతలి వాణ్ణి నాశనం చేసి వాడి సంపద కొల్లగొట్టి తెచ్చి ఇవ్వాలనటమే ఈ పాత్ర లక్షణం... ఋగ్వేదంలో కూడా "ఓ ఇంద్రుడా! వారి సంపదను కొల్లగొట్టి తెచ్చి మాకిమ్మ"ని కోరిన ఋక్కులున్నాయి. కాబట్టి అది కూడా లోకరీతే ననుకుందాం. కానీ సింగరాజు లింగరాజు లోకాతీత వ్యక్తి. లోకం ఏమనుకున్నా అతనికి నిమిత్తం లేదు. లోకానికి మంచిగా కనిపిస్తే కూడు పెడుతుందా...గూడునిస్తుందా. అనుకునే వాడు ఈ లింగరాజు. అతనికి పరువుతో పనిలేదు, మర్యాదలు చేయడు తనకు మర్యాదలు కావాలని కోరడు. మర్యాదలు చేస్తే తన డబ్బు వృథాగా ఖర్చవుతుంది. మర్యాదలు పొందితే మొహమాటానికి లొంగిపోవాల్సి వస్తుంది. అదేదో సినిమాలో "అయితే నాకేంటీ" అంటాడే అచ్చం అలాంటి కేరెక్టరు. .లోకంలో ఉన్న లోభత్వాన్ని ఒక విగ్రహంగా పోతపోస్తే అచ్చం సింగరాజు లింగమూర్తిలా ఉంటుంది.

అంత పరమలోభికి ఇంట్లో ఒక వంటవాడు కూడా ఉన్నాడు. వాడికి జీతం నిండుగా ఇవ్వడు. వంట చేయటానికి కట్టెలు వగైరాలు వాడద్దంటాడు. పెరటి దొడ్లో కరివేపాకు చెట్టుమీద కాకిగూడు పడగొట్టి ఈ పూటకు దానితో వంట కానివ్వమంటాడు. అగ్గిపుల్లని సగం చీల్చి నిన్న వెలిగించగా మిగిలిన సగం పుల్లతో ఇవ్వాళ పొయ్యి వెలిగించమంటాడు. పక్షిగూడు పడగొట్టడం పాపం కదండీ, అంటే, ఖర సంవత్సరంలో మా యింటి వంటంతా కాకి గూళ్లతోనే వెళ్ళిపోయిందని అనెయ్యగల గడుసరి. తానే తన పూర్వీకులకన్నా ఉత్తముడని తన గురించి తానే గర్వించే తత్వం అతనిది.

సంపదల మహత్తు తెలియని చవట బ్రహ్మ కనీసం నాలాంటివాడికి చావైనా లేకుండా వ్రాశాడా? చచ్చాక కూడా ఈ డబ్బంతా వెంటపెట్టుకుని తీసుకెళ్ళే ఉపాయం అయినా చెప్పలేదు కదా! అని బాధపడతాడు.

"తినేవాడిదే డబ్బు" అనేది సింగరాజు లింగరాజుల ఫిలాసఫీ ! ☆

# తీరని తనివి

**అవి అహ్ణ పేక్ఖణిక్షేణ తక్షనం మామి తేణ దిట్టేణ**
**సివిణా పియేణ వ తహ్ణ వ్విఅ ణ పిట్టా**

ఇది గాథా సప్తశతిలో ఒక గాథ

ఒక అబ్బాయిని చూడగానే ఆమెకు ఇష్టం కలిగినప్పుడు తక్షణం ఆమె మనసులో అనిపించిన భావాల్ని తన మేనత్తకు ఇలా చెప్పకుందా అమ్మాయి. "మనసుకు నచ్చినవాడు హఠాత్తుగా కనిపించినప్పుడు కళ్లతో చూసినంత మాత్రాన 'తనివి' తీరదు గదా! కలలో మంచి నీళ్ళు తాగితే దప్పిక తీరుతుందా....?" అని!

ఈ గాథని వ్యాఖ్యానిస్తూ, "తమిళ ఆళ్వార్లు భగవంతుణ్ణి 'ఆరాత ఆముదం (ఆరని అమృతం) – అంటారు. ఎంత తాగినా 'తనివి' తీరని అమృతం వంటి వాడు భగవంతుడని దాని అర్థం. దాని అనువాదమే అతృప్తస్యమృతరూపుడు" అనే మాట అంటారు తిరుమల రామచంద్ర!

తనివి తీరకపోవటం దేవుడి విషయంలో ఏమోగానీ లోకం విషయంలో చాలా అనర్థాలకు దారి తీస్తుంది.

ఆపాతమధురాల్లాగానే, 'ఆపాతవిషాదాలూ' ఉంటాయి. ఆపాతం అంటే ఉన్నట్టుండి అకస్మాత్తుగా ఊడిపడటం. విన్నంతనే, చూసినంతనే, రుచి చూసినంతనే, వాసన చూసినంతనే తాకినంతనే మధురంగా అనిపించే దాన్ని ఆపాత మధురం అంటారు. ఇక్కడో చమత్కారం ఉంది. వినంగానే బావుందంటే, ఆ సంగీతమో, కవిత్వమో ఆసాంతం తర్కించి చూస్తే లోపభూయిష్టంగా ఉందనే చురక కూడా ఉంది. ఆ సంగీతం ఆపాత మధురం అంటే లోతుగా చూస్తే అపశృతులున్నాయని కూడా అర్థం. 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అనటంలో ఇదే వ్యంగ్యం ఉంది. లవ్ ఆఫ్టర్ ఫస్ట్ నైట్'కు గ్యారంటీ లేదని!

అలాగని మనసుకు కలిగిన 'తనివి' ని మనిషి ఒదులుకోలేడు కదా! "ధనమున విద్యను సంతతి దనిసిన వారెందు గలరె". డబ్బు విషయంలోనూ, విద్య విషయంలోనూ, సంతతి విషయంలోనూ తనిసిన వాళ్ళెక్కడా ఉండరంటాడు నన్నయ. తనివి, తనివు, తవ్వి, తనియు శబ్దాలకు తృప్తినొందటం అని అర్థం.

మనిషి! పుట్టగానే తల్లి నవ్వుని చూసి మొట్టమొదటగా ఆపాతమధురంగా భావిస్తాడట! నుదురు ఎడమ భాగాన మెదడు లోపల తనివి కేంద్రాలుంటాయి. బౌద్ధ భిక్షువులు గాఢమైన ధ్యానంలో ఉన్నప్పుడు ఈ కేంద్రాలలో ఒక విధమైన

ప్రకాశాన్ని కనుగొన్నారట. ఈ తనివి కలిగినప్పుడు మనసులో చోటు చేసుకునే మధుర భావావేశాన్నే చంటి బిడ్డడిడి సామాజిక నవ్వు "first social smile" లో కూడా గమనించవచ్చు నంటాడు డోనాల్డ్ విన్ని కాట్ అనే న్యూరో సైంటిస్ట్.

మనసులో కలిగే ఆపాతమధురమైన తనివి ఈ సామాజిక నవ్వు (సోషల్ స్మైల్) ! తనివి తీరటానికి కావలసిన ఆనందం, ఆశ్చర్యం, సంతోషం, ఉత్సాహం, ఉద్వేగం ఉద్రేకం, ఆశ, ఆత్మీయత' లాంటి ప్రవృత్తులు సామాజికమైన పరస్పర మార్పిడికి కారణం అవుతాయి. సోషల్ షేరింగ్ అంటారు దీన్ని. ఆపాతమధురాలు సంభవించినప్పుడు మెదడులో మార్పులు ఏర్పడినట్టే, ఆపాత విషాదాల సమయంలో కూడా మెదడులో కొన్ని రసాయనాలు విడుదలౌతాయి.

'ఆపాతవిషాదం' వలన మెదడు కార్టిజాల్ అనే స్ట్రెస్స్ హార్మోన్ని ఉత్పన్నం చేస్తుంది. దీనితోపాటు ఒక్కోసారి 'ఆక్సిటోసిన్' అనే హార్మోను కూడా ఎక్కువ మోతాదులో విడుదలౌతుంది. దాని ప్రభావాన ఆ వ్యక్తి అకస్మాత్తుగా దానశీలిగా మారిపోయి, ధార్మిక కార్యక్రమాల్లో పాల్గొనటం లాంటివి చేస్తాడని వ్యక్తి మరణించినప్పుడు దినవారాల్లో ఉదారంగా గోదాన భూదానాదులు చేయటానికి కారణం ఇదే! సంతోషం వచ్చినా దుఃఖం వచ్చినా కొందరిని పట్టలేము. అందుకు కారణం ఈ రసాయనాల విడుదల ప్రభావమే!

మామూలుగా మన ఇంటి దగ్గర కిరాణా చిల్లర దుకాణంలో సరుకులు కొంటే, మనకు కావలసిన వాటిని మాత్రమే కొనుక్కుంటాం. అక్కడ తనివిని రెచ్చగొట్టే అంశాలుండవు. ఫలానా సబ్బు ఉన్నదా అని అడిగి దాన్ని కొనుక్కుని వెళ్ళిపోతాం. కానీ, ఆ సబ్బునే కొనటానికి షాపింగ్ మాల్సుకు వెళ్ళాం అనుకోండి... అక్కడ మన తనివిని రెచ్చగొట్టే ఆపాతమధురాలు అనేకం పని చేయటం మొదలెడతాయి. ఆక్సిటోసిన్ లాంటి ఉత్ప్రేరకాలు ఎక్కువ మోతాదులో విడుదల అయ్యేందుకు దారి తీస్తాయి దాంతో, మనకు అవసరం లేని అనేక వస్తు సరంజామా మీదకు ఆకర్షణలు మళ్ళుతాయి. ఒక సబ్బుకు బదులు ఆరు సబ్బులు కొంటే అర్ధరూపాయి వెనక్కి అనే ఆఫర్లకు లొంగిపోతాం. అలా కొనుక్కోవటంలో మీ తెలివి తేటల్ని చూసి ఇతరులు అసూయ పడతారు లాంటి స్లోగన్లు అక్కడ మనల్ని మరింత రెచ్చగొడతాయి. సబ్బు కోసం వెళ్ళి, ఆపాతమదురాలకు లొంగి, జేబులో ఉన్న డబ్బునంతా వెచ్చించేలా చేస్తాయి. తరచి చూశాక తెలిసొస్తుంది... అసలు సంగతి.

మంచి నీళ్ళు తాగినట్టు కలగంటే సరిపోని మాట నిజం. అలాగని తనివి తీర్చుకోవటానికే ప్రాధాన్యత నివ్వటం కూడా సమాజానికి శ్రేయస్కరం కాదు గదా!



# తెలుగు చంద్రుడు

**"అమరుల బోనపుట్టిక, సహస్ర మయూఖుని జోడుకోడె, సం**
**తమసము వేరువిత్తు, కుముదంబుల చక్కిలిగింత, పుంశ్చలీ**
**సమితికి జుక్కవాలు, నవసారస లక్ష్మి తొలంగుబావ, కో**
**కములకు గుండెతల్లడము, కైరవమిత్రుడు తోచె దూర్పునన్"**

'ఎవ్వరూ పుట్టించకపోతే భాషెలా పుడుతుందీ?' అనడుగుతాడు మాయా బజారులో ఘటోత్కచుడు. అవును! పామరజనులు, ప్రజాకవులు పుట్టించిన పదాలలో లోతు(డెప్త్) ఎక్కువగానూ పండిత కవుల పదాలలో ఎత్తు(ఉన్నతి) ఎక్కువగానూ కనిపిస్తాయి. పారిజాతాపహరణంలో కైరవ(కలువలకు) మిత్రుడైన చంద్రుడు ఉదయించటాన్ని చెప్తూ, ప్రజాకవి నంది తిమ్మన అచ్చతెలుగులో చంద్రుడికి పెట్టిన ఆరు పేర్లు చాలా లోతుగా కనిపిస్తాయి.

"మాకొలది జానపదులకు(మాలాంటి పామరులకు) నీ కవనపు ఠీవి అబ్బునే! కూపనటద్భేకములకు (నూతిలో కప్పల్లా గెంతే మాకు) గగన ధునీ శీకరముల చెమ్మ (చల్లని ఆకాశగంగ జల్లువి) నంది సింగయ తిమ్మా!" అని తెనాలి రామకృష్ణుడు గొప్పగా పొగిడిన కవి తిమ్మన. ఈ పద్యంలో తిమ్మన సృష్టించిన కొత్త తెలుగుపేర్లు ఇవీ:

**బోనపుట్టిక:** నక్షత్రాల హోటళ్ళలో భోజనానికి వెడితే స్థాలీ ఇస్తారు. అంటే ఒక ముంతడు అన్నం పెడతారన్నమాట. స్థాలీ అంటే కుండ. డజన్లకొద్దీ వంటకాలున్న చిన్నగిన్నెల్ని పెద్ద పళ్ళెంలోనూ, పుల్కాలూ, నాన్'లు, రకరకాల రోటీలు, పొరోటీలను చిన్న బుట్టలోనూ పెట్టి తెస్తారు. ఆ భోజ్యాలబుట్టని 'బోనాల పుట్టిక' అన్నాడు తిమ్మన. చంద్రుడి పదహారు కళల్ని రోజుకొకటిగా దేవతలు(ఫైవ్'స్టార్ సంస్కృతి ఉన్నవారు) ఆస్వాదిస్తారు కాబట్టి, చంద్రుణ్ణి 'దేవతల బోనపుట్టిక' అన్నాడు.

జోడుకోడెః వలపట దాపట జోడెడ్లలో ఒక తెల్లగిత్త సహస్రమయూఖుడైన (వేయి వెలుగులున్న) సూర్యుడైతే, అతని 'జోడుకోడె' అంటే, జోడుగా ఉండే రెండో తెల్లగిత్తలాగా ఉన్నాడట ఆ నిండు చంద్రుడు! చంద్రుణ్ణి జోడు కోడె అనటం ఇక్కడి విశేషం.

**వేరువిత్తు:** వేరువిత్తు అంటే నాశనం చేసేదని! వేరు విత్తులాంటి వాడు వంశనాశకుడు! ఈ పద్యంలో సంతమసానికి (కటికచీకటికి) నాశకుడు కాబట్టి చంద్రుణ్ణి 'చీకటివేరువిత్తు' అన్నాడు.

**చక్కిలిగింత:** కలువలకు చక్కిలిగింతలు పెట్టినంత ఆనందం కలిగించేవాడు చంద్రుడు. చక్కిలి (చెక్కిలి కాదు) అంటే చంక. వేరొకరు చంకల్లో తడిమితే కలిగే ముదాన్ని (ఆనందాన్ని) చక్కిలిగింత అంటారు. ముదం పొందేది కాబట్టి కుముదం పదాన్ని ప్రయోగించాడు."చక్కిలిగింత"ని నామవాచకం చేసి చంద్రుణ్ణి "కుముదలకు చక్కిలిగింత అని పిలిచాడు.

**చుక్కవాలు:** శుక్రగ్రహం, తిలకం బొట్టు, నీటి చుక్క, కన్నీటి చుక్క, చుక్క కూర వీటన్నింటినీ చుక్క అనే అంటారు. జ్యోతిష శాస్త్ర రీత్యా శుక్రుడు శుభుడే అయినప్పటికీ, రాక్షసగురువు కాబట్టి ప్రొద్దున్నే అతన్ని చూడకూడదని, శుక్రుడున్న దిక్కులో ప్రయాణం మొదలు పెట్టేవాళ్ళు కాదు. చుక్క(శుక్రుడు) ఎదురైతే పనులు చెడతాయని ఒక నమ్మకం! అనుకున్నది అవక పోతే, చుక్క వాలిందనీ, చుక్క ఎదురయ్యిందనీ అంటారు. ఇక్కడ నంది తిమ్మన "పుంశ్చలీ సమితికి జుక్కవాలు" అన్నాడు. పుంశ్చలీ సమితి అంటే వేశ్యల గుంపు. రోడ్డు పక్కనే చీకట్లో ఏ చెట్టుకిందో తమ వృత్తిని పూర్తి చేసుకునే వేశ్యలకు చీకట్లోనే బేరా లెక్కువ. చంద్రుడు ఇంత వెలుగు లీను తుంటే బేరాలకు చుక్కవాల్తుంది కదా! అందుకని చంద్రుడు 'వేశ్యలకు చుక్కవాలు'!

**తొలగు బావ:** నంది తిమ్మన క్రియారూపాన్ని నామవాచకం చేసిన మరో గొప్ప ప్రయోగం ఇది: ఉమ్మడి కుటుంబవ్యవస్థలో కొత్తకోడలు తన భర్తకు అన్న అయిన బావగారు ఎదురైతే గౌరవంగా తలమీదకు ముసుగు లాగి పక్కకు తొలగి నిలబడుతుంది. అలా తను తొలగే బావగారిని "తొలగుబావ" అన్నాడు తిమ్మన. తానురాగానే నవసారసలక్ష్మి (తామరలశోభ) తొలగుతోంది కాబట్టి, చంద్రుడు తొలగుబావ అయ్యాడు.

**గుండెతల్లడం:** తిమ్మనగారు చంద్రుడికి పెట్టిన మరోపేరు 'గుండెతల్లడం'. చంద్రుడొచ్చాడంటే సూర్యుడు అస్తమించినట్టే! చీకటైతే కోకం(చకోరపక్షులు)లకు కళ్ళు కనిపించవు. అందుకని చీకటంటే వాటి గుండె తల్లడిల్లిపోతుంది కాబట్టి, కోకాలకు చీకటిచ్చే చంద్రుణ్ణి "గుండె తల్లడి" అనిపిలుస్తాడు.

దేనికైనా ఒక మంచి పేరు పెట్టాలంటే పండితులు సాధారణంగా సంస్కృతంలోకి వెడతారు. ఫ్లై ఓవర్'ని ఊర్ధ్వవారథి అనాలని చూస్తారు. కానీ, పరమ పామరుణ్ణి దేని మీద నుండి వచ్చావని అడిగితే 'పైవంతెన' మీంచి అని అలవోకగా అనేస్తాడు. కొత్త అంశాలకు పేర్లను తెలుగులోనే పెట్టటానికి ప్రయత్నించటం ఒక విజ్ఞత. అవసరం అయితే, క్రియారూపాన్ని ఇలా నంది తిమ్మనలాగా నామవాచకం చేసైనా సరే తెలుగులోనే పేరు పెట్టాలనేది ఈ పద్య సందేశం. తెలుగు చంద్రుడికి బోనపుట్టిక, జోడుకోడె, వేరువిత్తు, చక్కిలిగింత చుక్కవాలు, తొలగుబావ ఇవన్నీ ఆయన పెట్టి అచ్చ తెలుగు పేర్లు ☆

# తెలుగు దీపాలు

**జగతీజ్యోతులు కాగడాలు బలుబంజాయిలు మోబత్తులున్**
**బగలొత్తుల్ దివిటీలు( దిర్వశిఖలుం బంజుల్ మహాజ్యోతులున్**
**దగ సూర్యప్రభ లామలాయులును జంద్రజ్యోతులున్ మైనపున్**
**జిగటాల్ నిచ్చెనపంజు లారతులు నగ్ని జ్యోతులున్ వెల్గగన్**

అయ్యలరాజు నారాయణామాత్యుడు 'హంసవింశతి' కావ్యంలో తెలుగులో ఎన్ని రకాల దీపాలున్నాయో ఈ పద్యంలో చెప్పాడు. క్రీ.శ.1660 ప్రాంతాలలో కడపజిల్లా ఒంటిమిట్ట ప్రాంతం వాడని ఈ కవి గురించి చెప్తారు. 16 - 17 శతాబ్దాల నాటి ఆంధ్రప్రాంత సామాజిక వ్యవస్థను ఈ కావ్యం ఒక విజ్ఞాన సర్వస్వం లాగా వివరిస్తుంది. ప్రతీ పద్యంలోనూ, ప్రతీ పదంలోనూ తన సమాజాన్ని ప్రతిబింబింప చేయాలని ఐదు వందల యేళ్ళనాడే ఒక కవి తాపత్రయ పడ్డాడంటే అది గొప్ప విషయమే!

తెలుగుని ఓ పెద్దాయన 'దిక్కుమాలినభాష' అన్నాడు. తూర్పు పశ్చిమం లాంటి దిక్కులకు తెలుగులో పదాల్లేవు కదా... అందుకని..." అని వివరణ ఇచ్చాడాయన. దిక్కులకే కాదు, అన్నానికి, పుస్తకానికీ, ఆఖరికి రోజూ వెలిగించే దీపానికి కూడా తెలుగులో సమానమైన పదాల్లేవు. లేవంటే లేవని కాదు, జనం నాలుకల మీంచి పక్కకు తప్పుకుని వ్యాప్తిలో లేకుండా పోయాయి. రోలు, కుంది, రోకలి, ఊక, తవుడు లాంటి పేర్లు ఇప్పటి తరానికి తెలిస్తేనే ఆశ్చర్యం. యువతలో చల్లకవ్వం చూసిన వాళ్ళు ఎంతమంది ఉంటారు? భాష నశిస్తుందంటే వాడకంలో లేకపోతే జరిగేది అదే! చెవులు శుభ్రం చేసుకోవటం కోసం దూది చుట్టిన పుల్లని (ear bud) తెలుగులో 'తిరి' అంటారు. చంటి బిడ్డలకు స్నానం చేయించి ఒళ్ళు తుడిచాక ముక్కుల్నీ చెవుల్నీ 'తిరి' పెట్టి శుభ్రం చేస్తారు. ఇంత చక్కని పేరు వదిలేసుకోవటం దౌర్భాగ్యం కాదా?

ఈ పద్యంలో అయ్యలరాజు నారాయణామాత్యుడు తన కాలం నాటికి ఎన్ని రకాల దీపాలు ఉన్నాయో చెప్పాడు.

**జగతీజ్యోతి:** ఆరంజోతి (అరుంధతీ నక్షత్రం) లాంటి పదం కావచ్చు. కాగడా: దీన్ని 'చేదివ్వె', 'చేవెలుగు', 'దుందుము' ఇలా పిలిచేవాళ్ళు. **పంజాయి:** 'పంజాయి' (లేక పంజు) అంటే, నేరుగా ఒక కట్టెపుల్లని వెలిగించి వెలుగు చూపేది. అగ్గిపుల్లని అందంగా 'పంజు' అని పిలవచ్చన్నమాట! **మోబత్తు:** ఇది ఈ నాటి కొవ్వొత్తి.

మరాఠీలో ఇదే పేరుతో పిలుస్తారు. **పగలొత్తు:** పగలు వత్తి(పగలొత్తు) అంటే 'మతాబు'లని 'ఆంధ్రదీపిక' నిఘంటువులో ఉంది. **దివిటీ:** కాగడా లాంటిదే 'దివటీ'(దివిటీ)కూడా! దివిటీకీ, కాగడాకూ, పంజాయీకి మౌలికమైన తేడాలున్నాయి. ఇనుప సలాక(రాడ్డు)కి గుడ్డలు చుట్టి నూనెతో తడిపి వెలిగిస్తే అది దివిటీ. చెక్క లేదా కట్టెకు గుడ్డలు చుట్టి వెలిగిస్తే అది కాగడా! కట్టెనే నేరుగా వెలిగిస్తే అది పంజాయి.

**తిర్వంఘు:** తిర్వంఘు, తిర్వలిక, తిర్లిక ఈ పేర్లన్నీ నిఘంటువుల్లో దీపం అనే అర్థాన్నే ఇస్తున్నాయి. తమిళంలో దీపాన్ని 'విళక్కు' అంటారు. దేముడి దగ్గర దీపారాధన చేసిన చిన్న దీపాన్ని 'తిరువిళక్కు' అంటారు. దీన్ని 'తిర్వంగ', 'త్రిల్లిక' అని తెలుగులో పిలిచే వాళ్ళు

బంజు, సూర్యప్రభ, చంద్రజ్యోతి, లాంటి దీపాలు కూడా ఉండేవి. మహాజ్యోతి అంటే అఖండ జ్యోతి లాంటిది. దగదగమని వెలిగే దీపం. అగ్నిమణి లాంటిది కావచ్చు. ఆమలాయి అనే దీపం ఉన్నదట. అది ఎలా ఉంటుందో తెలియదు.కజ్జల ధ్వజము, గృహమణి, దశాకర్షము, దిబ్బెము(దివ్వె), దోషాతిలకము, దోషాస్యము, ద్యోత్రము, నయనోత్సవం, నివాం, తిరువడి, శీతపంచకము, శీతరమ్యము, స్నేహప్రియము, స్నేహాశయము లాంటి సంస్కృతం పేర్లు కూడా ఉన్నాయి.

దీపం పుచ్చుకుని దారి చూపించే వాణ్ణి 'దీవెలవా'డంటారు. దీపంలో వేసే వత్తిని దీపవల్లి అని పిలుస్తారు. పూర్వకాలపు ఇళ్లలో దీపం పెట్టేందుకు గుమ్మం పక్కనే గూళ్ళు ఉండేవి. దీపపు గూడుని 'దీగూడు', 'దివ్వెసుడి' అనేవాళ్ళు. పెరుమాళ్ల తిరుణాళ్ళ సమయంలో ఉపయోగించే దీపస్తంభాన్ని తిరువడికోల, దీపవృక్షం, దీపపు సెమ్మె ఇలా పిలుస్తారు. దీప నిర్వాణ గంధము అంటే దీపం ఆరేటప్పటి వాసన! దీన్నే 'కాటుపోయింది, కాటువాసన' అంటారు. నూనె అయిపోయింది, గమనించాలని చెప్పటానికి ఈ మాట ని వాడుతుంటారు.

'ప్రమిద' కు నూనెచిప్ప, సానిక. మల్లం, మటి (ట్టి) కంచం లాంటి పేర్లున్నాయి. నిజానికి ప్రమిద కన్నా 'మట్టికంచం' అనటంలో జాతీయత ఇమిడి ఉంది. భావం, స్వభావం రెండూ కనిపిస్తాయి. ఇలాంటి సోకైన నుడుల్ని వాడకంలో పెడితే భాష బలంగా ఉంటుంది. 'భాషల ఆకాశంలో ప్రతి పదమూ ఒక నక్షత్రమే' అని యునెస్కో ఇచ్చిన నినాదం ఒక ఊపుగా మనం ఈ బరువుని తలకెత్తుకోవాలి. ప్రతి మాటనీ అచ్చుతెలుగులో అనాలనుకుంటే మనకు పదాలు లేక కాదు. మన పాత సాహిత్యం లోంచి ఇలాంటి పదాలను వెదికి పట్టుకోగలగాలి. ✯

# తెలుగు విద్యార్థి

**తనయందు నఖిల భూతములందు నొకభంగి/సమహితత్వంబున జరుగువా(డు**
**పెద్దల బొడగన్న భృత్యుని కైవడి( జేరి నమస్కృతుల్ సేయువా(డు**
**కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన/మాతృభావన సేసి మరలువా(డు**
**తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను/దీనుల( గా(న జింతించువా(డు**
**సములయడ సోదర స్థితి జరుపువాడు/దైవతములంచు గురువుల( దలచువా(డు**
**లీలలందును బొంకులు లేనివా(డు/లలితమర్యాదు(డైన ప్రహ్లాదు(డధిప**

మనకు గుణనిధి లాంటి పరమ 'పండితపుత్రులు' వేల సంఖ్యలో ఉన్నారు. కానీ ప్రహ్లాదుడి లాంటి రాక్షసపుత్రులు అరుదు. 'పండితపుత్ర' అనేది నీచవాచకం అయినప్పుడు 'రాక్షసపుత్ర' అనేది ఉత్తమ గుణవత్తర శబ్దం కావాలి కదా! కానీ, మన పాఠశాలలు ప్రహ్లాదుణ్ణి దృష్టిలో పెట్టుకుని, తమ విద్యార్థుల్ని 'నాయనలారా! రాక్షసపుత్రులారా!' అని పిలవ లేరు కదా !

"తన పట్ల అఖిల జీవరాశుల పట్ల ఒకే తీరులో ఉంటాడు. పెద్దల దగ్గరకు వెళ్ళినప్పుడు కట్టుబానిస లాగా వంగి దణ్ణాలు పెట్టి గౌరవిస్తాడు. నదురుగా ఉన్న అమ్మాయి కనిపిస్తే, మా అమ్మలా ఉందనుకుంటూ, అటుతిరిగి వెళ్ళి పోతాడు. దీనుల్నీ, హీనుల్నీ తలిదండ్రుల మాదిరి ధర్మవత్సలతతో సాకుతాడు. స్నేహితుల్ని సోదరుల్లా, గురువుల్ని దేవుడిలా భావిస్తాడు. సరదాక్కూడా అబద్ధాలాడడు. అమిత 'లలిత మర్యాదు'డితడు" అని ప్రహ్లాదుణ్ణి ఈ పద్యంలో పోతనగారు వర్ణిస్తాడు. స్కూలు వదిలి వెళ్ళేప్పుడు కాండక్టు సర్టిఫికేటు మీద పోతనగారు చెప్పిన ఈ తెలుగువిద్యార్థి లక్షణాలన్నీ ఆ విద్యార్థికి ఎంతంత ఉన్నాయో ధృవీకరించే పద్ధతి ఉంటే విద్యార్థుల్లో సమాజ అనుకూల భావాలను పెంపొందింప చేయటానికి వీలౌతుంది. అలాంటి లక్షణాలున్న వాణ్ణి గుర్తించి, ఉత్తమ విద్యార్థి పురస్కారం ఇవ్వాలి. రాక్షసపుత్రుడి ఘనత ఇది!

హిరణ్యకశ్యపుడనే రాక్షస ప్రభువు విద్యావ్యవస్థకు ఇచ్చినంత గౌరవాన్ని రాక్షసేతర దైవసమానులైన ప్రభువు లెవరూ ఇచ్చినట్టు మన పురాణాల్లో కనిపించదు. అంతటి రాక్షసుడు "ఏయ్! పంతులూ! ఇంటికొచ్చి మా అబ్బాయికి పాఠాలు చెప్పు" అనలేదు. సామాన్యుడి లాగానే తన కొడుకుని అడవిలో ఉన్న మామూలు గవర్నమెంటు స్కూలుకే పంపాడు. చెప్పిన మాట వినక పోతే 'రాజుగారి బిడ్డ అని చూడకుండా దండించ' మన్నాడు. వీపు వాయకొట్టి మరీ చదువు చెప్పాలన్నాడు. అవసరమైతే తన మనుషుల్ని కూడా పంపించి దండించేందుకు ప్రయత్నించాడు. మన తల్లి దండ్రులు తమ పిల్లలకు రెండు మొట్టికాయలు మొట్టి చదువు

చెప్పించటానికి సిద్ధంగా ఉన్నారా? అలసట కలగకుండా ఏ.సీ. స్కూళ్ళలో పరమ సుకుమారంగా, కష్టం అనేది తెలియకుండా, పల్లెత్తు మాట పడ నీయకుండా చదివించే తల్లిదండ్రుల కన్నా రాక్షసుడైనా సరే, హిరణ్యకశ్యపుడే గొప్పవాడు! ఇది హిరణ్యకశ్యపుడనే నాణానికి ఒక పార్శ్వం.

శ్రీ రాముణ్ణి వాల్మీకి 'మర్యాదాపురుషోత్తము'డంటే, ప్రహ్లాదుణ్ణి పోతనగారు 'లలితమర్యాదు'డనీ పిలిచారు. అంతటి లలిత మర్యాదుడే తండ్రి మీద తిరగబడ్డాడు. తండ్రి మీద అనటం కన్నా ప్రభుత్వం మీద తిరుగుబాటుగా దాన్ని భావించాలి. చదువుల్ని గౌరవించిన హిరణ్యకశ్యపుడు ఆ చదువుల్లో ఇతర దేవుళ్ల మీద విషం ఎక్కించాలని ప్రయత్నించాడు. అధికారం ఉందని, సిలబస్సు మార్చి పారేసి, తన ఘనతని పిల్లలకు బోధించమని ఆదేశించాడు. ఇది హిరణ్యకశ్యపుడనే నాణానికి రెండో పార్శ్వం.

స్వాతంత్ర్యం వచ్చాక నెహ్రూ కుటుంబం గురించి పాఠ్యాంశాల్లో ఊదర కొట్టిన అభినవ హిరణ్యకశ్యపులు ఈ దేశాన్ని యాభై ఏళ్ళకు పైబడి పాలించిన సంగతి మరిచిపోకూడదు. వాళ్ల తరువాత అధికారంలో కొచ్చిన వాళ్ళు కూడా తమ పార్టీ పెద్దల బయోడేటాలను పిల్లలతో భట్టీయం పట్టించాలని కోరుకుంటున్నారు. తెలుగు ప్రభువులు తక్కువేమీ తినలేదు. ఒక ప్రాంతంలో పుట్టినవాళ్లంతా చెడ్డవాళ్లనీ, మన ప్రాంతం వాళ్ళే మహానుభావులనీ పాఠ్యాంశాల్లో రాయిస్తున్నారు. మనోళ్ళవీ మన ఆశ్రితులవీ రచనలు తెచ్చి పాఠ్యాంశాలుగా పెట్టిస్తున్నారు. ఈ నవీన హిరణ్యకశ్యపుల గురించి మాట్లాడ లేకపోతే మనం పండితపుత్రులుగానే మిగిలిపోతాం.

ప్రభువులు స్వీయ ప్రచారం కోసం, రాజకీయ లబ్ధికోసం పాఠ్యాంశాలతో ఇలా చెరలాడి చదువుల్ని అబద్ధాలతోనూ సంకుచితత్వంతోనూ నింపి ఎల్లకాలమూ పబ్బం గడుపుకోగలుగుతా మనుకోవటం పెద్దభ్రమ. 'తెలుగువిద్యార్థి' కూడా ఒకరోజున ప్రహ్లాదుడిలా ప్రభుత్వాల మీద తిరగబడే ప్రమాదం ఉంది. పిల్లల బుర్రల్లోకి విద్వేషం ఎక్కించాలనుకున్న హిరణ్యకశ్యపుడికి జరిగిన భంగపాటే చివరికి నేటి ప్రభువులకూ తప్పదనేది ప్రహ్లాదోపాఖ్యానం చెప్తున్న నీతి!

చదువులు కుల, మత, ప్రాంతాల కతీతంగా ఉండాలి. నన్నయాదుల్ని ప్రాంతీయతా చట్రంలో బిగించాలను కోవటం కన్నా హిరణ్యకాశ్యపేయం ఇంకొకటుండదు! నిజానిజాలను గ్రహించగలిగే విజ్ఞతని చదువు కలిగించాలి! మనం చదువుకుంటున్నది అందుకే! ☆

# తెలుగు భాషకు తిరుక్షౌరం

**" తిరుకట్టె సేవ జేసెద తిరుమాంహ నలికి పూసి తీర్చెద ముగ్గుల్**
**తిరుమంజనంబు దీర్చెద తిరుపుట్టములుతికి వేగ దెచ్చెద దినమున్"**

తెలుగు వైష్ణవులకు తమిళం దైవభాష. వీళ్ళలో చాలా మంది తెలుగువారే, తమిళ ప్రాంతాల్లో నివసించి, తాతల కాలంలోనే తెలుగు నేలకు వలస వచ్చిన తెలుగు వాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళు ఇళ్ళలో తమిళం మాట్లాడటం, తమిళుల్లాగే ప్రవర్తించటం, తెలుగు విషయాలను తమిళీకరించటానికి ఎక్కువ మొగ్గు చూపటం ఈ పద్య భాగంలో కనిపిస్తుంది.

ఇలాగే, వీర శైవులున్నూ కన్నడం తమకు దైవభాషగా భావించిన సందర్భాలు కూడా కనిపిస్తాయి. శివుడు కన్నడం వాడూ కాదు, విష్ణువు తమిళుడూ కాదు. కన్నడ బసవడూ, తమిళ రామానుజుడూ కలిగించిన ప్రభావాల పుణ్యం అది. తమిళ శైవుల కన్నా తమిళ వైష్ణవుల పలుకుబడి తెలుగు మీద ఎక్కువ. వీళ్ళు తెలుగు పదాలకు ముందు 'తిరు' చేర్చి విష్ణుత్వం ఆపాదించటం గొప్ప విషయమే కానీ, తమిళీకరించే పనిగా అది పరిణమించటమే బాధాకరం.

**తిరుకట్టె సేవ జేసెద:** కట్ట అంటే చీపురు కట్ట. దాన్ని తిరుకట్ట - గుడి ఊడ్చే చీపురు కట్ట అనడం వలన దానికి పవిత్రత వచ్చింది. కానీ అందులోంచి తెలుగుదనం ఊడ్చుకుపోయి, అది తమిళ పదంగా మారిపోయింది.

**తిరుమాంహ నలికి పూసి తీర్చెద ముగ్గులు:** మాంగ అంటే ఇంటిలో ఒక భాగం. తిరుమాంగ/తిరుమాళ్ళ/ తిరుమాంహ/ తిరుమాంఘ అంటే గుడి పూజారి లేదా మతగురువు నివాసం. తిరుమాంగ సేవ అంటే వైష్ణవ గురువు ఇంటిని అలికి ముగ్గులు పెట్టే సేవ ఇది. దాన్ని తెలుగు వైష్ణవులు తమిళంలోనే చెప్పాలా?

**తిరుమంజనంబు దీర్చెద:** మజ్జనం అంటే నీళ్ళలో మునిగి చేసే స్నానం. తిరుమంజనం అంటే పవిత్రమైన కోనేరులో స్నానం. కోనేటిని 'తీర్థకూలం' అన్నారు. సంస్కృతంలో తీర్థం అంటే దేవుడి నీళ్ళు అని. కూలం అన్నా దేవుడి నీళ్ళే! తీర్థకూలం అనటం ద్వారా తమిళీకరించే ప్రయత్నం స్పష్టమౌతోంది. కూలం/కొలం/కూలం/ కొలను ఈ పదాలన్నీ నీటికి సంబంధించినవే! ఆంధ్ర మహావిష్ణువు స్థావరమైన 'శ్రీకాకుళం'లో కాకుళం అంటే 'కా' నల్లని, 'కుళం' నది... కృష్ణానది అని అర్థం.

తిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద: పుట్టమువబట్ట. తిరుపుట్టముప దేవుడికి కట్టిన వస్త్రం. తిరుపావడ. అంటారు.

ఇలా తెలుగులో వ్యవహారంలో ఉన్నమాటల్ని తమిళ పదాలుగా మార్చినవి చాలా ఉన్నాయి. మచ్చుకు కొన్ని:

తిరుతిల్లిక అంటే దేవుడి ముందు వెలిగించిన దీపం. తిరుపాట (భక్తి గీతం), తిరుబాస (దేవుడిమీద ఒట్టు), తిరు కాపు (గుడి తలుపులు) తిరుగిన్నె (దేవుడి గిన్నె), తోమాలె అంటే ఆకులూ పూలూ కూర్చికట్టిన మాల. తోమాలి దేవుడికి వేసే పూదండ. పడిదెం అంటే జుర్రుకుంటూ తాగేదని! దీనికి తిరు చేర్చి తిరుపడిదెం– 'తిరుపడితాము' అన్నారు. తిరుచుట్టు (గుడి ప్రహరీ), తిరు బోనం (నైవేద్యం), తిరునగరు: ధనికుల నగరం, దేవుడి ఊరు. తిరునాడు: వైకుంఠం, ఇలా చాలా మారుడు పదాలు కనిపిస్తాయి.

సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో దీన్ని ప్రస్తావిస్తూ, "భోజనము చేసినప్పుడు 'అన్నము' అనక 'సాదము' అని, 'పరమాన్న'మనక 'తిరుకణామధు' అని, 'భక్ష్యాలు' అనక 'తిరుపణ్యారము' అని, ఈ విధముగా అన్నియు అరవము తోనే అడుగవలెను. లేకున్న వైష్ణవుడు మైల పడిపోవును. ఇది వైష్ణవము తెచ్చి పెట్టిన అరవ దాస్యము" అన్నారు.

ఇందులో దేవుడి పాత్ర, భక్తుల పాత్రా ఏమీలేవు. ఎవ్వరినీ ఇప్పుడు తప్పు పట్టి ప్రయోజనమూ లేదు. కాకపోతే, తెలుగు భాష కొచ్చేసరికి కొప్పుకు ముందు తిరుచేరిస్తే, 'తిరుకొప్పు' అంటే బోడి తల అనీ, క్షవరానికి ముందు తిరు చేరిస్తే, 'తిరుక్షౌరం' (ఉన్నది కాస్తా ఊడటం) అవుతున్నాయి. దేవుడి భక్తికీ భాషకూ ముడిపెట్టి ప్రయోగాలు చేస్తే, అమ్మ భాషాభక్తులు ప్రశ్నించటం సహజమే! ✯

# తెలుగులో సైనిక పదాలు

**"వంకదారులు(జేరి వాకిటి దద్దడం/బులు సెర్చి, కొమ్మల మ్రోకు వైచి,
ప్రాకి లోపలజొచ్చి పలుగాడి దెఱచిన/పంతగార్లకు మున్న, బ్రద్దపరులు
తోన నిచ్చెన లెక్కి లోని కొత్తళములో(/బురణించి చొచ్చిన పోటు మగల
వా(డి మెచ్చక, యాళువరి మీ(ద బాళెల/వారి(దా(కించిన వాసి బిరుదు
లచ్చెరువు నొంద, మేడలు సొచ్చి, యూర్చు
దొద్దకార్లచే(బటి వోయె(దూర్పుదిక్కు్మ
టాల వాటుల, నేటుల, ఊంతు మిగిలి,
తటిమి రచ్చటి బలము(గొందఱు గడంగి"**

14వ శతాబ్ది నాటి నాచన సోమన వ్రాసిన ఉత్తరహరివంశం తృతీయాశ్వాసంలో పద్యం ఇది! యాదవుల కోటమీద నడిరాత్రివేళ పౌండరీకుల దాడి వర్ణన ఇది! కోటను స్వాధీనం చేసుకుని ఊరుని దోచుకున్నారు. తూరుపు పగిలినట్టు భళ్ళున తెల్లవారింది. ఇదీ ఈ పద్యంలో సారాంశం.

ఇందులో మనం మరిచి పోయిన వెయ్యేళ్ళ నాటి గొప్ప తెలుగు పదాలున్నాయి.

**వంకదారలు(జేరి:** మొదట వంకదారల్లోంచి శత్రు సైన్యం కోటను చేరిందట. వంకలంటే వాగుల్లాంటివి. బహుశా కోట లోపలికి నీరు రావటానికి నదిలోంచి వచ్చిన ఒక కాలువ ద్వారా ప్రవేశించారని అర్థం కావచ్చు కానీ, ఇది వంకదారి కాదు, వంకదార. కోట వాకిటి ముందర వంకదారలు అనే అర్థంలో ఇతర కవుల ప్రయోగాలు కూడా ఉన్నాయి. ప్రధాన ద్వారం లోపలి వైపు గడియ వేసి, దిగువ భాగంలో చిన్న ద్వారం వంగి లోపలకు వెళ్ళేలా ఉంటుంది. బహుశా అది వంకదార (wicket) కావచ్చు. శత్రు సైనికులు మూకుమ్మడిగా రాకుండా ఇది కొంతవరకైనా ఆపుతుంది కదా!

**వాకిటి దద్దడంబులు సెర్చి:** వాకిట్లో అంటే కోటకు బయటి భాగంలో దద్దడం లేదా దద్దళం అంటే బోడిమిద్దె. కోట బురుజు. సెర్చి అంటే దాన్ని చెరిచి, ధ్వంసం చేసేశారు.

**కొమ్మల మ్రోకు వైచి ప్రాకి లోపలజొచ్చి:** కొమ్మలంటే కోటమిద్దెల మీద ఉండే దిమ్మలు. వాటికి మోకు విసిరి ఉచ్చు వేసి పైకి ఎగబాకి కోట పైకి చేరారు.

**పలుగాడి దెఱచిన పంతగార్లకు మున్న:** పలుగాడి అనేది చిన్న దర్వాజా లాంటిది. పలుగాడి తలుపులు అంటే, చిన్న ద్వారం లేదా రహస్య ద్వారం తలుపులు. ఇంతకు మునుపు వంకదార లోంచి మోకులేసి పాక్కుంటూ వచ్చి, బురుజు పైన ఈ పలుగాడి తలుపులు తెరిచి పంతగార్లు(శత్రు మూక)ముందుగా కోట నెక్కారట!

**బ్రద్దపరులు తోన నిచ్చెన లెక్కి:** బ్రద్దపరి అంటే ఒక విధమైన పేనుతో చేసిన డాలు. ఇప్పటి రిజర్వ్ పోలీసులు కూడా రాళ్ళ దాడులు జరుగుతున్నప్పుడు

పేనుతో అల్లిన పొడవైన రక్షణకవచాన్ని వాడతారు. ఈ డాలు పుచ్చుకున్న సైనికులు నిచ్చెన లెక్కుతుంటే కోట... పైన ఉన్న సైనికులు రాళ్ళు విసిరి, కోటమీంచి ఎగబ్రాకే వాళ్ల ను అడ్డుకుంటూ ఉంటారు. రాళ్ళు తగలకుండా బ్రద్దపరి అవసరం ఉంటుంది. లోని కొత్తళములో బురణించి చొచ్చిన పోటు మగల వాడి మెచ్చక: కొత్తడం లేదా కొత్తళం అంటే కోట బురుజు మీద నడిచేందుకుండే దారి. పురణించటం అంటే శత్రువు పురోగమించటం, చొచ్చిన అంటే దూసుకొచ్చిన,, పోటుమగలు వీరసైనికులు, వాడి మెచ్చక ఇంత గొప్పగా కోటని ఆక్రమించేందుకు దాడి కొచ్చిన వీరుల్ని లెక్కచేయకుండా,

**యాళువరి మీద బాళెలవారి:** ఆళువరి, ఆలంగం, కొత్తడం ఇవి బురుజుల్లాంటివే! ఒక్కో నిర్మాణానికి, ఒక్కో పేరు ఉండి ఉంటుంది. మన కోటలన్నీ ధ్వంసమైనవే కాబట్టి వాటిని గుర్తించ లేకపోతున్నాం. పాళెలు అంటే, పాలెగార్లు, **తాకించిన వాసి బిరుదు లచ్చెరువు నొంద :-** తాకించిన-యుద్ధంలో చావగొట్టిన, వాసి బిరుదులు గొప్ప పేరున్న యోధులు, అచ్చెరువు నొంద ఆశ్చర్యపడేలాగా **మేడలు సొచ్చి:-** అంటే నగరం లోకి ప్రవేశించి ప్రజల ఇళ్ళ మీదదాడి చేశారు. ఆర్చు- పెద్దగా అరచు, అరిచి హడావిడి చేశారు. **దొడ్డకార్ల చేన్-** దొడ్డకార్లంటే కొల్లగొట్టటానికి వచ్చిన వాళ్ళతో బటి వోయె దూర్పుదిక్కు:- తూర్పుదిక్కు పగిలి పోయిందట (the dawn broke). అంటే సూర్యోదయం అయ్యింది. అప్పటి దాకా అంతా విధ్వంసమే కాబట్టి, చీకటిపోయి వెలుతురు రావటాన్ని తూర్పుదిక్కు పగిలిందంటాడు కవి!

**ఊల వాటుల, నేటుల, అంతు మిగిలి, తటిమి రచ్చుటి బలము(గొందలు గడంగి:-** ఇళ్ళు కూలగొడ్తుంటే తగిలిన దెబ్బలకీ, దాడి చేయటం వలన తగిలిన దెబ్బలకీ జనం గగ్గోలు (అంతు) పెడుతుండగా మిగిలిన యాదవ వీరుల్ని అక్కడినుంచి తరిమేసినప్పుడు భళ్ళున తెల్లవారిందట. ఇక్కడ అంతు అంటే కలకలం. రంతు అంటే రతి సంబంధమైన అని అర్థం. ఖచ్చితమైన అర్థం కావాలంటే 'ఱ (శకట రేఫ-బండి ర) వర్ణం ఉండాల్సిందే! ఇప్పుడు ఆ పదాన్ని మనం వాడకపోయినా ఒకప్పుడు వాడిన దాన్ని చదవటానికైనా వర్ణం ఉండాలి కదా!

ఈ మొత్తం పద్యంలో వంకదార, దద్దడం, పలుగాడి, బ్రద్దపరి, ఆళువరి, ఆలంగం, కొత్తడం, పంతగారు ఈ పదాలన్నీ మిలటరీ సాంకేతిక పదాలు. మనం మరిచి పోయినవి. యుద్ధానికి, కోటలకోసం యుద్ధపదాలు ఇన్ని తెలుగు పదాలున్నాయంటే లోతుగా అధ్యయనం చేస్తే ఎన్ని దొరుకుతాయో కదా! "యాళువరిమీద పాళెలు" లాంటివి చక్కని పదాల కూర్పు. పాలెగార్లు రెడ్డిరాజుల కాలంలోనే ఉన్నారని కూడా అర్థం అవుతోంది. ✯

# తొలి తిట్టుకవిత

**"మా నిషాద ప్రతిష్ఠాం త్వ, మగమశ్శాశ్వతీ స్సమాః**
**యత్క్రౌంచ మిథునా దేక, మవధీః కామమోహితం"**

'కొట్టు', 'చంపు' అని రాస్తే విప్లవకవిత్వం అని నిషేధించాలని చూస్తారు. గట్టిగా తిరగబడి తిడితే, తిట్టుకవిత్వం అంటారు. కానీ, భారతీయ సాహిత్యానికి ఆదికావ్యం రామాయణాన్ని వాల్మీకి కవికోకిల ఇలా ఒక తిట్టుతోనే ప్రారంభించాడు. మామూలుగా తిట్టలేదు. అనేక అర్థాలు వచ్చేలా తిట్టాడు. కాబట్టి, యాదాలాపంగా కాక, బాగా ఆలోచించి తిట్టినట్టే లెక్క! తిట్టాలనే తిట్టాడన్నమాట!

కాళిదాస మహాకవి ఈ శ్లోకం గురించి వ్యాఖ్యానిస్తూ, 'శోకం లోంచే శ్లోకం' పుట్టింది అన్నాడు. ఎవరినైనా ఎవరైనా తిట్టారంటే మనసులో కలిగిన బాధ (శోకం) వలనే అలా తిడతారు. బాధపడేవాడి పక్షం వహించిన ఏ కవి అయినా, బాధ పెట్టిన విషయాన్ని తన కవితలో తిట్టి తీర్తాడు. వాల్మీకి ఆ పనేచేశాడు. ఆయనకు ఎవరి మీద కోపం వచ్చింది ...? ఏమని తిట్టాడు...?

"వేటగాడా! ఆ పక్షి జంట అనురాగంతో ఆదమరచి ఉన్న అదను చూసి బాణం వేశావు. ఆ జంటలో ఒకటి నేలకూలింది. ఇంత అప్రదిష్ట మూటగట్టుకున్నావు.. నువ్వు ఇలానే త్వరలోనే చస్తావ్!" అనేది ఈశ్లోకం లోని తిట్టు సారాంశం. ఇక్కడ పక్షిని కొట్టిన వేటగాణ్ణి తిట్టినట్టు మనకి కనిపిస్తోంది.

ఇక్కడే మౌలికమైన ఒక ప్రశ్న అడగాలి. 'అసలు ఈ తిట్టుకీ, తాను ప్రారంభించ బోయే రామాయణానికీ సంబంధం ఏమిటీ...?' వాల్మీకి నోట వెలువడిన ఈ ప్రథమ శ్లోకానికీ రామాయణ కథా క్రమానికీ అన్వయం ఏమీ కుదరకపోతే ఇది వ్యర్థ కవిత్వమే అవుతుంది.

'తుపాకీ గోడకు వ్రేలాడి ఉన్నట్టు రాస్తే, కథ పూర్తయ్యేలోపు ఆ తుపాకీ పేలాలి' అనే సూక్తి వాల్మీకి కవితకూ వర్తిస్తుంది. ఉత్తినే అలా తిట్టేసి వదిలేసి ఉంటే, ఇన్ని శతాబ్దాల తర్వాత కూడా వాల్మీకి గురించి మనం గొప్పగా అనుకోవాల్సిందేమీ ఉండేది కాదు. మరో కోణంలోంచి పరిశీలిస్తే తిట్టినట్టు కనిపిస్తూనే, పొగిడేదిగా కూడా ఈ కవిత కనిపిస్తుంది. ఎవర్ని పొగుడుత్తున్నాడు...? కామమోహితుణ్ణి పట్టి కొట్టిన వాణ్ణి- అలా కొట్టినందుకు పొగుడుత్తున్నాడు!

రామాయణంలో రాముడి చేతుల్లో చచ్చిన వాళ్ళంతా కామమోహితులే! తమ్ముడి భార్యని ఎత్తుకెళ్ళిన వాలిని, సాక్షాత్తూ తనభార్యని ఎత్తుకెళ్ళిన రావణుణ్ణి

ఇంకా అతి కాముకత్వంతో వ్యవహరించిన వాళ్ళని శిక్షించటమే రామాయణ ప్రయోజనం! అలా చేయటం వలన అది రాముడికి శాశ్వతంగా నిలిచిపోయే ప్రతిష్ఠ నిచ్చిందే కానీ, ఎలాంటి పాపాన్నీ అంటగట్టలేదు.

రాముడు తన తండ్రిలాగా అనేక పెళ్ళిళ్ళు చేసుకుని వున్నట్లైతే ఇంకొకడి బహు భార్యాత్వాన్ని ప్రశ్నించే నైతిక హక్కు ఆయన కుండేది కాదు! అందుకని కామమోహితమైన పక్షిని కొట్టే కథతో రామాయణాన్ని ప్రారంభించి ఏకపత్నీ వ్రతాన్ని ప్రబోధించనున్నట్టు వాల్మీకి ఈ శ్లోకం ద్వారా ఒక సూచన చేశాడన్నమాట. ఏకపత్నీ వ్రతులకు శాశ్వత కీర్తి లభిస్తుందనేది ఇందులో ప్రబోధం.

**"కామంతో కావరమెక్కిన వాణ్ణి కొట్టి లోకంలో కీర్తిని గెలిచావు... వేటగాడా! వర్థిల్లు"** అనేది ఈ తొలి తిట్టుకవితలోని అన్వయార్థం! చెట్టు చాటు నుండి వాలిని కొట్టిన సమయంలో 'జంతువుని చెట్టు కొట్టటం వేటగాడి ధర్మమే' నంటూ తనని వేటగాడిగానే సంభావించుకుంటాడు. రాముడు. కాబట్టి పిట్టని కొట్టిన వేటగాణ్ణి వాల్మీకి అసహ్యించుకున్నాడనటం సరికాదు.

'కవిత్వం అనేది దుష్టుడి దౌష్ట్యాన్ని ఎత్తి చూపించటంలో ఉంటుంది గానీ, రాముడి ఔన్నత్యాన్ని ఊరికే పొగడటంలో ఉండదు' అని వాల్మీకి నమ్మినట్టు దీన్ని బట్టి అర్థం అవుతోంది. 'విమర్శలో పరామర్శ'ని చొప్పించగలవాడే మహాకవి! వాడిన ప్రతిపదమూ లోతైన భావాల్ని పాఠకుడిలో రగిలించ గలిగినప్పుడు ఆ కవిత పది కాలాల పాటు మన గలుగుతుంది.

అతికాముకతను మగతనంగాను, బహుభార్యాత్వాన్ని హీరోయిజంగాను తెలుగు సినిమాల్లో చూపిస్తుంటే, ఏ వేటగాడూ మాట్లాడక పోవడం వింత.

ప్రేమించటం అంటే రతి భంగిమలను ప్రదర్శించడం నేటి కాముకనీతి.

ఏ భాషలోనూ లేనన్ని కాలేజీ ప్రేమకథలు తెలుగు సినిమాల్లో వస్తున్నాయి. పిల్లల్ని దారిలో పెట్టాలనుకునే తల్లిదండ్రుల్ని నేరస్థులుగాను, గురువులను కేతిగాళ్ళగానూ చూపిస్తున్నారు. ఫలానా విశ్వవిద్యాలయాన్ని ఊడిస్తే నిరోధులే తప్ప ఇంకేమి దొరకవని మొన్న ఒక కేంద్రమంత్రిగారు అన్నారు.

కామంతో కావరమెక్కిన వాళ్ళని కావరమెక్కించే వాళ్ళని కొట్టి లోకంలో కీర్తి గెలుచుకో ! వేటగాడా ! ☆

# లోకనాయకులు

**రాగలదోయి! ధర్మసమరం బిది భారత జాతిముక్తికై**
**సాగినదోయి దాస్యమునజచ్చియు జావనివారలందఱున్**
**ద్యాగము శాంతి సత్యమును దప్పని యస్త్రములై, జగజ్జయ**
**శ్రీ గురియింప సంగరముసేయుచు, ద్రోయుడు మాతృ దుఃఖమున్**

(మహాత్మకథ: తుమ్మలసీతారామమూర్తిచౌదరి)

గాంధీజీ సహాయనిరాకరణోద్యమానికి పిలుపిచ్చాడు. దేశప్రజలు ఈ ఉద్యమం లో ఎలాపాల్గోవాలో, కర్తవ్యబోధచేశాడు. ఆ సందర్భంలో పద్యం ఇది. తుమ్మల సీతారామమూర్తి చౌదరి వ్రాసిన 'మహాత్మకథ' కావ్యంలోది ఈ పద్యం.

'తెలుగు లెంక', అభినవ తిక్కనగా 'గాంధీ ఆస్థానకవి' ప్రసిద్ధులైన తుమ్మల సీతారామమూర్తి (డిసెంబరు 25, 1901 - మార్చి 21, 1990) తెలుగుదనం మూర్తీభవించిన జాతీయోద్యమ కవి. గాంధీదర్శనాన్ని, దేశభక్తిని, తెలుగు ప్రశస్తిని లోకానికి చాటుతూ శతాధిక గ్రంథాలు వ్రాశారు. బాపూజీ ఆత్మకథ, 'మహాత్మకథ' వ్రాశారు.

అభినవ తిక్కన బిరుదుని ప్రశ్నిస్తూ, మీ పద్యాల్లో అత్యుత్తమ మైంది, తిక్కన పద్యాల్లో పరమ చెత్తగా ఉన్నదీ ఏరి, దానికన్నా మీ ఉత్తమ పద్యం ఎలా గొప్పదో చెప్పాలని సభలో అడిగాడట ఓఆగంతకుడు. "నన్ను అభినవ తిక్కన అని వాళ్ళూ వీళ్ళూ అంటూంటే ఊరుకోవడం పొరబాటని ఇప్పుడు తెలిసింది. ఈ సభాముఖంగా నేను ఆ బిరుదు వదిలేస్తున్నాను. తెలుగు లెంకగానూ, మహాత్ముని ఆస్థానకవిగానూ పిలిపించు కోవటానికి అర్హతనిలబెట్టు కుంటాను" అన్నారట ఆయన. గాంధేయ వాదాన్ని మనసా వాచా కర్మణా నమ్మిన వ్యక్తి తుమ్మలవారు.

గాంధీసహాయ నిరాకరణ ఉద్యమంలోకి రావలసిందిగ దేశప్రజలందరికీ పిలుపునిచ్చాడు. ప్రభుత్వానికి ఏవిధంగానూ సహకరించకుండా ఉండటం ఆ ఉద్యమం. "ఓ భారతీయులారా! ధర్మయుద్ధం రాబోతోంది. భరతజాతి దాస్యవిముక్తి కోసం జరిపే ధర్మయుద్ధం ఇది. బానిసల్లా, జీవచ్ఛవాల్లా బతుకుతున్న దేశీయులంతా త్యాగం, శాంతి, సత్యం సూత్రాలను విధిగా పాటిస్తూ పోరాట దీక్ష తీసుకోవాలి. ఇవే ఆంగ్లేయులను తరిమేసే ఆయుధాలు మనకి. గెలుపు స్వంతం చేసుకోవటం కొసం పోరాడండి. భరతమాత శోకాన్ని తొలగించండి" అని గాంధీ పిలుపునిచ్చినట్టు తుమ్మలవారు వర్ణిస్తారు. త్యాగం, శాంతి, సత్యం ఆయుధాలుగా చేసుకోగలిగాడు కాబట్టే, ప్రపంచంలో విముక్తి పోరాటాలకు గాంధీమార్గం ఆదర్శం అయ్యింది.

స్వాతంత్ర్యం తరువాత పుట్టిన వారికి లేదా పెరిగిన వారికి స్వాతంత్ర్యోద్యమం నాటి అనుభూతులను అనుభవించే అదృష్టం లేదు. ఆనాడు ఏకనాయకత్వాన్ని ఆమోదించి దేశీయులంతా గాంధీ వెంట నడవటానికి, ఈరోజున అలాంటి ఏకనాయకత్వం లేకపోవటానికీ కారణాలను మనం పరిశీలించవలసిందే! ఒక రంగంలో కాకపోతే మరొక రంగంలో నైనా ప్రజలను సామూహికంగా నడిపించ గలిగే ప్రతిభావంతుడి కోసం జనం ఎదురు చూస్తోన్నారు.

నిజానికి స్వాతంత్ర్యోద్యమ దీప్తి రేకెత్తించి, ప్రజల్లో స్వాతంత్ర కాంక్ష కసిగా రగిలేలా చేసినవాడు లోకమాన్య బాలగంగాధర తిలక్. బ్రిటిష్ వారితో కన్నా కాంగ్రెస్ వారి తోనే ఆయన ఎక్కువ పోరాడవలసి వచ్చింది. తిలక్ చరమాంకంలో గాంధీ రంగం దేశరాజకీయ మీదకువచ్చారు. భగవద్గీతను అమూలాగ్రం శోధించిన తిలక్ మహాశయుడి మాదిరే గాంధీ కూడా సంస్కృత శ్లోకాలను ఉదహరిస్తూ జనాన్ని ఆకట్టుకోవటం మొదలు పెట్టాడు. తనగురువుగా తిలక్‌ని గాంధీ గౌరవించాడు. కానీ, తన త్యాగం, శాంతి, సత్యం సూత్రాలలో శాంతి (అహింస) విషయంలో తిలక్ విబేధించినా గాంధీ అహింసాత్మక పోరాట బాట వదల్లేదు.

తిలక్ అనుభవాలు తిలక్‌వి. 1907 సూరత్ కాంగ్రెస్ సభలో ఎవరో విసిరిన బూటు తిన్నగా వెళ్ళి స్టేజీమీద కూర్చున్న సురేంద్రనాథ్ బెనర్జీకి తగిలింది. అది తిలక్ మాట్లాడుతుండగా జరిగింది. బూటు తిలక్ మీదకు విసిరేరో, సురేంద్రనాథ్ బెనర్జీ మీదకే విసిరేరో తెలీదు. తిలక్ వర్గీయుల్ని వేదిక ఎక్కనీయకుండా చేసిన కుట్రకు బదులుగా తిలక్ వర్గీయులు దుడ్డు కర్రలు పుచ్చుకుని వీరవిహారం చేస్తే గానీ పని జరగలేదు. అహింసావాదాన్ని అందుకే తిలక్ అంగీకరించ లేకపోయాడు. గాంధీ క్రమేణా అతివాదులైన తిలక్ వర్గీయుల్నీ, మితవాదులైనతిలక్ వ్యతిరేక వర్గీయుల్ని తన దారికి తెచ్చుకోవటానికి అహింసనే వాడుకున్నాడు. దేశప్రజలు ఆ తేడాని గుర్తించారు. గాంధీవెంట నడిచారు. తిలక్ మరణించిన తరువాత 1921లో బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో తిలక్ వారసుడిగా, కాంగ్రెస్ నాయకుడిగా గాంధీ ఎంపికయ్యారు.

విజయవాడలో ఇప్పటి గాంధీనగరంగా పిలువబడుతున్న ప్రాంతం ఆ రోజున ఖాళీస్థలం. అక్కడ జరిగిన బహిరంగ సభలో గాంధీ సూచన మీద పింగళి వెంకయ్య రూపొందించిన జాతీయజెండాని ఆవిష్కరించారు. అయితే ఎజెండాలో ఆవిషయాన్ని పెట్టటానికి సమయం లేకపోవటం వలన అధికారికంగా ప్రకటించ లేకపోయారు. స్వాతంత్ర్యానంతరం ఆ జెండానే జాతీయజెండాగా ఆమోదించటం జరిగింది. కానీ, ఆ విషయాన్నీ, దాని రూపకర్త పింగళివెంకయ్య గారి పేరునూ ప్రభుత్వం రికార్డ్ చేయలేదు. చేయక పోవటం వాళ్లతప్పు. వెంటపడి చేయించుకోక పోవటం మనవాళ్ళ తప్పు. "మీరు ఢిల్లీ వచ్చేది ఒకరిమీద ఒకరు చాడీలు చెప్పుకోవటానికేగా?" అని గాంధీ మన నాయకుల్ని ఈసడించాడంటే సిగ్గుపడాల్సింది మనం. తోకనాయకులే తప్ప మనకు లోకనాయకుడు లేని లోటు స్పష్టంగా కనిపిస్తోంది. ✪

# దణ్ణాలు అన్నానికి

"భోజనాని విచిత్రాణి పానాని వివిధాని చ
వాచః శ్రోతానుగామిన్యస్త్వచః స్పర్శసుఖాస్థథా..."

మంచి కట్టు, బొట్టు కలిగిన నవయౌవన స్త్రీ పక్కనుండగా, చక్కని పాటలు, వినసొంపైన మాటలు వింటూ, విచిత్రమైన భోజనాలు,అనేక రకాల వంటకాలు, చిత్రమైన పానీయాలు తీసుకొని, తాంబూలం వేసుకొని, పూవులూ సుగంధ లేపనాదులు మత్తెక్కిస్తుంటే, స్పర్శాసుఖమైన ఆలోచనలతో, మనసుకు ఉత్సాహం ఇచ్చే చేష్టలతో సంతోషంగా ఉన్న ఎవరికయినా లైంగికశక్తి అనేది గుర్రంతో సమానంగా ఉంటుందని సుశ్రుతుడు పేర్కొన్నాడు.

లైంగిక సమర్థత విషయంలో గుర్రానిది పెట్టింది పేరు. గుర్రాన్ని "వాజీ" అంటారు. గుర్రమంత లైంగిక సమర్థత నిచ్చే ద్రవ్యాలను వాజీకరా (aphrodisi-acs) లని పిలుస్తారు. పైన చెప్పిన కమ్మని భోజనాదులన్నీ మంచి వాజీకరాలేనని దీని అర్థం. అన్నం శబ్దానికి పోషించేదీ, ఆయుష్షునిచ్చేది, సంరక్షించేదిలాంటి అర్థాలున్నా, సంసార జీవితాన్ని సుఖమయం చేసేదని రెండువేల యేళ్ళనాటి సుశ్రుతాచార్యుడు అన్నానికి ఇచ్చిన నిర్వచనం గొప్పది.

'భావప్రకాశ' అనే వైద్యగ్రంథంలో "భక్తమన్నం తథాంధస్చ క్వచిత్కూరంచ కీర్తితం" అనే శ్లోకంలో అన్నానికి 'భక్త', 'అంథ', 'ఓదన', 'భిస్సా', 'దీదివి' అనే పేర్లున్నాయనీ, కొన్నిచోట్ల 'కూరం' అని కూడా అంటారనీ ఉంది. అంథ, కూరం శబ్దాలకు అన్నం అనే అర్థమే ఉందని ఈ వైద్యగ్రంథం చెప్తోంది.

ఆప్టే సంస్కృత నిఘంటువులో అన్నం శబ్దానికి ఒక జాతి ప్రజలు, ఆంధ్రులు అనే అర్థాలున్నాయి. ఆంధ్ర భృత్యా: అనే మాటను ఉదహరించి, 'ఆంధ్ర రాజవంశము' అని దానికి అర్థాన్ని చెప్పారు. ఆంధ్ర భృత్యులుగా శాతవాహనులు తమని తాము చెప్పుకొన్నది తాము ఆంధ్రరాజుల మనే అర్థంలోనేనని, ఈ ఆంధ్రులను అన్నం అనే పేరుతో కూడా పిలిచారని ఆప్టే నిఘంటువు వలన తెలుస్తోంది.అలాగే, అంధ అనే పదానికి అన్నం, ఆంధ్రులు అనే అర్థాలు మనకు స్పష్టంగా కనిపిస్తున్నాయి. స్వయంగా ఆంధ్రుల్నే అన్నం పేరుతో పిలిచినట్టు నిఘంటువులే పేర్కొంటున్నాయి. మరణం లేని వారనే అర్థంలో అమృతాంధసులనే పదం కూడా కనిపిస్తుంది. కానీ,

మన పెద్దలు జైన కథల్లోని అంధకుడి వృత్తాంతం తీసుకొని మనల్ని శాపగ్రస్థులుగా చిత్రించారు. పురాణేతిహాస బ్రాహ్మణాలు భాషాజాతి పరంగా మనల్ని బహిష్కృతులుగా చిత్రించాయి. చారిత్రకంగా ఇది మనకు జరిగిన అన్యాయం.

ప్రోటో ఇండో యూరోపియన్ పదరూపాల్లో 'అంధ్' శబ్దానికి మనిషి అనే అర్థమే ఉంది. anthropology అనే మానవ సంబంధ శాస్త్రంలో "అంధ్" అంటే మనిషి. అంతేగానీ గుడ్డి కాదు. అంధ్ అంటే మనిషి. అంధ్ అంటే ఆంధ్రుడు. అంధ్ అంటే, అన్నం. అన్నం అంటే ఆంధ్రుడు. ఆంధ్ర శబ్దం భాషా జాతిగా మొత్తం తెలుగు ప్రజలకు వర్తించే పదం. ఒక్క ఆంధ్రప్రదేశ్ లోనే ప్రజలు ఆహారాన్ని అన్నం అనటం ఉంది.

అన్నం గురించిన విశేషాలు మరికొన్ని ఉన్నాయి. వియత్నాం దేశాన్ని 1945 వరకూ 'అన్నం దేశం' అనీ వియత్నామీయుల్ని అన్నామైట్స్ అనీ పిలిచేవారు. బావోదాయి చక్రవర్తి 'వీయేత్-నమ్' అనే ప్రాచీన కాలం నాటి పేరు వ్యాప్తిలోకి తెచ్చాడని చరిత్ర.. అన్...నన్ అంటే, చైనా భాషలో 'దక్షిణ భాగం' అని అర్థం. అత్యంత ఆశ్చర్యకరంగా 'ద్రావిడ' పదానికి దక్షిణానికి వెళ్ళినవారు అనే అర్థమే ఉంది. ఆంధ్రుల్ని అన్నం పేరుతో వ్యవహరించటానికి అంతర్జాతీయ కారణాలు ఏవో ఉండి ఉంటాయని దీన్నిబట్టి అనిపిస్తోంది.

ఎవరేమనుకున్నా అన్నం మనదే! మనం మాత్రమే దేశంలో భోజనాన్ని అన్నం అని పిలుస్తున్నాం. ఉత్తరాదివారు రోటీ అంటారు. అన్నం అనటంలేదు. తమిళ, కన్నడ, మలయాళీలు సాపాటు అనే అంటారు. మనమే అన్నం అంటున్నాం. మనకు బువ్వ, కూడు ఎంత తెలుగో అన్నం కూడా అంతే తెలుగు. ☆

# దానశీలికి అడ్డు తొలగాలి!

శ్లో: నైవాహమేతద్యశశేదదాని న చార్థహేతోర్నచ భోగతృష్ణయా
పాపైరనాసేవితఏషమార్గఃఇత్యేవమేతత్ సకలం కరోమి
సద్భిః సదాధ్యాసితం తు ప్రశస్తంతస్మాత్ప్రశస్తంశ్రయతేమతిర్మే
ఏతన్మహాభాగ్యవరం శిబేస్తు తస్మాదహం వేద యథావదేతత్

అష్టకుడు అశ్వమేధయాగం చేశాడు. యాగం పూర్తయ్యాక అతని సోదరులు ప్రతర్ధనుడు, వసుమనస్సు, శిబి ఈ ముగ్గురినీ తీసుకుని విమానం (రథం) ఎక్కి స్వర్గానికి బయల్దేరాడాయన! దారిలో నారదుడు కనిపిస్తే 'రాండి రాండి' అంటూ ఆయన్ను కూడా ఎక్కించుకుని మొత్తం ఐదుగురూ కలిసి వెడ్తున్నారు. కొంతదూరంవెళ్ళాక ఆ నలుగురు సోదరులకీ ఒక సందేహం వచ్చింది. మనం గనక స్వర్గానికి వెళ్ళలేకపోతే భూ మీ్మద దిగిపోవల్సిందే కదా.. .మనలో ముందు ఎవరు దిగాల్సి ఉంటుంది...అని! దానికి నారదుడు ఇలా సమాధానం చెప్పాడు:

"ఒకసారి అష్టకుడూ, నేనూ కలిసి ఆకాశయానం చేస్తుంటే, నేల మీద రంగురంగుల ఆవులు కనిపించాయి. అవన్నీ తాను దానం ఇచ్చినవే అంటూ గొప్పలు చెప్పుకున్నాడు కాబట్టి, 'అష్టకుడు' మొదట భూమికి దిగాలి. ఒకసారి 'ప్రతర్ధనుడు' విసుక్కొంటూ దానం చేశాడు. అందుకని రెండవ వాడుగా అతను దిగాలి. ఇంక మూడవ వాడు 'వసుమనస్సు'. ఈయన లోక సంచారం చేసే ఆకాశ రథాన్ని చూపించి, 'ఇదినీకే' అనినాతో అన్నాడు.ఆ తరువాత అవసరార్థం నేను పరోక్షంగా అడిగి చూశాను. అతను ఇవ్వకుండా ముఖం చాటేశాడు. కాబట్టి, మూడోవ్యక్తిగా 'వసుమనస్సు' దిగాలి.

ఇంక చివరికి మిగిలింది నేనూ, శిబి ఇద్దరం...! నాలుగో వ్యక్తిగా నేనే దిగిపోతాను. ఎందుకంటే శిబికి నేను సరిపోను. దానగుణంలో అతనికి సాటి ఎవరూ లేరు... కన్నకొడుకునే నరికి మాంసం వండి దానం ఇచ్చిన త్యాగమూర్తి" అంటాడు.

"ఏవిటయ్యా...ఎవడో దానం అడిగాడని, కన్నకొడుకుని చంపటం ఏవిటీ..? ఆ మాంసాన్ని తినమని అతను ఆదేశిస్తే నువ్వు తినబోవటం ఏవిటీ...?" అని, మంత్రులు అడిగితే, శిబిచక్రవర్తి ఆ బ్రాహ్మణుడు నాపుత్రుడి మాంసం కావాలని, వండి పెట్టమనీ దానం అడిగాడు. నేనుఇచ్చాను... అంటూ తాను అలా ఎందుకు చేశాడో ఒక వివరణ నిస్తూ, పైశ్లోకాన్ని చెప్తాడు:

"పేరు ప్రతిష్ఠల కోసం గాని, సిరిసంపదల కోసంగాని, స్వంత లాభం కోసం గాని, స్వర్గభోగాలు ఆశించిగాని, నేను ఏ దానమూ చెయ్యలేదు. దానం అనేది పాపాత్ములు చెయ్యలేని పని! ఒక్క సత్పురుషులు మాత్రమే దానమార్గాన్ని అనుసరించ గలరు. అందుకని ఆ మార్గానే నేను వెడుతున్నాను" అని!

శిబిని గురించిన ఈ కథనంతా చెప్పి, ఆయన కున్నంత దానగుణం తనకు లేదు కాబట్టి, శిబి కన్నా తాను ముందు దిగిపోవాల్సి వస్తుందంటాడు నారదుడు. సంస్కృత మహాభారతం అరణ్యపర్వం(188.54)లో ఈ ఉదంతం ఉంది. చివరికి మిగిలేది  దాన గుణం మాత్రమేనని, దాన శీలికి స్వర్గద్వారాలు ఎప్పుడూ బార్లా తెరిచే ఉంటాయని దీని సారాంశం...

ఇస్తానని ఇవ్వనివాడు, విసుక్కుని ఇచ్చినవాడు, ఇచ్చిగొప్పలు చెప్పుకున్నవాడు ఒకరిని మించి ఒకరు పాపాత్ములని ఈ కథలో మనకో సూత్రం కనిపిస్తుంది. ఇవ్వకుండానే ఇచ్చినట్టు చెప్పుకునేవాళ్ళు, 'నేనుకాబట్టి' ఇచ్చానని గొప్పలు చెప్పుకునే వాళ్ళు, అప్పుడప్పుడూ అంతో ఇంతో ఇస్తుండకపోతే, నరఘోష పెరిగిపోతుందని కొంత సొమ్ము దాన ధర్మాలకు విదిలించే వాళ్ళు, రూపాయి ఇచ్చి వంద రూపాయల ఫోటోలు దిగే వాళ్ళు... ఇలాంటి వాళ్ళు చాలా మంది ఉన్న కాలంలో వాళ్లకు స్వర్గానికి వెళ్ళే బండెక్కే అవకాశమే రాదు!

శిబి చక్రవర్తి ఒక సన్నని దారిలో రథం తోలుకుంటూ వెడ్తున్నాడట. అదే సమయానికి సుహోత్రుడనే రాజుకూడా ఆ దారినే వచ్చాడు. రెండు బళ్ళు పట్టని ఇరుకుదారి అది. ఎవరో ఒకరు రోడ్డుమార్జిన్ దిగాలి. ఇద్దరూ సమానమైన అధికారాలు కలిగినవాళ్ళు. కాబట్టి ముందు ఎవరు దిగాలి..అనితర్కిస్తున్నారట. ఆ సమయంలో నారదుడు వచ్చి, 'రాజకీయపరమైన ప్రోటోకాల్ సమానంగా ఉన్నప్పటికీ, వ్యక్తిత్వం రీత్యా ఇద్దరిలో ఎవరు తక్కువో వాళ్ళు ముందు పక్కకు తప్పుకుని దారివ్వాలి...' అంటాడు. అయితే వారిద్దరిలో ఎవరి వ్యక్తిత్వం గొప్పదని అడిగితే నారదుడు ఇలాచెప్తాడు–

"తనకు ఒక ఉపకారం చేస్తే తిరిగి వంద ఉపకారాలు చేసే గుణం శిబి చక్రవర్తి కుంది. లోభిని దానం చేత, అబద్ధాన్ని నిజంచేత, క్రూరుణ్ణి ఓర్పుచేత, అసాధువుని సాధుత్వం చేత గెలుచుకునే లక్షణం శిబికి ఉంది" అని చెప్తాడు. అప్పుడు సుహోత్రుడు నారదుడి తీర్పుకు కట్టుబడి, రథం దిగివచ్చి శిబికి దణ్ణం పెట్టి రథాన్ని పక్కకు లాగి దారి ఇస్తాడు.

అనేక ట్రాఫిక్ జాముల్ని పరిశీలిస్తే, చాలా సందర్భాలలో "ముందు నువ్వు అడ్డు తీయాలంటే నువ్వు తీయాలనే తగూలాటలే ఎక్కువ కారణంగా కనిపిస్తుంటాయి. సిగ్నల్స్ దగ్గర, ట్రాఫిక్ ఆగి బళ్ళు కదిలే పరిస్థితి లేనప్పుడు అక్కడ చాలామంది బిచ్చగాళ్ళు చేరటానికి కారణం బహుశా, మొదట బండి కదిలే అవకాశం ఇప్పించేందుకేనన్న మాట. ఎవడికి దానగుణం లేదో వాడు రెండు చేతులతోనూ నోరుమూసుకుని తన బండిని అడ్డుతీయాలనేది నారదుడి పేరుతో మహాభారతం ఇచ్చిన తీర్పు. దానం చేసిన వాడి బండే ముందు కదలాలి! దానశీలికి అడ్డుతప్పుకోండి. 

# దారపు పగ్గాలు

సీ. ఆలు నిర్వాహకురాలు భూదేవియై/ యఖిలభారకు డన్న యాఖ్య దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై/ కామితార్థము డన్న ఘనత దెచ్చె
గమలగర్భుడు సృష్టికర్త తనూజుడై/ బహుకుటుంబికు డన్న బలిమి దెచ్చె
గలుషవిధ్వంసిని గంగ కుమారియై/ పతితపావనుడన్న ప్రతిభ దెచె
ఆంధ్రు బిడ్డలు దెచ్చు ప్రఖ్యాతి గానీ/మొదటి నుండియు నీవు దామోదరుడవె
చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్య భావ/హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

కాసుల పురుషోత్తమ కవి చేసిన వ్యాజస్తుతి ఇది. అయ్యగారి ఘనత అంతా అమ్మగారిదే నంటూ ఆంధ్రవిష్ణువును ఎత్తి పొడుస్తూనే స్తుతించిన ఒక చక్కని పద్యం ఇది. "ఈ భూలోకాన్ని మొత్తాన్నీ నిర్వహించే భూదేవి ఆయన భార్య కాబట్టి, అఖిల భారకుడనే ప్రతిష్ఠ దక్కింది. ధనవంతురాలైన ఇందిర (లక్ష్మి) ఇష్టసఖి కాబట్టి, అయ్యగారికి కామితార్థాలు తీర్చే వాడన్న ఘనత వచ్చింది. సాక్షాత్తూ సృష్టికర్త కమలగర్భుడైన బ్రహ్మగారి కొడుకు కాబట్టి బహుకుటుంబీకుడనే బలిమి వచ్చింది. కాలుష్యాలన్నీ కడిగేసే గంగ ఆయన కూతురు కాబట్టి, పతితపావను డన్న ప్రతిభ దక్కింది. నీ ప్రఖ్యాతి అంతా ఆడవాళ్ళ వలనో, మరెవరి వలనో దక్కుతున్నదే నంటాడు కవి. అయినా మొదటి నుండీ నువ్వు దామోదరుడివే నంటాడు.

"దామాని ఉదరే యశ్యాశాః దామోదరః" పొట్టకు తాడుతో కట్టబడ్డవాడు కాబట్టి దామోదరుడు అయ్యాడు. దామం అంటే తాడు, యశోదమ్మ బాలకృష్ణుడి పొట్టకి ఒకతాడు కట్టి, దాని రెండో కొసని రోలుకు కట్టింది కదా! మొత్తం మీద, కలెక్టరమ్మ మొగుడు, బ్యాంకు మేనేజరమ్మ మొగుడు, పొల్యూషన్ కంట్రోలరమ్మ తండ్రి ఇలా టైటిల్స్ పెట్టి తీసే సినిమాల్లో హీరోలాగా విష్ణుమూర్తి ప్రసిద్ధు డయ్యాడన్నమాట. 'మొలతాడున్న మొనగాడు అంటారే.... అలాంటిది ఈ దామోదర బిరుదు

మనుషులకే ఇంత లౌక్యం ఉంటే వాళ్లని సృష్టించిన వాడికి ఇంకెంత ఉండాలి...! తాడుతో కట్టించుకుని మరీ, దామోదరుడు అని పేరు పెట్టుకున్నాడంటే గొప్ప లౌక్యుడనే అనాలి.

తన మెడలో తాడు కట్టిన వాడి భర్తగాని నడుముకుత్రాడు కట్టగలగా లంటే ఆమెకు స్వంతంగా భూదేవిలా భూములుండాలి. లేదా లచ్చిందేవిలా డబ్బుండాలి.

పేరుకి దామోదరుడైనా పురుషుడు గానీ, పురుషోత్తముడు గానీ, సాదాసీదా భార్యలకు కట్టుబడతారా అనేది కాసుల పురుషోత్తమకవికి వచ్చిన సందేహం.

మగాడు మగువకు కట్టినా, మగువ మగాడికి కట్టినా ఆ దారపు పగ్గాల్లోనే ఉంది బంధమైనా, బాంధవ్యమైనా! కానీ, మెడలో కట్టిన దారపు పగ్గాలతో భార్యను కట్టుకొనే భర్తని తనకు కట్టుబడేలా చెయ్యాలంటే సౌందర్యాదులు కూడా కొంత తోడ్పడ వచ్చేమో గానీ, వాటికి నికరం లేదు. డబ్బొక్కటే శాశ్వతం అనుకుంటాం కదా!

భార్యను కట్టుకొని, అంటే వెంటబెట్టుకుని వెడితే అదనపు గౌరవం దక్కుతుంది. పెళ్ళికి మగా డొక్కడే వెళ్ళాడనుకోండి, బయట గేట్లోనే, వచ్చిన వీణ్ణి పక్కన బెట్టి రాని ఆవిడ రాలేదేమండీ అనడుగుతారు. అదే, భార్యతో కలిసి వెడితే ఆతిధ్యం ఇచ్చే వాళ్ళు దంపతీ సమేతంగా వచ్చి పలకరించి సాదరంగా ఆహ్వానిస్తారు. సినిమా హాల్లోనో, బస్టాండులోనో, రైల్వే స్టేషన్లోనో పక్కన లేడీ ఉంటే టిక్కెట్లు తేలిగ్గా దొరుకుతాయి. వెనకాల భార్యను ఎక్కించుకుని స్కూటరు మీద వెడితే సాధారణంగా మనసున్న పోలీసులు ఆపి, లైసెన్సు అడగరు. ప్రమోషన్లో కాంట్రాక్టులో అడగ టానికి ఆఫీసరు గారి దగ్గరకు భార్యతో కలిసి వెడితే వచ్చే సమాధానం సానుకూలంగా ఉంటుంది.

కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ,రూపేషు లక్ష్మీ, క్షమయా ధరిత్రీ, భోజ్యేషు మాతా, శయనేషు రంభా షట్కర్మయుక్తా కులధర్మపత్నీ అన్నాడు ఓ మగరచయిత. “పర్త్యమ్ వ్రాతే తిష్టతి ఇతి పత్ని” అంటే మగాడి పక్కన నిలబడి అతని పనుల్లో సహకరించేది పత్ని అనే మగాడి నిర్వచనం కూడా ఉంది. ఆ సహకరించటం కూడా దాసిగానూ, మంత్రిగానూ, పెట్టే కష్టాలను భరించే భూదేవిగానూ, వండి వడ్డించే తల్లిగానూ, పడగ్గదిలో రంభగానూ ఉండాలనటమే “మగాడిద” మనస్తత్వం.

‘మా ఇంటికి నేనే యజమానిని అని మా ఆవిడ అంగీకరించింది’ లాంటి సరదా ఇంగ్లీషు వాక్యాలు ఆడవాళ్లని సంతోష పెట్టడానికే గానీ, మన సామాజిక వ్యవస్థలో ఇమిడేవి కావు. ఇక్కడ ఏ మగాడూ తానే యజమానినని ప్రత్యేకంగా అనుమతి తెచ్చు కోవాల్సిన అవసరం లేదు. కలెక్టరు గారి మొగుడు కూడా తన భార్య కలెక్టరని చెప్పుకోడు. దారపు పగ్గాల దామోదరత్వం అనేది ఒక బూటకం. అదొక వశీకరణ నాటకం. ☆

# దేశీయ భోజన అవమానాలు

"మధురాన్నములు మాని మహనీయులందఱు దోసెలుప్మాలకు దాసులైరి
శతవర్ష జీవులు శల్యగత ప్రాణు లకట కాఫీగత ప్రాణులైరి
ఎలనీరు ద్రావి హాయిగ సుఖించెడు వార లైసు సోడాలకు నర్థులైరి
కర్పూర తాంబూల ఖాదనులగువారు ఖారఖిల్లీల సర్దారు లైరి
మంచి పెసరట్టు, సిగరెట్టు మనకు రెండె
పంపె స్వర్గంబు నుండి ఈశ్వరుడటంచు
బలికి కొఱమాలి నిను గోరి పిలిచినాము
గాని, లేకున్న నీవు రాగలవె కఱవ...?
క్షామదేవత! లేక రాగలవె నీవు...?

భావ కవిత్వపు తొలినాళ్ళలో కాకినాడ కేంద్రంగా సాహితీ సేవ చేసిన ప్రసిద్ధ సాహితీవేత్త ఉమ్రాలీషా కవిగారి రచన ఇది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న తొలితరం యోధుల్లో ఆయన ఒకరు. టీకా తాత్పర్యాలు అవసరంలేకుండా అలతి అలతి పదాలతో ఆయన రచన సాగుతుంది. ఈ ఖండకృతిలో ఉమ్రాలీషాకవి చెప్పిన ఒక్కో విషయాన్నీ మనం పట్టించుకోవాలి.

కమ్మనిరుచుల్ని వదిలేసి మహనీయులంతా దోసెలు ఉప్మాలకు దాసులయ్యారు. ఇడ్లీ అట్టూ పూరీ ఉప్మాలు మనభోజన వ్యవస్థని పూర్తిగా మార్చేశాయి. ప్రొద్దున పూట వాటిని తినటం సర్వమానవాళికీ వేదాలు నిర్దేశించిన విధి అన్నట్టు భావిస్తున్నారు. కమ్మని చద్దితిని పనులకు పోయేకార్మిక, శ్రామిక, రైతాంగ సోదరులంతా రెండిడ్లీ సాంబార్లకు బలైపోతున్నారు. సంపాదించిన రోజు కూలీలో టిఫినూ టీ కోసం కనీసం పాతిక రూపాయలు వెచ్చించవలసివస్తున్నా సరే, పూర్వం పద్ధతిలో కమ్మని పెరుగన్నం దండిగా తిని, మెండుగా పనిచేసి, నిండుగా సంపాదించు కోవాలనే ఆలోచన తగ్గిపోయింది. మేధావివర్గం కూడా ఇందుకు మినహాయింపు కాకపోవటమే విచిత్రం.

వందేళ్ళు సుఖంగా జీవించాల్సిన ప్రాణులు కాఫీ తాగకపోతే ప్రాణాలేపోయేలా కాఫీ గత ప్రాణులుగా తయారయ్యారు. షుమారుగా 1900-1910 ఆ ప్రాంతాల నుండీ కాఫీ జనసామాన్యాన్ని పూర్తిగా లోబరచుకుంది. 1960-70ల తర్వాత టీ కూడా దానికి తోడయ్యింది. ఆకల్నీ, జీర్ణశక్తినీ చంపే ఇలాంటి పానీయాలకు బానిసలం కావటం వలన కొన్ని వ్యాధులకు రాచ ద్వారాలు తెరిచినట్టయ్యింది.

ఎలనీరు అంటే కొబ్బరిబోండాం నీళ్ళుతాగి హాయిగా సుఖించే వాళ్ళంతా ఐసుసోడాల కోసం వెంపర్లాడి పోతున్నారు. మన నీళ్ళలో రంగులు, రసాయనాలు కలిపి మన ఆయుః పరిమాణాన్ని తగ్గించే కూల్‌డ్రింకుల్ని ఇష్టారాజ్యంగా అమ్ముకోమని మన ప్రభుత్వాలు విదేశీ కంపెనీలకు అనుమతులిస్తున్నాయి. కానీ, మనవిజ్ఞత ఏమయ్యిందీ..? మనదేశ ఆదాయాన్ని మనం విదేశీ కంపెనీలకు అప్పళంగా అర్పించటంలో మనవంతు పాత్ర మనం కూడా పోషిస్తున్నాం కదా! గాంధీ గారి విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమాన్ని ఈ దేశప్రజలే విజయవంతం చేసిన సంగతి మనం మరిచిపోకూడదు. అప్పుడే కాదు. ఇప్పుడూ విదేశీ వస్తువుల మోజు మంచిది కాదు.

కర్పూర తాంబూలాలు వేసుకుని గౌరవప్రదంగా జీవించేవాళ్లు మన పూర్వీకులు. కానీ, ఈ నాటిమనుషులు ఖారాఖిల్లీలతో నోరు పాడుచేసుకుని, బుగ్గకేన్సరూ, గొంతుగడ్డలూ తెచ్చుకుని తాము నాగరికులం అని చెప్పుకుంటూ బతుకు వెళ్ళ దీయటం మామూలు విషయం అయిపోయింది. రోడ్డుమీద ఎక్కడ తెల్లని గోడ కనిపిస్తే అక్కడ ఎర్రగా ఉమ్మి ఖరాబు చేసే 'ఉమ్మార్తు'లూ, నిస్సిగ్గుగా మూత్రవిసర్జన చేసే 'నిలబడుద్ధాయి'లూపెరిగారు.

మంచి పెసరట్టు, సిగరెట్టు ఈ రెండింటినే భగవంతుడు మనకు స్వర్గం నుంచి పంపాడని భావిస్తూ, లోకం ఎలా కొట్టుకుపోతున్నా పట్టించుకోకుండా అభినవ నీరోల్లా, అభినయ సామ్రాట్టుల్లా "బుద్ధి తక్కువై నిన్ను కావాలని పిలిచాం...కరువా! మాకే గనక అట్లూ, సిగరెట్లూ, కూల్డ్రింకులూ, ఖారాఖిల్లీలూ తీసుకునే అలవాట్లే లేకపోతే, మా గుమ్మం ఎక్క గలిగేదానివా క్షామ దేవతా...?" అనడుగుతున్నారు. ఉమ్రాలీషా కవి !

విదేశీయం ముద్ర వేస్తే చాలు ఎగేసుకుపోయే తత్త్వం ఒకటి గాంధీగారు పోయాక మన దేశంలో మితిమీరిపోయింది. మానసిక వైద్యులు ఇంకా ఈ వింత మనోదౌర్బల్యానికి ఒక పేరు పెట్టలేదనుకుంటాను.

ఉమ్రాలీషా కవిగారి కవితని విశ్లేషిస్తే కానీ, ఆయన స్వరంలో ఇంతకన్నా కాఠిన్యం కనిపిస్తోంది.

ఇలాంటి అలవాట్లతో మన ఆహారసంస్కృతిని మరిచిపోయి నిర్లక్ష్యంగా వ్యవహరించటం వలన, మనకు కరువుకాటకాలు వస్తున్నా యనీ,మనం దేశీయమైన పద్ధతిలో మరింత బాధ్యతాయుతంగా జీవంచవలసి ఉంటుందనీ ఉమ్రాలీషా కవిగారి హెచ్చరికతో కూడిన సూచనని పట్టించుకోవాల్సి ఉంది. దేశంగురించి ఆలోచించటం అంటే సామూహికంగా మనం మనకోసం ఆలోచించటమే అన్న సంగతిని ఇంకా సమర్థవంతంగా ఈ తరానికి తెలియ జేయాల్సి ఉంది. ✫

# ధగిడీ రాజ్యం

**జగలోభుల్ మలభాండ విగ్రహులు గంజాతిండి జండీలు మొం**
**డి గులాముల్ మగలంజె లాగడపు టెడ్డేల్ ఘోర క్రూరాధముల్**
**ధగిడీలుండగ నేమి యర్థుల గృతార్థత్వంబు నొందింతురే**
**జగదేవక్షితి పాల రాజకుల తేజా! దీనకల్పద్రుమా!**

పెట్టనివాడిని ఇష్టారాజ్యాంగా తిట్టిన ఒక చాటు తిట్టుకవిత ఇది !

ఇన్నిన్ని తిట్లు తిన్నాక ఎవడైనా బతికుంటే వాడికన్నా గాడిద నయం అన్నమాట! 'గాడిద కొడకా' అని తిడితే, 'వీడా నా కొడుక'ని గాడిద కూడా ఏడ్వగలదు కాబట్టి గాడిదే నయం!!

ఇంతకీ, ఇన్ని తిట్లు తిన్న ఆ 'అడ్డగాడిద' ఎవరు? ఒకడేమిటీ ఈ కవిగారికి పెట్టని వాళ్ళందరినీ కలిపే తిట్టాడు. పెట్టిన వాణ్ణి పొగడటానికి బదులుగా పెట్టనివాళ్ళను తిట్టటం ఓ టెక్నిక్. 'నువ్వలాంటి వాడివి కాదు నాయనా' అనటమూ పొగడటమే! పద్య కవి ఎవరో తెలియదు. చాటు పద్యంగా చెలామణిలో ఉంది. తాను తిట్టిన వాళ్ళ పేర్లు చెప్పకుండా సాధారణీకరించి వదిలేశాడు కవి. ఆ కవిగారిని గౌరవిస్తానన్నన్నవాడు ఇమ్మడి జగదేవరాయుడనే ప్రభువని ఇందులో ఉంది.

జగదేవరాయుడు ఒక గొప్ప సంస్థానాధీశుడేమీ కాదు. బెంగుళూరు దగ్గర చెన్నపట్టణం అనే ఒకమండల స్థాయి చిన్న రాజ్యానికి పాలకుడు. షుమారుగా 1620 నాటివాడు కావచ్చని నిడదవోలు వెంకట్రావుగారు 'దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం' లో ఇతని గురించి వ్రాస్తూ, ఈ చాటు పద్యాన్ని ఉదహరించారు.

'అర్థుల కృతార్థత్వంబు నొందింపని', సత్కవి పండితులను గౌరవించి ప్రోత్స హించటం తెలియని ధనమదాంధుల్ని జగలోభులు, మలభాండవిగ్రహులు, గంజా తిండి లండీలు, మొండి గులాములు, మగలంజెలు, ఆగడపు ఎడ్డెలు, ఘోర క్రూరా ధములు, ధగిడీలు ఇలా తిట్టి పోశాడు. ధగిడీ అంటే పచ్చి నీచమైన స్త్రీ. లండీలంటే కుత్సితులు. జగదేవరాయ అలాంటివాడు కాదనీ, అతను దీనకల్పద్రుమం అనీ ఈ పద్యంలో పొగిడాడు.

సాహితీ సేవ అనేది ఈరోజుల్లో చాలామందికి ఒక హాబీ! సినిమా రచయితలకు వచ్చినట్టు ఇతర రచయితలకు సాహిత్యాదాయం ఉండదు. పోతన ఐదువేళ్ళూ నోట్లోకి పోయే పరిస్థితి ఉన్నవాడు కాబట్టి కూళలకు తన కృతిని ఇవ్వనని కరాఖండిగా చెప్పేయ గలిగాడు. నిత్యపేదరికంలో జీవించిన త్యాగరాజు కూడా

రాముడికి తప్ప మరొకరికి తలవొంచనన్నాడు. విశేషం ఏమంటే, రాజులకు కృతినివ్వని కావ్యాలు ఎన్నో నేటికీ నిలిచి ఉండగా, రాజాదరణ పొందిన కావ్యాలలో కవి ఎవడో తెలియకుండా కాలగర్భంలో కలిసిపోయినవే ఎక్కువ కనిపిస్తాయి. కాబట్టి, సాహిత్య పోషకులు మంచి సాహిత్యం రావటానికి ప్రేరకులేగానీ, కారకులు కాదన్నమాట.

రచయిత రవ్వంత గౌరవాన్ని, ప్రోత్సాహాన్ని మాత్రమే కోరుకుంటాడు. నేటి కాలంలో అదే తగ్గిపోతోంది! ప్రభుత్వ పురస్కారాలు, విశ్వవిద్యాలయ పురస్కారాలు, అకాడెమీ పురస్కారాలు అత్యధికంగా నవ్వుల పాలౌతున్నాయి.

తెలుగు పుస్తకాలకు అంతర్జాతీయ ఖ్యాతి రావటం లేదని అంటారు గానీ, అంతర్జాతీయ స్థాయిలో పుస్తక ప్రచురణ చేసేంత స్థితి మన ప్రచురణ రంగానికి లేదు. అయినా చాలామంది ప్రచురణకర్తలకు రచయితలంటే చిన్నచూపు.

అప్పో సొప్పో చేసి, రచయితే స్వంతంగా ప్రచురించుకుంటే, ఉచితంగా పంచుకోవటం తప్ప ఆ పుస్తకాలు ఏం చేసుకోవాలో తెలీదు. ఇరుకు కొంపలో ఈ పనికిమాలిన పుస్తకాల కట్టలు అడ్డంగా ఉన్నాయని ఇంట్లోవాళ్ళ తిట్లు నిత్య నైవేద్యాలౌతాయి. అత్యున్నత సాహితీ విలువలున్న పుస్తకాలకు మార్కెట్ ఉండదనే ఒక అపనమ్మకం పుస్తక విక్రేతల్లో ఉంది కాబట్టి, స్వీయ రచనలను షోరూములో ఉంచటాని క్కూడా చాలామంది అంగీకరించటం లేదు. జిల్లా గ్రంథాలయాలు స్వీయ ప్రచురణ కర్తలకు ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వటం లేదు. ప్రచురణ తనకు వృత్తి కాదు కాబట్టి, గ్రంథాలయ సంస్థల చుట్టు తిరిగే అవకాశం రచయితల కుండదు.

వ్రాసిందంతా అచ్చు కావాలనే దుగ్ధ లోంచి మొదటగా రచయిత బయటకు రావాలి. "మొక్కుబడి ముందుమాట"లతో పేజీలు నింపటం కన్నా, ఆ రంగంలో నిపుణుడి చేత తన పుస్తకాన్ని ఎడిట్ చేయించి, నిర్దుష్టంగా అచ్చు వేస్తే, మంచి పుస్తకాలకు తప్పకుండా మార్కెట్టు ఉంటుంది. పబ్లిషర్లు కూడా ఎడిటర్లను నియమించి, ప్రతి అక్షరాన్నీ పరిశీలించాకే పుస్తకం అచ్చు వేయటం మంచి అలవాటు. నిగ్గు తేలిన మేలిమి రచన ఒక పేజీదైన చాలు.

చుట్టూ ఎందరో ధగిడీల కారణంగా నేటికాలపు రచయితలు రాయని భాస్కరులుగా మారిపోతున్నారు. ఒకరిని నిందించి ఉపయోగం లేదు. ★

# ధనలక్ష్మిలేని రాజధాని

"వెలయు నఖిల భువనములలోన వారణ
నగరిపు రమ తల్లి నాదనర్చ
రాజ్యలక్ష్మి మిగుల బ్రబల నయోధ్యనో
రాజ వినుతి గనిన రాజధాని"

ఇంద్రుడి రాజధాని అమరావతి. అది ఈ సమస్త సృష్టి లోనూ వారింపరాని సంపద కలిగిందిట. అందుకని దాన్ని 'అవారణ' అంటారు. నగం అంటే కొండ. ఈ కొండల్ని పిండికొట్టి మహానగరాలు నిర్మించిన వాడు కాబట్టి నాగరిపు కొండలకు వ్యతిరేకి అన్నారు. పర్వతాల రెక్కల్ని ఇంద్రుడు తన వజ్రాయుధంతో విరగకొట్టాడనే కథలోని ఆంతర్యం ఇదే! అందుకని పురందరుడైన ఇంద్రుడికి నగరిపుదని పేరును ఆ 'నగరిపుడి రమ' అంటే ఇంద్రుని రాజధాని అమరావతిని కానీ, అంతటి అమరావతికి తల్లిలాగా ఉన్నదట అయోధ్యా నగరం!

ఇంద్రుడి అమరావతిని తలదన్నేలా అయోధ్యానగరం ఎందుకున్నదో కారణాలు వివరిస్తున్నాడు. నానాదేశాల రాజన్యులు అక్కడ చేరారంటే పాలనా వ్యవస్థ బలంగా ఉందనీ, విదేశీ వర్తక వాణిజ్యాలు బాగా సాగుతున్నాయని, దేశసౌభాగ్యంలో ప్రజలు భాగస్వాములయ్యారనీ అర్థం. అందుకని "రాజ్యలక్ష్మి మిగుల ప్రబలన్"–అక్కడ రాజ్యలక్ష్మి తాండవి స్తోందట! అమరావతి నగరం ధనలక్ష్మితో కూడుకుని ఉంటే, అయోధ్య రాజ్యలక్ష్మితో నిండి అమరావతికి తల్లిలా ఉన్నదంటాడు పింగళిసూరన.. రాఘవపాండవీయం ద్వ్యర్థికావ్యంలో ఈ ఒక్కమాటతో పటిష్టమైన పాలనావ్యవస్థ కొత్త రాజధాని ఎలా ఉండాలో సూరన కవి చెప్తున్నాడు.

ఈ ప్రపంచానికి కొత్తరాజధాని నగరాలు కొత్తేమీ కాదు. మూడువిభిన్న ప్రాంతాలకు అందుబాటులో ఉండాలని 1991లో నైజీరియా 'అబుజా' పేరుతో కొత్త రాజధాని నగరాన్ని నిర్మించుకుని లాగోస్ నుండి మార్చుకుంది. బ్రిటీష్ హోండురాన్ దీవులు1961 హరికేన్' లో పూర్తిగా విధ్వంసమైనప్పుడు బెల్మోపాన్ నగరాన్ని నిర్మించుకున్నాయి. బ్రెజిల్ తన రాజధాని జనంతో నిండిపోయిందని 'బ్రసీలియా' ని కొత్త రాజధానిగా నిర్మించుకుంది. సిడ్నీ, మెల్బోర్నె ప్రాంతాల మధ్య వైషమ్యాలు నివారించటానికి ఆస్ట్రేలియా 'కాన్బెర్రా' అనే రాజధాని నగరాన్ని

కట్టుకుంది. 1964లో 'బోట్స్‌వానా' స్వతంత్రదేశం అయినప్పుడు గబొరోన్ అనే రాజధాని నగరాన్ని కొత్తగా నిర్మించుకుంది. 1974 బంగ్లాదేశ్ పరిణామాల తరువాత రావల్పిండి సైనిక స్థావరాలకు దగ్గరగా ఉన్న ఇస్లామాబాద్ ప్రాంతంలో నూతన నగరాన్ని నిర్మించి వాణిజ్య కేంద్రం అయిన కరాచీ నుండి రాజధాని నగరాన్ని తరలించుకుంది పాకిస్థాన్. మలేషియా కూడా కౌలాలంపూర్‌లోనే రాజధాని ఉన్నప్పటికీ, 2002లో పుత్రజయ అనే నూతన రాజధానిని నిర్మించింది. అమెరికా(USA) కూడా వాషింగ్టన్ డిసి నగరాన్ని నిర్మించి ఫిలడెల్ఫియా నుండి రాజధాన్ని తరలించింది.

జపాన్, బర్మా, ఇండియా ఇంకా చాలా దేశాలు కొత్త రాజధాని నగరాలు నిర్మించుకున్నాయి. పాతది నిండిపోతే కొత్త రాజధాని కట్టుకుంటాయి. కొత్త రాజధాని అనేది స్థానిక పరిస్థితుల్ని బట్టి, అవసరాల్ని బట్టి, ప్రజల ఆకాంక్షల్ని బట్టి నిర్మితం అవుతుంది. రాజధానులు రాత్రికిరాత్రి వెలిసేవికావు. వాటినిర్మాణానికి బలమైన పునాదులు కావాలి. అందుకోసం ఎంతకైనా తెగించాలి. ఎందరో పూనుకుని నిలబడ్డారు కాబట్టి నేటి మహానగరాలు నిర్మాణం అయ్యాయి. ఎవరూ అలా నిలబడకపోవటం వలనే హైదరాబాదుకు సమాంతరంగా మరోనగరాభివృద్ధి జరగకుండా పోయిందికూడా!

అలాగని, ఇల్లు కట్టే పనిలో పడి, వంట చేసుకోవటం మానేయరుకదా! ఇంట్లో బియ్యం, ఉప్పు, పప్పు సమకూర్చుకోవటానికి మొదటి ప్రాధాన్యత ఇచ్చి, ఆ తరువాతే ఇంటి నిర్మాణం సంగతి చూస్తాడు యజమాని! ధనలక్ష్మి లేకుండా రాజధాని ఏర్పడాలంటే, రాజ్యలక్ష్మి బలంగా, ప్రబలంగా, అచలంగా ఉండేలా చూసుకోవాలి! మొదట ఇంటగెలవాలి! పాలకుడికి రాజ్యలక్ష్మే ప్రధానం!

ఎవరి కాలంలో రాజ్యలక్ష్మి వర్ధిల్లుతుందో ఆ రాజ్యంలో ధనలక్ష్మి కూడా వర్ధిల్లుతుంది !! రాజ్యంలో పటిష్టమైన పాలనా వ్యవస్థ ప్రబలంగా ఉండటమే రాజ్యలక్ష్మి అంటే !!

★

# నడువరులు - అడుగరులు

"నడవకయే నడచివచ్చితి
నడిచిన నే నడిచి రాను నడచెడునటులన్
నడిపింప నడవనేరను
నడవడికలు చూచి నన్ను నడిపింపరయా"

బొగ్గవరపు పెదపాపరాజు అనే కవి సంసారం నడవక నానా కష్టాలు పడ్తున్నాడు. గుంటూరు ప్రాంతానికి చెందిన వాడని చెప్తారు. గుంటూరు నుంచి నిజాం ప్రభువును ఆశ్రయిస్తే ఏమైనా చేయూత ఇస్తాడేమోనని నడుచు కుంటూ అప్పటి రాజధాని గోల్కొండ ప్రయాణం అయ్యాడు. దారిలో ఎవరో దానయ్య ఆత్మీయంగా పలకరించి, ఆయన కథంతా విని, అయ్యో! అక్కణ్ణించి ఇంతదూరం నడిచి వచ్చారా అన్నాడట... ఆశ్చర్యంగా. అప్పుడా కవి గారు చెప్పిన పద్యం ఇది:

**నడవకయే నడచివచ్చితి:** సంసారం నడవక పోవటం వలనే నడిచి వచ్చాను! ఏ గుర్రబ్బండో ఎక్కి వచ్చేటంత స్తోమతే ఉంటే ఇంకొకళ్ళని ఇలా దేబిరించటం దేనికీ! **"నడిచిన నే నడిచి రాను కదా...?"** సంసారం నడిస్తే నేను నడిచి ఆను కదా ! **నడచెడు నటులన్ నడిపింప నడవనేరను...** ఇంక సంసారం నడిచేలాగా నడిపించటం నావల్లకాదు, **నడవడికలు చూచి నన్ను నడిపింపరయా:** నాప్రతిభా పాండిత్యాలను చూసి నన్ను నడిపించండి మహాప్రభో అని మొత్తుకున్నా డాయన.

తను నడిచి, 'నడక'ని ఇన్ని రకాలుగా ఈ పద్యంలో నడిపించాడాకవి! నడక అవసరం ఎంతుందో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. నడవకుండా బతుకు నడిపించాలంటే కదరదు.

ఇవ్వాల్టి సామాజిక జీవన వ్యవస్థలో బాగా నడుస్తున్న వాళ్ళు అంటే సంపన్న వర్గాల వాళ్ళు పూర్తిగా నడవటం మానేశారు. అందుకని వాళ్లని నడిపించటానికి నడక సంఘాలు, నడక దారులు, నడక మైదానాలూ కొత్తగా ఏర్పడ్డాయి. పక్కింటికి వెళ్ళేందుకు కూడా నాలుగు చక్రాల రథాలు ఎక్కాల్సిన పరిస్థితులు ఈ నాటివి.! ఎందుకంటే, నడవటం అనేది ఒక దిక్కుమాలిన పని అనే అభిప్రాయం చాలా మందిలో ఉంది కాబట్టి చేత నడిచే వాళ్లమీద చిన్నచూపు ప్రదర్శిస్తుంటారు.

కొద్దిపాటి ప్రసిద్ధి ఉన్న వ్యక్తి కొద్ది దూరమే గదా అని నాలుగడుగులు నడుద్దాం అని పొరబాటున అనుకున్నాడనుకోండీ... వెనకాలే వ్యాఖ్యానం వినిపిస్తుంది. "మనవాడి పని అప్పుడే అయిపోయిందా...? నడిచి పోతున్నాడు" అని "ఏంటి సార్ నడుస్తున్నారు? కారేవయ్యిందీ...?" అనే అడుగరులే (అడిగేవాళ్ళు) ఎక్కువ." "మీరు నడిచి వెడుతుండగా చూశాను, మీకు అభినందనలు" అని నడువరులను

(రోడ్డు మీద నడుస్తూ కనిపించినవారిని) అభినందించే రోజులు ఎప్పుడొస్తాయో ! ప్రపంచ నడువరులారా ! ఏకం కండి ! పోయేదేమీ లేదు కొంచెం షుగరూ, కొంచెం పొగరూ తప్ప !!

అనవసరంగా ఈ జనం అంతా ఈ వూళ్ళో ఉత్తినే నివసిస్తున్నారనే భావన సాధారణంగా మున్సిపల్ అధికారులకు బలంగా ఉంటుంది. "ఇక్కడ ఉంటూన్నావు కాబట్టి పన్నిచ్చుకో" అనాలని పాతాళభైరవిలో రాజుగారి బావమరదిలా ఆలోచిస్తుంటారు.

ఏ మునిసిపాలిటీ వీధిలోనూ మనుషులు సురక్షితంగా నడిచి పోవటానికి అనువు కల్పించక పోవటమే ఇందుకు తార్కాణం. రోడ్లే కాదు, నగరంలో ఇరుకు వంతెనల మీద కూడా ఫుట్ 'పాథ్' లుండవు. ఒకవేళ ఉన్నా దానిమీద నీళ్ళపైపులు, కేబులు పైపులూ బిగించి ఉంటాయి. వాహనాలను తప్పించుకుంటూ మనుషులు ఎలా నడిచిపోవాలో ఏ మునిసిపల్ కమీషనరైనా కారుదిగి నడిచి చూస్తే కష్టాలు తెలుస్తాయి. అందువలన అవసరం లేకపోయినా మోటారు బళ్ళు వాడాల్సి వస్తోంది జనం. నడక మానేయటమే నడవడి అయ్యిందిప్పుడు. ఈ జనారణ్యంలో రోడ్డు మీద నడక సురక్షితం కాని పరిస్థితి.

స్థూలకాయులు, షుగరు రోగుల సంఖ్య ఇంతలా పెరగటానికీ మునిసిపాలిటీ వాళ్ళే కారణం అని, ఏ ఇంట్లో షుగరు, బీపీ స్థూలకాయం, మోకాళ్ల నొప్పులు రోగులున్నారో వాళ్లందరికీ నష్ట పరిహారం మున్సిపాలిటి వారే చెల్లించాలని జనం ఏదో ఒక రోజు అడగక తప్పదు.

ఆ మధ్య ఘనత వహించిన ఒక మున్సిపాలిటీ వారు ఉదయాన్న నడిచే వాళ్లమీద పన్ను వేసే ఆలోచన చేసి, జనాగ్రహం పెల్లుబకడంతో నడక పన్నుని వాయిదా వేశారు. వాయిదానే వేశారు. సందు చూసుకుని ఎప్పుడో మళ్ళీ వేస్తారు.

ఓ నడక మిత్రుడు ఇలాగే పలకరించి మీరు 'ఇక్కడ నడవటానికి వచ్చారా...?' అని ఆశ్చర్యంగా అడిగినప్పుడు ఈ పద్యం గుర్తుకొచ్చి ఆయనకు అర్థం అయ్యేలా ఇలా చెప్పాను.

**'నడవకయే నడచివచ్చితి'** బైట ఎక్కడా నడిచే వీలులేకపోవటం వలనే నడుచుకుంటూ ఇక్కడికి వచ్చాను, **'నడిచిననే నడిచి రాను'** రోజూ నడిచి వెళ్ళేందుకు సామాజిక పరిస్థితులు, మున్సిపాలిటీ రోడ్డు పరిస్థితులూ అనుకూలంగా ఉన్నట్టైతే నడవటం కోసం నేను నడుచుకుంటూ ఇక్కడకు రాను. **'నడచెడు నటులన్ నడిపింప నడవనేరను'** ఎంతదూరం అయినా నడిచే వెళ్ళగలిగేలా ఈ మున్సిపాలిటీని నడిపించనూ లేను.. నడవనూ లేను. **'నడవడికలు చూచి నన్ను నడిపింపరయా'** ఇప్పుడున్న జనం నడవడికను వాళ్ల ఆరోగ్య పరిస్థితినీ చూసి, నన్నూ మా ఊరి ప్రజల్నీ నడిపించేందుకు గట్టి నిర్ణయాలు చేయండి మునిసిపాలిటీ మహాశయా. ✮

# "నవ్వులపాలు"

"పట్టు దొలంగు మండ, వెసపాకుడు పట్టిన బండ, భర్తచే
పట్టని ముండ, మబ్బునెడ బాసిన యెండ ప్రపూర్ణ నీరముల్
పట్టని కుండ యుద్ధమున బాఱ దలంచిన రండ, మిత్రులే
పట్టున లేని యండ నగుబాటుకు కారణమౌ ధరాస్థలిన్"

కవిపేరు తెలియకుండా జనంలో వ్యాప్తిలో ఉన్న పద్యాలను చాటుపద్యాలు అంటారు. కవి పేరు చాటకుండా చాటున ఉంచి చెప్పిన పద్యాలివి. ఈ పద్యంలో నవ్వుల పాలయ్యే విషయాలు కొన్నింటిని 'ండ' ప్రాసతో చెప్పాడీ కవి. పైకి ఒక అర్థం కనిపించినా ఆలోచిస్తే చాలా అర్థాలు కనిపిస్తాయి ఈ పద్యంలో

1. **పట్టు దొలంగు మండ:** మండ అంటే కల్లు ముంత. అదిచెయ్యి జారితే నవ్వుల పాలు కావటమే! మండ అంటే స్త్రీ అనే అర్థం కూడా ఉంది. చేతికందిన స్త్రీని జారవిడుచుకుని నవ్వులపాలు కావటం దీని భావం కావచ్చు. సగం పగిలిన కుండని కూడా మండ అంటారు. ఇందులో వేరుశనక్కాయలు, శనగపప్పు లాంటివి వేయిస్తారు. మండలో వేగింది మండపప్పు! కొన్ని ప్రాంతాల్లో మండని మంగలం అని కూడా పిలుస్తారు. వీటిని చేజార్చుకోకూడదు.

2. **వెసపాకుడు పట్టిన బండ:** పాకుడుపట్టిన బండమీద కాలువేస్తే నవ్వుల పాలు అయ్యేది ఖాయం. బండ అంటే తెలివి తక్కువ వాడు కూడా ! పాకుడు పట్టిన బండ అంటే బుర్రనిండా బురద మట్టి ఉన్న వాడని! బండ అంటే పచ్చడి బండ. పచ్చడి చేసేప్పుడు జాగ్రత్తగా లేకపోతే పచ్చడి చింది కంట్లో పడుతుంది.

3. **భర్త చేపట్టని ముండ** : ఇందులో కూడా అనేక అర్థాలున్నాయి. భర్తచేయి పట్టుకోనిది, భర్త తన చెయ్యి పట్టుకోకుండా వదిలేయబడినది, భర్త అంటే పట్టనిది ఈ మూడు రకాల స్త్రీలనీ 'ముండ' అని వ్యవహరించాడు. భర్తతో సుఖం పొందని స్త్రీ భర్తలేని విధవతో సమానమే నని కవి ఊహ. ముండ అంటే ముండనం (గుండు) చేయించుకున్నది. స్త్రీని భర్త వదిలేసినా, భర్తని స్త్రీ వదిలేసినా నగుబాటు స్త్రీలకే ననే భావన కనిపిస్తుంది. అది అప్పటి సంగతి. ఇప్పుడు భార్యను వదిలిన వాడికి సామాజిక గౌరవమే లేదు.

4. **మబ్బు నెడబాసిన యెండ** : తెలుగులో ఓ సామెత ఉంది... 'మబ్బు విడిచి యెండ, మొగుడు విడిచిన ముండ' అని! అందుకే ఈ రెండింటినీ పక్కపక్కనే ప్రస్తావించాడు. అగ్ని ప్రమాదం జరిగిపోయాక ఫైరింజన్లు వచ్చినట్టు, అత్యాచారం

అయిపోయాక పోలీసులు వచ్చినట్టు, మబ్బులు సృష్టించి పిడుగులు విధ్వంసం అయ్యాక సూరీడు వచ్చినట్టు అక్కరకు రాని మొగుడు, మొగుడు వదిలేసి ఆడదీ నగుబాటుకు అర్హమేనని దీని భావం.

5. **ప్రపూర్ణ నీరముల్ పట్టని కుండ** : సగం ఖాళీగా ఉన్న కుండలాంటి వాళ్ళు అసంపూర్ణ ప్రజ్ఞా వంతులు, అర్ధకళా ప్రపూర్ణులు! వీళ్ళకు నగుబాటు తప్పదు.

6. **యుద్ధమున బాఱదలంచిన రండ** : యుద్ధం జరుగుతుంటే పారిపోవాలనుకునే పిరికివాడు అనే అర్థంలో పైకి కనిపించి నప్పటికీ రండ శబ్దానికున్న వెలయాలు, వితంతువు అర్థాలను కూడా పైన చెప్పినట్టే సమన్వయం చేసుకోవాలి.

7. **మిత్రులేపట్టుకుని యండ** : మట్టిబెడ్డ, ఆధారం, ఆశ్రయం ఇరుగుపొరుగు సమూహం ఇవన్నీ 'అండ' పదానికి పర్యాయాలు 'అండ' అంటే సమూహం, మిత్రులు ఏ పట్టున కూడా లేనివాడు నగుబాటౌతాడు.

ఇలా 'ండ' ప్రాసతో నగుబాటుకు దారితీసే అంశాలను ఈ పద్యంలో పేర్కొన్నాడు. పిండ(చెత్తకుప్ప) : పెండ (పేడ) : లొండ (చిల్లు) : ఫండ (నపుంసకుడు): శండ (ఆబోతు) : తొండ (రంగులుమార్చే రంగేలీ రాజా) .... ఇలా నగుబాటును సూచించే పదాలు ఇంకా అనేకం ఉన్నాయి. వీటిలో మీరుకూడా ఓ పద్యం ప్రయత్నించ వచ్చు.

సాధారణంగా చాటుపద్యాల్లో నిందాస్తుతులు ఎక్కువగా ఉంటాయి. పేరు చెప్పుకోవటానికి ఇష్టపడని వ్యక్తులు తాము పేరు తలవటానిక్కూడా ఇష్టపడని వ్యక్తుల మీద చెప్పినవి ఎక్కువ కనిపిస్తాయి.

ఈ చాటుపద్యం పుట్టు పూర్వోత్తరాలు మనకు తెలీవు. కానీ, ఇది నిత్య సత్యాలను చెప్పింది. చెయ్యిజారే అంశాల్ని, కాలు జారే అంశాల్ని, చెయ్యి వదిలేసే అంశాల్నీ, మబ్బు చాటున దాగిన సూర్యుళ్ళనీ, సగం తెలిసిన పాండిత్యాన్నీ, యుద్ధంలో వెన్ను చూపే భీరువుల్నీ, హితులూ సన్నిహితులూ లేని బతుకుల్ని నగుబాటు అయ్యేవారుగా హెచ్చరిస్తుందీ పద్యం.

ఎలా జీవించకూడదో నేర్పేదే నిజమైన వ్యక్తిత్వ వికాసం. నీతులకన్నా ఇలా చెప్తే జనం బుర్రలో నాటుకుంటుందని కవి భావించినట్టు కనిపిస్తుంది. నవ్వుల పాలు కాకుండా నిలిచే మనోబలం కావాలంటే ఇలాంటివి చదువుతూ వుండాలి.

☆

# నాంచారమ్మ కథ

"అలరుల నందనంబున
అలరారుచు నొక్క కన్య యావిర్భవమై
అలసీత మున్ను భూమిని
చెలువుగ నుదయించినట్లు శ్రీయొప్పారెన్"

శ్రీ విల్లిపుత్తూరులో కొలువై ఉన్న గోదాదేవిని మోక్ష సంపదలిచ్చేది కాబట్టి చూడికొడుత్తవళ్ అని పిలుస్తారు తమిళులు. 'చూడికొడుత్త నాచ్చారు' ఆమె పేరు. నాచ్చియార్ అని 'య' కారంతో పలకాలి. ఈమెనే నాంచారు అంటారు తెలుగువాళ్ళు. తెలుగువాళ్లలో నాంచారయ్యలూ, నాంచారమ్మలూ చాలామంది ఉన్నారు. ఈమెకు ఆండాల్, కోదై, అనే పేర్లుకూడా ఉన్నాయి. కృష్ణదేవరాయలు ఈ 'చూడికొడుత్తవళ్' జీవిత చరిత్రని ఆముక్తమాల్యద కావ్యంగా మలిచాడు. "ముక్త 'పదాన్ని మోక్షం అనే అర్థంలో జాగ్రత్తగా ప్రయోగించాడు. అత్యున్నతమైందని ఆమె సంతృప్తి చెందాకనే స్వామికి సమర్పించే తత్త్వం ఆమెకి చిన్ననాటి నుండే అలవడినట్టు చిత్రిస్తాడీ కావ్యంలో రాయలవారు.

జనకుడికి పొలంలో సీతాదేవి దొరికినట్టు, విష్ణుచిత్తుడికి తన పూలతోటలో ఈ నాంచారు దొరికింది. జనకుని కుమార్తెగా, రాముని భార్యగా సీత పూజనీయం అయ్యింది. విష్ణుచిత్తుని కుమార్తెగా, శ్రీమహావిష్ణువు భార్యగా, గోదాదేవిగా నాంచారు పూజలందుకుంది. ఇది అతి సామాన్యుడిక్కూడా తట్టే పోలిక.

కానీ, కృష్ణదేవరాయలు ఆ పుష్పవనంలో "ఒక్కబాలన్గనుగొనె" అని మాత్రమే ఆముక్తమాల్యద కావ్యంలో వ్రాశాడు. ఆయన కేదో మనసులో సందేహం ఉండి ఉంటుంది...'అయోనిజ' లాగా సీతాదేవి దొరికిందని వ్రాయలేదు. ఆ పూలతోటలో కాముకులు స్వేచ్ఛగా తిరగటాన్ని కూడా అదే ఆశ్వాసంలో వర్ణించటం చేత, ఏ పెళ్ళి కాని తల్లో, తండ్రో ఆ పసిగుడ్డుని ఈ పూల తోటలో వదిలి వెళ్ళినట్టు నర్మగర్భంగా సూచించి వదిలాడు.

దేవాతామూర్తిగా పూజలందుకున్న వ్యక్తి చరిత్ర కాబట్టి ఎన్ని మహత్తుల నైనా ఆపాదించి రాసేందుకు అవకాశం ఉన్నప్పటికీ, రాయలు సామాజిక దృష్టి తోనే ఆముక్తమాల్యద కావ్య రచనచేశాడు కాబట్టి అలా వ్రాయలేకపోయాడు.

17వ శతాబ్దికి చెందిన "'నందవర భాస్కర శేషాచలామాత్యుడు'" తన "'నాచ్చారు పరిణయం'" కావ్యంలో చెప్పిన పద్యం ఇది. "అలరులు నిండిన ఆ తోటలో అలరారె ఒక పాపాయి అలనాడు సీత భూమిలో దొరికినట్టు చెలువుగ ఉదయించింది వెలుగులు నిండగా!" అంటాడు ఈ పద్యంలో నందవర కవి. తాళ్ళపాక తిరువేంగళనాథుడు కూడా 'పరమయోగి విలాసం'లో ఇదే అర్థంలో వర్ణించాడు. ఎవరి భక్తి వాళ్ళది! కొందరికి దేవుడు ముఖ్యం. కొందరికి సమాజమే దేవుడు!

"నాచ్చారుపరిణయం"కావ్యాన్ని'రాజుపాళయం'లో తెలుగుని కాపాడాలనే ఏకైక నినాదంతో ఆవిర్భవించిన తెలుగు విద్యాలయం పక్షాన 1987లో ప్రచురించారు. యక్షగాన సాంప్రదాయంలో వెలువడిన కావ్యం ఇది.

ఈ తెలుగు విద్యాలయానికి వెన్నుదన్నుగా నిలిచిన ముదునూరి జగన్నాథ రాజుగారు తెలుగు వారందరికీ ప్రాతః స్మరణీయుడు. ఆయన బహుభాషా ప్రవీణ. ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో కూడా అనేక రచనలు చేసిన వ్యక్తి. తమిళనాట నివసిస్తున్న తెలుగు వాళ్ళు తమ మనుగడను కాపాడుకుంటూ, తమ భాషను కాపాడుకుంటూ పడుతున్న శ్రమ వర్ణనాతీతం. కొద్ది నెలల క్రితం శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారితో కలిసి రాజుపాళ్యం పరిసరాల్లో తెలుగువారి స్థితిగతులను అధ్యయనం చేయటానికి వెళ్ళే అవకాశం నాకు దొరికింది. ఆ సందర్భంలో కీ.శే. ముదునూరి జగన్నాథరాజుగారి ఇంటిని సందర్శించాము. ఆయన కుమార్తె, అల్లుడు రాధాకృష్ణరాజుగారు ఇద్దరూ అంకితభావంతో జగన్నాథ రాజు గారి స్మృతుల్ని పదిలపరచిన తీరు ఆశ్చర్యం కలిగిస్తుంది. రెండస్థుల మేడలో జగన్నాథ రాజుగారి గ్రంథాలను తెలుగు గ్రంథాలయంగా నడుపుతున్నారు.

తమిళనాడులో ఎందరో తెలుగువాళ్ళు తాము తెలుగువారిమని చెప్పుకునే ధైర్యంలేని స్థితి నడుస్తోంది. అయినా, తంజావూరు, మేలట్టూరు, మధురై, రాజుపాళ్యం, హోసూరులాంటి ప్రాంతాల్లో తెలుగు భాషా సేవకులు భాషకోసం పడ్తున్న 'ఆర్తి' చూస్తే ఆశ్చర్యం అనిపిస్తుంది. ☆

# నీకు నీవే వడ్డించుకో..

**"అనుటయు( బకపక నగి య/వ్వనజజు(దను నీకు నీవె వడ్డించుకొనన్**
**జనునే/ యిప్పుడు నీ కి/వ్వనిత పొస(గ దరుగు, మగుడ వచ్చిన త్రోవన్"**

భూలోకంలో త్యాగ మూర్తులు చచ్చి స్వర్గానికి వెళ్ళి నానా వ్యభిచారాలు చేస్తూ సుఖిస్తారని మన కవుల నమ్మకం. కన్యాశుల్కంలో గురజాడ చెప్పినట్టు కొందరు బొంట్లు బతికినంత కాలం యాంటీనాచ్చి, చచ్చాక రంభాదులతో ప్రోనాచ్చి వ్యభిచారం అనుకుంటారు.

స్వర్గంలో ఈ ప్రోనాచ్చిలంతా ఒకసారి ఇంద్రసభలో కొలువుదీరి ఉండగా, అప్సరసల్లో ఎవతె గొప్పదనే అంశం చర్చ కొచ్చింది. మహా తాపసులంతా ఎవరి అనుభవం కొద్దీ వాళ్ళు తలా ఒక పేరూ చెప్పారు. వివాదం ముదిరంది ! ముఠాలు, గ్రూపులుగా చీలి ఆంధ్రా అసెంబ్లీ మాదిరి నాలిక మడిచి తిట్టుకోవటం, రా!రా! చూసుకుందాం అని కొట్టుకోవటం దాకా వ్యెంది సీను. ఇంద్రుడు వెళ్ళి, ఎవరు మేటిగత్తె అనేది తేల్చమని బ్రహ్మని అడిగాడు. బ్రహ్మగారు, "రంభ జడప్రాయ, ఊర్వశి నలుపు, చిత్రరేఖ జీవంలేనిది, వామన పొట్టిది, శశిరేఖ వక్రాంగి, తిలోత్తమ గానుగ రోలులా ఉంటుంది" ఇలా అందరికీ తలా ఒక వంక పెడతాడు. ఉత్తమ శాసనసభ్యుడు ఎవరు, ఉత్తమ మంత్రి ఎవరు? ఇలాంటి ప్రశ్నల్ని ఓటరు దేవుణ్ణి అడిగి చూడండి.. ఆయనా ఇలానే సమాధానం చెప్తాడు.

అప్పుడు ఇంద్రుడు "గోరంత యొచ్చెంబు లేని ఒప్పులకుప్పను సృష్టించ"మని అడిగాడు. బ్రహ్మగారు అహల్యని సృష్టించాడు. ఇంద్రుడా అమ్మాయిని చూసి, "దేవ రాజ్యేందిర వోలె బాల నను జేరుట యుక్తము" ఈ అమ్మాయికి నేను మాత్రమే తగినవాణ్ణి అంటాడు. ఆమాటకు పకపకా నవ్వి బ్రహ్మ చెప్పిన పద్యం ఇది. "ఇంద్రుడా? నీకు నువ్వే వడ్డించు కోవాలను కుంటున్నావా? ఇప్పుడీ అమ్మాయి నీకు తగదు"అంటాడు.

తనకు తానే వడ్డించుకునే ఇంద్రుళ్ళు మనకు పంచాయితీ స్థాయి నుండి పార్లమెంటు స్థాయి వరకూ అన్ని దశల్లోనూ, అన్ని దిశల్లోనూ ఉన్నారు. ఎవరికి వాళ్ళు అలా డిసైడు చేసేస్తే ఇంక ప్రభుత్వం దేనికీ? పాలన దేనికీ అనేది నాలుగు తలల దేవుడి ప్రశ్న. ఓటరు దేవుడి లాగానే బ్రహ్మదేవుడి క్కూడా విసుగొచ్చింది. తనకు తానే వడ్డించు కోవాలనుకునే వాడికి ఓ వాత పెట్టాలనుకున్నాడు. అహల్యను తీసుకుపోయి, గౌతముడనే వ్యభిచారం ఎరగని అరసిక శేఖరుడికి కట్టపెట్టాడు. తర్వాత అహల్య కథ మనందరికీ తెలిసిందే!

వాడికి కాదని వీడికి అధికారం కట్టబెట్టాక, వాడు చేసిందీ, వీడు చేసిందీ, చివరికి దేశం గతి ఏమయ్యిందీ మనం కళ్ళారా చూస్తున్నవే! అధికారపక్షం, ప్రతిపక్షంలాగా ఇంద్రుడు, గౌతముడు అహల్యను వేధించారు. "నమ్మిన దాన, నా తనువు నమ్మిన దాన!" అని అహల్య బాధపడేలా కథ నడుస్తుంది.

ఇది "అహల్యా సంక్రందనము" కావ్యంలోని పద్యం. సముఖ వేంకట కృష్ణప్ప నాయకుడు వ్రాసిన ఈ కావ్యం చిన్నదే! అర్థ తాత్పర్యాలు అవసరం లేకుండానే అర్థం అవుతుంది. ఈ కావ్యంలో నిత్య లోకసత్యాలు అనేకం కనిపిస్తాయి. "లతకూన తాపస తరువు(గార చెట్టు)ను అల్లుకున్నది" "ఆడ పుట్టువున నాహా! పుట్టనౌనా?" "బొమ్మ (బ్రహ్మ) యే వాడు, పెనురాతిబొమ్మ గాని?" లాంటి వాక్యాలు మనసుకు తగులుతాయి. "బలారాతిని గోరి కూడితివి రాతిరి జామున గావునన్ బలా! రాతి శరీర మందుము" అంటూ, గౌతముడు శపించే సన్నివేశాన్ని ఇంత లలితంగా చెప్పటం ఈ కవికే చెల్లింది. "కుచ ఆనన అంగరుచి", "గిన్నెలతో నెలతో లతోన్నతితో", "కందరమై దరమై రమైక్యమై" "కోయిలకో యిలకో లకోరికో", "బాల హరిన్ లహరిన్ హరిన్" లాంటి అనేక ప్రయోగాలను ఒకే పద్యంలో చేసి పదాలతో బంతులాడుకున్నాడు కవి. "అహల్యా కచకుచములంట గలిగినచో ఏడు కొండల రాయని కేను భక్తి గనక శిఖరములెత్తింతు" నంటాడు ఇంద్రుడు. అహల్య కుచ శిఖరాలు అంటుకోగలిగితే ఏడు కొండలు ఎక్కివస్తానని ఇంద్రుడు మొక్కుకున్నాడట.

అహల్యా సంక్రందనంలో దేవీయత ఇలా వర్ధిల్లింది. తిరుమల నాయకుడి మనుమడు చొక్కనాథ నాయకుడు. ఆ చొక్కనాథ మనుమడు విజయరంగ చొక్కనాథుడు. అతని ఆస్థానకవి ఈ సముఖ వేంకట కృష్ణప్ప. అతని కాలానికి దక్షిణాంధ్ర యుగం చరమ దశకు చేరుకుంది. శృంగార వర్ణనల్లో 'అతి' తగ్గి, పద చమత్కారాల ...రుచి' పెరగటం వలన ఆ క్షీణ యుగంలో భాషకు మేలే జరిగింది. పచ్చి బూతుని ఎత్తి చూప లేదని, మసహాళ్లు ముద్దుపళని రాధికా సాంత్వనాన్ని నెత్తిన పెట్టుకున్నట్టు ఈ కావ్యాన్ని గౌరవించలేదు. "మాధుర్యామల సాహితి రసిక శిఖామణికిని గాని, మడ్డిగానికి దగునే?" అని ఈ కవి ఎంత కడుపు మండి అన్నాడో!

అహల్య అంటే ఊసర క్షేత్రం. దున్నని నేల. ఇంద్రుడు వర్షాధిపతి. వానరాకడతో నేల పులకరించింది. ఆ భూమి గౌతముడిది. అతను వ్యవసాయం చేయలేదు. రాళ్ళూ రప్పలతో నిండిపోయింది నేల. రాముడొచ్చాడు. అహల్యను హల్యం ద్విహల్యం, త్రిహల్యం చేశాడు. నేలను దున్ని సాగు చేశాడు. రాతిని నాతిని చేశాడు. సిరిసంపదలు వర్ధిల్ల చేశాడు.

వ్యవసాయాన్ని ప్రోత్సహించిన వాళ్లంతా దేవుళ్ళయ్యారు. పంటలు, వంటలు, నీటి కుంటలు దండగ అనే వాళ్లు భూముల్ని తమకు తామే వడ్డించు కుంటున్నా రిప్పుడు. అందినకాడికి దండుకోవటమే రాజనీతి. ★

# నేటికాలపు వేస్టు చదువులు

**బెంచీలక్కరలేదు, గేమ్సు మొదలౌ ఫీజుల్ వినన్ రావు, పొ**
**మ్మంచు న్నిర్ధను(దోసి పుచ్చరు గురుల్, ప్యాసైననే లాభ మిం**
**దంచున్నేమము లేదు, మీ చదువునందాలోక మీలోకమున్**
**గాంచన్ వచ్చెడి నార్యులార! మ్రొక్కంజెల్లు నెక్కాలమున్.**

తిరుపతి వేంకట కవుల కాలానికి, చాందసవాదం, భూస్వామ్య వాదం, బూర్జువాయిజం లాంటి పదాల వ్యాప్తి లేదు. వాటి గురించిన అవగాహన కూడా ఆ కవులకు లేదు. ఆనాటి మేథావులు మానవతా వాదానికి పరిమితంగా ఉండేవాళ్ళు అలాగని అంటరాని తనాన్ని వ్యతిరేకించటం లాంటి విచక్షణాపూర్వక అంశాలను పెద్ద స్థాయిలో ఖండించిన సందర్భాలు కూడా అరుదు. బ్రహ్మసమాజం లాంటి సంస్థలు సామాజిక సంస్కరణలను కోరాయిగానీ, అస్పృశ్యత లాంటి అంశాలకు ప్రాధాన్యత ఇచ్చినట్టు కనిపించదు. వీరేశలింగంగారు కూడా విధవాపునర్వివాహం లాంటి సంస్కరణలకే పరిమితం అయ్యారు.

1920లో గాంధీని కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నుకున్న బెజవాడ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో అంటరాని తనం నిర్మూలనను ఒక కార్యక్రమంగా చేపట్టాలని నిర్ణయించారు. తనకన్నా ముందే ఆంధ్రులు హరిజన సేవా కార్యక్రమాలు చేపట్టారని గాంధీగారు స్వరాజ్య పత్రికలో రాసుకున్నాడు కూడా! ఇరవయ్యవ శతాబ్ది తొలినాటి పరిస్థితి అది!

మొత్తం మీద జాతీయతా వాదం బలపడ్తున్న ఆ రోజుల్లో ఆంగ్లేయులు తెచ్చిన ఆధునికతను సిద్ధాంత రీత్యా వ్యతిరేకించిన సంస్కర్తలే ఎక్కువ. తిరుపతి వెంకట కవులు తమ కాలంలో విస్తరించిన ఇంగ్లీషు చదువుల గురించి తమ వ్యతిరేకతను పై పద్యంలో చాటుకున్నారు. ఒక అడుగు ముందుకు వేసి గురుశిష్య పరంపర పద్ధతిలో చదువుకొనసాగిస్తే క్లాసురూములూ వాటిలో బెంచీలూ అక్కరలేదనీ, గేమ్సు మొదలైన వాటికి ఫీజులు కట్టాలనే మాటలే వినరావనీ, ఫీజు కట్టలేక పోయిన నిర్ధనుణ్ణి క్లాసులోంచి వెళ్ళి పొమ్మనటం లాంటివి జరగవనీ ప్యాసైతేనే పైక్లాసులోకి వెళ్ళటం లాంటి నియమాలేవీ ఉండవనీ అంటారు ఈ పద్యంలో తి. వేం. కవులు.

ఇంకో పద్యంలో చెప్పులకాళ్ళు, క్రాఫింగ్ చేయించిన తలకాయలు, ముఖాన విబూది రేఖల్లేని శూన్యలలాటం, గొప్ప బడాయి వేషాలు, కుచ్చుల పాగలు (చెప్పులు, బూట్లూ) కోట్లు, కంఠమందొప్పెడి పట్టముల్(టై), ఇలాంటివేషాలతో కనిపించే గురువులు, శిష్యులూ నీకు లేరుకదా...తంద్రీ చిరాయువై బ్రతుకు, అమ్మా! ఓ వేదమాతా నీకు మొక్కుతున్నాను... అంటాడు. ఇలా ఆధునిక విద్యలు గురుశిష్య సంబంధం చెడ గొట్టాయనే ఆవేదన వాళ్ళ పద్యాలలో కనిపిస్తుంది.

గురువు తనకొచ్చిందంతా శిష్యుడికి నేర్పేవాడు. గురువు దగ్గర సరుకున్నంత మేర విద్యార్థి ఆయన దగ్గరే ఉండేవాడు. శిష్యుడికి అన్నం పెట్టి చదువు చెప్పేవాడు గురువు. ఈ రోజుల్లో అలాంటి చదువులు అసాధ్యం అంటారు గానీ, సంగీత నృత్యాది కళలు నేర్పించే వారి దగ్గర, వేదాధ్యయనం చేయించే వేద పాఠశాలల్లోనూ, మోటారు మెకానిక్‌లు దగ్గర, వడ్రంగం మేస్త్రీల దగ్గరా ఇతర వృత్తి విద్యలు నేర్పేవారి దగ్గరా ఇంకా ఈ నాటికీ గురు శిష్య పరంపర కొనసాగుతూనే ఉంది. కంప్యూటర్‘కు సంబంధించిన జావా, ఒరాకిల్, డీటీపి లాంటి విద్యల్ని ప్రైవేట్ సంస్థల్లోనే నేర్చుకుంటున్నారు. నిజానికి ఇలా నేర్పే వాటిలో చాలాభాగం విద్యాసంస్థలు కావు. మామూలు టైపు ఇన్‌స్టిట్యూట్ లాంటివే! కాబట్టి గురుశిష్య సంబంధం అలాంటి చోట్ల కొనసాగుతూనే ఉంది.

తెల్లదొరల మెకాలే విద్యావ్యవస్థ నుండి, నల్లదొరల కార్పొరేట్ విద్యావ్యవస్థ వరకూ సాగిన ఈ నూట యాబై యేళ్ళ కాలంలో గురువును ఫీజులు కట్టే విద్యార్థికి బానిసను చేయటం, డబ్బు పారేస్తాం, ఎంత చెప్తావో చెప్పమనే ధోరణి రావటం విద్యారంగానికి మేలు చేసేవని అభ్యుదయవాదులెవరూ అనుకోరు.

ఆనాడు, గురుకులం పద్ధతిలో చదువులు అగ్రవర్ణాల వారికే పరిమితంగా ఉండటం వలన అందరికీ విద్య కోసం పాశ్చాతుల విద్యా పద్ధతుల్ని అనుసరించక తప్పలేదు. కానీ, విద్య ఇలా వక్రమార్గాన పడటం కూడా ఇబ్బందికరమైన విషయమే! గురుకుల వ్యవస్థను ఆనాడు భూస్వామ్య అనుకూలవాదం, ఫ్యూడలిజం అవశేషాలుగా భావించారు. కానీ, విద్యారంగ ఆధునీకరణ ఇంతగా పాశ్చాత్యీకరణం చెందకుండా గట్టి పోరాటాలు జరిపి ఉంటే బావుండేదనిపిస్తుంది.

ఫీజుల్లేని చదువులూ, డిగ్రీలు లేని పాండిత్యంతో ప్రసిద్ధులైన మల్లంపల్లివారిలాంటి మేధావులు వ్రాసిన గ్రంథాలను దాటి అదనంగా మన విశ్వవిద్యాలయాల ఆచార్యులూ, ప్రాచార్యులూ వ్రాసింది తక్కువ. మేధా సంపత్తికి డిగ్రీలూ, ఉద్యోగ హోదాల్ని కొలబద్దగా తీసుకునే దౌర్భాగ్యం పోవాలి. ★

# న్యాయపాలన

**"చతురంగ బలములు విజయవాడ దుర్గాంబ వరమున బడసి దుర్వారలీల**
**జగతి స్థలం బెల్ల సాధించి జయశాసనములు దిగ్ధంతి దంతముల సలిపి**
**పేదబాలునకుగా బ్రియసుతమోహంబు పట్టక బెజవాడ బాడి నిలిపి**
**కలయంగ బురమున గాంచన వర్షంబు గురియించి దేవతాకోటిపొగడ..."**

ఇది దగ్గుపల్లి దుగ్గన రచించిన నాసికేతో పాఖ్యానము కావ్యంలో పద్యం. ఇందులో విజయవాడ విష్ణుకుండిన రాజు మాధవవర్మ గురించిన కథ మొత్తం నాలులైన్లలో చెప్పేశాడు కవి. నిజానికి తలగడంత పుస్తకమే వ్రాయగల సమాచారం ఈ కథకు ఉన్నప్పటికీ దుగ్గన కవి ..కట్టె కొట్టె, తెచ్చె, వదిలె'అని రామాయణం చెప్పినట్టు నాలుగు వాక్యాల్లో ఈకథను ఇమిడ్చి, ఈ పద్యం చెప్పాడు.

మాధవవర్మ విజయవాడ దుర్గాంబ దయతో చతురంగ బలాలూ సము పార్జించు కున్నాడు. అనేక ప్రాంతాలు జయించి జయశాసనాలు నెలకొల్పాడు. ఒక పేదబాలుడు రథం కిందపడి చనిపోతే అతని చావుకు కారకుడైన తన కొడుకుని, పుత్రవాత్సల్యం చూపించకుండా మరణశిక్ష విధించి, బెజవాడ కీర్తిని చాటాడు. దాంతో దేవతాకోటి పొగిడి, నగరంలో బంగారం వాన కురిపించారు. ఇదీ ఆనాలుగు మాటల కథ.

ఎవరీ మాధవవర్మ...? విజయనగరం జిల్లా విజయనగరం సంస్థానా ధీశులైన పూసపాటి వారి తాత ముత్తాతల ముత్తాత తాత ఈ మాధవవర్మ. విష్ణు కుండినులు క్రీ.శ. 4 నుండి 7వ శతాబ్దివరకూ 23జిల్లాల ఆంధ్రప్రదేశ్'ని పాలించిన ఘనులు. వాళ్ళకు ఆ రోజుల్లో చాలా రాజధాని నగరాలుండేవి. బెజవాడ వాళ్ల ప్రధాన రాజధాని.

14-15 శతాబ్దాల వాడైన దుగ్గన కవి ఈ పద్యంలో విజయవాడ, బెజవాడ అని, రెండు పేర్లూ వాడాడు. అతని కాలంలో బందరు-మచిలీపట్టణం అన్నట్టు ఈ రెండు పేర్లూ పర్యాయాలుగా వాడుకలో ఉండి ఉంటాయి.

విష్ణుకుండినులు జైన బౌద్ధాలకు వ్యతిరేకంగా వైదిక ధర్మాలను, వైదిక దేవతలను, సంస్కృతభాషను బాగా ప్రోత్సహించి, ఉత్తరాది వారికి ఆశ్రయాన్ని కల్పించారు. ఆ ఉత్తరాదివాళ్ళు తెలుగువాళ్లలో తెలుగువాళ్లుగా కలిసి పోయారు.

కానీ, మన వాళ్ళు తాము తెలుగువాళ్ళం అన్న సంగతి మరిచిపోయి, సంస్కృత భాషకు "దాసోహం" అన్నారు. ఇప్పుడు ఇంగ్లీషు విషయంలో జరిగిందే అప్పట్లో సంస్కృతం విషయంలో జరిగింది. సంస్కృత మెకాలేలు తెలుగు పేరెత్త నీకుండా పాలించారు. మాతృభాషాభి మానం మన రక్తంలోంచి తప్పుకోవటానికి ఇది కూడా కారణమే!

ఏది ఏమైతేనేం క్రీ.శ. 4వ శతాబ్దికి చెందిన మాధవవర్మ గారు బెజవాడ ప్రశస్తిని నిలబెట్టారు. మాధవర్మని మెచ్చుకోవటం కోసం దుర్గమ్మ బంగరు వాన కురిపించి తాను' కనకదుర్గ' అయ్యింది.

పాలకుడు న్యాయబద్ధంగా వ్యవహరించాలే గానీ, దుర్గమ్మ బెజవాడలోనే కాదు, పాలకుడి ఇంటి పెరట్లో కూడా కనక వర్షం కురిపిస్తుంది. బెజవాడలో తుఫానులు తప్ప మామూలు వానలు అరుదు. చక్కగా పాలిస్తే, వానతోపాటు బంగారు నాణాల వడగళ్ళు కూడా పడతాయని దుగ్గన కవి గారి నమ్మకం. అందుకే, తన కావ్యాన్ని అంకితం ఇచ్చుకునే సందర్భంలో బెజవాడ మాధవవర్మను తలచుకున్నాడు.

బండిని ఎవరు నడుపుతున్నా యాక్సిడెంట్ అయినప్పుడు, బండి యజమానే నష్టపరిహారం ఇచ్చుకోవాలనేది మాధవర్మ తీర్పు సారాంశం. సుప్రీంకోర్టు కూడా బండి యజమానిని బాధ్యుణ్ణి చేస్తూ తీర్పు నిచ్చింది. అందుకే యజమాని ప్రతి ఏడాది థర్డ్' పార్టీ ఇన్సూరెన్సు కడుతున్నాడు. మన బండి వెళ్ళి అవతలి వాడిమీద పడనవసరం లేదు, అవతలివాడే వచ్చి మన బండిమీద పడి దెబ్బతిన్నా థర్డ్ పార్టీ ఇన్సూరెన్సు ఉపయోగపడుతోంది.

మన చరిత్ర కథల్లో నేటి కాలానికీ వర్తించేవి చాలా ఉన్నాయి. వాటిని ఆపాదించుకో గలగాలి అంతే! ☆

# పకోడి - చెకోడి - కోడిబడి ...

కరకరలాడు కొంచెమగుకారము గల్గు బలాండువాసనా
హర మగుగొత్తిమీరయును నల్లము గన్పడు నచ్చటచ్చట
ధరను బకోడిబోలెడు పదార్థము లేదని తద్రసజ్ఞు లా
దరమునబల్కుచుందు రది తాదృశమే యగునంచుదోచెడిన్

కరకరలాడుతుంటాయి. కారంకారంగా ఉంటాయి. ఉల్లిపాయలవాసన ఘుమాయిస్తూ ఉంటుంది. వాటిమీద కొత్తిమీర, అల్లం, అక్కడక్కడా కనిపిస్తూ ఉంటాయి. ఈ భూమ్మీద పకోడీని మించిన రుచిగల పదార్థం లేనే లేదని దాని రుచినెరిగిన వారు చెప్తుంటారు. అది నిజమేననిపిస్తోంది...అని, ఓ అవధానంలో పకోడీ గురించి అడిగిన ప్రశ్నకు తిరుపతి వేంకట కవులు కొంటెగా చెప్పిన సమాధానం ఇది.

యశోద తన "ముంగిటముత్యం" బాల కృష్ణుడికి రకరకాల వంటకాలు చేసి, ప్రేమమీరా తినిపించింది. అందులో పకోడీలు కూడా ఉన్నాయని సూరదాసు వర్ణించాడు. అంటే, సూరదాసు కాలానికి పకోడీలు వాడకంలో ఉన్నాయన్నమాట. పకోడి-చెకోడి లలో కోడిబడి ఈ "కోడి" ఏమిటీ? 'కోడి' అనే శబ్దానికి గుడ్డు పెట్టే కోడి అనే అర్థంతో పాటు, చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి పల్లంగా ఉన్న వైపున కట్టిన ఒక రాతి కట్టడం అనీ, కోడీ అనే ఒక "బంగారు ఆభరణం" అనీ అర్థాలు కనిపిస్తాయే గానీ ఒక భక్ష్యవిశేషం అనే ప్రత్యేకమైన అర్థం లేదు. కోడితనం అంటే హేళన. కోడిగం అంటే ఒక శృంగార చేష్ట, వంచన, కొంటెతనం!

సామాజిక వ్యవహారా లన్నింటికీ ఒక ఎన్ సైక్లోపీడియా లాగా ఉపయోగపడే "హంసవింశతి" తెలుగు కావ్యంలో 'కోడిబడి' వంటకం గురించి ఉంది. పిల్లలు ఇష్టంగా తినే ఒక దినుసు, పిండివంట అని దీనికి శబ్దరత్నాకరం మొదలైన నిఘంటువుల్లో అర్థం ఇచ్చారు. పకోడీకీ ఈ కోడిబడితో సంబంధం ఉందా అనేది అనుబంధ ప్రశ్న! కోడితో చేసిన వడలు "కోడివడలు". ఈ "కోడివడలు" జనవ్యవహారంలో కోడిబడులుగా మారి ఉండవచ్చు. మరి ఈ "కోడి" ఏమిటీ?

షుమారుగా పాతిక వరకు ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలు భారత దేశంలో జీవిస్తున్నారు. జి బ్రొన్నికోవ్ రూపొందించిన "ద్రవిడియన్ ఎటిమాలజీ" అనే

నిఘంటువులో 'కోడ్-ఇ" పదానికి "జొన్నలు" అనే అర్థం కనిపిస్తుంది. "కోళ్ళు" అంటే, జొన్నలు. చోళ్ళుగా కూడా ఇవి ప్రసిద్ధి పొందాయి. తవిదలు లేదా తైదులంటే, రాగులు. గంటె లంటే, సజ్జలు. కోడిపిండి లేదా జొన్న పిండితో చేసిన చిరుతిండి వంటకాలను పకోడి చేకోడి పేర్లతో పిలిచి ఉంటారనే నిర్మాణాత్మక ఊహతో మనం కొంత ముందుకు కదలవచ్చు.

'పకోడీ' అనే వంటకం 'పకోరా' "పక్వవటుకం" అనే సంస్కృత పదం లోంచి ఏర్పడిందని కొందరి అభిప్రాయం. భారతీయ వంటకాలన్నింటినీ పంజాబుకో, గుజరాతుకో, బెంగాలీలకో అంటగట్టి రాయటం వలన, పకోడీల విషయంలో దక్షిణాది వారి పాత్ర , తెలుగువారి పాత్ర ఉన్నదని ఎవ్వరూ ఆలోచించినట్టు కనిపించదు. ఒకవేళ ఆలోచించినా తమిళం వరకూ చూసి వదిలేశారు. అనాదిగా తెలుగువారికి చరిత్ర పరంగా జరుగుతోన్న అన్యాయం ఇదే కదా!

తడిపిన జొన్నపిండి ముద్దని సన్నని బలపం ముక్కలా చేసి చేతి వేలిమీంచి తిప్పి ఉంగరాల్లా చేస్తారు కాబట్టి, చేతి కోడీలు చేకోడీలు, చేగోడీలు అని వ్యవహరించి ఉంటారు. జొన్నపిండి పక్వం కాబట్టి పకోడి సార్థకనామధేయి అయ్యింది.

మన ప్రాచీన సాహిత్యంలో తెలుగు వారి ఆహార పదార్థాలకు సంబంధించిన వర్ణనలు, వాటని వండే తీరు చాలా చోట్ల ఉబలాటంగా కవులు వర్ణించారు. ప్రాచీన శాసనాలలో కొంత సమాచారం దొరకుతుంది. తెలుగువారి ఆహార చరిత్ర నిర్మాణానికి ఇవన్నీ కీలకమైన అంశాలే !

అయితే, మన సాంఘిక చరిత్రకారులు దురదృష్ట వశాత్తు 'ఆహార చరిత్ర' ని పట్టించుకోకుండా వదిలేస్తారు.

పట్టించుకుంటే 'కోడి శబ్దానికీ, 'చోడి' శబ్దానికీ సారూప్యత గురించి ఆలోచించి ఉండేవాళ్ళం !! ✯

# పట్టణ నాగరకత

"పద్మినీ పద్మాతపత్రంబు శిథిల పత్రాగ్రమై రాయంచ యాశ్రయించె
దాలు స్రవత్ఫేన జాలుబుతో ఘోణిపంచల రొంపి గలంచి యాడె
దూరొద్గమద్భావ ధూమ మంబుద బుద్ధి నెమ్మిలో పొదనుండి నిక్కిచూచె
జఠరస్థ జలము నాసానళమున బీల్చిసామజంబరు ప్రక్క జల్లుకొనియె
సరసిపై నీరు సలసల తెరలి
సకల వీథులు నిర్నృగోచ్ఛయములయ్యె
మిట్టమధ్యాహ్నమిది సుధామధురవాణీ
యరమిచ్చొ బథ: శ్రమ మపనయింప"

ఎండకు విరుగుడు నీడ. దాహానికి విరుగుడు నీళ్ళు. ఆ నీళ్ళు కూడా ఎండ తీవ్రతకి సలసలమంటున్నాయి. జలాశయాలు వేడెక్కిక్కేటంత ఎండలో కూడా జీవరాశికి అంతో ఇంతో సేద తీరే సౌకర్యం ఉన్నప్పుడే అది మహానగరం అవుతుందని అగస్త్యుడు లోపాముద్రతో చెప్తున్నాడీ పద్యంలో!

ఎండ మండి పోతుంటే, ఒక రాయంచకు దిక్కుతోచలేదు. అప్పటికే దాని రెక్కలు అలిసిపోయాయి. ఆ చెరువులో తామరాకు అడుగున దూరి చల్లదనాన్ని అనుభవి స్తోందట. తామరాకు అడుగునైతే నీడ చల్లదనం రెండూ ఉంటాయని!

ఎండకి శోష వచ్చి రొప్పటం వలన ఒక వరాహం నోట్లోంచి నురుగులు కక్కుతోంది. చెరువు దగ్గర దానికి బురద కనిపించే సరికి ఎక్కడలేని ప్రాణాలూ లేచి వచ్చి, బురదలో పడి దొర్లిందట.

దూరంగా దావాగ్ని ముంచుకొస్తోంది. నల్లపొగలు కమ్ముకుంటున్నాయి. ఆ నల్లపొగని నల్లమబ్బులనుకుని ఎండకు తట్టుకోలేక ఎక్కడో పొదలో దాగి కూర్చున్న ఒక నెమలి ఆశకొద్దీ, తలకాయి బైటపెట్టి మెడ నిక్కించి తొంగి చూస్తోందట.

కడుపులో దాచుకున్న నీళ్ళనే తొండంతో బయటకు లాగి వీపు మీద పోసుకుని ఒక యేనుగు ఊరట పొందుతోందట...

చాలా జంతువులకు చర్మంలో స్వేదగ్రంథులు మనుషుల కున్నంతగా ఉండవు. అందుకని వాటి శరీరంలో జీవనక్రియల వలన ఉత్పన్నమయ్యే వేడిని చల్లార్చేందుకు కావలసినంత చెమట పట్టకపోవటంతో మనుషుల కన్నా జంతువులు నీళ్ళకోసం

ఎక్కువ అల్లాడతాయి. పంది బురదనే మెచ్చటానికి కారణం బురద ఎక్కువ సేపు దాని చర్మాన్ని చల్లగా ఉంచుతుంది కాబట్టి! ఇతర జంతువులు కూడా చెరువులో దిగి స్నానం చేసి ఒడ్డుకువచ్చి ఒంటిమీద దుమ్ము ఎత్తి పోసుకుంటాయి. ఎందుకంటే ఆ తడి ఎక్కువ సేపు నిలబడి ఉంటుందని! తెలుగునాట చెరువుల్ని అశ్రద్ధ చేయటం వలన పాడి పరిశ్రమ కూడా దెబ్బతింది. రైతాంగం తెలిసి చేసిన తప్పే ఇది. చెరువులు లేని ఊళ్ళలో జల్లు స్నానాలతో పశు సంపద బతకలేదు.

చెరువులో నీళ్ళు సలసల తెరలేంతగా ఎండ మిట్ట(మట్ట) మధ్యాహ్నం మండి పోతుంటే, వీధులన్ని నరసంచారం లేక వెలవెలబోతున్నాయి. "చేసేదేమీ లేదు, ఇక్కడే ఎక్కడో నీడపట్టున కాసేపు సేదతీరుదా"మంటున్నాడు అగస్త్యుడు, తన భార్య లోపాముద్రతో! తెనాలి రామకృష్ణుడి పాండురంగ మాహాత్మ్యంలోది ఈ పద్యం. నగరంలో ఎండా, వానల బారినుండి కాపాడే ఏర్పాట్లు లేకపోతే ఊళ్ళోకి వచ్చేవాళ్ళు అగస్త్యుడిలానే అగచాట్లు పడాలని తెనాలి కవి ముఖ్యంగా రాజధాని నిర్మాతలను హెచ్చరిస్తున్నాడు.

భగభగ ఎండలు, సుడులు తిరిగే తుఫానులు, వెల్లువెత్తి వచ్చే వరదలకు ప్రసిద్ధి చెందిన బ్లేజ్‘వాడ దగ్గర కొత్త రాజధాని వస్తోంది. రేపటినుండీ ఈ రాజధాని నగరానికి వచ్చే అగస్త్యులు, లోపాముద్రల కోసం ముందు చూపుతో తగిన ఏర్పాట్లు చేయవలసి ఉంది.

మానవులతో పాటు, ప్రకృతి, పర్యావరణం, పశుపక్ష్యాదుల సమజీవనం, సహజీవనం సాగనిస్తేనే అది ప్రపంచ స్థాయి ప్రజానగరం అవుతుంది. నగరాల వెలుపల మురుగువాడలు కాదు, వ్యవసాయ క్షేత్రాలు ఉండాలి.

మౌలికంగా వ్యావ సాయిక దేశం మనది. ఈ దేశంలో పట్టణ నాగరికత పొసగేది కాదు. పట్టణ నాగరికత ముదిరితే చివరికి సింధు నాగరికతకు పట్టినగతే పడ్తుంది. వ్యవసాయాన్ని, పశుపోషణనీ కొనసాగనిచ్చిన నగరాలు పదికాలాల పాటు పదిలంగా ఉంటాయని తెనాలి వాని భావం. ☆

# పట్టుబట్టిన వాడిదే గెలుపు

నిలువున నొలిపించె విలువంగడమునెల్ల
శరముల యాయంబు బొరయుటుడిపె
దగ శబ్ద మాత్రపాత్రముచేసె గుణలత
బ్రాకున గట్టించె మౌలబలము
గంచుకివశముగావించె సేనానాథు
గమరించె సహచరు(గటికి యెండ
బ్రతిపక్షభావ సంగతు(దని హితు(జూచె
వరగతకేతనము కీర్తిభరము దులిపె ధర్మనిర్మల బుద్ధి సుశర్మ(గదిసి
గెలువగాలేక చనికోపగించి మదను(
దుఱకతనవారలతనికి నోదుమనిరె?
పతికి( గీడౌటుబంట్ల పాపంబుగాదె?

సుశర్మ అనేవాడు నిండు యవ్వనంలోనే సన్యసించాడు. అతన్ని సంసారపు దారుల్లోకి తేవాలని మన్మథుడు ఎంతో ప్రయత్నించి చివరికి ఓడిపోయాడు. తెనాలి రామకృష్ణుడు పాండురంగమహాత్మ్యంలో సుశర్మోపాఖ్యానంలో చెప్పిన పద్యం ఇది. పట్టు పట్టకూడదు. పడితే విడవకూడదని వేమనగారు చెప్పినట్టు సుశర్మ, మంచికో చెడుకో ఒక నిర్ణయం తీసుకున్నాడు. ఇంక అంతే! దానికి తిరుగు ఉండకూడదని భావించాడు. ధర్మనిర్మల బుద్ధి సుశర్మ! అది అతని స్వభావం అన్నమాట. అతన్ని కదిసి అంటే గెలవలేక చేసేది లేక పరువు పోయిందని బాధపడి ఆ కోపంతో మన్మథుడు ఏం చేశాడో ఈ పద్యంలో వర్ణన!

1. చెరకుగడ (విలువంగడం) మన్మథుడి విల్లు. తన విల్లు తనకు ఎందుకూ పనికి రాకుండా పోయిందని కోపంగా ఆ చెరకుగడని నిలువునా వలిపించేశాడట. ధనస్సు వంశాన్ని అంటే మొత్తం చెరకు తోటనే నరికించి ఆకులు వలిపించి చెరకుగడల్ని వేరు చేశాడు.

2. మన్మథుడి పుష్పబాణాలు ఇన్నాళ్ళూ మన్మథుడికి ఊడిగం చేశాయి. ఇప్పుడు అవి సరిగా పని చేయలేకపోయాయి కాబట్టి వాటి జీతాన్ని ఆపేశాడట. శరాలు ఆయం (రాబడి) పొరయుట (పొందటం) ఉడిపెన్...నిలుపు చేశాడట.

3. కొందరు ముఖ్యమంత్రులో. ప్రధానమంత్రులో అపనమ్మకం ఉన్న వ్యక్తుల్ని మినిష్టర్ వితౌట్ పోర్ట్ ఫోలియో–ఏ శాఖనూ అప్పగించకుండా ఉట్టి మంత్రి పదవి నిచ్చి కూర్చోపెడతారు. అదొకరకం శిక్ష. ఒక ధనస్సే విల్లునే వాడకుండా నిలువునా కొరత వేయించి నప్పుడు, ఇంక వింటినారి నామమాత్రం అయిపోతుంది కదా! గట్టిగా లాగితే ఝుంకారం చేస్తుంది. అంతే! కొందరు మనుషులు "లేచానంటే మనిషిని కాను" అనీ, "నేనే గనక తలుచుకుంటే..." అనీ ఉత్తినే వాగాడంబరంతో కాలక్షేపం చేస్తుంటారు చూశారా...అలా,"దగ శబ్ద మాత్రపాత్రముచేసె గుణలతన్" ఈ వింటినారిని కూడా పేరుకు తప్ప దేనికీ పనికిరాని దాన్ని చేశాడట మన్మథుడు.

4. తన మూలబలాన్నే (ప్రధాన సైన్యాన్ని) మ్రాకులకు (చెట్లకు) కట్టించేశాడట.

5. సాక్షాత్తూ తన సైన్యాధిపతిని అంతఃపుర రక్షకుడికి అప్పగించేశాడట.

6. ఇంక తన సహచరుడు, నేస్తుడూ అయిన వసంతకుణ్ణి కటిక ఎండలో కమరించె అంటే, నిలబెట్టాడట, వసంత ఋతువు చైత్ర వైశాఖమాసాలలో వస్తుంది. చెరకు పంట చేతికొస్తుంది.ఎండలు ముదురుతుంటాయి. నాట్లయ్యాక ఖాళీగా కూర్చుని ఎంకితో కాలక్షేపం చేసిన నాయుడు బావ మళ్ళీ వ్యవసాయం పనుల్లోకివచ్చి పాపం ఎండలో అల్లాడి పోతుంటే మన్మథుడు వేసిన శిక్షలా ఉన్నదని చమత్కారం

7. స్నేహితుణ్ణి కూడా ప్రతిపక్ష భావనతో చూశాడట మన్మథుడు. ఆ హితుడు ఎవరు? చంద్రుడికి కృష్ణ, శుక్ల పక్షాలు రెండు ఉంటాయి. అలాంటి పక్షాలు గలవాణ్ణి ప్రతిపక్షభావనతో చూశాడు.

8. మన క్రికెట్ వీరులు గెలిచినప్పుడు జెండా ఎగరేసుకుంటూ గ్రౌండంతా తిరుగుతారు. ఓడినప్పుడు తలవంచుకుని, బ్యాట్లు నేలకేసి కొట్టుకుంటూ మౌనంగా లోపలికి పోతుంటారు. అలాంటి స్థితిలో ఉన్నాడు మన్మథుడు. ఓడి పోయిన పార్టీ వాళ్ళిచ్చిన బిరుదుల్ని గెలిచిన పార్టీ వాళ్ళు రద్దు చేయటం ఒక శిక్ష! అలా గెలిచినప్పుడు తను గర్వంగా ఎగరేసిన జెండాని దించేశాడట. మన్మథుడి జెండా మీద చేప గుర్తు ఉంటుంది. చేపని పట్టుకున్న ప్పుడు దాని వంటికి బురద ఉంటే దులిపినట్టు, మన్మథుడు తన జెండాని దులిపేశాడు. ఓడినవాడి మనోగతాన్ని, శ్రామికుడి చైతన్యాన్ని. గెలిచినవాడి పట్టుదలనీ అన్నింటినీ కలగలిపి ఈ పద్యంలో ఒకచోట చేర్చటం గొప్ప ప్రయోగం! చివరికి అంటాడు, తమ నాయకుడు ఓడి పోవాలని సేనలూ, సేనాధిపతులూ, సహచరులూ కోరుకున్నారా...? కానీ, సేవకుల పాపంగా శిక్షలు వాళ్లకి పడ్డాయని! ఉప ఎన్నికల్లో పార్టీ ఓడిపోతే నియోజక వర్గం ఇన్‌ఛార్జీ మీద వేటువేయటం లాంటిది ఇది ! ✪

# పోటుగాడి లక్షణాలు

స్థానేషుత్రిషు చ స్థిరో రఘుపతిస్త్వాసిత్రష్షలంబస్తథా
స్థానేషుత్రిషువై సమస్త్రిషు పునశ్చాన్నత్యవాన్రాఘవః
స్థానేషుత్రిషు తామ్రవర్ణ సహితః స్నిగ్ధశ్చ గాంభీర్యవా
స్థానేషుత్రిషు శోభతే రఘుపతిః కించత్రిశీర్షశ్చసః

తెలుగువాడుగా ఏ బెంగాల్లోనో కాకుండా ఉత్తరాదిలో పుట్టి ఉంటే గొప్పఖ్యాతి వస్తుందనే జనాభిప్రాయం లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రి గారికి అక్షరాలా వర్తిస్తుంది. ఆయన వెలువరించిన ఆశ్చర్య రామాయణం పేరుకు తగ్గ గొప్పగ్రంథం. టీటీడీ వారి ప్రచురణ. ఇంకా దొరుకుతోందనే అనుకుంటాను. అది చదివితే రామాయణం ఆశ్చర్యం గొలుపుతుంది.

'రామాయణం అంటే వాల్మీకి రామాయణమే. మరొకరు వ్రాస్తే చదవం" అనే నియమం తెలుగు పండితుల్లో జాస్తి. 'అవాల్మీకం' అనిముద్రవేసి, ఇతర రామాయణ కర్తల్ని తక్కువ చేస్తుంటారు కూడా! వాల్మీకి తరఫున వకాల్తా పుచ్చుకున్నట్టు ప్రవచన కారుల మాటలు ధ్వనిస్తుంటాయి.

విశ్వనాథ రామాయణాన్నో, మొల్లరామాయణాన్నో, రంగనాథ రామాయణాన్ని సాధికారికంగా అధ్యయనం చేసి రోజూ ప్రవచనం చెప్పొచ్చు. చెప్పరు. తులసీ దాసు రామాయణం తెలుగువారికి తెలియక పోవటానికి కారణం ఇదే! టీవీలో రామానంద సాగర్ రామాయణం వస్తుంటే ఆ కథని మనం నోరుతెరిచి చూశాం. మనకు వాల్మీకేతర రామాయణాలు తెలియవు కాబట్టి!

లక్కావఝుల వేంకట కృష్ణశాస్త్రిగారి ఆశ్చర్య రామాయణం సుందర కాండ ఆరవ సర్గలోది పైన చెప్పిన శ్లోకం."రాముడి శరీర అవయవాల గురించి సీతకు తెలియచెప్పి, తాను రామదూతనేనని ఆమెకు నమ్మకం కలిగించేందుకు హను మంతుడు పడిన శ్రమ ఈ శ్లోకంలో కనిపిస్తుంది. మూడుచోట్ల స్థిరం, మూడు చోట్ల పొడవు, మూడు చోట్ల సమత్వం, మూడు చోట్ల మిట్ట, మూడు చోట్ల ఎర్రనిరంగు, మూడు చోట్ల నునుపు, మూడు చోట్ల లోతుకలవాడు. అంతేకాదు, ఆయన తలకాయ మూడు తీరుల్లో ఉంటుంది..." అనిచెప్తాడు. ఈ మాటల్ని బట్టి, సీతరాముణ్ణి పోల్చుకుని, హనుమంతుణ్ణి నమ్మాలి. ఆయన చెప్పిన మూడేసి అవయవాల లక్షణాలు ఇవి:

**స్థిరంగాఉండేవి-** రొమ్ము, మణికట్టు, పిడికిలి

**పొడవైనవి-**కనుబొమలు, బాహువులు, వృషణాలు
**హెచ్చు తగ్గులు లేకుండా సమంగా వుండేవి-** తలమీదశిఖ, వృషణాలు, మోకాళ్ళు.
**మిట్టగా అంటే ఉబ్బెత్తుగా ఉండేవి-** రొమ్ము, కడుపు, బొడ్డుభాగం
**ఎర్రని రంగులోఉండేవి:** కనుకొలకలు, అరికాళ్ళు, అరిచేతులు
**నునుపుగాఉండేవి:** అరిచేతులు, వెంట్రుకలు, జననాంగం
**లోతుగాఉండేవి:** నాభి, గంభీరమైనస్వరం, గొప్పదైన సత్త్వం(వ్యక్తిత్వం)
**తలకాయతీరు:** సమంగా గుండ్రంగా ఉంటుంది, గొడుగులాగా విచ్చుకుని ఉంటుంది. విశాలంగా ఉంటుంది.

ఇంత గూఢంగా, ఒకపొడుపు కథలాగా ఆ సమయంలో హనుమంతుడు ఎందుకు మాట్లాడవలసి వచ్చిందో కవిగారే స్వయంగా ఒక వివరణని ఇచ్చుకున్నారు: "నీ మగ నివృషణములు మొదలగునవి ఇట్లున్నవని హనుమంతుడు చెప్పినచో, నీ సీత నిశ్చయించునని హనుమంతుడింత గూఢముగా జెప్పెనని తెలియవలెను" అంటారు. వాటి గురించి హనుమంతుడికెలా తెలుసంటే,"అతీంద్రియార్థములను దెలియ జేయునది శాస్త్రము గాన దానిచే దెలిసికొని హనుమంతుడు చెప్పెనని తెలియ వలయును" అన్నారాయన. సీతారాములకు మాత్రమే తెలిసిన విషయాన్ని చెప్తేనే సీత అతన్ని నమ్ముతుందనేది ఇక్కడ ముఖ్యాంశం.

అందుకని జననాంగాల వర్ణనకు దిగాడు హనుమంతుడు. మన సాహిత్యంలో జననాంగాలకు సంబంధించిన అంశాలన్నీ అశ్లీలంగానే ముద్రపడ్డాయి. బుగ్గమీద పంటినొక్కులు, గోటి నొక్కుల వర్ణనలో లేని అశ్లీలం గుహ్యావయవం పేరెత్తితే చాలు వచ్చి పడ్తుంది. దీనిమీద హావెలాక్ ఎల్లీ తన సైకాలజీ ఆఫ్ సెక్స్ గ్రంథంలో వ్రాస్తూ, "గుహ్యావయవాలు అలా అక్కడ చాటు మాటుగా ఉన్నాయి కాబట్టే, 'సిగ్గు'అనేది ఏర్పడుతోంది. అవి ఏ అరచేతిలోనో ఉండి ఉంటే ఈ ప్రపంచంలో సిగ్గూలేదు, ఎగ్గూలేదు" షేక్ హ్యాండ్ ఇచ్చినంత తెలిగ్గా రతికార్యం జరిగిపోతుంది" అన్నాడు

రావణుడే హనుమంతుడి రూపానవస్తే ఎంతైనా నటించగలడేమోగానీ, శత్రువు మగటిమిని మాత్రం పొగడలేడు. అందుకని హనుమంతుడు ఈ దారి ఎంచుకున్నాడు. తాను రామదూతననే నమ్మకం కలగటానికి ఆ అస్ఖలిత బ్రహ్మచారికి తెలిసిన విద్య అదే! రాముడి పిడికిలి శక్తిమంతమైనది. ఆయన మగటిమి ముందు రావణుడెంత? ఆయన కన్నెర్ర చేస్తే రావణుడు భస్మం అయిపోతాడనే సందేశం కూడా ఇందులో ఉంది.

ఆరోగ్యవంతుడైన, సమర్థుడైన, లోకకళ్యాణ కారకుడి దేహస్థితి ఎలా ఉంటుందో ఈ శ్లోకంలో కనిపిస్తుంది. పోటుగాడంటే ఇలా ఉండాలన్నమాట! ✪

# ప్రజా'బలి'స్వామ్యం

**కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే**
**వారేరీ సిరి మూటగట్టుకుని పోవంజాలిరే భూమిపై(**
**బేరైనంగలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై**
**యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!**

ఈ కాలంలో అంటూ ఆ కాలంలోనే ఈ కాలం గురించి పోతనగారు చెప్పిన గొప్ప పద్యాలలో ఇదొకటి. అన్నీ ప్రశ్నలే! సమాధానాలను మనం కాలం లోంచి వెదుక్కోవాలి. ఈ కాలంలో రాజులెక్కడున్నారయ్యా అనుకోనవసరం లేదు, ఈ కాలం పాలకుల్లో తామే రాజులం అనీ, తమదే ఈ రాజ్యం అనే భావన గూడు అన్ని పార్టీల వాళ్ళలోనూ ఇదే ధోరణి. నేటి ప్రజాస్వామ్యంలో ప్రముఖం రాజస్వామ్యమే! ఇప్పుడున్నది డెమొక్రసీ కాదు, హిపోక్లసీ, మసి!!

దుర్యోధనుడికి తట్టి వుంటే, కురుక్షేత్ర సంగ్రామానికి బదులు ఎన్నికలకు పిలుపునిచ్చి వుండేవాడు. తనూ, తన సోదరులు కలిసి దుర్యోధనుడికి వంద వోట్లు పడతాయి. పాండవులకు ఐదు వోట్లతో డిపాజిట్ గల్లంతై ఉండేది. ఇలాంటి ప్రజాస్వామ్య ప్రమాదాన్ని శంకించే కాబోలు, ధర్మరాజు ముందు జాగ్రత్తగా ...మేం నూటైదుగురం' అంటూ ఉండేవాడు !

"దుర్యోధనుడు కూడా పాండవులు అజ్ఞాతవాసం నుండి తిరిగొచ్చే సమయానికి విపరీతంగా దాన ధర్మాలు చేసి, ప్రజాభిమానం పెంచుకొనేందుకు సిద్ధంగా ఉన్నాడట! కానీ ఒక ప్రపంచ యుద్ధాన్ని తలపించే యుద్ధం జరగటాన, ఎన్నికలప్రహసనం జరిగే అవకాశం లేకుండా పోయింది. ఇదంతా విషయాంతరం. పోతనగారి పద్యంలోకి మళ్ళీ వద్దాం.

"దానం అడగటానికి వచ్చినవాడు మారువేషంలో ఉన్న విష్ణువే! జాగ్రత్తగా ఉండకపోతే ఓడతావు" అని గురువైన శుక్రాచార్యుడు బలిచక్రవర్తిని హెచ్చరిస్తాడు. దానికి బలిచక్రవర్తి చెప్పిన సమాధానం ఈ పద్యం! ఇది ఆ నాటి రాచరికానికీ, నేటి దొంగ ప్రజాస్వామానిక్కూడా వర్తించే సమాధానం.

**కారే రాజులు?**: ఈ కాలంలో ఎవరైనా,ఎలాంటి వాడైనా రాజు కావటం లేదా?

**రాజ్యముల్ గలుగవే?**: వాళ్ళకి రాజ్యాలు దక్కటం లేదా?

**గర్వోన్నతిం బొందరే?**: వాళ్ళు పొగరెక్కి వ్యవహరించట్లేదా?

**వారేరీ?**: అలాంటి రాజకీయ దురంధరులుగా తమని చిత్రించుకున్న వాళ్ళంతా ఇప్పుడు ఏవయ్యారు? ఈ లోకంలోంచే పోయారు

**సిరి మూటగట్టుకుని పోవంజాలిరే?**: అధికారంలో ఉన్న కాలంలో మూటగట్టుకున్న సిరినంతా పోయేటప్పుడు పట్టుకు పోగలిగారా?

**భూమిపై పేరైనంగలదే?**: ఈ నేలపైన వాళ్ళ పేరైనా ఉందా? కనీసం వాళ్లను తలుచుకునే వాడున్నాడా?

**శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై**: శిబిచక్రవర్తి లాంటివాళ్ళు ప్రజాదరణ పొంది కీర్తిమంతులై నిలిచారు.

**యీరే కోర్కులు**: ఎందుకంటే మనఃస్ఫూర్తిగా అడిగింది అడిగినంతగా ఇచ్చారు కాబట్టి! ఈ ప్రజలకోసం ఎంతో కొంత చేశారు కాబట్టి.

**వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా?**: ఇంత కాలం తరువాత కూడా అలాంటి వాళ్ళని ప్రజలు మరిచారా గురుదేవా?

రాజుమరణిస్తే శిల్పంలో జీవిస్తాడు, సుకవి మరణిస్తే జనం నాలుకలమీద జీవిస్తాడన్న జాషువా మాటలు గుర్తుకొస్తాయి. రోడ్లను ఆక్రమించి శిల్పాలు నిలబెట్టేవాళ్ళకిది చురక! లోకోపకారి చిరంజీవి అవుతాడనేది దీని సారాంశం.

వామనుడు సత్యలోకం కంటే ఎత్తుకు పెరిగి బ్రహ్మాండం అంతా నిండి, ఇదంతా తనకు దానంగా కావాలని అడిగాడంటే అదంతా బలి చక్రవర్తి ఆధీనంలోని రాజ్యం అన్నట్టే కదా! వామనుడు అడిగింది భూమికి పైన ఉన్న రాజ్యాన్నే! ఇంకా అంత రాజ్యం బలి చక్రవర్తికి భూమికి అడుగున పాతాళాది లోకాల్లో ఉంది. తనవి ఇచ్చే చేతులని చాటటమే తనకు నిజమైన ఆస్తి, కీర్తి అని గుర్తించిన రాజు కాబట్టి, తనను తాను బలి చేసుకోవటానికే సిద్ధపడ్డాడు బలి చక్రవర్తి. అది 'బలి' స్వామ్యం!!

మచ్చుకు ఒక్క ప్రధాని, ఒక్క ముఖ్యమంత్రి, ఒక్క మంత్రి అలా వ్యవహరిస్తాడేమోనని ప్రజలు ఆశతో ప్రతిసారీ తమ ఓటుని బలి ఇచ్చుకుంటూ ఉంటారు... ప్రజా'బలి'స్వామ్యం! ఇది. ✪

# ప్రపంచానికి పర్యాయం కవిత

"నా భూమి ఒక కొత్త పద్యంలా కనిపిస్తోంది
నేను బయల్దేరిన చోటులోని
అక్షరాల దుమారం అలాగే అక్కడే గుండ్రంగా పరిభ్రమిస్తోంది .
గతంలో ఒక పక్షి అక్కణ్ణుంచి వెళ్ళిపోయిన జ్ఞాపకం కూడా లేదు.!"

ప్రపంచాన్ని ఎరిగిన ఒక కవితారాజహంసకి, ఎగిరి ప్రపంచాన్ని తిరిగి వచ్చిన ఒక కవితారాజహంసకి ఈ భూమండలం ఒక కొత్త పద్యంలా కనిపించటంలో ఆశ్చర్యం లేదు. తన రెక్కలమీద ప్రపంచాన్ని చుట్టివచ్చి, ఈ భూగోళాన్ని పక్షికంటితో చూస్తూ, 'పునరపి జననం-పునరపి మరణం' అనే గ్రహింపుతో ఈ లోకాన్ని ప్రార్థించి అడుగుతున్నాడు... కవి, 'కిందికి దించేసి'నప్పుడు తన రెక్కల ఈకలతో కాలం మీద ప్రపంచానికి పర్యాయపదంగా తనను రాయాలని!

ప్రసిద్ధ కవి, అవధాని, రాష్ట్ర సాంస్కృతిక రంగానికి సంచాలకుడిగా గురుతర బాధ్యతలు నిర్వహించిన కీ.శే. డా. రాళ్ళబండి కవితా ప్రసాద్ అక్షరాలివి. తను పట్టభద్రుడయ్యింది లెక్కలు, సైన్సులో! నేర్చిన విద్య పద్యం వ్రాయటం. పట్టువీడకుండా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగు సాహిత్యం, ఫిలాసఫీ పూర్తి చేశాడు. మంచి ఉపాధ్యాయుడు కావాలని ఆశ! అందుకని, మచిలీపట్టణం ఆంధ్ర జాతీయ బోధనా కళాశాలలో ఉపాధ్యాయ విద్య నేర్చుకున్నాడు. అపారమైన ధారణశక్తి ఉండటంతో అవధానాల మీదకు దృష్టి మళ్ళించాడు. శతావధానం, ద్విశతావధానాలు చేశాడు. తనదైన పద్ధతిలో నవరస అవధానం, సంఖ్యావధానం చేశాడు. అనేక గ్రంథాలు వ్రాశాడు. కవితాప్రసాద్ గొప్ప తపస్సంపన్నుడు. అమ్మవారి ఉపాసకుడు మంత్ర శాస్త్రంలో కూడా ప్రవేశం ఉన్నది. ఆది పరాశక్తి అసలు రూపాన్ని ఆవిష్కరిస్తూ, "శక్తి-ఉపాసన" గ్రంథం కూడా ప్రచురించాడు.

కానీ, స్వర్గంలో చోటు కోరి వర్గీయులందరినీ వదిలి వెళ్ళిపోయాడు. రెక్క లల్లార్చు కుంటూనే కవితారాజహంస ఎగిరిపోయింది.

కవి అయిన వాడి చూపు, వాడిగా ఆకాశం లోంచి పక్షి చూసినట్టే ఉంటుంది. దాని కంటికి విశాలమైన భూమి మొత్తం ఒకే సారి కనిపించినా, తన రెక్కల నీడలోంచి సముద్రగర్భంలోని చేపని కూడా అది చూడగలదు. కవీ చూడగలడు.

చాలామంది పాలకులు తమనెవరూ చూడట్లేదనుకుంటారు. కానీ, కవి చూస్తూ ఉంటాడు. ఒక కంట కనిపెడుతూనే ఉంటాడు. లెక్కలూ, పద్దుల పద్యాలు వ్రాస్తూనే ఉంటాడు. కడుపు రగిలి రెక్కలల్లార్చుకుంటూనే ఉంటాడు. ఎందుకలా విలవిల లాడిపోతున్నాడో ఎవరికీ అర్థం కాదు. అయినా చూడటం ఆపడు. విశాలమైన చూపులతో కసిగా చూస్తూనే ఉంటాడు.

కంటికి కనిపించిన ప్రతి దృశ్యం, ప్రతి సన్నివేశం, ప్రతి సంఘటనా కవికి ఒక కొత్త పద్యమే! కవితా రాజహంస ప్రపంచం అంతా తిరుగుతుంది. వెళ్ళినచోటల్లా అక్కడ ప్రతి పద్యమూ ఒక అక్షర దుమారం రేపుతూనే ఉంటుంది. రేగినచోటే ఆ దుమారం పరిభ్రమిస్తూ ఉంటుంది. దుమారం లేపిన పక్షి అక్కడ నుండి వెళ్ళి పోయినా దాని జ్ఞాపకాలు పదిలంగా లేకపోయినా, దుమారం రేగుతూనే ఉంటుంది. అది కవిత్వ ప్రభావం.

కవితారాజహంస విశ్వమంతా తిరిగీ తిరిగీ, తిరిగి రావటానికి సమయం చాలక, అలా తిరుగుతూనే ఎక్కడో ఎప్పుడో, ఏ దుమారమో రేపుతూ, రెక్కలార్చుకు నేల రాలిపోతుంది.

“నేను నేల మీద పడిపోయినప్పుడు నన్నెవరు గుర్తుపడతారు ? గుర్తుపడితే మాత్రం, నా రెక్కల ఈకల కలంతో కాలం పలక మీద ‘కవిత్వం వ్యక్తికి కాదు, ప్రపంచ హంసకు పర్యాయపదం’ “అని రాయండి” అని తన ఆఖరి కోరిక చెప్పు కున్నాడు మిత్రుడు రాళ్ళబండి కవితాప్రసాద్. ప్రపంచానికి పర్యాయం కవితే! ☆

# ప్రాచీన తెలుగులు

ఆంధ్ర దేశస్థ సర్వాపగాభంగాత్ రంగరంగముల శౌర్యములు నేర్చి
ఆత్మప్రలాప శౌర్యములు తాలిచి సుమిత్రా బోర్నియో ద్వీపతతులు గెలిచి
వంగ మహారాష్ట్ర హద్దులు పరిచయ స్థలములై వినయమ్ము సలుప మెలగి
ఈజిప్టు నుండి కృష్ణాజలమ్ములకుబోరంబాటగా పరాక్రమము జూపి
సకల దీవుల విజయధ్వజములు నాటి
తనదు తెరచాప వార్ధిరాజునకు కట్టు
కోకగా పూర్వమాంధ్రుల నౌక రాజ్య
మమర జేసిన దేడు సంద్రముల మీద

ఆంధ్రదేశం లోని సమస్త నదీ తీర ప్రాంతాలలో వెలుగు లీనిన మహానాగరికతకు వారసులుగా తాము నేర్చిన శౌర్యాలను ప్రదర్శిస్తూ, సుమిత్రా బోర్నియో లాంటి అనేక ద్వీపాలను గెలుచుకుని ఆంధ్రరాజ్యాలు స్థాపించుకుని, వంగ మహారాష్ట్ర హద్దుల వరకూ ఉన్న భూములు 'మాకు పరిచయాలే' అన్నంతగా వినయ సంపన్నతతో మెలగుతూ, అటు ఈజిప్టులోని నైలూ నుండి ఇటు కృష్ణాజలాల వరకూ వర్తక వాణిజ్యాల కోసం రాకపోకలు విస్తృతంగా జరిపి, సముద్రం పైన తమదే ఆధిపత్యం అన్నంతగా సకల దీవుల్లోనూ విజయధ్వజాలు నాటిన తొలినాటి ఆంధ్రుల ప్రశస్తిని విశ్వనాథ సత్యనారాయణ ఆంధ్ర పౌరుషంలో ప్రస్తుతిస్తాడు. సముద్ర రాజుకు తన తెరచాపను కట్టుకోకగా కట్టిన ఆంధ్రులు తమ ఆంధ్రరాజ్యాన్ని నౌకారాజ్యంగా ఏడు సముద్రాలమీదా అమరచేశా రంటాడాయన ప్రాచీనాంధ్రుల చరిత్రకు ఈ పద్యం అద్దం పడుతుంది.

క్రీస్తుశకం తొలినాళ్లలో కృష్ణాజిల్లా దివిసీమలో దొరికిన నాణాలలో 'divi అక్షరాలు ఆనాటి తెలుగువారి విదేశీ వర్తకాలకు సాక్ష్యం. చరిత్రకారులు ఈ విదేశీ వాణిజ్య సంబంధాలను భారత దేశపు ప్రాచీన వర్తక వైభవంగా గొప్పగా చిత్రించారు కూడా! కోడూరు ఓడరేవు భారత దేశంలోనే అత్యంత ప్రాచీన ఓడరేవు పట్టణంగా గుర్తించారు. తెలుగునేలమీద సింధూనాగరకతకు సమాంతరంగా జనజీవనం ఉండేదని, వీళ్ళు ప్రత్యేకమైన సంస్కృతి, ఇనుమును కరిగించగల పరిజ్ఞానం కలిగినవారనీ, అప్పటికి ఉత్తరాదివారికి ఇనుము తెలియదనీ ఒప్పుకుంటారు. కానీ, ఆ సంస్కృతిని తెలుగు సంస్కృతిగానో, కృష్ణాగోదావరీ లోయల నాగరికత గానో ప్రకటించటానికి ఇష్టపడరు.

బుద్ధుడి కాలానికే ఆంధ్రపథం (ఆంధ్ర రాజ్యానికి దారి) పేరొందింది. ఆదిలాబాద్, నాందేడ్ ప్రాంతాల్లో 'మూలక' రాజ్యాలు కరీంనగర్ నిజామాబాద్ జిల్లాల్లో 'అశ్మక', ఆంధ్రనగరాలుగా ప్రసిద్ధాలు. అవిభక్త ఆంధ్రప్రదేశ్ మ్యాపు పైన 55 ప్రాచీన బౌద్ధ స్థావరాల్ని గుర్తించి బెజవాడ కేంద్రంగా ఈ స్థావరాలను కలుపుతూ కొన్ని రేఖలు గీసి చూస్తే, 6 రహదారులుగా కనిపించాయి.

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలనుండి కళింగ (ఒడీసా), మహరాష్ట్ర, కర్ణాటక, ఛత్తీస్ 'ఘడ్, తమిళనాడులలోకి భూమార్గాన వర్తక వాణిజ్యాలు నడిచిన ఈ రహదారుల్లోనే ప్రాచీన బౌద్ధ స్థావరాలు నెలకొన్నాయని దీన్ని బట్టి అర్థం అవుతోంది. 2008లో ద్రవిడ విశ్వవిద్యాలయం ప్రచురించిన 'నైలూ నుండి కృష్ణ దాకా' అనే నా పుస్తకంలో ఈ వివరాలు పొందుపరిచాను.

నాగ, యక్ష, గరుడ జాతులు బహుశా ఈ నేలపైన నివసించిన తొలి జాతులవారు కావచ్చు. నాగులకు మోపిదేవి, యక్షులకు భట్టిప్రోలు, గరుడులకు గృధ్రవాడ (గుడివాడ) రాజధానులు కావచ్చు. వారితో పాటు ఈ నేలమీద తొలి ఆఫ్రికన్ ద్రావిడ జాతులు కూడా జీవించినట్టు భాషాపురావస్తు శాస్త్ర ఆధారాలను బట్టి భావిస్తున్నారు. కాకుళ అనే నది, ఎలకుర్రు లాంటి ఊరు పేర్లు నైలూ నదీతీర ప్రాంతాల్లో కూడా ఉన్నాయి. తెలుగునేల మీద కొచ్చినప్పుడు కృష్ణాజిల్లా శ్రీకాకుళం వీళ్ళ రాజధాని నగరం కావచ్చు. ఆఫ్రికన్ ద్రవిడ జాతులు సముద్రమార్గాన కృష్ణా గోదావరి ముఖ ద్వారాలనుండి తొలిగా తెలుగునేల పైనే అడుగు పెట్టారని ఫ్రాంక్లిన్ సి సౌత్'వర్త్ అనే పరిశోధకుడు ప్రకటించాడు.

ఈ జాతుల ప్రజలు తెలుగువారుగా సహజీవనం సాగిస్తున్న కాలంలో ఆంధ్రవిష్ణువు సారథ్యాన ఉత్తరాదినుండి ఆంధ్రులు శ్రీకాకుళాన్ని జయించి ఇక్కడి తెలుగు ప్రజలతో మమేకమయ్యారని యేటుకూరి బలరామమూర్తిగారు వ్రాశారు. ఈ జాతులందరి భాషా సంస్కృతుల సమ్మేళనంగా పుట్టిందే తెలుగు భాష. జాతి పరంగా మనం ఆంధ్రులుగానూ, భాషాపరంగా తెలుగు వారిగానూ మారటానికి ఇది చారిత్రకనేపథ్యం. వెదికితే, కృష్ణాతీర ప్రాంతాల్లో గ్రామనామాలు ఆఫ్రికన్ గ్రామనామాలతో సమానంగా ఉన్నవి అనేకం కనిపించే అవకాశం ఉంది. 'బెజ' దేవత అక్కడ వుంది  ఈ బెజదేవత ఆరాధకుల కారణంగా బెజవాడ' ఏర్పడి ఉండవచ్చు కూడా! విశ్వనాథవారు "ఈజిప్టు నుండి కృష్ణాజలమ్ములకు బోరంబాటగా పరాక్రమము జూపి" అనడం వెనుక ఇంతకథ ఉంది. దక్షిణాదిలో తొలి ద్రావిడులు తెలుగువారే! తెలుగే ప్రాచీనం! ✮

# ప్రాచీన విజ్ఞాన ప్రగతి

**"మాననీయానంత మణికాంత ధామమై ఇది హిమానీ వేళనింపు నింపు**
**శోణ ప్రవాళ మంజులతా నిశాంతమై యలరించు నిది వసంతాగమమున**
**దరళ ముక్తాదీప్తి ధారాధి వాసమై వేసవి నిది మహోల్లాస మొసగు**
**బ్రబల వజ్రోపల ప్రాసాద భాసమై తొలకరి నిది కుతూహలము నిలుపు**
**జనవరోత్తమ! ఇది సర్వ సమయ సౌఖ్య జనక మిందలి యాలేఖ్య సాధ్య సిద్ధ**
**కిన్నరాంగన లవిగీత నృత్య వాద్యములు సూపి నిలుతురు వలయునెడల"**

ఇది రామరాజ భూషణుడి "వసుచరిత్రం"లో పద్యం. ఇంద్రుడు వసురాజుకి ఓ విమానం బహూకరించి, దాని వివరాలు చెప్పే సందర్భంలో. "ఓ జనవరోత్తమా! ఈ విమానం హిమానీ వేళ (శీతాకాలం, శిశిర ఋతువులో) సూర్యుడి మనోహరమైన కాంతిధామంలా నీకు వెచ్చని సుఖాన్నిస్తుంది. వసంతాగమ కాలంలో ఎర్రని చిగుళ్ళతో సొగసైన పొదరిల్లు లాగా మనోహరంగా నిన్ను సంతోష పెడుతుంది. గ్రీష్మంలో మంచి ముత్యాల కాంతి ధారల్లాంటి జలధారల్లా నీకు ఉత్సాహాన్నిస్తుంది. వానాకాలంలో వజ్రం లాంటి దృఢమైన మేడలా అలరిస్తుంది. తక్కిన ఋతువుల్లో కూడా తగ్గట్టుగా నీకు సౌఖ్యాన్నిస్తుంది. ఈ విమానంలో బొమ్మల్లా కనిపించే సిద్ధ, సాధ్య కిన్నర స్త్రీలు నీక్కావలసిన సమయంలో ప్రత్యక్షమై నిన్ను అలరిస్తారు" ఇలా వివరిస్తాడు. వేడి, చలి, వాన తెలీకుండా సమశీతల ఎయిర్ కండీషనింగ్, ఎయిర్ హోస్టెస్సుల సౌకర్యం ఉండే విమాన వర్ణన ఇందులో కన్పిస్తుంది. ఇవి కవుల ఉబుసుపోని స్వకపోల కల్పనలే కావచ్చు. కానీ, ఈ కల్పనల క్కూడా కొంత ఆధారం ఉంది.

అశోకుడు తన కాలం నాటి 9మంది ప్రసిద్ధ శాస్త్రవేత్తల బృందంతో ఒక సంఘాన్ని నియమించాడట. ప్రాచీన అద్భుత శాస్త్రీయ విషయాలు, అతీంద్రియ శక్తులు, ఇతర మహత్తులతో కూడుకున్న శక్తిమంతమైన విషయాలను సమీకరించటం, వాటిని రహస్యంగా పదిలపరచటం ఈ శాస్త్రవేత్తల బాధ్యత. అవి దుష్టుల చేతులకు చేరకూడదనే రహస్యం పాటించాడు. వాటిలో ఎక్కువ భాగం యుద్ధ విద్యలే ఉన్నాయి. అహింసాయుతంగా రాజ్యాన్ని రక్షించటం, శత్రువుల పైన విజయాలు సాధించటానికీ వీటిని వాడటం ఆయన ఉద్దేశం. అందులో 'భూమ్యాకర్షణ శక్తి రహస్యాలు' అనే పుస్తకం కూడా ఉన్నదని, అది టిబెట్టు లేదా ఉత్తర అమెరికాలో ఎక్కడో భద్రంగా ఉండి ఉంటుందనీ ఒక కథ ప్రచారంలో ఉంది. అలాంటి శక్తిమంతమైన ఆయుధాలు

నాజీ ల్లాంటి వాళ్ళ చేతుల్లో పడి ఉంటే రెండో ప్రపంచ యుద్ధం జరక్కుండానే భూమండలం ధ్వంసం అయ్యేండేది. లెహసా'(టిబెట్)లో ఇటీవల చైనా వాళ్లకి కొన్ని సంస్కృత గ్రంథాలు దొరికాయి. చండీఘర్ విశ్వవిద్యాలయంలో డా. రూత్ రేనా గారితో అనువదింప చేస్తున్నారు. అందులో అంతరిక్ష నౌకలు, విమానాలు రాకెట్ లాంచర్ల లాంటి అస్త్రాల సమాచారం ఉందని చెప్తున్నారు.

క్రీ.పూ. 4వ శతాబ్ది నాటి భరద్వాజ మహర్షి రచించిన వైమానిక శాస్త్రం గ్రంథానికి జి ఆర్ జోశ్యర్ (మైసూరు) ఇంగ్లీషు అనువాదం కూడా వెలువడింది. కంబస్టన్ ఇంజిన్లు, పల్స్ జెట్ ఇంజిన్ల లాంటి యంత్రాల ప్రస్తావన కూడా వీటిలో ఉందిట. రామాయణం, భారతాల్లో అణుయుద్ధాలను మరిపించే యుద్ధ వర్ణనలు చదువుతుంటే డిటెక్టివ్ కథల్లో అద్భుత ఊహల్లా అనిపిస్తాయి. కానీ, సాహిత్యాధారాలు ఉన్నాయని అర్థం అవుతోంది. మొహెంజోదారోలో ఒక చోట రాచవీధుల్లో కొన్ని అస్థిపంజరాలు పడి ఉండటాన్ని గుర్తించారు. ఇవి ఒకదాని చెయ్యి ఇంకొకటి పుచ్చుకున్నట్టుగా ఉన్నాయని, హీరోషిమా, నాగసాకీ లాంటి అణుప్రమాదం లాంటిది ఏదో సంభవించి నప్పుడు వీధుల్లో జనం పరుగులు తీసిన దృశ్యాన్ని తలపిస్తోం దన్నారు చరిత్రకారులు.

దక్షిణాదిలో డెక్కన్ పీఠభూమి పైన సింధు నాగరికతకు సమాంతరంగా వర్ధిల్లిన కృష్ణా గోదావరీ, కావేరీ నదుల నాగరికత గురించి చరిత్రకారులు అశ్రద్ధ చేయటం, సింధు నాగరకత నిర్మాతల గురించి, ఆ నగరాల పతనానికి గల కారణాల గురించీ విశ్లేషణ లేకపోవటం...మొత్తం మీద మనం అసమగ్రమైన చరిత్ర మీదే ఆధారపడ్తున్నాం అనేది నిజం.

దండకారణ్యంలో ఉక్కుతో చేసిన పరికరాలు, ఆయుధ కర్మాగారాలు ఉండేవి కనకనే రామలక్ష్మణుల్ని విశ్వామిత్రుడు వెంటబెట్టుకుని ఇక్కడకు వచ్చి, వాళ్ళ శరీరానికి తగ్గ కొలతల్లో ఆయుధాలు తయారు చేయించి ఇప్పించాడు. లోహయుగంగా పిలిచే ఆ కొత్త రాతియుగంలో తెలుగునేలపైన ఉక్కుశస్త్రాలతో పాటు అస్త్రాలు కూడా తయారు చేశారేమో పరిశోధకులు తేల్చాలి. అన్నీ వేదాల్లోనే ఉన్నాయనే భావన ఎంత చాందసమో, ప్రాచీనకాలంలో వైజ్ఞానిక ప్రగతి లేదనటమూ అంతే చాందసం. పరిశీలిస్తే కదా నిజనిజాలు బయట పడేది! ☆

# ఫలించని కవి శాపాలు

**క. కూటికి గాకులు వెడలెడు బ నేటావల మూకచేరి యేడువ దొడగెన్**
**గాటికి గట్టెలు చేరెనుబ లేటవరపు పోతరాజు లేడా లేడా?**

కవుల్లో తిట్టుకవులు వేరుగా ఉంటారు. వాళ్లకి తిట్టడమే పని. తిట్టిన వాడికి ఏ కొద్ది అపకారం ఏ కారణం వలన జరిగినా అది నా మహిమే నంటారు. ఆ మధ్య ఒకాయన తనను తాను నడిచే దైవంగానూ, కదిలే బ్రహ్మంగానూ ఒక పుస్తకం వ్రాశాడు. అందులో సదరు కవి గారు చిన్నపిల్లాడిగా ఉన్నప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారు తనను దేవుడని గుర్తించలేము అందుకని కోపం వచ్చి, ఆయన కొడుకు పాము కరిచి చచ్చిపోవాలని శపించాడట. అలా విశ్వనాథ వారి పెద్దకొడుకు తన శాపం వలనే చనిపోయాడని వ్రాసుకున్నాడా ఇలా లోకంలో జరిగిన ప్రతిదానికీ పుస్తకంలో ! తన శాపాన్ని కారణంగా చూపించే తిట్టుకవులు కొందరున్నారు. కష్టం వచ్చినపుడు ఏ జన్మలో పాపమో, ఏ మహానుభావుడి శాపమో అనుకోవటం మానవసహజం. కానీ అవతలివాడికి తన శాపం వలనే కష్టం వచ్చిందనటమే వింత !

పూర్వకవుల్లో తిట్టిన వెంటనే తిట్టినట్టే జరిగిన సందర్భాల గురించి కొన్ని చాటువులున్నాయి. కొందరికి తిట్టు ముద్ర ఉండేది. ఈయన జోలికి పోతే ఏదో ఒకటి తిడతాడనే భయం ఉండేది. జనాన్ని అలా భయపెట్టి పబ్బం గడుపుకునే కవులు కూడా ఉండే వాళ్ళేమో తెలీదు.

ఆ రోజుల్లో ఒక్క కవి తిడితేనే రాజులు రాజ్యాలు కోల్పోయి హరిశ్చంద్రుడి కష్టాలన్నీ పడేవాళ్ళు. ఇప్పుడు కవులందరూ కలిసి తిట్టినా ఒక్క ప్రభువుకూ, ఒక్క ప్రభుత్వానికీ ఏమీ కావట్లేదు. ఎందుకని?

తురగా రామకవి అనే తిట్టు కవి ఉండేవాడు. గోదావరి తీరంలో పెద్దాపురం వాడు. ఆడిదము సూరకవీ, ఈయనా ఒకే కాలానికి చెందిన వాళ్ళని చెప్తారు. ఈ ఇద్దరూ తిట్టుకవులే! ఒకళ్ళ నొకళ్ళు తిట్టుకున్న సందర్భాలూ ఉన్నాయి. మహమ్మదు కుతుబ్ షా గురించి రామకవి ప్రస్తావన చేశాడు కాబట్టి, ఇప్పటికి 500 యేళ్ళ క్రితం తిట్టుకవిగా తురగా రామకవి ప్రసిద్ధుడైనట్టు చెప్పవచ్చు. వేములవాడ భీమకవి తర్వాత తిట్టు కవిత్వంలో తురగా రామకవే ప్రసిద్ధుడు.

పెద్దాపురంలో లేటవరపు పోతురాజు అనే భూస్వామి ఉండేవాడు. డబ్బు అవసరమై ఒకరోజు రామకవి ఆ పోతురాజు గారింటికి వెళ్ళాడు. రామకవి వచ్చాడంటే ఏదో ఒకటి తిట్టకుండానూ అంతో ఇంతో పట్టకుండానూ పోడని, సదరు పోతరాజుగారి భార్య, 'ఆయన ఇంట్లో లేరండీ' అని చెప్పింది. విషయం

అర్థం అయ్యింది రామకవికి. కోపం నషాళానికి అంటింది. ఇంట్లో ఉండే లేవనిపిస్తావా...అని హుంకరించి పై పద్యం చెప్పాడు.

తద్దినాలు పెట్టే చోట కావు కావుమంటూ కాకులు చేరతాయి. తద్దినాలను ఎటోడ్డున అక్కడ బంధుమిత్రులు చేరి ఏడుస్తుంటారు. ఇంకోవైపు శవదహనం కోసం కట్టెల్ని పేరుస్తూ ఉంటారు. మరోవైపు శవసంస్కారాలు జరుగుతుంటాయి. చావు దృశ్యం పరమ దుఃఖభాజనంగా ఉంటుంది.

పోతరాజు గారి భార్యవచ్చి ఆయన ఇంట్లో లేడనేసరికి రామకవికి మనసులో ఈ దృశ్యం మెదిలింది. ఊళ్ళో ఒక్క కాకి కూడా లేదు. కాకులన్నీ పోతరాజు గారికి పెడుతున్న పిండాలకోసం ఏటవతల శ్మశానానికి పోయినట్టున్నాయి. మీ ఇంట్లో కూడా మనుషుల సందడేమీ కనిపించటం లేదు. అంతా శ్మశానికి ఏడవటం కోసం పోయినట్టున్నారు. కట్టెలవాళ్ళు కూడా అక్కడికి కట్టెలు చేర్చేసినట్టున్నారు. లేటవరపు పోతరాజు ఈ భూమ్మీద లేడా లేడా అంటూ రెట్టించి అడిగాడు.

ఆ పద్యం వినేసరికి ఇంట్లో దాక్కున్న పోతరాజుగారికి నిజంగా చచ్చినంత పనైంది. తన చావు దృశ్యాన్ని ఊహించు కుని షాకయి, కళ్ళు తిరిగి కిందపడ్డాడు. పోతరాజు చచ్చాడనుకుని అతని భార్య రామకవి కాళ్లమీద పడి బావురు మంది. క్లైమాక్సులో రామకవి ఓ 'విరుగుడు పద్యం' చెప్పాడు:

**"క. మేటి రఘురాము తమ్ముడుబ పాటిగ సంజీవి చేత బ్రతికిన రీతిన్**
**గాటికి బో నీ కేటికిబని లేటవరపు పోతురాజ లెమ్మా రమ్మా."** అని!

"మేటి రఘురాముడి తమ్ముడు సంజీవి చేత లేచినట్టే, లేటవరపు పోతరాజా! నువ్వుకూడా లే!" అన్నాడు. ఆ విరుగుడు పద్యం విన్నాక పోతరాజు గారికి నిజంగానే ప్రాణాలు లేచి వచ్చాయి. లేచి కూర్చున్నాడు. మొత్తం మీద రామకవి శాపానుగ్రహ శక్తులు రెండూ ఉన్నవాడని ముద్ర పడిపోయింది.

ఛందో బంధంగా పద్యం చెప్పగలగా లంటే, మాటలు కాదు. ఏదో అద్వితీయమైన శక్తి ఉన్నవాడే అలాంటిది నిర్వహించ గలడని జనాల్లో ఒక నమ్మకం ఉండేది. కొందరు కవులు ఆ నమ్మకాన్ని బాగా ఉపయోగించు కున్నట్టు ఈ పద్యాలు చదివితే అర్థం అవుతుంది. తూకానికి నిలిచే కవివాక్కు తప్పకుండా ఫలిస్తుందనేది వాస్తవం...

నేటి పరిస్థితులు వేరు. కవిని సగటు మేధావిగా భావించేట్లయితే మన దేశంలో మేధావులు నిష్పక్షపాతంగాలేరని గట్టిగా చెప్పొచ్చు! ఒక కులానికో, వర్గానికో, మతానికో సిద్ధాంతాల ముసుగు తొడిగి వాటికి అంకితంగా నడుస్తున్నారు. దేశ సమస్యల్ని కూడా ఆ కోణం లోంచే చూస్తున్నారు. అందుకే విశ్వామిత్ర, వశిష్ఠ, వామదేవాది ఋషులు కూడా ఇప్పుడొచ్చి, ఇదే దారిన వెడితే వాళ్ళ శాపాలు కూడా ఫలించవు. శాపం ఫలించాలంటే కళ్ల తెరల్ని తీసి లోకాన్ని చూడ గలిగి ఉండాలి! 

# ఫిరాయింపు పుణ్యమే

'భ్రాతృవధ పితృవధాదుల(
బాతకములు రావు విష్ణుపద భక్తులకున్
దైతేయ సూనులిరువుర
యేత ద్వ్యవహార సాక్షు లిభపుర నాథా:

పార్టీ ఫిరాయింపుల చట్టం వలన ఫిరాయింపులు ఆగక పోగా గుర్రపు కొనుగోళ్ళు మరింతగా పెరిగాయి. "అవతలి పార్టీ విధానాలు నిన్నరాత్రి నుండే నాకు నచ్చటం మొదలైంది. కాబట్టి, తెల్లవారేసరికి నా మనసు మార్చుకున్నాను" అంటుంది అమ్ముడు పోయిన ఒక గుర్రం. అధికార పార్టీలోకి దూకిన గుర్రానికి ఐదేళ్ళలో మిగిలిన కాలం వరకూ ఢోకా ఉండదు. ఐదో ఏడు చివర్న తీరిగ్గా ఈ గుర్రం ఆనాడు గోడ దూకటం చెల్లదని స్పీకరుగారు చెప్పిన సందర్భాలూ ఉన్నాయి.

తెనాలి రామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యం కావ్యంలో చెప్పిన ఈ పద్యం చదువుతుంటే ఇవన్నీ గుర్తుకొచ్చాయి. ఇది ధర్మరాజుని ఓదార్చటాన్ని గురించిన సందర్భంలో పద్యం. యుద్ధంలో ధర్మరాజు, ఆయన సోదరులు కలిసి, అవతలి వైపు వెళ్ళిన వాళ్ళందరినీ ఏ ఒక్కరూ మిగలకుండా చేశారు. అలాగే, తమ పార్టీలోకి వచ్చినవాళ్ళనీ కోల్పోయారు. చివరికి ఏకాకు లయ్యారు. అపరాధబావం వాళ్లని కలచి వేయటం మొదలు పెట్టింది.

అప్పుడు సనందనుడు ఇందులో పాండవుల తప్పేమీ లేదన్నాడు "చంపేదీ నేనే, చచ్చేదీ నేనేనని, ఎవరి డ్యూటీ వాళ్ళు చేయాలని, బాణాలు తీసి కొట్టమనీ కృష్ణుడు హితబోధ చేశాడు కాబట్టి, పాండవులు చేసిన హత్యాకాండ పాప కార్యం కాదని, అందుకు బాధ్యతని కృష్ణుడిమీదకు నెట్టేయాలని చెప్తాడు.

పార్టీ మారి వచ్చిన విభీషణుడు తన అన్నగారి రహస్యాలన్నీ కొత్త పార్టీకి చెప్పినప్పుడు అది పాపం కాదు. అలాగే తండ్రికి వ్యతిరేకంగా పార్టీ మారి ప్రహ్లాదుడు విష్ణువుతో తన తండ్రిని చంపించటం కూడా పాపం కానే కాదు. కాబట్టి, మన పురాణేతిహాసాల ప్రకారం పార్టీ మారటం నేరం కాదు. ప్రహ్లాదుడికి, విభీషణుడికీ ఫిరాయింపు పాపం అంటక పోవటానికి వాళ్ళ భక్తే కారణం అన్నాడు. అవతలి వైపుకు వెడితే సంతలో పశువును కొన్నట్టు, ఇవతల వైపుకు వస్తే, భక్తితో గౌరవంతో వచ్చినట్టూ భావించు కోవాలనేది ఆ రోజుల్లోనూ ఫిరాయింపు సిద్ధాంతానికి మూలసూత్రమే! పార్టీ మార్పుళ్లకు పాపాలుండవు.

పార్టీ మారటం అనేది చొక్కా విడిచి కొత్తది వేసుకున్నంత తేలికేమీ కాదు. శల్యుడు అటు వైపునే ఉండి ఇటు పని చేయటానికి ఎంత రిస్కు తీసుకోవాల్సి వచ్చిందీ...? అది కూడా ప్రహ్లాద భక్తి లాంటిదే కాబట్టి శల్యుడికీ ఏ పాపం అంటదు. శల్యుణ్ణీ, భీష్ముణ్ణీ రేవంత కష్టాలు పడి పాండవులు దారికి తెచ్చారు. రహస్యంగా కర్ణుడితో కూడా బేరం పెట్టారు. కానీ, పొరబాటున అలా బేరాలు చేస్తూన్న సమయంలో ఋజువుగా దొరికిపోయి ఉంటే ఏమయ్యేది?

దుర్యోధనుడు రహస్య కెమేరాలతో స్టింగ్ ఆపరేషన్ చేసి పాండవుల్ని పట్టుకున్నాడనుకుందాం... అప్పుడు పరిస్థితి ఏంటి...? కౌరవులు చిన్నప్పటి నుండీ చేసిన అక్రమాలను ఏకరువు పెడుతూ దొరికిపోయిన పాండవులు తిట్ల దండకంతో విరుచుకు పడే వాళ్ళు. వీళ్ళు వాళ్ళనీ, వాళ్ళు వీళ్ళనీ తెగబడి తిట్టుకునే వాళ్ళు. ఓ వారం టీవీ సీరియళ్ళు కూడా చూడకుండా జనం ఈ తిట్ల పురాణ కాలక్షేపం చేసేవాళ్ళు! సర్వసైన్యాధ్యక్ష పదవికి రాజీనామా చేస్తున్నానని భీష్ముడు తప్పుకునేవాడు. అసలీ పట్టుకునే డ్రామా ఆడించి పాండవుల్ని పట్టించింది నేనే నంటూ నమ్మించి, శల్యుడు కూడా బయట పడేవాడు.

పాపం కర్ణుడి పరిస్థితే ఘోరం అవుతుంది. తాను బేరానికి లొంగ లేదని చెప్పినా దుర్యోధనుడు నమ్మడనే బెంగ పట్టు కుంటుంది. స్వార్థ రాజకీయాలు నడుపుతున్నాడని శల్యుణ్ణి పట్టుకుని కడిగేసేవాడు. బేరం చెడి ఇలా మాట్లాడుతున్నావని శల్యుడు కర్ణుణ్ణి ఎద్దేవా చేసేవాడు. సంజయుడు జరిగిందంతా ధృత రాష్ట్రుడికి చెప్పేవాడు. ధృతరాష్ట్రుడు మాకు వ్యతిరేకంగా కుట్ర చేస్తున్నాడని పాండవులు ఆయన్నీ తిట్టేవాళ్ళు. మళ్ళీ మర్నాడే రాజ్యాంగ రక్షకుడైన రాజుని తిట్టినందుకు ఆయన మనసు గాయపడితే సంతోషం. ఇంక మా వ్యాఖ్యలు ఉపసంహరించు కుంటూన్నాం అనేవాళ్ళు.

శల్యుడు తన శల్య సారధ్యం ప్రయోగించి కర్ణుడికి ముగింపు పలికేస్తాడు. ఫిరాయింపుల్లో దొరికినా చివరికి పాండవులే గెలిచి మళ్ళీ ఇలా నిర్వేదంలో పడతారు.

బోలెడంత ఖర్చు పెట్టి పార్టీ మార్పించి ఇందర్ని తెచ్చి కలుపుకున్నాం. చివరికి జరిగిందేమీ లేదు. ఖర్చు తప్ప-అని !



# ప్రభుత్వ వ్యతిరేకత

**రాజై దుష్కృతి జెందె జందురుడు రారాజై కుబేరుండు దృ**
**గ్రాజీవంబునగాంచె దుఃఖము క్ష్మాపాలు డామాటచే**
**యాజిం గూలె సమస్త బంధువులతో నారాజశబ్దంబు ఛీ,**
**ఛీ, జన్మాంతరమందు నొల్లను జుమీ, శ్రీకాళహస్తీశ్వరా!**

భారతదేశంలో ఏకపార్టీ పాలన అంతం అయ్యాక ప్రభుత్వం మీద యుద్ధం అనేదే ఏక సూత్రంగా వ్యవస్థ కొనసాగుతోంది. 'వచ్చేసారి నేనే గెలుస్తా'ననే ఆశతో ప్రతిపక్షం, దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనే ధోరణిలో అధికార పక్షం ఏలుబడిని నడిపించేస్తున్నాయి. ఎవ్వరికీ నేటి మీద గానీ, రేపటి మీద గానీ భరోసా లేదు. ఈ కారణం వలన దేశ రాజకీయాల్లో నిన్న తిన్నవాళ్ళు, నేడు తినేవాళ్ళు అనే రెండంచెల వ్యవస్థ ఏర్పడింది. అధికార యంత్రాంగానికి ఇది లోకువ అయ్యింది. ప్రభుత్వానికి అధికారుల మీద అదుపు లేకుండా పోయింది.

పోయినాళ్ళంతా మంచోళ్ళు అనే మాట అబద్ధం. ఉన్నాళ్ళు పోయినాళ్ల తీపి గుర్తులన్నది నిజం. పార్టీ మారింది, వ్యక్తులు మారారే తప్ప ప్రభుత్వ తీరులో మార్పు లేకపోవటాన తాను ఓడగొట్టిన పాతోళ్ళే ఇంకా అధికారంలో ఉన్నారు గామోసు అని సగటు ఓటరు అనుకుంటున్నాడు. సామాన్యుడికి అధికార పక్షం, ప్రతిపక్షం అనే తేడా ఉండదు. అతనికి అందరూ ప్రభువులే! అందరూ పీడకులే! అందరూ పీడకలలే!

శ్రీకాళహస్తీశ్వర శతకంలో ధూర్జటి కవి వ్రాసిన పద్యం ఇది. రాజు అనే పదాన్ని, 'నేటి రాజులు, మాజీ రాజులూ ఇద్దరికీ కలిపి, అసలు రాజు అనే పదాన్నే ఛీఛీ! అని అసహ్యించుకుంటా నంటూన్నాడు ఈ పద్యంలో ధూర్జటి.

"కాళహస్తీశ్వరా! రాజు అంటే చంద్రుడు. ఆ చంద్రుడు మచ్చగలిగిన వాడయ్యాడు. రారాజు అంటే కుబేరుడు. ఈ కుబేరుడికి మెల్లకన్ను. అంటే డబ్బున్న వారి వంక 'తిన్నగా', పేదలవంక 'వక్రంగా' చూస్తాడు. రారాజంటే దుర్యోధనుడు కూడా! బంధుమిత్ర సపరివారంగా వాడు చచ్చాడు. అందుకే, రాజు అనే పదాన్నే ఛీ ఛీ అంటూన్నాను. జన్మజన్మలా రాజు కావాలని మాత్రం కోరుకోనంటాడు. ఎవ్వరైనా దేవుణ్ణి సంపదలు, అధికారాలు, పదవులు ఇవ్వమని అడుగుతారు. ధూర్జటి తనకు పదవీయోగం వద్దన్నాడు.

ధూర్జటి కవి, కృష్ణదేవరాయల అష్టదిగ్గజాలలో ఒకడని ప్రతీతి. అదే నిజమైతే పరోక్షంగా పదవి అనుభవించిన వాడే! క్రీ.శ. 1480 నుండి 1545 వరకు జీవించాడు. చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తి పట్టణ వాస్తవ్యుడు. తండ్రి రామనారాయణ.

తాత జక్కయ నారాయణ. కాబట్టి ధూర్జటి జన్మత: వైష్ణవుడనీ, తరువాతి కాలంలో శివభక్తుడై నాడని, మతంతో పాటు అభిమతం కూడా మార్చుకున్నాడనీ, ప్రభుత్వ వ్యతిరేకతను పెంచుకున్నాడనీ, అప్పుడే కాళహస్తీశ్వర శతకం వ్రాశాడనీ పరిశోధకులు భావిస్తున్నారు. అష్టదిగ్గజాలలో ధూర్జటిని 'పెద్ద ధూర్జటి' అంటారు, ఇంకో నలుగురు ధూర్జటులు ఉన్నారు. కాళహస్తీశ్వర శతకం పెద్ద ధూర్జటి వ్రాసిందే! 'శ్రీకాళహస్తి మహత్మ్యం' ప్రబంధంకూడా వ్రాశాడు

దేశంలో ప్రజలందరూ ధూర్జటిలా తిట్టగల సమర్థులే! తిట్టేవారికన్నా తిట్టుకునే వారి సంఖ్య మరీ ఎక్కువ. తిట్టడానికి పరిమితులుంటాయి గానీ, తిట్టుకోవటానికి ఉండవు. ఎన్ని బూతులైనా తిట్టలేంగానీ తిట్టుకోవచ్చు. ధూర్జటి మనసులో గూడుకట్టుకున్న అసంతృప్తికి ఈ 'ప్రభుత్వ వ్యతిరేక పద్యం' ఒక సాక్ష్యం. ఇది పూర్తి సామాజికమైన పద్యం. నేటి కాలానికి బాగా వర్తిస్తుంది.

కేవలం ప్రభుత్వ వ్యతిరేకత మాత్రమే అభ్యుదయం, దేశభక్తి అని చాలామంది అభిప్రాయం. ఒక సభలో వేరే విషయం మీద ప్రసంగిస్తున్న వక్తని "మేం ప్రభుత్వాన్ని ఇన్ని తిట్టాం, మీరు ఎందుకు తిట్టలేదు" అంటూ మైకు లాక్కుని వీరంగం ఆడాడో తిట్టుకళా ప్రవీణుడు. వీధిపంపు దగ్గర తిట్లాట లాగా ఉండకూడదు, మేధావులు తిట్టడం అంటే! ధూర్జటిలా ఉండాలి.

ప్రభుత్వాన్ని రాక్షసీకరణం చేయటం (Demonizing the Government) వలన "గతకాలమే మేలు" అనే అభిప్రాయం జనంలో బలపడ్తున్న సంగతి తిట్టుదారులు గుర్తించటం లేదు.రాజుగారి పెద్దభార్య సామెతలాగా ఇప్పటి 'వీళ్ళు' మంచివాళ్ళు కాదంటే, అప్పటి 'వాళ్ళు'మంచివాళ్ళై పోతున్నారు. ఓడగొట్టి, ఊడగొట్టి అవతల పారేసిన వాడికి తిరిగి ఊపిరి పొస్తున్నారు.

ఇవ్వాళ అధికారంలో ఉన్నాడా, నిన్న అధికారంలో ఉన్నాడా కాదు, అధికారం రుచి చూసినవాడెవడైనా సరే,'ఛీఛీ అంటాను' అంటున్నాడు ధూర్జటి. తిట్టడానికి ఇంతకన్న పదాలు అక్కరలేదు.

ఈ దేశంలో మేధావుల తిట్లు జనసామాన్యానికి అందే స్థాయిలో ఉండవు. అదేదో పాత సినిమాలో అన్నట్టు 'ఓరీ గార్ధభా' అంటే ఎవరికీ ఎక్కదు. 'ఒరేయ్ అడ్డగాడిదా' అంటే ప్రభుత్వం చేసే వాడిక్కూడా "ఓహో! అయ్యగారికి కోపం వచ్చింది, నేను పద్ధతి మార్చుకోవాలి" అనిపిస్తుంది. విషయాన్ని బట్టి తిట్లు ఉండాలే గానీ, సిద్ధాంతాల ముసుగేసి తిడితే జనానికి ఎక్కదు. వాణ్ణీ వీణ్ణీ కలిపి ఉతికే చాకచక్యం ధూర్జటిది. ✪

# బుద్ధయానం

**"కనక వలయ భూషిత ప్రకోష్ఠైః కమల నిఖైః కమలానివ ప్రవిద్య అవనత తనవస్తతో అన్యయక్ష శ్చకిత గతై ర్ధధీరె ఖురాన్'కరాగ్రై"**

అమరావతిలో దొరికిన శిలా ఫలకాలలో ఒక అద్వితీయమైన శిల్పఖండం మీద సిద్దార్థ రాకుమారుడి మహాపరిత్యాగ దృశ్యం కనిపిస్తుంది. ఆ ఫలకం కుడి చివర సిద్దార్థుడి గుర్రం "కంటకం" ఉంది. కంటకమూ, చెన్నడనే రౌతు, సిద్దార్థుడు ఈ ముగ్గురూ కలిసి రహస్యంగా ఇల్లు వదిలి వెళ్తున్న సమయం అది! గుర్రం అడుగుల చప్పుళ్ళు వినిపించకుండా దేవతలు దాని గిట్టల కింద చేతులు పెట్టి కాళ్ళను ఎత్తి పట్టుకున్న అద్భుత దృశ్యాన్ని మనం ఈ శిలాఫలకం మీద చూడవచ్చు.

అశ్వఘోషుడి బుద్ధచరిత్రలో శ్లోకం ఇది! ఆయన క్రీ.శ. ఒకటో శతాబ్ది వాడు. అమరావతి స్తూప నిర్మాణ కాలానికి చెందిన వాడు. ఆయన చేసిన వర్ణనలు ఈ అమరావతి స్తూప ఫలకాలమీద అనేక శిల్పాలలో కనిపిస్తాయి. అశ్వఘోషుడి నాటకీయతకు ఏ మాత్రం తీసిపోని నాటకీయ దృశ్యాలెన్నో అమరావతి ఫలకాలలో ఉన్నాయి. ఒక శిల్పంలో సిద్ధార్థుడు భార్యా పుత్రులను వదలి వెళ్ళబోయే ముందు తల్లి పక్కలో పడుకుని ఉన్న తన బిడ్డడు రాహులుడి వంక దీనంగా చూస్తూ, చేతులతో స్పృశిస్తున్న దృశ్యం కరుణ రసాన్వితంగా ఉంటుంది. ఆ శిలాఫలకంలో కనిపించే ప్రతి వస్తువులోనూ విషాదం కమ్ముకుని ఉంటుంది. గుర్రాన్ని నడిపే చెన్నదు దైన్యం నిండిన కళ్ళతో చేతిలో కాగడాతో నిలబడి ఉంటాడు. అది అర్ధరాత్రి సమయం అని స్ఫురించేందు కోసం కాగడాని చెక్కిన ఆ తెలుగు శిల్పి అమరశిల్పే!

"యక్షులు తమ శరీరాల్ని వంచి, కరాగ్రాలతో (అరచేతుల్తో) గుర్రం కాళ్ళ డెక్కల్ని పైకెత్తి పట్టుకున్నారు. మోచేతుల దాకా బంగారు కంకణాలు తొడుక్కున్న ఆ యక్షుల చేతులు తామరపూవుల్లా ఉండి, తామర పూవులమీంచి గుర్రం నడిచి వెడుతున్నట్టుగా ఉంది. తన ప్రభువు వెళ్ళి పోతున్నాడని కంటకాశ్వం దుఃఖిస్తోంది...." ఇదీ పై శ్లోకంలో వర్ణన.

అశ్వఘోషుడు బుద్ధ చరిత్ర కావ్యంలో చెప్పిన విషయాలే బుద్ధుడి చరిత్రకు ఆధారం ఈ కావ్యంలో ఆయన చూపించిన నాటకీయత గొప్పది. సిద్ధార్థుడు తన కంటకం గుర్రాన్ని కౌగిలించుకుని, ప్రేమగా తట్టి, దాని చెవిలో నెమ్మదిగా అంటాడు: "ఎన్ని యుద్ధాల్లోనో ప్రభువు నీ పైన ఎక్కి శత్రుశేషం లేకుండా చేయగలిగాడు. నువ్వుంటే జయమే గానీ, అపజయం ఉండదు. ఆ అమృతత్వాన్ని నాక్కూడా ఇవ్వు..."

అని ప్రార్థిస్తాడు. ఇంద్రియ సుఖాల కోసం చెలికాళ్ళు బాగా దొరుకుతారు. కానీ, కష్టాల్లో ఉన్నప్పుడూ, ధర్మాన్ని ఆశ్రయిస్తున్నప్పుడు, ఒక్కడూ తోడు రాడు... నువ్వు నా తోడుగా వచ్చావు...! అని మెచ్చుకుంటాడు. "ఈ మహాయానం లోక కళ్యాణం కోసం, ధర్మ ప్రతిష్ఠాపన కోసం అని అర్థం చేసుకో" అంటాడు. అందుకు తగ్గట్టుగా ఆ గుర్రం కూడా ఎలాంటి సకిలింపు లేకుండా డెక్కల చప్పుడు లేకుండా నిశ్శబ్దంగా ఆయన్ని ఇల్లు దాటించేందుకు సహకరిస్తుంది...

ఇక్కడ కరుణశ్రీ గారి ఒక పద్యాన్ని తప్పనిసరిగా స్మరించుకోవాలి. "ఈ ప్రగాఢ మధ్యే నిశీధి గడియ కదిలించుచున్న సవ్వడి ఇదేమి? ఇంత అర్ధరాత్రమున ఎవ్వారు వారు? మూసి యున్నట్టి తలుపులు తీసినారు?" సిద్ధార్థుడు ఎలాంటి అడ్డూ లేకుండా నిష్క్రమించ టానికి దేవతలే తలుపు గడియ తీశారట!

ఆ రాత్రి సమయంలో సిద్ధార్థుడు ఇల్లు వదిలి, అడవిలో ప్రయాణించి తెల్లవారే సరికి భృగు మహర్షి ఆశ్రమానికి చేరతాడు. గుర్రం దిగి, దాని వీపు తట్టి, "నీ విధి పూర్తయ్యింది" అంటాడు. అది విని కంటకాశ్వం దుఃఖపూరితం అవుతుంది. దాన్ని ఊరడిస్తూ, "కంటకమా! ఏడవకు. ఓర్చుకో! ఉత్తమాశ్వ లక్షణాలను నువ్వు ప్రదర్శించావు. ఈ శ్రమకి తగిన మంచి ఫలితాలు త్వరలోనే చూస్తావు" అంటాడు. భవిష్యత్తులో తాను సాధించబోయే మహత్కార్యాల సూచన ఈ మాటల్లో కనిపిస్తుంది. ఇదీ అశ్వఘోషుడు సృష్టించిన నాటకీయత. అమరావతి శిల్పాల్లో ఇవే పోకడలు కనిపిస్తాయి. వాటిని చూసి ఆనందించ గలిగే మనసు కావాలి.

భారతీయ పురావస్తు శాఖ(ఏ ఎస్ ఐ)అమరావతి శిల్ప పరిరక్షణ కోసం ఒక ఉద్యమ స్ఫూర్తితో ముందుకు రావాల్సిన సమయం ఇది. అమరావతి పరిసరాలలో బౌద్ధానికీ, జైనానికీ, శైవానికీ సంబంధించిన అనేక అవశేషాలు భూగర్భంలో పూడుకుని ఉన్నాయి. ఈ శాఖవారే గతంలో పురావస్తు ప్రాంతాలుగా గుర్తించిన స్థలాలున్నాయి. కొత్త రాజధాని నిర్మాణ ఆవేశంలో అవి కరిగి పోవటం గానీ, దురుపయోగం కావటం గానీ, అక్రమ తరలింపులు జరగటం గానీ దేనికైనా అవకాశం ఉంది. ఆ శాఖవారు ముందుగా మేల్కొని, చారిత్రక సంపద కలిగిన భూమిని గుర్తించి పరిరక్షించే పని ప్రారంభించాలి. బుద్ధుడి త్యాగం నిరుపయోగం కాకూడదు. ✪

# భక్తి - రక్తి

**ఆకారంబులు లేని నీకు మనుజుండాకారమిచ్చున్,నినున్**
**లోకవ్యాపకు గోవెలన్ నిలిపి తల్పుల్ మూయు,నిస్సంగుడౌ**
**నీకుం బెండిలి జేయు,నాకలితృషానిద్రల్ ప్రకల్పించు,మో**
**హాకృష్టుండయి బేల యయ్యెనరుడన్నన్నా! కృపాంభోనిధీ!**

"నీకు ఏ ఆకారమూ లేదని నీ గురించి గొప్పగా చెప్పుకుంటాం. మళ్ళీ నీకే ఏ సినీ నటుడి రూపమో ఇచ్చి కొలుచుకుంటాం. నువ్వు లోకవ్యాపకుడి వంటూ, నువ్వు లేని కణమూ, అణువు లేదంటాం. కానీ, నీకో గుడికట్టి తలుపులు మూసి నిన్ను అందులో బంధిస్తాం. నిన్ను నిస్సంగుడి వంటాం. కానీ నిత్య పెళ్ళికొడుకుని చేసి, నీ పెళ్లికి రోజు టిక్కెట్లు అమ్ముకుంటూ ఉంటాం. మాకున్నట్టే నీక్కూడా ఆకలి దప్పుల్నీ, నిద్రనీ కల్పించి, మా బలహీనతలన్నీ నీకు ఆపాదించి మేలుకొలుపులు పాడుతుంటాం. అవసరం అయితే నీకు లంచం ఇచ్చైనా సరే పని గడుపుకోవాలని చూస్తాం. పంచభక్ష్య పరమాన్నాలతో నీకు ప్రసాదాలు పెడుతుంటాం. వాటిని అమ్ముకుని ఆదాయాలు సమకూరుస్తుంటాం. మాయలో పడి, నిన్ను కూడా మాయలోపెట్టి అసహాయులుగా ఈ వెట్టి పనులన్నీ చేస్తున్నాం..." ఇలా సాగుతుంది "కళా ప్రపూర్ణ", "సాహిత్య చక్రవర్తి" చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారి ఒక పద్యం.

**అల్లుడా రమ్మని ఆదరమ్మున బిల్వ / బంపు మామను బట్టి చంపగలమె**
**జలకేళి సవరించు జవరాండ్ర కోకల / నెత్తుక పోయి చెట్లెక్క గలమె**
**యిల్లిల్లు దిరిగి వ్రేపల్లెలో మ్రుచ్చిలి / మిసిమి ముద్దలు దెచ్చి మింగ గలమె**
**గొల్ల పొట్టెల గూడి కోల సేకొని యాల / కదుపుల నేర్పుతో కాయగలమె**
**తల్లిదండ్రులు పరుల కీదలచు కన్య / బలిమిపై దెచ్చి భార్యగా బడయగలమె**
**దుష్టులను వంక వీరుల ద్రుంప గలమె / అనపరాధుల దండింప నరుగ గలమె."** అని భగవంతుని ఎత్తిపొడవాలంటే ఒక భక్తకవికి కష్టసాధ్యమైన విషయమే!

"అల్లుడా! రావయ్యా అని పిలువ బంపిన మేనమామని పట్టి చంపావు. నదిలో స్నానాలు చేస్తున్న ఆడపిల్లల కోకలు ఎత్తుకుపోయావు. వ్రేపల్లెలో గోపికల ఇళ్ళలో దూరి వెన్నముద్దలు దొంగిలించి తెచ్చి మింగావు. బుడ్డ కుర్రాళ్లను పెట్టుకుని పశువుల్ని కాశావు...అంటూ అర్జునుడి నోటిద్వారా కృష్ణుడి లీలల్ని ఎత్తి పొడిపిస్తాడాయన! మా ఇంటావంటా ఇలాంటి బుద్ధులు లేవన్నట్టు మాట్లాడతాడు అర్జునుడు.

దానికి కృష్ణుడు తాను లేకపోతే ఈ అర్జునుడు ఎక్కడుండేవాడివంటూ గేలిచేస్తాడు. తమకేదో ఒరగబెట్టినట్టు నటిస్తూ తనకు పేరొచ్చేలా చేసుకున్నాడని అర్జునుడు కూడా కృష్ణుని ఎదురు ఆక్షేపిస్తాడు.

మొత్తం మీద మనుషులు లేకపోతే దేవుడు లేడు, దేవుడు లేకపోతే మనుషులు లేరనే ఒక సమన్వయం చిలకమర్తి వారి గయోపాఖ్యానం పద్యాల్లో కనిపిస్తుంది. నేనొక్కణ్ణి లేకపోతే నిన్ను కొలిచేవాడెవడని అన్నమయ్య ఇంతకన్నా ఘాటుగానే అన్నాడు. భక్తుల్లేని దేవుడికి విలువుండదు. కాబట్టి భక్తుల్ని మంచి చేసుకోవాలసిన అవసరం దేవుడికి బాగా ఉంది. ముఖ్యంగా డబ్బులున్న భక్తుల అవసరం మరీ ఉంది. భక్తులు లేకపోతే దేవుడి ఉనికే ప్రశ్నార్థకం అవుతుంది.

ఈ మధ్య దేవాలయ ఆగమవాస్తుని మార్చేసి, కమర్షియల్ కాంప్లెక్సులు కట్టేందుకు వాడే వాస్తుని తెచ్చి గుడి రూపురేఖలన్నీ మార్చేస్తున్నారు. దాని వలన దేవాలయాలకు భక్తుల తాకిడి, రాబడి కూడా ఇబ్బడిముబ్బడిగా పెరిగి దేవుళ్ళ ప్రతిష్ఠ ద్విగుణం బహుళం కాసాగింది. ఈ కమర్షియల్ వాస్తు భక్తిని చంపి భక్తుల్ని పెంచింది. చివరికి, దినపత్రికల, న్యూస్ ఛానళ్ళ క్రైమ్ రిపోర్టర్లకు తెల్లవారుఝామునే డ్యూటీలు వేయాల్సిన కేంద్రాలుగా దేవాలయాలు మారాయి. కానీ, అందువలన భగవంతుడి ప్రశస్తికి వచ్చిన మచ్చ ఏమీ లేకపోగా భక్తుల తాకిడి మరింత పెరుగుతోంది.

దేవాలయ గోపురాలకు, దేవుడి విగ్రహాలకు బంగారు తాపడాలు చేయించి మరింత 'భక్తరాబడి' పెంచాలని దేవస్థానాల ఆలోచన! తమిళనాడులో ఉన్న వెంకటేశ్వర స్వామి గుడి మొత్తం బంగారం తళుకులతో మెరిసిపోతుంటే ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతి వెంకన్న ప్రాభవం తగ్గి పోతుందనీ, ఇక్కడ కూడా బంగారపు తాపడం చేయాలని చాలామంది భక్తులు కోరుతున్నారు. తిరుమల దేవళం కనీసం వెయ్యేళ్ళ చారిత్రక ఆధారాలు, అనేక దాన శాసనాలు కలిగిన ప్రాచీన దేవాలయం. బంగారు రేకులు బిగిస్తే, ఆ శాసనాలన్ని మూసుకుపోతాయని మేధావి వర్గం ఆందోళన చేస్తున్నారు. అవి పనికిరాని దానశాసనాలేనని వాళ్ళూ, అందులోనే చరిత్ర దాగి ఉంటుందని చరిత్రకారులు వాదులాడుతున్నారు. ఏం చేయాలో తేలని మీమాంస తోనే ఏళ్ళు గడిచి పోతున్నాయి. ఆ శాసనాలకు నకళ్ళు తీయించి ఇస్తే ఏవి ఉండాల్సినవోఏవి నిరుపయోగమో పరిశోధకులు నిర్ణయిస్తారు. కానీ, ఒక శాసనంలోని చారిత్రక సమాచారాన్ని తూకం వేసి, ఇది అవసరం, ఇది అవసరల అని నిర్ధారించగలిగే చరిత్రకారుడుంటాడనుకోను ! ☆

# భాషఘోష

**హరులు నుండుగాక కరులు నుండును గాక**
**ఉంద్రు( గాక వేయి యోధ వరులు**
**మానవాధిపులకు మఱియు విశేషించి**
**కవియె లే(డో యశము కలుగ(బోదు**

యేలూరిపాటి అనంతరామయ్యా గారు గతతరం కవిపండితుడు. ఆయన నీలకంఠ దీక్షితులు సంస్కృతంలో వ్రాసిన మూడు శతకాలను నీలకంఠ త్రిశతి పేరుతో పద్యాల్లో అనువాదం చేశారు. పైన పద్యం సభారంజనం అనే శతకంలోది. రాజుల దగ్గర వేలకొద్దీ గుర్రాలుంటాయి. ఏనుగులుంటాయి. గొప్ప సైనికులుంటారు, ఎందరున్నా కవి లేకపోతే కీర్తి రాదు-అనేది దీని భావం.

కవులు ఎప్పుడూ ఉంటారు. కానీ కామాన్ని ఆదరించేవాళ్ళే కొద్దిగా ఉంటారు. రాజాదరణ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. రాజు ఎంత ఛండాలుడైనా ఆయన్ని ఇంద్రుడంతవాడిగా పొగిడి అగ్రహారాలో, మణి మాన్యాలో పుచ్చుకోవటాన్ని రాజాదరణగా భావిస్తుంటారు కొందరు. గుడ్డివాడు ధనవంతుడైతే, కమలపత్రాక్షుడనీ, గడ్డులోభిని కల్పవృక్షం అనీ, పిరికివాణ్ణి విక్రమాదిత్యు డనీ ఈ ప్రపంచంలో కవులు మాత్రమే కీర్తించగలరంటాడు నీలకంఠ దీక్షితులు. "పాండవులు జూదంలో ఓడి, పరదేశాల పాలైనా, వెట్టి చాకిరీ చేసినా ఐదుగురికి ఒకే పెండ్లాం ఉన్నా వ్యాసుడి వాక్కుల వల్ల అవి కీర్తిమంతాలే అయ్యాయి...అంటాడు

తిమ్మిని బమ్మిగా చూపించ గలిగిన చాక చక్యం కవులకుంటుంది. వాళ్లకే సహజంగా రాజాదరణ ఉంటుంది. అవార్డులు కావాలన్నా, పదవులు కావాలన్నా వందిమాగధం లేనిదే ఏదీ దక్కదు. పొగిడే కవులు పురస్కారా లంకృతులు కాగలరేమో కానీ, వాళ్లకి లోకంలో విలువుంటుందనేది నమ్మలేని విషయం.

ఇంతకీ. రాజాదరణ అంటే కవులకు అవార్డులు ఇవ్వటమేనా? ప్రభువులు ఈ మాత్రం చేస్తే చాలా?

తెలుగు భాషకు, తెలుగు సాహిత్యానికీ, తెలుగు సంస్కృతికీ ప్రభుత్వ పరంగా చేయవలసిన ఉపకారాలు కొన్ని ఉండగా, చేస్తున్న అపకారాలను సరిచేసుకో వలసినవి మరికొన్ని ఉన్నాయి. వాటిని నెరవేర్చుకోగలగటమే రాజాదరణ అంటే!

భారత రాజ్యాంగం దేశీయ భాషల్లో విద్యను నేర్పటానికి దేశప్రజలకు భరోసా ఇచ్చింది. కానీ, తెలుగు నేలమీద ఆ భరోసా అమలు కావటం లేదు. మాతృభాషకు

రాజాదరణ లేకపోగా రాజ్యాంగ అతిక్రమణ జరుగుతోంది. దీన్ని సరిచేసుకోవాలి. తెలుగు నేలమీద తెలుగు దిక్కులేని అక్కుపక్షిలా అఘోరిస్తుండగా తమిళ నేలమీద తమిళ భాషానురక్తి శ్రుతి మించి రాగాన పడింది. ఆ రాష్ట్రంలో తమిళం తప్ప ఇంకో భాష చదవటానికి వీల్లేదని తెలుగు స్కూళ్ళని మూయించేశారు. తెలుగు జనాభా సగానికి పైగా ఉన్న తమిళనాడులో తెలుగు అలా అఘోరిస్తోంది. ఇంకో భాష నేర్పరాదనటం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. ఆ విషయం కేంద్రానికి తెలీదా? కోర్టులకు తెలీవా? ఎవరూ మాట్లాడరు. దేశంలో భాషా రాజాదరణ అలా అఘోరిస్తోంది.

కేంద్రానికి భాషా విధానం ఉంటే ఇలా జరిగేది కాదు. కానీ రాజకీయ ప్రయోజనాలు అన్నింటికన్నా ముఖ్యమైనవి. ఆనాడు మన్మోహన్ గారు కరుణానిధి గారికి తమిళం క్లాసికల్ హోదాని రాజభరణంగా ఇచ్చేశాడు. ఈనాడు మోదీ గారు తెలుగు హననాన్ని రాణిగారికి భరణంగా ప్రసాదించాడు.

తెలుగు భాషకు విశ్వవిద్యాలయాలు చేయవలసిన కార్యాన్ని చేయటం కూడా రాజాదరణే! తెలుగు కన్నడ భాషా యోధులు పోరాడి ఆ రెండు భాషలకూ క్లాసికల్ హోదా సాధించినప్పుడు, మన విశ్వవిద్యాలయాలలో తెలుగు శాఖల వాళ్ళు కొందరు హేళన చేయటం నేను ఎరుగుదును. భాషోద్యమంలో భాగం పంచుకోని విశ్వవిద్యాల యాల తెలుగు శాఖలు క్లాసికల్ హోదా వస్తే, సాలుకు 100 కోట్ల రూపాయలు పరిశోధనా ప్రాజెక్టులకోసం వస్తాయనే విషయాన్ని కూడా మరిచారు. ఈ ఐదేళ్ళ కాలంలో సాలుకు 100 కోట్ల చొప్పున వచ్చి, నిరుపయోగంగా వెనక్కి తిరిగి పోతున్నాయి.

2016 జనవరి 3 వరకూ 21 రోజులపాటు కుప్పం ద్రవిడ విశ్వవిద్యాలయం లో పరిశోధక విద్యార్థులకోసం ప్రత్యేక ప్రసంగాలు ఏర్పరచి, ఈ నిధుల వినియోగానికి ఒక ప్రారంభం పలికారు. ఇతర విశ్వవిద్యాలయాలు ఇప్పటి కైనా కళ్ళు తెరవటం మంచిది..... సెమినార్లను ప్రమోషన్లకోసం మార్కుల సెమినార్లుగా న్యాక్‌గా మార్చేశారు, రాజాదరణ కోసం పాకులాడటం అంటే ఇదే! భాష, సాహిత్యం, పరిశోధన ఇవేవీ లేకుండానే కాలం చెల్లిపోతోంది కాలానికి!

భాషాభిమానుల ఘోష ఎవరికీ పట్టదు. అందుకని, ఎవరినీ ఏమీ అనలేక ఇంగ్లీషుని తెలుగులో తిట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు జనం. ✩

# భాషా గీర్వాణం

"యతియుంబ్రాసయు లేని సంస్కృత కవిత్వారణ్యా మందున్న భా
రత వేదానఁ బదేను పర్వముల కాంధ్రత్వంబు నేర్పించి
శాశ్వతుడై పోయిన తిక్కయజ్వకు నివాసంబైన నెల్లూరికిన్
నతు లర్పింపుము స్నానమాడు మతిగణ్యంబైన పెన్నానదిన్"

మహాకవి జాషువా...పాండిత్యం ఎంత ఉన్నా కులంచేత సామాజిక గౌరవాన్ని పొందలేక, పేదరికం చేత సుఖ జీవనాన్ని అందుకోలేక, తన దీన స్థితిని ఈశ్వరుడికి చెప్పవలసిందిగా గబ్బిళాన్ని ప్రార్థిస్తాడు.

ఇంటి చూరుకో, పైకప్పుకో పట్టుకు వ్రేలాడుతుంది గబ్బిళం . అది పట్టుకున్న చోట ఒక పెన్సిలుతో చుక్కపెడితే ఎక్కడెక్కడో తిరిగి, తిరిగి ఆ చుక్కమీదే వాలగల సమర్థత కలిగింది. 'గురి'ని అవలీలగా చేరగలది కాబట్టే, దాన్ని వేడుకున్నాడు కవి, తన పక్షాన దేవుడితో రాయబారం నడపమని!

గబ్బిళం అందరిలాగా మామూలు కళ్లతో చూడదు, జ్ఞాననేత్రంతో చూస్తుంది. దాని చూపుని అర్థం చేసుకునే గదా రాడార్ వ్యవస్థని కనిపెట్టారు...

గబ్బిళం స్తన్యజీవి. అయినా దానికి పిల్లల్ని కని పాలిచ్చి పెంచే ఆవులాంటి జంతు జీవాలతో సమాన గౌరవం లేదు. పక్షిలా ఎగరగలదు. తూనీగలాగా దూసుకుపోగలదు. వాటి కన్నా వేగంగా దిశను మార్చుకోగలదు. అయినా చిలుకకి అంత ప్రతిష్ఠ లేదు. గ్రద్దలాగా పరువులేదు ఏ దేవుడూ పట్టించుకోని మేధావి గబ్బిళం. దానికి మొర పెట్టు కున్నాడు కవి. అణచివేతకు గురైన వ్యక్తులు అణచి వేయబడిన వారికి చెప్పుకోగలుగుతారు ?

గుర్రం జాషువా (సెప్టెంబర్ 28, 1895 - జూలై 24, 1971) అందరూ భావ కవిత్వం వ్రాస్తున్న కాలంలో సామాజిక ప్రయోజనం కోసం రచనలు ప్రారంభించిన కవి. కవితాయుధంతో కులవాదుల మీద తిరగబడ్డాడు. ఛీత్కారాలు ఎదురైన చోటే సత్కారాలు పొందాడు.

"యతిప్రాశలు లేని సంస్కృత కవిత్వ దుర్గమారణ్యంలో ఐదోవేదం అయిన మహాభారతం బందీగా ఉంది. దాని బంధనాలు వదిలించి, పదిహేను పర్వాలను తేట తెలుగులోకి తెచ్చి, శాశ్వత కీర్తిని పొదాడు తిక్కన మహాకవి. ఆయన ఊరు నెల్లూరు. దాని మీదుగా వెళ్ళేప్పుడు ఆ నగరికి నమస్కారం పెట్టు. గొప్పదైన పెన్నానదిలో స్నానం చెయ్యి..." అని గబ్బిళానికి సూచిస్తాడు ఈ పద్యంలో. తంజావూరు సరస్వతీ మహలుని సందర్శించ మంటాడు. ఇంకా ఇలాంటి ముఖ్య

దర్శనీయ స్థలాలకు మొక్కమంటాడు. సామాజిక కవితకు కొత్త ఊపిరి పోసిన పద్యకవి జాషువా!

మేధావుల్లోనూ పండితుల్లోనూ సంస్కృతాభిమానం జాస్తిగా ఉండి, అది మాతృభాషాభిమానాన్ని కప్పిపుచ్చుతోంది. తెలుగుభాషపై మక్కువని ఆంగ్ల భాషాభిమానులతో పాటు సంస్కృత భాషాభిమానులు కూడా ఈసడించటాన్ని చాలా మందిలో గమనించాను. ఒక సంస్కృతాభిమాని తన ఇంట్లో పనిమనిషితో కూడా గీర్వాణంలోనే మాట్లాడతానన్నాడు. అందువలన అమ్మభాషకు ఒరిగిందేమిటని అడిగాను. సంస్కృతం బతికితే అన్ని భాషలూ బతికినట్టే నని ఆయన సమాధానం చెప్పాడు. పూర్వం జయంతి రామయ్య, కొక్కొండవెంకట రత్నం లాంటి గ్రాంథిక భాషావాదులూ ఇలాగే ఇంట్లో కూడా గ్రాంథికమే మాట్లాడే వాళ్ళని ప్రతీతి. వీళ్ళు కారడవుల్లో బతకవలసిన వాళ్ళనేది జాషువా గారి అభిప్రాయం అందుకే "యతియుంబ్రాసయు లేని సంస్కృత కవిత్వారణ్యం" అన్నాడాయన.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి సంస్కృత వాఙ్మయ చరిత్ర ప్రధమ భాగం చదివితే, సంస్కృతభాష ఎలా రూపొందిందో బాగా అర్థం అవుతుంది. అది అన్ని అమ్మభాషల్లాగా ఏర్పడింది కాదు. మానవ నిర్మితం. మాతృభాష రాత్రికి రాత్రే పుట్టదు. సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, మతపరమైన కారణాలతో భాష ఎప్పటికప్పుడు కొత్త పరిణామాలు పొందుతూ ఒక రూపాన్ని సంతరించుకుంటుంది. సంస్కృతం నేర్చుకోవటానికి దైవభక్తికీ ముడి పెట్టినందువలన కొత్త సమస్య లొచ్చాయి.

దేవుడికి సంస్కృతం మాత్రమే తెలుసని, తెలుగులో "అయ్యా! నా సమస్య తీర్చు" అని వేడుకుంటే దేవుడికి అర్థం కాదనీ జనంలో భ్రమలు కల్పించ నవసరం లేదు. వేదమంత్రాలను సంస్కృతం అని మన చేత నమ్మించాలని చూడటం అన్యాయం.

సంస్కృతం అంటే ఈ దేశంలో పుట్టిన ప్రతి ఒక్కరికీ గౌరవం ఉంటుంది. ప్రత్యేకంగా బోర్డు తగిలించుకుని ఆ అభిమానం చాటుకో వలసిన అవసరం లేదు. అలాగే మాతృభాషాభిమానానికీ బోర్డు అవసరం లేదు. కానీ, అమ్మభాష పట్ల చిన్నచూపునే ఆక్షేపించాల్సి వస్తుంది. వేరొక భాషాభిమానంతో అమ్మభాషని వాడకపోవటం మాతృభాషా ద్రోహమే!

పదిహేనుపర్వాల అచ్చతెలుగు ఆంధ్రమహాభారతాన్ని తిక్కనగారికి నమస్కరించుకుని, తెలుగు భాష కోసం చదవాలనేది జాషువా గారి అభిప్రాయం. సంస్కృత పదాలతో నింపి ఇదంతా తెలుగనటం పండితుల్లోని పాండిత్య ప్రదర్శనా ధోరణికి అద్దంపట్టడమే అవుతుంది. భాషా గీర్వాణం వదిలి తెలుగులోనే మాట్లాడే వాడికి కోటి దండాలు. ☆

# మండు వేసవిలో సుఖ సంసారం

**నలదమయంతు లిద్దఱు మనః ప్రభావానల బాధ్యమానులై**
**సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనమ్ములన్**
**నలిన దళంబులన్ మృదు మృణాళములన్ ఘనసార పాంసులం**
**దలిరుల శయ్యలన్ సలిలధారల( జందన చారు చర్చలన్**

ఇది నన్నయ గారి పద్యం. ఎలాంటి ఏసీలూ లేని ఆ రోజుల్లో ఎండా కాలంలో సరస సాంగత్యాలకు సౌకర్యవంతంగా ఉండేవి కావు. అందుకని, చల్లదనం కంటికి, వంటికీ, ఇంటికీ ఆనక, ఆ ఉక్కపోతలోనే కొత్త దంపతులైన నలదమయంతులు హనీమూన్ 'సలిపా'రని వర్ణిస్తాడు ఈ పద్యంలో నన్నయ గారు.

సలపరింత అంటే, పుండు పోటెత్తడం. ఆ ఎండాకాలంలో నలదమయంతులు ఆనంద డోలికల్లో తేలియాడిందేమీ లేదనటానికి 'సలిపా'రనే పదం వాడి ఉంటాడు నన్నయగారు. ఎంత ఏసీలో జీవించే వారికైనా, కరెంటు పోతే, 'ఏసీ' 'తీసీ'గా మారిపోయి, ఇదే దుస్థితి తప్పదు కదా!

పూర్వకవులు సాధారణంగా వసంతమాసాన్ని, శారద రాత్రుల్నీ సుఖ వికాసాలకు అనువైన కాలంగా వర్ణిస్తారు. కానీ, నన్నయ గారు 'దీర్ఘవాసరనిశల్' అంటే, ఎప్పుడు క్యాలెండర్లో తేదీ మారుతుందా... అనిపించే సుదీర్ఘ దివారాత్రాల రోజుల్లో కొత్త దంపతులైన నల దమయంతుల్ని తెచ్చి కలిపాడు. మనః ప్రభావాన్ని అంటే,మన్మథ తాప బెడదని తప్పించు కోవటానికి ఆ నవదంపతులు పడిన అవస్థ ఊహించుకోవాల్సిందే!

ముప్పై వేల ఎకరాల రాజధాని ఊరింతలు ఏవీ లేని సత్తెకాలం కాబట్టి, ఆ రోజుల్లో పూలతోటలు, తామరకొలనులూ వగైరా 'ఉన్న' రోజులు కాబట్టి, తామర పూల రేకులు, తామర కాడలతో(మృదు మృణాళములన్ ), పన్నీటి జల్లులతో (సలిల ధారలన్) అక్కడ వేసవి కాలక్షేపం చేసారట. వాళ్లకు చల్ల దనం అనేది ఏ మాత్రం అయినా దొరికిందంటే గంధం చెక్కని కొద్దిగా పచ్చ కర్పూరం పలుకులతో (ఘనసార పాంసులన్) అరగదీసి గంధం తీసి అది వొంటికి రాసుకోవటం (చందన చారు చర్చ) వలన మాత్రమే! అది రాసుకున్నాక లేత ఆకులు (నలిన దళంబులన్) పరుపులా పరుచుకుని వాటిమీద 'వాళ్ళ తంటాలేవో వాళ్ళు పడ్డారు' అని చెప్పటం కోసం 'సలిపారు' అనే పదం వాడాడు నన్నయ గారు.

సుఖజీవనానికి చల్లగాలిమర(ఏసీ మిషను) ఒకటి ఉండి ఉంటే వేసవిలో రతి వైభవాన్ని వర్ణించటానికి కవులకు కలాలు, పేజీలు సరిపోయేవి కాదు. వేసవి

శృంగారం గురించి చెప్పేదేమీలేదని 'సలిపారు' అనేసి ఊరుకున్నాడు నన్నయ గారు. అప్పో సొప్పో చేసి ఏసీ పెట్టించుకున్నప్పటికీ కరెంటు సమస్య 'సలపరింత' పెట్టేది ఖాయం కదా!

అందుకని, కొత్త రాజధానిలో 'బృందావనం ఫౌంటైన్లూ, నందనవనాలూ, తామర కొలనులూ, కాసిని మంచిగంధం చెక్కలూ, పచ్చకర్పూరం పలుకులూ వగైరా శీతల ఉపచర్య సామగ్రి జనసామాన్యానికి అందుబాటులో ఉండటం అవసరం' అని కొత్త ప్రభువులకు నన్నయగారి ఈ పద్యం సూచిస్తోందన్న మాట! చెరువుల్నీ, తోటల్నీ తొలగించి, భవనాలు కడుతున్నందున ఈ శీతల సామగ్రిని జనసామాన్యం కోసం ప్రభుత్వమే సమకూర్చాలని నన్నయగారి సూచన కనీసం సబ్సిడీ అయినా ఇవ్వాలని సూచన.

వేసవిలో వడకొట్టకుండా, విరేచనాలు కాకుండా, ఒళ్ళు పేలకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకుంటారు గానీ, నన్నయ చెప్పిన 'సలప'రింతని తప్పించుకోవటానికి మందస్తు మార్గాలు నన్నయగారి ఈ పద్యంలోనే ఉన్నాయి. ఆయన పచ్చకర్పూరం గంధం మిశ్రమాన్ని వంటికి పూసుకుని శీతలోపచారాలు చేసుకోవాలన్నాడు. కానీ, ఈ మిశ్రమాన్ని చిన్న ఉండలు కట్టుకుని రోజూ ఒకటి లేక రెండు మాత్రలు కడుపులోకి తీసుకుని పాలు తాగండి. ఈ గంధం పచ్చకర్పూర మిశ్రమం శరీరంలో ఊష్మాన్ని తగ్గిస్తుంది. పైపూతగా వంటికి రాసుకుంటే ఎంత చల్లదనాన్నిస్తుందో, కడుపులోకి తీసుకున్నా అంత చలవనిస్తుంది. లైంగిక శక్తినీ, ఆసక్తినీ పెంచుతుంది. తక్కువ మోతాదులో తీసుకోవాలి! పచ్చకర్పూరం అతిగా వాడకూడదు. జలుబు చేస్తుంది.

'అపార్ట్'మెంట్ల సంస్కృతి పెరిగాక గాలీ వెలుతురు గురించి ఆలోచించటం మానేసి, సీలింగు ఫ్యాన్లూ, పగటి దీపాలు, ఏసీల మీద ఆధారపడ్డ ప్రజలకు కరెంటు లేని సమయంలో నలదమయంతుల సలపరింత అనుభవంలోకి వస్తుంది. గాలీ వెల్తురూ రాకుండా, ఫ్యాన్లతోనూ ఏసీలతోనూ వదిలిన గాలినే పీలుస్తూ జీవించే విధంగా ఇళ్ళు కట్టుకుంటూ, సుఖాన్ని భూతద్దంతో వెదుక్కోవటం మనకు మనం చేసుకుంటున్న అన్యాయం. ఏ ఇంట్లో పగటిపూట కూడా లైట్లు వేసుకుని జీవిస్తారో ఆయింట్లో నన్నయగారు చెప్పిన సలపరింత ఎక్కువని, ఆయింట్లో దంపతులకు లైంగికశక్తి ఆసక్తి తక్కువనీ దీని భావం. ★

# మాజీనది

"గంగా సంగమమిచ్ఛగించునె? మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే? యమునతోనానందముం బొందునే?
రంగత్తుంగ తరంగ హస్తములతో రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ..!"

గంగ, యమున కలిసే ఒకేసారి సముద్రుడితో సంగమిస్తాయి. అదొక ఆనందం సాగరుడికి! తుంగభద్రానదికి సాగర సంగమం లేదు. ఆ నది కన్యగా ఉండి పోక తప్పలేదు. అందుకని తెనాలి రామకృష్ణుడు ఆ నదిని ఓదార్చటం ఈ పద్యంలో కనిపిస్తుంది.

"గుణభద్రా...తుంగభద్రా... ఎగిరిపడే అలల హస్తాలతో ఆ రత్నాకరుడైన సముద్రుడు నిన్ను తాకి సుఖించి ఉంటే గంగా సంగమాన్ని ఇష్టపడే వాడా? కావేరిని దేవేరిగా అంగీకరించేవాడా? యమునతో ఆనందం పొందేవాడా? మిగతా నదుల జోలికి పోయేవాడా...?" అంటాడు. తెనాలివాని అందమైన ఊహలో సముద్రం, నదీ సంగమాలు ఆ రెండింటికీ క్షేమ దాయకం అనే సందేశం ఉంది.

నదులకు సాగరుడే గతి అని మనం నమ్ముతున్నాం. గట్టిగా ఆలోచిస్తే, సాగరుడిక్కూడా నదులే గతి అని అర్థం అవుతుంది. తుంగభద్రకి ఒకటే బాధ... సాగరసంగమానికి నోచుకో లేకపోతినే... అని! తెలుగు సముద్రానికీ అలాంటి బాధే ఉంది... తుంగభద్రా సమేతంగా కృష్ణానదీ సంగమమే కరువై పోయిందని! అవును ! కృష్ణ ఇప్పుడు మాజీనది !

నిజానికి, సాగరసంగమ భాగ్యం లేని తుంగభద్రని కృష్ణానది హత్తుకుంది, ఓదార్చింది. ఆదరించింది. తనలోనే లీనం చేసుకుని తనతో కలుపుకు పోతానని మాట ఇచ్చింది! వేలాది యేళ్ళుగా కృష్ణా, తుంగభద్ర స్నేహం భద్రంగానే సాగుతోంది. లోకం అంతా తుంగభద్రని కృష్ణకు చెల్లి గానే భావిస్తున్నారు. ప్రయాగలో గంగా-యమునల్లాగా సంగమేశ్వరంలో కృష్ణ-తుంగభద్ర నదుల విలీన స్థలి పుణ్యక్షేత్రంగా భాసిల్లింది. ఒకప్పుడు ఆంధ్రలో నదుల్ని జీవనదులనే వారు. ఇప్పుడా పరిస్థితి లేదు. ఇక్కడ పంటలేకాదు, నదులు కూడా వర్షాధారాలై పోయాయి. గోదావరి, కృష్ణా, తుంగభద్ర, పెన్న, నాగావం, వంశధార... అన్నీ రైతన్నల కన్నీళ్ళలా ఇంకిపోయాయిప్పుడు.

పూణే, సతారా, కోలాపూర్, హైదరాబాద్ నగరాల మురికినంతా మోసుకుని కృష్ణమ్మ కర్నూలుదాకా వస్తోంది. ఇక్కడ తుంగభద్ర తో కలిసినందువలన దాని లోని విషాలు కొంత పలచబడతాయి. నదులనేవి పైన వాళ్ళ మురికిని మోయటానికే గానీ, దిగువ భూముల దాహార్తి తీర్చటానికి కాదని పైన రాష్ట్రాలవారి నిశ్చితాభి ప్రాయం. వరదలొచ్చినా, ఉప్పెన లొచ్చినా, కరువు లొచ్చినా అన్నీ దిగువ భూములకే అయినా నీటి దొంగలకేం జాలి?

ఋగ్వేదంలో వృత్రాసురుడి కథ ఉంది. వాడు కూడా పల్లపు భూములకు దక్కాల్సిన నీటిని ఇలానే బంధిస్తాడు. ఇది అంతర్జాతీయ నీటి సూత్రానికి విరుద్ధం అని, ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని ప్రయోగించి వృత్రాసురుడు కట్టిన ఆనకట్ట కూలగొట్టి నీటి బంధనాన్ని వదిలించాడు. వేదం మనకు సర్వప్రమాణం కదా! మరి, వృత్రాసురుడి కథ ఎందుకు కాదూ...?

క్రీ.శ. 1700 ప్రాంతాల్లో కావచ్చు. అప్పటి మైసూరు రాజు, బృందావన్ గార్డెన్స్ దగ్గర చామరాజ సాగర్ ప్రాజెక్టు ఉన్న చోట కావేరి మీద ఇలానే ఆనకట్ట కట్టి ఆ నదీజలాలను బంధించాలని చూశాడు. అందువలన తంజావూరు, మధిర రాజ్యాలు నీరు లేక ఎండిపోయే పరిస్థితి వచ్చింది. అప్పట్లో మధురా రాజ్యాన్ని తెలుగు రాణి మంగమ్మగారు పరిపాలిస్తూ ఉండేది. ఆవిడ తన సైన్యంతో మైసూరు రాజు కట్టిన ఆనకట్టను కూలగొట్టటానికి బయల్దేరింది. కానీ భయంకరమైన ఉప్పెన వచ్చి మంగమ్మ గారు పగలగొట్టకుండానే మైసూరు ఆనకట్ట పగిలిపోయింది. ఇంద్రుడి వజ్రాయుధ ప్రయోగం అంటే ఇదే! ఆలమట్టికీ ఏదో ఒక రోజు వజ్రాయుధ ఘాతం తప్పదు. అందాకా కృష్ణా తుంగభద్రలు ఒకరినొకరు ఓదార్చుకోవలసిందే!

ఒకరోజు తుంగభద్ర కృష్ణతో అంది... "అక్కా! నీలో లీనం అయిపోయి, నీ ద్వారా సాగర సంగమ భాగ్యం పొందుదా మనుకుంటే, ఇదేంటి ఇలా అయ్యిందీ... నీక్కూడా సముద్రంలోకి వెళ్ళే ప్రాప్తం లేకుండా పోతోంది కదా..." అని!

అప్పుడు కృష్ణా నది అంది... "చెల్లీ! నీకు లేకా, నాకు ఉండీ ఒకటే అయ్యింది! ఈ మనుషులు సముద్రంలోకి నదీ జలాలు వెళ్ళడం వృథా అనుకుంటున్నారు. నదులు కలవకపోతే సాగరుడు కూడా మరణిస్తాడు. చచ్చిన సముద్రాలెన్నో ఉన్నాయి. నదుల్ని ఎండగడితే సముద్రాలు ఎండిపోతాయి" అని.

"పూణే నుండి హైదరాబాద్ దాకా ఈ నగరాలన్నింటి మురికిని ఆంధ్రులు భరించాల్సిందేనా" అడిగింది తుంగభద్ర.

"హైదరాబాద్ మురుగు కలవకుండా మా స్వచ్ఛ కృష్ణాజలాలు మాకు కావాలి..." అని ఆంధ్రులడగాలి కదా..." అంది కృష్ణ. తుంగభద్ర నవ్వి ఊరుకుంది. ★

# మాట తప్పిన 'మాట'

**"శిరమెల్లన్ గొరిగించుకొంచు, స్వతప శ్శీలంబులన్ మాని, మే**
**టిరుషుల్ ఛీ ! యన, సిగ్గులేని పరిపాటిన్ గల్లు పెల్లానుచున్,**
**నరు పున్కన్ ధరియించి, యుత్తర దిగంత ప్రాప్తి కూరేగెదన్**
**ఖర వాహంబున వాడవాడలును; నా క్ష్మానాథుడే బొంకినన్"**

హరిశ్చంద్రుడు దేశాన్నేలే రాజు. నిజం కోసం నిబద్ధంగా నిలబడ్డవాడు. అతని చేత అబద్ధం ఆడిస్తానని విశ్వమిత్రుడూ, ఆడించలేవని వశిష్టుడూ పందెం వేసుకున్నారు. వశిష్టుడు అంటున్నాడు. "హరిశ్చంద్రుడే అబద్ధం ఆడితే నేను తల గొరిగించుకుంటాను. నా తపస్సు వదిలేస్తాను. అందరితోనూ మంచిగా ఉండటం మానేస్తాను. చివరికి సాటి ఋషులంతా ఛీ ఛీ అనేట్లు పరమ రోతగా కల్లు తాగి మనుష్య కపాలం చేత్తో పుచ్చుకుని గాడిదెక్కి ఊరేగుతాను" అంటాడు. ఇది బలిజేపల్లి వారి సత్య హరిశ్చంద్రీయం నాటకంలో పద్యం.

హరిశ్చంద్రుడి మీద వశిష్టుడి నమ్మకం అంతటిది. మన సినిమాల్లో గానీ కావ్యాల్లో గానీ ఋషులూ, మునులూ ముండనం అంటే గుండు కొట్టించుకున్నట్టు కనిపించరు. జైన బౌద్ధులకు ఆ అలవాటుండేది. వైదిక దేవతలకు, మునులకూ లేదు. అందుకని, బౌద్ధుల్లా గుండు గీయించుకుంటానని, కాపాలిక శైవుల్లా కపాలం పుచ్చుకు తిరుగుతానని, రాక్షసుల్లా కల్లు తాగటం మొదలు పెడతాననీ అంటాడు వశిష్టుడు. వైదిక ధర్మాలను వదులుకుంటాడని దీని భావం. తప్పు చేసి దొరికిన వాణ్ణి గాడిదెక్కించి ఊరేగిస్తారు. అలా ఖరవాహనం ఎక్కి ఊరేగుతానంటాడు.

ఇక్కడ విశ్వామిత్రుడి కుతంత్రం వేరు. హరిశ్చంద్రుడు అబద్ధం ఆడతాడా లేదా అనే విషయాన్ని పక్కన బెడితే, అనుక్షణం గాడిదెక్కే దృశ్యం వశిష్టుడి కళ్లలో మెదిలేలా చేయాలి. అందుకే అతణ్ణి అంత రెచ్చగొట్టాడు. అతను విసిరిన వలలో అమాయకంగా చిక్కుకుపోయాడు వశిష్టుడు. ఇప్పుడా పురోహితుడి గౌరవం కాపాడటం కోసం అయినా అబద్ధం ఆడకుండా గట్టిగా నిలబడాల్సిన పరిస్థితి హరిశ్చంద్రుడుకి ఏర్పడింది. బంతి హరిశ్చంద్రుడి కోర్టులో పడింది.

బలిజేపల్లి లక్ష్మీకాంతం (23 డిసెంబర్ 1881 – 30 జూన్ 1953) నటుడు, కవి, సినిమా రచయిత, నాటక రచయిత, స్వాతంత్ర్య సమర యోధుడు కూడా! ఆయన రచనలలో హరిశ్చంద్ర నాటకం (1924) గొప్పది. గుంటూరు జిల్లా బాపట్ల

దగ్గర ఇటికం పాడు ఆయన జన్మస్థలం. కర్నూలు రిజిస్ట్రార్ ఆఫీసులో కొన్నాళ్ళు గుమాస్తాగా పనిచేశారు. అవధానాలు చేస్తూ ఆనాటి జమీందారుల్ని అనేకమందిని కలిశారు. చల్లపల్లి రాజా సహకారంతో గుంటూరులో చంద్రిక సైన్సు నెలకొల్పారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకెళ్ళారు. జైల్లో ఉన్న సమయంలోనే సత్యహరిశ్చంద్రీయం నాటకం వ్రాశారు. ఒక డ్రామా కంపెనీ నెలకొల్పి ఈ నాటకాన్ని అనేక ప్రదర్శన లిచ్చారు. అందులో నక్షత్రకుడి పాత్ర ఆయనే వేసేవారట. సి పుల్లయ్య గారు ఈయన్ని సినీరంగానికి పరిచయం చేశారు. వరవిక్రయం సినిమాలో సింగరాజు లింగరాజు పాత్ర నటించారు. మళ్ళీ పెళ్ళి, వరవిక్రయం, భూకైలాస్ లాంటి సినిమాలకు మాటలు, కొన్ని సినిమాలకు పాటలు కూడా వ్రాశారు.

సత్యవాక్పాలన గురించి చెప్పటానికి రాజుగారి కథనే ఎందుకు తీసుకోవాలి ? సామాన్యుడికి అలాంటి నిబద్ధత ఉండదా? రాజు కన్నా ఎక్కువ కష్టాల కోర్చి నిజంగా నిజం కోసమే బతుకుతున్నది సామాన్యుడే! ఉన్నత వర్గాల గురించి అలా ఉంచండి, ఈ దేశంలో మధ్యతరగతి, దోచుకుంటూ దోచుకోబడే జీవితాన్ని కొనసాగిస్తున్నారు. కానీ, సామాన్యుడికి అబద్ధం ఆడేందుకు ఆస్కారాలు తక్కువ, అంటే, మన మెజారిటీ ప్రజలు సత్యవాక్పాలకులే నన్నమాట! కానీ సామాన్యుడి సత్యానికి ప్రత్యేకమైన విలువ ఏమీ లేదు. అతను నిజం ఆడినా ఆడకపోయినా అది సమాజం మీద చూపించే ప్రభావం తక్కువ. అందుకని, పాలకుడు అతని మంత్రి పురోహితాది పరివారం యావత్తూ మాటమీద నిలబడాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పటానికి రాజు హరిశ్చంద్రుడి కథని బలిజేపల్లి వారు ఎంచుకున్నారు.

విశ్వనాథ సత్యనారాయణ వేద హరిశ్చంద్ర, కావ్య హరిశ్చంద్ర రెండింటినీ వ్రాశారు. వేద హరిశ్చంద్రుడు ఈనాటి పాలకులకు సరిగ్గా సరిపోతాడు. ఎన్నికల వాగ్దానాలను ఎలక్షను రోజునే గాలికి వదిలేసే బాపతు, కావ్య హరిశ్చంద్రుడు నేను ప్రత్యేక హోదా ఇస్తా అన్నాను, నల్ల డబ్బు బయటకు తెస్తా అన్నాను, ఋణమాఫీ అన్నాను, జాబు గ్యారంటీ అన్నాను, రేట్లు పెంచను అన్నాను, ఇంకా చాలా అన్నాను అని గుర్తు పెట్టుకుంటాడు అదీ ఆ ఇద్దరికీ తేడా!

రాజు మీద అపారమైన నమ్మకంతో వశిష్టుడు గుండు కొట్టించుకుంటానన్నాడు. ఈనాటి ప్రభువులకు తమ మీద తమకే నమ్మకం లేదు, ఇంక మంత్రి సామంత పురోహితులకు ఆ రాజులపక్షాన హామీ ఇచ్చే ధైర్యం ఎక్కడ ఉంటుంది. గుళ్ళనీ, గుళ్ళలో లింగాల్నీ కొట్టే పనిలో ఎవరికి వాళ్ళు బిజీగా ఉన్నారు. సత్య వాక్పాలకులైన ప్రజలే మాట తప్పినందుకు 'గుళ్ళు' కొట్టించాలి మరి! ☆

# మానవ చకోరాలు

**పొగిలెద వొంటిపాటున 'గుహూకుహు' యంచు బ్రతిక్షణమ్ము బై**
**కెగసెదు, పల్కెలంకులకు నేగెదు సైకతభూమి దారి నె**
**వ్వగ మెడ వ్రేలవైచెదు భవచరిత్రమ్ము విచిత్రమయ్యె నీ**
**మగువను వీడి కాదుగద మా కెరిగింపుము చక్రవాకమా?**

చక్రవాక చకోరాలు అపురూప పక్షిరాజాలు. అవి ఉన్నాయో లేదో తెలీదు. ఎవరో వచ్చి ఏదో ఇచ్చి పోతారని ఎదురు చూసే వాళ్ళని ఈ పక్షులతో పోలుస్తారు... అవి కూడా వానకోసమో మరి దేని కోసమో ఎదురు చూస్తూనే ఉంటాయెప్పుడూ!

సామాన్యుడి సంగతి సరే, ఈ దేశంలో సగటు మేథావి మాత్రం చేస్తున్నదేముంది, ఎదురు చూడటం తప్ప! రాజకీయ నాయకులు ఎన్నికల సమయంలోనూ, సంపన్నులు ఆదాయం పన్ను కట్టే సమయంలోనూ, సామాన్యులు 'నిత్యావసరాల' కోసం మాత్రమే ఎదురు చూస్తారు. అవి తీరితే మళ్ళీ వెనక్కి తిరిగి చూడరు.

కానీ మేథావుల మాత్రం, ఆలోచనలు ఇందుకు భిన్నంగా వుంటాయి. దింపి ఇంకొకడు ఎక్కే వరకూ ఎదురుచూస్తారు. ఆ ఇంకొకడు ఎక్కాక వాడు దిగేవరకూ మళ్ళీ ఎదురు చూస్తారు. నిరంతర చకోరాల్లా ఎదురు చూస్తూనే ఉంటారు. వాళ్ళ కళ్ళు కాయలు కాసి ఉంటాయి. చేతులు మాత్రం పట్టుకుంటే పువ్వుల్లా కంది పోతూ ఉంటాయి. ఇదీ సగటు మేథావి పరిస్థితి.

ఒకసారి నదీతీరంలో ఇసుక నేలల్లో మెడ వ్రేలాడవేసి కుప్పకూలి ఉన్న ఓ చక్రవాకం పింగళి, కాటూరి కవుల కళ్ళలో పడింది. అది ఎవరి ఆసరా కోసమో ఎదురు చూస్తోన్న దానిలా కనిపించింది వాళ్ళకి... "అహో! చక్రవాకమా! అపురూపమైన పక్షిరాజమా! వంటరిగా ఇలా ఈ ఇసుకనేలలో కూలబడి పొగిలి పొగిలి ఏడుస్తున్నావు? కుహూ కుహూ అంటూ ఎగురుతూ తిరిగే వాడివి కదా...? నీ ప్రియురాలి కేమైనా అయ్యిందా? ఇది వియోగ దుఃఖం కాదుగదా!" అని ఆ పక్షిని పలకరించారు.

పింగళి–కాటూరి జంట కవుల "ఎడబాటు" అనే ఖండకావ్యం లోది ఈ పద్యం. 'కోకిల'–'ఎడబాటు' ఈ రెండు ఖండ కావ్యాలనూ కలిపి ఒకే పుస్తకంగా తెచ్చారు. ఈ పద్య కావ్యానికి వందేళ్ళ వయసుంది. అవి సత్తెకాలపు రోజులు. ప్రకృతి వికృతిగా మారకుండా పదిలంగా ఉన్న ఆ రోజుల్లో ...అమలిన శృంగారం' ఒక సిద్ధాంతంగా ప్రబలి ఉండేది. కాబట్టే పింగళి - కాటూరి ఆ అక్కుపక్షిది వియోగ దుఃఖంగా ఊహించారు.

అప్పటినుండీ ఇప్పటికీ ఈ వందేళ్ళ ఆకలిరాజ్యంలో వియోగాలు త్యాగాలు కావ్యాల్లోంచి కనుమరుగయ్యాయి. 'అమలినానికి బదులు మలినం, వియోగానికి బదులు సంయోగం, త్యాగానికి బదులు 'అయితే నాకేంటి' ధోరణులు కావ్య లక్షణాలైనాయి.

ఇలాంటి కరువు రోజుల్లో, 'మాజీనది' గా మారిన కృష్ణానది ఒడ్డున ఇసుకనేలల్లో ఓ కవిగారికి అలాంటి దృశ్యమే కనిపించిందనుకోండీ... "పంటభూములన్నీ ఇసుక, ఇటుక, ఇనుముతో ఇరుకై పోయిన ఈ కాంక్రీటు అడవిలో నేల కూలిన చకోరమా! ఒక్కడివే కూలబడ్డావు, నీరాణి ఏమైంది? నీ గూడు ఏమైంది? నీ కూడు ఏమైంది? నీ కుటుంబం చెట్టుకొకరు, పుట్టకొకరూ అయిపోయారా...?' అనడుగుతాడు కవి !

దానికి ఆ చకోరం గుర్రుగా చూస్తుంది. "మొక్కలన్నీ చెక్కలై పోయిన ఈ రాజ్యంలో చెట్టులూ, పుట్టలూ ఎక్కడున్నాయని వాటిని పట్టుకు తిరుగుతామూ..." అని నిలదీస్తుంది. దాంతో ఖంగు తింటాడు కవి "మరి, నీ ఎదురు చూపులు ఎవరి కోసం...?" అనడుగుతాడు.

"కొత్తగా కట్టే ఊళ్ళో 'కొట్టేసిన' మొక్కకి బదులు మొక్కనీ, నరికేసిన అడవికి బదులు అడవినీ, తవ్వేసిన భూమికి బదులు భూమిని ఇస్తారట! ఎక్కడో, ఎప్పుడో, ఎవరో నాటబోయే మొక్క కోసం, పెంచబోయే అడవి కోసం, చదును చేసే భూమి కోసం ఎదురుచూస్తున్నా" అనిచెప్తుంది.

అరవై యేళ్ళ స్వాతంత్ర్యానంతర దేశీయ చరిత్రలో 'గరీబీ హటావో' నుండి 'గరీబోం కో హటావో' దాకా ఏలుబడి వారు మాట వెంబడి నిలబడిన దాఖలా లేదని తెలిసినా చకోరాలు అలా ఎదురు చూస్తూనే ఉంటాయి. ఎదురు చూపుల్లో ప్రశాంతత ఉంటుంది. ప్రపంచ శాంతి ఉంటుంది. అంతేగానీ, గుడ్లురిమితే ఏముంటుందీ...కళ్ళ మంటలు తప్ప!

మానవ చకోరాల్లారా? మీ మానాన మీరు అలా 'మట్టి పిసుకుతూ' ఎన్నాళ్ళు బతుకుతారు? దర్జాగా కాలుమీద కాలు వేసుకుని పడక కుర్చీలో కూర్చుని ఎదురు చూస్తూ బతకండి! రాబోయే పదేళ్ళలో ఇక్కడ చైనా-జపాన్ వాళ్ళు మయసభ, ఇంద్రసభ, యమసభ, ద్యూతసభ ఒకటేమిటీ... మీరు ఏది కోరితే అది కట్టించి ఇస్తారు. ఎదురు చూడండి! ఎదురు చూడండి! ✯

# మిఠాయి పొట్లాం ప్రేమ

"భూయశ్చాహ త్వమపి శయనే కంఠలగ్నా పురా మే
నిద్రాంగత్వా కిమపి రుదతీ సస్వరం విప్రబుద్ధా!
సాంతరాససం కథిత మసకృత్ పృచ్ఛతశ్చ త్వయా మే
దృష్టఃస్వప్నే కితవ రమయన్ కామపి త్వం మయేతి"

స్త్రీ పురుషులు వంటరిగా కాకుండా సమూహంగా జీవించటానికే ఈ సమస్త సృష్టి ఏర్పడింది. సమాజం అంటే, 'స్త్రీ పురుష జంట'ల సమూహమే. ప్రేమతో కూడిన లైంగికత ఆ జంటల్ని సంసారం వైపు నడుపుతుంది. సంసారం మనుషుల్ని సమాజం వైపు నడుపుతుంది. ఇవన్నీ వాటికవిగా జరిగిపోయే అంశాలు. వంటరితనం నుండి తనను తాను బయట పడేసు కోవటానికి మనిషి పడే తాపత్రయం ప్రేమ. ప్రకృతి మనిషిని వంటరిగా జీవించాలని సృష్టించలేదు. స్త్రీ పురుషులు కలిసి జీవించటం అనేది మానవ లక్షణం. అందుకు అనేక ఇతర ప్రేరకాలతో పాటు ప్రేమతో కూడిన సెక్సు కూడా ఒక ప్రేరకం.

ప్రేమ అనే కాయితంలో పొట్లాం కట్టిన మిఠాయి లాంటిది సెక్సు! సెక్సు పుస్తకానికి భాగవతం అట్ట వేసి, ఆధి భౌతిక, ఆధి దైవిక అంటూ తాత్వికతని జోడించిన సాహిత్యం జయదేవుడి కాలం నుండీ అతివ్యాప్తం కావటంతో గాఢరతి అనేది "గాఢ ప్రేమ"కు పర్యాయం అయ్యింది. ప్రేమ అంటే పార్కుల్లో ముద్దులు, కౌగలింతలు, రతి కార్యాలు, విదేశాల్లో వీధుల్లో చిందులు, గంతులు, హోరెత్తే పాటలు ... ఇంతేనని మన సినిమాల్లో చూపిస్తే, మన కావ్యాలు అంతకు ఒకింత ఎక్కువగానే చూపించాలని చూశాయి. అందువలన సెక్సుకి ప్రాధాన్యత పెరిగి ఇతర సామాజిక అంశాలకు మన సాహిత్యంలో చోటు తగ్గిపోయింది.

కాలేజీ ప్రేమ కథలు మరే ఇతర భాషల్లోనూ లేనంతగా తెలుగు సినిమాల్లోనే ఎందుకున్నాయి? మన విద్యార్థులు ప్రేమించు కోవటానికే కాలేజీల్లో చేర్తున్నట్టు ఎందుకు చూపించనిస్తున్నాం మనం?

పైన చెప్పిన శ్లోకం కాళిదాసు మేఘ సందేశంలోది. యక్షుడి కుశలాలు యక్షకాంతకు తెలియ జెప్పటానికి మేఘుడు బయల్దేరతాడు. కుబేరుడి శాపం కారణంగా ఆ జంటకు ఇది ప్రథమ వియోగ దుఃఖం. ఆమె కైలాస పర్వతం దగ్గర ఉంది. అతను రామగిరి దగ్గరున్నాడు. మేఘుడు 'తంతి' చేరవేస్తున్నాడు. ఆమె భర్త కుశలం గురించీ, అనుక్షణం ఆమెనే తలవటం గురించీ చెప్పటం టూకీగా ఇందులో ఇతివృత్తం. ఆమె నమ్మకం కోసం ఒక రహస్యాన్ని గుర్తుగా చెప్తాడు యక్షుడు.

"ఒకసారి అతన్ని కావులించుకుని నువ్వు అలాగే నిద్రపోయి, మధ్యరాత్రిలో లేచి, పెద్దగా ఏడవటం మొదలు పెట్టావట. "నువ్విప్పటిదాకా ఎవ్వతెతోనో కులుకుతూ నా కలలో కనిపించావుగదా...అందుకని...ఏడ్చానని నవ్వుతూ అన్నావట కదా!" అంటాడు మేఘుడు. మేఘుడు చెప్తున్న యక్ష విరహ సందేశాన్ని కుబేరుడు వింటాడు. ఆ దంపతుల ప్రేమను స్వయంగా తెలుసుకుని శాపం త్వరగా ముగిసేలా అనుగ్రహించటంతో ఆ కథ సుఖాంతం అవుతుంది.

సెక్స్ అనేది సత్సంతానం కోసం మాత్రమే జరపాలని, సంతాన అవసరం లేనప్పుడు రతి తంతు కేవలం సుఖ లాలసత్వం కోసమేనని వేదాంతులు చెప్తారు. ఇప్పుడు జపాన్ యువత ఈ సిద్ధాంతాన్ని పాటిస్తోంది. జీవితానికి రెండు క్షణాల సుఖం కన్నా నూరేళ్ళ కెరీరు ముఖ్యం అనీ, నలబై యేళ్ళొచ్చే వరకూ పెళ్ళి చేసుకో కూడదని జపనీ యువత గట్టిగా భావిస్తోంది. ఆర్థికంగా ఎదిగాక, వృత్తిలో రాణించాకే సంసారం, సంతానం అంటున్నారని, అందాకా బుద్ధుడి మార్గంలో నిగ్రహానికి ప్రాధాన్యత నివ్వాలని ఎక్కువ మంది భావిస్తున్నారక్కడ!

ఈ వార్తని అమెరికన్ మీడియా "జపానులో పెరుగుతున్న నపుంసకుల సంఖ్య" అని వక్రీకరించి ప్రచారం చేసింది. బాధ్యతా రాహిత్యానికి పేరుబడ్డ మన కొంటె పత్రికలు మరింత మషాలా అద్దాయి. తూర్పు దేశాల సంస్కృతి విధ్వంసమే అమెరికన్ మేధావుల లక్ష్యం. అందుకే, నిగ్రహాన్ని నపుంసకతగా హేళన చేశారు.

తెలుగు నేల మీదకూడా ఇంచుమించు ఇదే పరిస్థితి నడుస్తోంది. ముప్పై యేళ్ళు దాటాక గానీ మన యువత పెళ్ళిళ్లకు సిద్ధం కావట్లేదు. అది డబ్బు ధ్యాసగా అపార్థం చేసుకున్నా, వృత్తి ప్రాధాన్యతలు వ్యక్తుల్లో సెక్సు ధ్యాసని చంపేస్తున్నాయనేది ముఖ్యం. పెళ్ళయిన ఏడాదిలోపే విడాకులకు పోతున్న వారి సంఖ్య పెరగటానికి ఇది ముఖ్య కారణం. ఈ మొత్తం వ్యవహారంలో ప్రేమ పాత్ర చాలా చిన్నదై పోయింది.

కైలాసం రామగిరుల్లో ఉంటున్న భార్యాభర్తల కథలు, పగలు ఒకరికి డ్యూటీ అయితే రాత్రి వేరొకరికి డ్యూటీ లాంటి మేఘసందేశంలోని దంపతుల కథలు దంపతులిద్దరూ ఉద్యోగాలు చేస్తున్న ఇళ్ళలో సర్వ సాధారణం. ఆనాడు మన కుబేరుడు కాబట్టి అయ్యో అన్నాడు. ఈ అమెరికన్ కంపెనీల కుబేరులకు అలాంటి అయ్యో లేమీ ఉండవు. వాళ్ళు పగలు పని చేస్తారు కాబట్టి, మనవాళ్ళతో రాత్రిళ్ళు పనిచేయిస్తారు. చివరికి దంపతులకు మిఠాయి పొట్లాం ప్రేమలే గతి అవుతున్నాయి.

ప్రేమకాయితంలో పొట్లాం కట్టిన మిఠాయి సెక్స్, పొట్లాం విప్పి మిఠాయిని కాయితం పారేస్తున్నాం. సంసారసారం ఇంతే ! సెక్సు తప్ప ప్రేమకొంతే !! ★

# ముగ్గులోకి దించటం

తెమ్ము బంగారు కుండ జలమ్ము లనుచు(
దెమ్ము లతకూన మంచి సుమమ్ము లనుచు(
దెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ములనుచు
మించుబోడిని నేరుపు మించ(బలుకు

సినిమా రంగంలో పంచ్ డైలాగులు, డబుల్ మీనింగ్ డైలాగులూ రాసేందుకు స్పెషలిస్టు రచయిత లుంటారు. సంభాషణలన్నీ ఎవరో రాసుకు పోతే, చివర్లో పంచ్ 'డైలాగుల రచయిత వచ్చి కొసమెరపులు రాసిస్తాడు. మీ ఊరొస్తా, మీ వీధికొస్తా, మీ ఇంటికొస్తా... అంటూ హీరో చేత చెప్పిస్తే దాన్నే 'పంచ్' అంటారు. హీరో ఈ మాటల్ని విలన్'తో అంటే రౌద్రంగా ఉంటాయి. అందమైన ఆడపిల్లతో అంటే మృదువుగా ఉంటాయి. ఆ తేడా తెలిసి పలకగలిగే నటుడేతె సీను పండుతుంది.

క్రీ.శ.1600నాటి చేమకూర వేంకట కవి ఇలాంటి 'పంచ్'లు వ్రాయటంలో సిద్ధహస్తుడు! తంజావూరు రఘునాథనాయకుడి కొలువులో ఉండేవాడు. అన్నీ 'పంచ్' పద్యాలతో ఆయన విజయవిలాసం అనే ఒక గొప్ప చమత్కార కావ్యం వ్రాశాడు. ప్రతి పద్యాన్ని గొప్పగా విశ్లేషించి తీరాల్సి నంత 'బాగైన రచన' అది! తాపీ ధర్మారావుగారు హృదయోల్లాస వ్యాఖ్యలో ఆ పని విజయవంతంగా చేశారు.

పైన చెప్పిన ఈ 'తెమ్ము బంగారుకుండ' పద్యంలో అన్నీ డబుల్ మీనింగ్ డైలాగులే ఉంటాయి. డబుల్ మీనింగ్ అని మనం వాడుకలో ప్రయోగించే పదానికి రెండర్థాలు, ద్వ్యర్థి లాంటి పదాలు పూర్తి సమానార్థకాలు కావు. డబుల్ మీనింగ్ సంభాషణలు అమ్మాయిలను 'ట్రాప్'లో పడేసేందుకు ఉపయోగ పడతాయన్నమాట! అర్జునుడు సుభద్రని ముగ్గులోకి లాగే ఈ ప్రయత్నంలో ఉన్నాడు. అన్నలిద్దరూ చెప్పారు కదా...అని, ఆ కపట మునికి సపర్యలు చేయటానికి వచ్చింది సుభద్ర, ఆవిడకు పని చెప్పటం ఇందులో సన్నివేశం. పద్యంలో అన్నీ తేలికపదాలే కాబట్టి ప్రతిపదార్థాలు వ్రాయనవసరం లేదు.

"బంగారు కుండలో నీళ్ళు పట్టుకురా! లేతతీగకున్న మంచిపువ్వులు పట్టుకురా! బాగైన కొమ్మకు కాచిన పళ్ళు పట్టుకురా!" అని, వింటున్నవాళ్ళకి ఇలానే వినిపించే విధంగా, అందంలో అందరినీ మించిన ఆమెతో నేర్పు మించేలా చమత్కారంగా మాట్లాడట. ఏవిటా చమత్కారం? "బంగారు కుండా! నీళ్ళు పట్టుకురా! లేత తీగలా

స్లిమ్ముగా ఉన్నదానా! మంచి పూలు పట్రా! బాగైన కొమ్మా(అందమైన అమ్మాయీ)... పళ్ళు పట్టుకురా!” అని ఆమెకి మాత్రమే అర్థం అయ్యేలాగా మాట్లాడట!

బంగారుకుండ, లతకూన, బాగైన కొమ్మ అని, సుభద్రని ఉద్దేశించి అనటం ఒక్కటే ఇక్కడ చమత్కారం కాదు. బంగారు పాత్రలో నీళ్ళే ఎందుకు అడిగాడు? విరహం మీద ఉన్నాను చల్లార్చు- అని సూచనప్రాయంగా చెప్పటానికే! పూలూ, పళ్ళు కూడా విరహశ్యామకాలే! కాకపోతే బంగారు కుండల్ని కుదురైన స్తనాలతోనూ, పూలను మేను మార్దవంతోనూ, పళ్లను ప్రేమలోని తియ్యదనంతోనూ పోల్చినట్టుగా కూడా అర్థం చేసుకోవచ్చు. అమ్మాయిని వశం చేసుకోవటానికి ఇలా వాత్స్యాయనీయాలన్నీ ఉపయోగించాలి కదా! అసలే కపట సన్యాసి కాబట్టి అతని మాటలన్నీ కపటంగా ఉండేలా వ్రాయకపోతే పాత్రౌచిత్యం దెబ్బతింటుంది. అందుకని, డబుల్ మీనింగ్ సంభాషణ తప్పనిసరి!

నిజానికి ఇవ్వాల్టి మన కొత్త తరం కుర్రాళ్ళు ఇలాంటి సంభాషణల్ని ఇంతకన్నా చమత్కారంగా చెప్పగల సమర్థులే! కాకపోతే పద్యంలోని అంతరాత్మ (చెప్పే విషయం) ఇక్కడ ముఖ్యం.

ప్రేమ పెళ్ళిళ్ళు కానీండి, పెద్దలు చేసిన పెళ్ళిళ్ళు కానీండి, మూణ్ణాళ్ళ ముచ్చటగా ముగిసిపోతున్న రోజులివి. ఏడాది తిరక్కమునుపే విడాకులకు పోతున్న కేసులు రోజురోజుకీ ఎక్కువౌతున్నాయి. దంపతుల మధ్య ఉత్త ఆకర్షణ తప్ప గాఢమైన ప్రేమ కుదరక పోవటమే ఇందుకు కారణం. ప్రేమ బలంగా ఉండాలి, దేవదాసు ప్రేమలా అస్థిరంగానూ, బలహీనంగానూ, పిరికిగానూ ఉండకూడదు.

రతి కార్యానికి ముందు బలమైన ఉత్తేజం కలగటానికి ‘ఉపరతి’ ఎలా ఉపయోగ పడుతుందో, బలమైన ప్రేమను పొందటానికి ‘ఉపప్రేమ’వాచకాలు అలా ఉపయోగ పడతాయి. ఇదొక ‘ఉప’ యోగం! ప్రేమ బలంగా ఉండాలంటే ‘ఉపప్రేమ’ తప్పనిసరి. సినిమాల్లో చూపించినట్టు ‘సిటీబస్సు ప్రేమ’ (బస్సులో చూడంగానే ప్రేమించేయటం, స్విజ్జర్లాండు మంచుకొండల్లో డ్యూయెట్టు పాడుకోవటం) లాంటి ప్రేమలు పెళ్ళిదాకా వెళ్ళేవి తక్కువ. వెళ్ళినా ప్రథమ వైవాహిక వార్షికోత్సవం జరుపుకున్నవి కూడా తక్కువే! బలమైన ప్రేమను పొంది, శాశ్వతమైన దాంపత్య బంధాన్ని పెంచుకోవాలన్నమాట...పెద్దలు చేసిన పెళ్ళిళ్లక్కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది.

సుభద్రలో ప్రేమభద్రం కావటం కోసం తాపత్రయ పడ్డాడు అర్జునుడు. ఈ పద్యం ప్రేమబలాన్ని కోరుకుంటోంది. ★

# ముప్పొద్దుల కాలక్షేపం

ప్రాతర్ద్యూత ప్రసంగేన
మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోర ప్రసంగేన
కాలో గచ్ఛతి ధీమతామ్ ?

బుద్ధిమంతులు ప్రొద్దునపూట జూదం గురించి చర్చిస్తారు. మధ్యాహ్నం పూట ఆడవాళ్ల గురించిన కబుర్లతో కాలక్షేపం చేస్తారు. ఇంక రాత్రి అయ్యేసరికి దొంగతనాలూ మోసాలు కుట్రల గురించే మాట్లాడతారట!

ఇదొక చాటు పద్యం. ఇదెవరో 'బుడ్డి'మంతుల గురుచి చెప్పలేదు. మీరు ఇక్కడ సరిగానే చదివారు 'బుడ్డిమంతులు' కాదు, బుద్ధిమంతులు ఇలా చేస్తారంటూ మూడు ముఖ్య విషయాలు ఈ పద్యంలో చెప్పాడు చాటుకవి పద్యాల పరిజ్ఞానం ఉన్న ఎవరికైనా ఈ చాటుపద్యం తెలుసు. దీనికి కవి పండితులు చెప్పే అర్థం గొప్పగా ఉంటుంది.

మహాభారతం కథ అంతా, జూదం ఆడటం, దాన్నొక ధర్మకార్యం గానూ, రాజు యొక్క తప్పనిసరి కర్తవ్యంగానూ చిత్రించటం వలనే జరిగింది. చివరికి ఈ జూదం ఒక ప్రపంచ యుద్ధం అనదగిన మహాభారత సంగ్రామానికి దారి తీసింది. జూదం అంత గొప్ప దన్నమాట! అందుకని నిద్ర లేస్తూనే జూదచర్చలు చేయమంటాడు ఈ చాటుకవి. అంటే మహాభారతం చదవాలని చెప్తున్నాడన్నమాట!

ఇంక మధ్యాన్నం పూట స్త్రీ ప్రసంగంతో కాలక్షేపం చేయాలంటాడు. స్త్రీల కారణంగా జరిగిన అనేక సంఘటనల సమాహారమే రామాయణం కాబట్టి, మధ్యాన్నం పూట రామాయణం చదవాలని చెప్పటానికి స్త్రీ ప్రసంగం చేయమన్నాడు.

అలాగే, రాత్రి అయ్యాక చోర ప్రస్తావన చేయమన్నాడు. అంటే వెన్నపూసనీ, స్త్రీల చీరల్ని, వీలైతే మానాల్ని దోచుకున్న దొంగ గురించి చెప్పిన భాగవతం చదవాలన్నాడు.

ఇదంతా, ఇతర వ్యాపకాలు లేని వ్యక్తులు ఇంట్లో కూర్చుని, కాలం ఎలా గడపాలో తెలీక బాధపడే వారికి ఈ చాటుకవి ఇచ్చిన సలహా! ఆ రోజుల్లో సంగతి అలా ఉంచితే, ఈ రోజుల్లో టీవీల వాళ్ళు ఈ సూత్రాన్ని అక్షరాలా అమలు పరుస్తున్నారు

ఉదయాన్నే దినపత్రికలు, ఆర్థిక పరమైన అంశాలను ప్రసారం చేసే ఛానళ్ళున్నాయి. ఇంటర్నెట్టు ముందు చేరి షేర్ మార్కెట్ల పోకడను అధ్యయనం చేసే వాళ్ళు మగాళ్లలో ఎక్కువగా కనిపిస్తారు. వీళ్ళు నిపుణుల సలహాలకు ప్రాధాన్యత

నిచ్చి షేర్ల కొనుగోలూ, అమ్మకాలూ చేస్తుంటారు. చివరికి ఇదంతా ఒక 'డబ్బుజూదం' అని అనుభవం మీద తెలుసుకుంటారు. దినఫలాలు, వారఫలాల్లో పూర్వం స్పెక్యులేషన్ లాభించును' లాంటి సలహాల కోసం వెదికే వారు. ఇటీవల జ్యోతిష్కులు ఈ విషయాన్ని పెద్దగా వ్రాయటం లేదెందుకోమరి ?

ఉదయం పూటే ఈ 'డబ్బుజూద ప్రసంగం' చేయటానికి అనువైన సమయం. ఆనక తీరిగ్గా చూద్దాం అనుకుంటే రేటు పెరిగి పోవటమో, పడి పోవటమో జరగవచ్చు. ప్లేటు బోర్లానూ పడొచ్చు. అందుకని 'ప్రాతర్ద్యూత ప్రసంగేన' ఉదయాన్నే జూదప్రసంగం చేయాలని చాటుకవి చేసిన సూచని టీవి ఛానళ్ళు పాటిస్తున్నాయి.

వృత్తి, వ్యాపారాలకు వాళ్ళకి వాళ్ళు సాధారణంగా టీవీలు చూసే అవకాశం ఉండదు. అందుకని, మధ్యాహ్న ప్రేక్షకుల్లో కేవలం మధ్యతరగతి, మధ్యవయసు, మధ్యాదాయం కలిగిన స్త్రీలు ఎక్కువ మంది ఉంటారు. మహిళా కార్యక్రమాలు మధ్యాహ్నం పూట ప్రసారం చేయటానికి కారణం ఇదే! ఆ విధంగా మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః మధ్యాహ్నం పూట స్త్రీలకు సంబంధించిన విషయాలకు ఎక్కువ అవకాశం కల్పించి, టీవీలవాళ్ళు చాటుకవి గారి మాట నిలబెడ్తున్నారు. సాయంత్రం దాకా వంటలూ, కుట్లు, చీరలు, వాటి ధరల మీద పోటీలు, పట్టుకుంటే పట్టు చీరలు, ఆడహీరోలు, ఆడవిలన్లు, ఆడ మోసగత్తెల సీరియళ్ళు ...ఒకటేమిటీ మధ్యాన్నం అంతా స్త్రీ ప్రసంగంతోనే కాలం గడిపేస్తుంటారు. 'సీ...రియల్' అనేది తప్ప సీరియళ్లే ఉంటాయి.

ఇంక, రాత్రి పూట మగాళ్ళు కొంపకు చేరే సమయం. అన్నం తింటూ రిమోటు పుచ్చుకుని వరుసపెట్టి టీవీ వార్తా ఛానళ్ళు చూస్తూ భోజనం చేస్తుంటారు రిమోటుతో 'లుక్కు'లకన్నా 'నొక్కు'లే ఎక్కువగా ఉంటాయి. ఏ ఛానల్లో చూసినా వార్తా ఛానళ్ల నిండా చోరుల కథలే! రాజకీయ దొంగలు, కాంట్రాక్టరు దొంగలు, విద్యాసంస్థల దొంగలు...అధికార ప్రతిపక్ష దొంగలు ఒకరేమిటీ... రాత్రి పడుకునే వరకూ రాత్రౌ చోర ప్రసంగేన అన్నట్టు దొంగల గురించిన వార్తలతోనే రాత్రి గడిచిపోతుంది.

ఏ కాలంవాడో తెలీదుగానీ, ఈ చాటుకవి చాలా దూరదృష్టితో ఈ విషయం చెప్పాడు. ప్రొద్దున పూట మహాభారతం చదవమంటే స్పెక్యులేషన్'లో రాణించటం అనీ, రామాయణం చదవమంటే వంటలు, కుట్లు, అల్లికలూ, మొగుళ్లమీద తిరగబడటాలు, కోడళ్లను చంపటాలు, అత్తలకు ఇళ్ళలోంచి ఉద్వాసన పలకటాలు లాంటి విద్యలన్నీ నేర్చుకోవటం అనీ, రాత్రిపూట భాగవతాన్ని చదవాలంటే జాతి దొంగల ఘనతను చూసి నేరాల ఘోరాలను గర్వపడాలనీ కొత్త అర్థం చెప్పుకోవాలి.

★

# ముల్లోకాలలలో సాటిలేనిది 'చల్ల'

ద్వి: శ్రీ రమ్యమైనట్టి చిక్కనిచల్ల
సారస్యమైనట్టి చక్కటిచల్ల
కూరిమికొనరమ్మ కొమరైనచల్ల
భారతిగొన్నట్టి బాగైనచల్ల
శ్రీరమగొన్నట్టి చెలువైనచల్ల
పార్వతిగొన్నట్టి పరువైనచల్ల
నవ్వుచుగొనరమ్మ నాచేతి చల్ల
నల్లావు పితికిన నయమైన చల్ల
తెల్లావుపితికిన తేటైనచల్ల
ఎఱ్ఱావు పితికిన హెచ్చయిన చల్ల
నఱ్ఱావు పితికిన నాడెంపు చల్ల

క: నెల్లనయిపుల్లనగుచును
చల్లనయై సకల తాపశమమై సమమై
చెల్లుగ మధురంబాసి
చల్లకు ముల్లోకములను సాటియు గలదె

'చల్ల' లేదా మజ్జిగ గురించి ఇంత చక్కని వర్ణన అపురూపమే! ఇది క్రీ.శ. 1788-89లలో తంజావూరును పాలించిన అమరసింహుడనే మరాఠీరాజు కోసం మాతృభూతయ్య అనే ఒక పేద తెలుగుకవి చెప్పిన పద్యం. పారిజాతాపహరణం అనే నాటకాన్ని, గద్యపద్యాత్మకంగా వ్రాశాడాయన! బ్రౌన్ దొరగారే ఈ గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చాడని నిడదవోలు వెంకట్రావుగారు వ్రాశారు. మధురానగరిలో ఓ గొల్లభామ చల్లలమ్మ బోతూ తన దగ్గర నాణ్యమైన చల్ల దొరుకుతుందని చెప్పుకుంటూన్న సందర్భంలోది ఈ పద్యం.

అమ్మకడుపు చల్లగా, అయ్య కడుపు చల్లగా, అందరి కడుపూ చల్లగా చేసేది 'చల్ల'. "చల్ల"ని ఇతరులకన్నా తెలుగు వారే ఎక్కువగా తాగుతారు. తెలుగు కృష్ణుడు 'చల్ల'లమ్మటానికి వెళ్ళే భామల్నే అడ్డగించాడని తెలుగు కవులు వ్రాశారు. పెరుగు అమ్మలేదని కాదు, చల్లంటే మనకున్న ప్రీతికొద్దీ చల్లలమ్మే అమ్మీలనే కవులు వర్ణించారు. ఈ 'మాతృభూతయ్య కవి' మాత్రం ఒక అడుగు ముందుకేసి, భామలు అమ్ముతున్న'చల్ల గొప్ప'ని కూడా వర్ణించాడీ పద్యంలో.

తెలుగువారికి 'చల్లప్రీతి' ఈ నాటిది కాదు. చల్ల శబ్దం అత్యంత ప్రాచీనమైనది. వేల యేళ్ళ క్రితం తొలి తెలుగువారు మాట్లాడిన మూల తెలుగు భాషలో (ప్రోటో-తెలుగు) చల్ల శబ్దం ఉందని జి బ్రొన్నికోవ్ పరిశోధకుడు రూపొందించిన తొలి తెలుగు పదాల నిఘంటువులో ఉంది. మూలద్రావిడ పదం 'సల్' లోంచి 'చల్ల'(మజ్జిగ Buttermilk), 'చల్' లోంచి 'చల్లని' (Cold) పదాలు ఏర్పడ్డాయని ఆ నిఘంటువు చెప్తోంది. ఆ రోజుల్లో చలివేంద్రాల్లో 'చల్ల' కుండలు ఉండేవి చలిపందిరి, చలివందిరి, చలివంద్రి, చలివెందర, చలివేందల, చలివేంద్రము ఈ పదాలన్నింటికీ 'చల్ల' అందించే పందిరి అనే అర్థం. చలివేంద్రపాలెం అనే ఊరు కృష్ణాజిల్లాలో ఉంది.

తక్రం త్రిదోష శమనం రుచి దీపనీయం-'చల్ల' త్రాగే వాడికి త్రిదోషాలు అదుపులో ఉంటాయని, ఏ జబ్బులూ రావనీ, వ్యాధులు త్వరగా తగ్గుతాయనీ, తిరిగి రాకుండా వుంటాయనీ, విషదోషాలు, దుర్బలత్వం, చర్మరోగాలు, క్షయ, స్థూలకాయం, అమిత వేడి తగ్గిపోతాయనీ, శరీరానికి మంచి రంగు కలుగుతుందనీ ఆయుర్వేద వైద్యగ్రంథాలు చెప్తున్నాయి. దేవతల కోసం అమృతాన్నీ, మానవుల కోసం 'చల్ల'నీ భగవంతుడు సృష్టించాడని యోగరత్నాకరం వైద్యగ్రంథంలో ఉంది.

'చల్ల' కలిపిన అన్నాన్ని చల్ది అన్నం, చల్దన్నం, చద్దన్నం అంటారు. ప్రొద్దున్నే చద్దన్నం తినేవారికి భోగం ఎక్కువ. టిఫిన్లు తినేవారికి రోగం ఎక్కువ. చల్లన్నం రోజూ తింటే ఎంతటి శ్రమనైనా తట్టుకునే శక్తి శరీరానికి కలుగుతుంది. వడదెబ్బ తగలకుండా నివారిస్తుంది. కడుపులో ఆమ్లాలు పలచబడి, గ్యాసు, ఉబ్బరం, పేగుపూత, అమీబియాసిస్, టైఫాయిడ్, మొలలు, మలబద్ధత, పేగుల్లో వచ్చే వ్యాధులు త్వరగా తగ్గుతాయి. ఆపరేషన్లు అయినవారూ, మానని వ్రణాలతో బాధపడేవారూ, చీము పోస్తుందని "చల్ల"వాడకూడ దనుకోవటం అపోహ. పుండు త్వరగా మానుపడాలంటే 'చల్ల' తీసుకోవాలి! బాలలకు, వృద్ధులకూ తప్ప ఇతరులందరికీ పాలకన్నా పెరుగు, పెరుగుకన్నా మజ్జిగ(చల్ల) మంచివి.

పైన చెప్పిన ద్విపదలో శ్రీరమ్యంగానూ, చిక్కగానూ, రుచికరంగానూ ఉండే తన చల్లని ఇష్టపడి కొనమంటోంది ఆమె. సరస్వతి, లక్ష్మి, పార్వతులు ముగ్గురికీ ఇష్టమైన ఈ చల్లని 'నవ్వుచు గొనరమ్మ నాచేతి చల్ల' అంటోంది. నల్లావు, తెల్లావు, ఎర్రావు, నర్రావుల నాణ్యమైన చల్ల అనీ, తియ్యతియ్యగా పుల్లపుల్లగా ఉండి, బాగా చలవచేస్తుందనీ, సకల తాపాల్నీ శమింపచేస్తుందనీ, అలాంటి చల్లకు ముల్లోకాలలో సాటి రాగలదేమీ లేదనీ చల్లలమ్మి అంటోన్నట్టు వర్ణిస్తాడీ పద్యంలో.

చల్ల తాగటం మానేసి, చల్లకవ్వాలు పారేసి మానవుడు మహనీయుడు కావాలనుకోవటం అపోహ, అత్యాశ అని దీన్నిబట్టి అర్థం అవుతోంది. ✯

# మేథోమర్దనం

ఓరి దురాత్మ! నీవార ముష్టింపచా
భాస యోజన గంధి ప్రథమ పుత్ర!
దేవరన్యాయ దుర్భావనా పరతంత్ర!
బహు సంహితా వృథాభ్యాస పతన!
భారత గ్రంథ గుంఫన పండితమ్మన్య!
నీవా మదీయ పత్నికి నశేష
క్లైవ్య కళ్యాణ ఘంటా పథమునకు
కాశికాపురికి నిష్కారణంబ
శాపమిచ్చెదనని యనాచార సరణి
హుంకరించినవాడ వహంకరించి
పొమ్ము నిర్భాగ్య! మాయూరి పొలము వదలి
ఎచటికే శిష్యుల్ నీవు నీ క్షణంబ!

మేథావులం అనుకునే వాళ్ళలో చాలామందిలో తమ గురించి తాము ఎక్కువగా ఊహించుకుని, తమకు ఎవరో తక్కువ చేశారని ఆరోపిస్తూ నిందించే ఒక లక్షణం ఉంటుంది. వాళ్లడిగింది ఇవ్వని వాళ్ళను నోటి కొచ్చినట్టు తిట్టి, చెడ్డ ప్రచారం చేయటం చదువుకున్నవాళ్ళలో కనిపించే ఒక లక్షణం.

ఈ దేశం మీద ఆధారపడి చదువుకుని, ఈదేశాన్ని తిట్టి విదేశాలకు ఎగిరి పోవాలని తహతహలాడే లక్షణం చదువుకున్నవాళ్ళలోనే ఉంటుంది. ఇలాంటి వింత ప్రవృత్తుల్ని శ్రీనాథుడు ఖండించాలనుకున్నాడు. అందుకోసం వ్యాసుడు కాశీని శపించే కథని ఎంచుకున్నాడు.

బాగా చదువుకున్న వాడు, మేథావి, వేదాలను విభజించి, ఒక క్రమ పద్ధతిలో అమర్చినవాడు, మహాభారతాన్నీ, అష్టాదశ పురాణాల్నీ ఇంకా చాలా రచనల్ని చేసినవాడు, అంతటి వాడు మరొకడు లేడనిపించుకున్నవాడు వ్యాసుడు. ఆయన చదువుకీ ఆయన వ్యక్తిత్వానికీ పొంతన ఉన్నదా లేదా అని పరీక్షించాలని అనిపించింది పరమేశ్వరుడికి. వ్యాసుడు కాశీ నగరానికి వచ్చిన ఒక సమయం చూసుకుని, అక్కడ తిండి దొరక్కుండా చేశాడు. జనం ఆకలికి మాడుతో అందరూ వెళ్ళి అన్నపూర్ణను వేడుకొని ఆమె పెట్టిన భిక్ష స్వీకరించి కడుపు నింపుకుంటున్నారు.

వ్యాసుడికీ ఆయన వెయ్యిమంది శిష్యులకూ ఎక్కడా తిండి దొరకలేదు. అన్నపూర్ణాదేవి భిక్ష కోసం పిలుస్తుందని ఎదురు చూశాడు. ఐదు రోజులు నిరాహార దీక్ష చేసినా భిక్షకు పిలుపు రాలేదు. దాంతో ఓపలేక కాశీపురాన్ని శపించటం మొదలు పెట్టాడు. అప్పుడు అన్నపూర్ణాదేవి వ్యాసుణ్ణీ, అతని శిష్యుల్నీ పిలిచి, కడుపునిండా అన్నం పెట్టింది. కానీ, చదువుకున్న అహంకారంతో జన్మభూమినే శపించబోయినందుకు వ్యాసుణ్ణి పరమేశ్వరుడు ఛడామడా వాయించేశాడు. శ్రీనాథుడి శ్రీ భీమేశ్వర పురాణం (భీమఖండం)లో శివుడు వ్యాసుడి మేథస్సుని బాగా మర్దించి అహంకార హుంకారాలను అణచి వేయటం ఈ పద్యంలో కనిపిస్తుంది.

"ఓరి దురాత్ముడా! **'నీవార ముష్టింపచా భాస'**: నీవారాలంటే నివ్వరి వడ్లు. నూర్పుళ్ళు అయిపోయాక అక్కడ రాలి పడిన వరిగింజలు ఏరుకు తెచ్చుకుని వండుకుని తినే పూటకు ఠికాణా లేని... **యోజన గంధి ప్రథమ పుత్ర**- చేపల వాసన కొట్టే సత్యవతికి (పరాశరుడి ద్వారా) అక్రమంగా పుట్టినవాడా! **దేవరన్యాయ దుర్భావనా పరతంత్ర**- సోదరులు సంతానం లేకుండా చనిపోతే వాళ్ళ భార్యల ద్వారా సంతానాన్ని కనే పరతంత్రం అంటే మనది కాని దురాచారం కలిగినవాడా...**బహు సంహితా వృథాభ్యాస పఠన**- వేదాలు అనాదిగా ఉన్నాయి. అలాంటి ఆదిమ గ్రంథాలను విభజించాలని వృథాభ్యాస పఠన శ్రమ పడినవాడా... **భారత గ్రంథ గుంఫన పండితమ్మన్య**- భారతం అనే గ్రంథాన్ని వ్రాసి, గొప్ప పండితుడివేమీ కాకపోయినా అయినట్టు కనిపించే వాడా! **'శాపమిచ్చెదనని యనాచార సరణి హుంకరించిన వాడ వహంకరించి'**-ఆచారాన్నీ ధర్మాన్నీ పాటించకుండా అహంకారంతో హుంకరించి కాశీపురానికి శాపం ఇస్తానంటూ బయల్దేరిన అనాచారీ! **'పొమ్మునిర్భాగ్య! మా యూరి పొలము వదలి ఎచటికే శిష్యుల్న్ నీవు నీ క్షణంబ!'** మా ఊరి పొలిమేరలు దాటి తక్షణం ఎక్కడికైనా నీ శిష్యులతో సహా వెళ్ళిపో" అని తిట్టాడు పరమశివుడు. అన్నం పెట్టి మరీ తిట్టాడు.

జన్మనిచ్చిన తల్లిని, జన్మభూమిని, చదువు చెప్పించి ఇంతవాణ్ణి చేసిన దేశాన్నీ, ఈ దేశ సంస్కృతీ వికాసాలనూ ద్వేషించే పరభాషా వ్యామోహపరులందరికీ ఈ తిట్లు తగులుతాయి. తగలాలి కూడా!

మన భాషా సంస్కృతుల పట్ల, ఆచార వ్యవహారాల పట్లవైమనస్యం, విముఖత, తిరస్కారాల్లాంటి భవాలు ఉన్న వాళ్ళు కనిపించినప్పుడు ఈ పద్యాన్ని వాళ్ళకి చదివి వినిపించాలి. **'అనాచార సరణి హుంకరించిన వాడ వహంకరించి'** అనటంలోనే ఇంత అర్థం ఉంది. దేశీయతని తక్కువ చేసి చూడటాన్ని కాశీని శపించబోయిన వ్యాసుడి తత్వంగా భావించాలి. ☆

# రానీ ! చూద్దాం... !

**"దాయమెత్తనో యీ సారె దాక నీక/ కట్టి గెలిచెద నిదె పాసికలను వచ్చి**
**పట్టునో భూతమిందేమి ముట్టగలదొ/ పొందవచిన వ్రాలకు బోవు గాక"**

కృష్ణుడు తన దేశానికి పాలకుడు. లోకపాలకుడు, విశ్వలోక పాలకుడు కూడా! ఆయనకు సత్యభామతో పాచికలాడే తీరిక దొరికింది. ఆటలో సత్యభామది పైచెయ్యి అయ్యింది. ఒక నిష్కంతో మొదలు పెట్టి, నాలుగు ఎనిమిది, పన్నెండు, పదారు ఇలా వరుసగా పందేన్ని రెట్టిస్తూ గెలుస్తోందామె!. కృష్ణుడి నిలవ సొమ్ము మొత్తం ఆమె మూలధనంలోకి చేరి పోతోంది. కృష్ణుడు లోలోపల కుతకుతలాడి పోతున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో పురప్రముఖులు గగ్గోలు పెట్టుకుంటూ వచ్చారు. పౌండ్రకుడిని చంపినందుకు ప్రతీకార చర్యగా కృత్య అనే భూతాన్ని కాశీరాజు ద్వారక మీదకు పంపాడని, అది జనాన్ని చంపుకు తింటోందనీ మొత్తుకున్నారు. 'ఆకొన మృత్యువులా, వెలిబ్రాకిన లయకాల రుద్ర ఫాలాగ్నిలా ఉన్నదా భూతం' అని చెప్పుకున్నారు.

కృష్ణుడు వినీ, విననట్టే కూర్చున్నాడు. పలక చెరిగిపోతుంది ఇంకో ఎత్తు వెయ్యమంటూ సత్యభామను రెచ్చగొడుతున్నాడు. వాళ్ళేమో "విన్నపం బంగారు దేవా" అంటున్నారు. ఆమె పాచికలు 'తాలించి' వేస్తోంది... ఇదీ సందర్భం. నాచన సోముడి ఉత్తరహరివంశంలో తృతీయాశ్వాసంలోది ఈ పద్యం.

సత్యభామ పాచికలు తాలించి వేసింది. తాలించటం అంటే చేతిలో అటూ ఇటూ పొర్లించటం. కూర. పప్పు, పచ్చడి, పులుసు, చారు, ఇలాంటి వంటకాలను వండి నప్పుడు చివరలో తాలింపు పెడతారు. పోపు పెట్టటం, సాతాళించటం అని కూడా అంటారు. ఒక ఇనుప గరిటలో పోపు గింజల్ని లేదా సంబారాల్ని నూనెతోనో, నేతితోనో దోరగా వేయించి ఆ గరిటతో సహా తెచ్చి, వండిన వంటకంలో బొర్లించి అటూ ఇటూ కలియపెడతారు. అందుకనే "తిరుగబోత" పెట్టటం అనే మాట కూడా వ్యాప్తిలోకి వచ్చింది. సత్యభామ పాచికల్ని చేతిలో తాలించింది అనటంలో వంట చేసే చెయ్యి పాచికల ఆటలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తోందనే వ్యంగ్యం ధ్వనిస్తోంది. పురజనం భూత భయంతో వణికి పోతున్నారు. సత్యభామ తటపటాయిస్తోంది. కృష్ణుడు పాచికలు వెయ్య మంటున్నాడు. ఈ సారి పందెంలో ఇప్పటిదాకా నువ్వు

గెలిచిందంతా తిరిగి నేను గెలిచేస్తాను...అన్నాడు. ఇంకోసారి నీకు పాచికలు ముట్టుకునే అవకాశం లేకుండా గెలుస్తానన్నాడు. ఆ భూతం వచ్చి ఈ పాచికల్ని ఎత్తుకెడుతుందా ఏంటి అని కూడా అనేశాడు. ఊరు జనం బిక్కచచ్చి పోతున్నారు. 'ఈ ఎత్తులో ఎవరికి లాభం రానుందో ఎవరికి తెలుసు... నువ్వు పాచికలు వెయ్యి' అంటున్నాడు. సత్య పాచికల్ని తాలిస్తోంది.

'త్వరగా వెయ్యి... పోయిన సొమ్మంతా గెలుచుకుని వెళ్ళి ఆ భూతం పని పడతాను..." అన్నాడు. ఆ మాత్రం భరోసా ఇచ్చాడు...చాలనుకుని సంతృప్తి పడ్డారు పౌరులు.

కష్టాలు, తుఫాన్లు, భూతాలు చెప్పిరావు. ముందుగా పసిగట్టి, రాకుండా అడ్డుకోగలిగే సమర్థత కలిగిన యంత్రాంగం లేనప్పుడు, జనం పోలీసులతోనూ, పోలీసులు మంత్రి తోనూ, మంత్రి ముఖ్యమంత్రితోనూ మొరపెట్టుకుంటారు, సదరు పెద్దాయన భార్యతో ఏకాంతంగా ఉండి, 'కాసేపాగి వస్తాలే! ముందు మీరు పదండి...' అనే అంటాడు.

ప్రజలకు పెనుముప్పు ముంచు కొచ్చిందంటే కచ్చితంగా ముందుగా పసిగట్టడంలో తాని విఫలమయ్యానని ప్రభుత్వం నడిపేవాడు అంగీకరించినట్టే లెక్క! ఇప్పుడే వచ్చేస్తాను అన్నాడంటే కామరాజుగారి పార్'కలామ్... 'చూద్దాం' సిద్ధాంతాన్ని పాటిస్తున్నట్టే లెక్క.

అయ్యా మీరొచ్చి కాపాడండీ అని ప్రజలు వచ్చి మొరపెట్టుకోవలసి వచ్చిందంటే అయ్యగారి పాలన అంతంత మాత్రంగానే ఉన్నటు లెక్క! చిట్ ఫండ్ కంపెనీవాళ్ళు బోర్డెత్తేసి పారిపోతుంటే, 'ఎవ్వరైనా కంప్లైంట్ ఇస్తే చర్య తీసుకుంటాం' అని పోలీసు వారన్నట్టే ఉంటుంది ఇది. తీరా కంప్లైంట్ ఇచ్చాక మళ్ళీ 'చూద్దాం' సిద్ధాంతమే అమలౌ తుంది. "అయ్యా! నా భార్య ప్రాణాపాయ స్థితిలో ఉంది, ఆసుపత్రిలో చేర్చాలంటే, "కానీ, చూద్దాం" అనే యజమానులూ ఉంటారు.

ఎన్నికలైపోయాక ఏరు దాటిన తెప్ప తగ్గలేసినట్టు, చూద్దాం చేద్దాం అనేవి ప్రభువుల ఊతపదాలుగా మారి పోతాయి.

భార్యతో జూదం ఆడుతూ, ఉన్నదంతా పందెంలో పోగొట్టుకుని, చూద్దాం చూద్దాం అంటూనే ఆఖరు ఎత్తు వేసి, పోయిందంతా గెలుచు కున్నాకే భూతాన్ని చంపటానికి వెళ్ళాడు కృష్ణుడు. భూతం అక్కడ కొచ్చి ఆగడాలు చేయక మునుపే దాని రాకను పసిగట్టే సామర్థ్యం ఉంటే, జనం భయభ్రాంతు లయ్యే వారు కాదు కదా! అయినా, అంతిమ విజయం తరువాత తొలి కష్టాలను ప్రజలు పూర్తిగా మరిచిపోతారు, మళ్ళీ ఎన్నికల నాటికి ప్రభువుల పూర్వ పాపాలన్నీ జనం మరిచిపోతారు కదా !



# రావణనీతి

"మానవనాథు లెంతయు నమాత్యులతో ననగూడనంతసి
గ్గెనపనుల్ ఒనర్పవలెనా? కాదు కింద్రజియొక్కమంత్రి,యు
ర్వీనుతులైన బిడ్డలు కల్గగనేమి నీతికై
కోనిది? పిల్లలేమియను కొందురు, పైకనరంతియేకదా!"

వ్యక్తి వ్యక్తిగా ఉన్నంతకాలం తాను ఏది చేసినా అది తన వ్యక్తిగతం. కానీ, పబ్లిక్కులోకి వచ్చినప్పుడు అంటే సమాజంలో ఉన్నతస్థానాన్ని పొంది, సెలెబ్రిటీగా గుర్తింపు పొందినప్పుడు, అధికార పదవుల్లో ఉన్నప్పుడు, ఏదో ఒక రంగంలో పేరు ప్రఖ్యాతులు పొందినప్పుడు వ్యక్తి తన వ్యక్తిగతాన్ని దాదాపు కోల్పోయినట్టే లెక్క.

జనం కళ్లలో పడ్డవాడి చుట్టూ ఆ జనం చూపులు కమ్ముకుని ఉంటాయి. తప్పుడు పని చేసి, 'అది నా పర్సనల్ విషయం' అని బుకాయించటానికి వీల్లేదు. పర్సనల్ జీవితం కావాలనుకునే వ్యక్తి పబ్లిక్కులోకి రాకూడదు. పబ్లిక్ పర్సనాలిటీ, ప్రైవేట్ లైఫ్ అనే రెండు అంశాలూ ఒకేసారి పొందాలనుకుంటే కుదరదు. పబ్లిక్ మనిషికి వ్యక్తిగత జీవితం ఉండదు. ఏది చేసినా పదిమందికోసం మాత్రంగానే ఉండాలి, పబ్లిక్కులోకి వస్తే ఏమైనా అంటాం... అని శ్రీశ్రీ అన్నది అందుకే! అలా అనే హక్కు పబ్లిక్కుకి ఏ చట్టమూ ఇవ్వాల్సిన అవసరం లేదు. ప్రతి రిపబ్లిక్కులోనూ పబ్లిక్కు అలానే ప్రవర్తిస్తారు. ఇది సమాజ ధర్మం.

ఈ సూత్రాన్ని మనం మార్చలేం అని రాముడు గ్రహించాడు. అయినా పబ్లిక్కు వ్యక్తుల మీద ఆమాత్రం నిఘా ఉండటం కూడా అవసరమే ననుకున్నాడాయన. అందుకే, రావణ వధ తరువాత రాముడు సీతను గైకొనటానికి అంత తటపటాయించాడు. ఎవడైనా ఓ కోణంగి ఏదైనా వాగితే తన పరువేం కావాలీ అని భయపడ్డాడు. అది రాముడి తరహా రిపబ్లిక్ నీతి. అదే రావణాసురుడి భార్యని ఎవరైనా ఎత్తుకెళ్ళినప్పుడు రావణుడు ఆ తస్కరుణ్ణి జయిస్తే, ఇలాంటి తటపటాయింపులేవీ ఉండేవి కావు. ఎందుకంటే రావణ రాజ్యం రిపబ్లిక్కు కాదు కాబట్టి. ప్రజా స్వామ్యంలో పబ్లిక్కుకి ఆమాత్రం కట్టడి అధికారం ఉంటుంది.

ఒక రిపబ్లిక్కులో పురప్రముఖులకే వ్యక్తిగత జీవితం పవిత్రమూ ఆదర్శ ప్రాయమూగా ఉండాలంటుంటే, సాక్షాత్తూ ప్రభువుకి ఇంకా ఎక్కువ ఉండాలి కదా! సీతారాములు ప్రవాసంలో ఉన్నారు. సీతాపహరణం చేయాలని రావణుడు ఒక నిర్ణయం తీసుకున్నాడు. అందుకు పథక రచనచేసి, మారీచుడి సహాయం అడిగాడు.

మారీచుడు వెంటనే "ఈ పని చేయటానికి నీకు "క్యాబినెట్టు అప్రూవ"ల్ ఉన్నదా? అనడుగుతాడు. మంత్రివర్గం ఆమోదంలేకుండా ఇలాంటి నిర్ణయాలు ఎలా తీసుకుంటావని నిలదీస్తాడు. దాంతో రావణుడు నోరెళ్ళపెడతాడు.

"కొత్తగా మాట్టాడుతున్నావేంటి? అలాంటివి ఎప్పుడైనా మనరాజ్యంలో చూశామా...చేశామా...? అయినా ఇది నా స్వంత విషయం. అమాత్యులతో ఏంపనీ" అని అడిగాడు.

"ఇవ్వాళ ఇది నీకు వ్యక్తిగత విషయమే కావచ్చు. కానీ, రేపు రాముడితో యుద్ధం చేయాల్సివస్తే, ఆ యుద్ధానికైనా అమాత్యుల అనుమతి కావాలా వద్దా?" అన్నాడు మారీచుడు.

"నేను ఆదేశిస్తే ఎవరైనా చచ్చినట్టు చేయాలి. లేకపోతే నా చేతుల్లోనే చావాలి" ఇలా సాగుతుంది రావణ మారీచ సంభాషణ.

పాలకులకు వ్యక్తిగత రహస్య విషయాలనేవి ఉండకూడదనీ, వాళ్ళ వ్యక్తిగతం అనేది ఆదర్శప్రాయంగా ఉండాలనీ మొత్తుకుని చెప్తాడు మారీచుడు. చివరికి విసిగిపోయి, "మంత్రివర్గానికి చెప్పుకోవటానికి అంత సిగ్గుపడే నీచాన్ని వ్యక్తిగతంగా చేయటం మాత్రం దేనికయ్యా?" అనడుగుతాడు.

"నీ మంత్రుల్లో నీ కొడుకు ఇంద్రజిత్తు కూడా ఉన్నాడు కదా! ఇప్పుడు నువ్వు చేయాలనుకుంటున్న సీతాపహరణం విషయం గురించి నీ కొడుక్కి తెలిస్తే అతను నిన్ను ఏమనుకుంటాడు? నీ బిడ్డలకు బిడ్డలు పుట్టాక ఈ వయసులో ఇలాంటి సిగ్గుమాలిన పనులు దేనికయ్యా? రాజు అంటే తండ్రితో సమానం. నీప్రజలు కూడా నీకు పిల్లల్లాంటివాళ్ళే! వాళ్ళు నీగురించి ఎంత అసహ్యంగా చెప్పుకుంటారు? పైకి నీతో ఎవరూ ఏమీ అనకపోవచ్చు. అంతమాత్రాన వాళ్ళు ఏవగించు కోవట్లేదని అర్థం కాదు..." అంటాడీ పద్యంలో మారీచుడు. ఇది విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షంలో పద్యం.

చెప్పుకోవటానికి సిగ్గుపడే పనులు కుటుంబస్థాయిలో తల్లిదండ్రులు చేయకూడదు. పుర ప్రముఖులు, సెలబ్రిటీలు, మంత్రులు అసలే చేయకూడదు. తల్లిదండ్రులు, పాలకులు పదిమందికీ ఆదర్శనీయంగా ఉండాలనేది ఇందులో నీతి.

ఎవడో ఏదో అనుకుంటాడనో, అంటాడనో మడి కట్టుకు కూర్చుంటే 'ఏలిక (పాలకుడు) బతుకు కూడా ఎలికతోకలా జానాబెత్తేడే అవుతుందనీ, నిజాయితీ కూడు పెట్టదనీ, అవతలి వాడికి కాస్త తినిపించి మిగతాదంతా మనం బొక్కేయాలనీ... అనుకోవడం రావణ నీతి...! లక్ష కోట్లు తిన్నవాళ్ళు దొరికిపోయి శిక్షపడితే పై కోర్టుకు పోయి రద్దు చేయించుకునే సావకాశం ఉన్నంతకాలం 'రావణనీతి' జిందాబాద్!



# రెండో భార్య బతుకు

**సీ : కలలోన నైన నువ్వుల కైన నామాటలు జవదాట వెరుచునో చంద్రవదన! యేపదార్థంబు నాయెదుట బెట్టక మున్న యెవ్వారి కొసంగండో యిగురుబోడి! చెలులు నాతో నేమి చెప్పుదురోయని లంచంబు లిచ్చునో చంచలాక్ష్మి! తోడిచెడియలు నాతోడి వంతులకు రా సయిరింపంజాలండో సన్నుతాంగి!**

నంది తిమ్మన గారి పారిజాతపహరణంలో 'సత్యభామ కంఠశోష' ఇది. కలలో కూడా, నవ్వులాటకైనా తన మాట జవదాటడానికి భయపడేవాడు. ఏదైనా బజారునుండి తెస్తే ముందు తనకు పెట్టకుండా ఇతర భార్యలకు ఏనాడూ పెట్టని వాడట కృష్ణుడు. అంతగా సత్యభామని నమ్మించేయ గలిగాడా పతి దేవుడు. అయినా ఎవరైనా చెలికత్తె అసలు సంగతి చెప్పకుండా దానికి లంచం ఇచ్చి మేనేజి చేస్తున్నాడన్న సంగతి సత్యకు తెలుసట. మిగతా భార్యలు సత్యభామతో వంతులకు రాకుండా అనేక జాగ్రత్తలు తీసుకుంటున్నాడట.... అదంతా తన మహిమేనను కుంటోంది. ఆ అమాయక ఇల్లాలు.

వ్రేటువడ్డ యురగాంగనయుంబోలె....అంటే, దెబ్బతిన్న పాములా లేచే సత్య ఇంత బేలగా ఎలా మాట్లాడుతోంది....? అయ్యగారికి ఎనిమిది మంది భార్యలున్నారని తెలిసి కాపరానికి ఒప్పుకున్నప్పుడే ఆమె బేల అని తెలిపోయింది. ఆ తరువాత కాలితో తన్నిందా లేదా అనేది పెద్ద విషయం కాదు. గదిలో నాలుగ్గోడల మధ్య జరిగే సం'గతు'లకు ప్రాధాన్యత ఏముంటుంది....? తన్నించుకుని ఆనందించే మగాళ్ళూ ఉండొచ్చు.

పేకాడే మొగుళ్ళూ, చెడు తిరుగుళ్ళు తిరిగే పతిదేవుళ్ళూ, మందురాయుళ్ళూ ఆడది ఎంత మొత్తుకున్నా ఎలా పట్టించుకోరో కృష్ణుడు కూడా అంతేనని వాపోతోంది సత్య. ఇప్పుడు కూడా నాగరిక సమాజంలో రెండిళ్ళ పతి దేవుళ్ళు చాలామంది కనిపిస్తుంటారు. మహిళా వాదులు దీన్ని పురుషాహంకారం అనే మాటతో తక్కువ చేసి చూపిస్తున్నారు. అది అంతకు మించిన నేరం.

ఏ వాగ్దానాలూ లేకుండా దశరథుడి రెండో భార్యగా ఉండి పోవటానికి సుమిత్ర ఎందుకు ఒప్పుకుంది...?

నీలనీరదశుభాంగుడు (వాన కురిపించడానికి సిద్ధంగా ఉన్న నల్లటి మబ్బులా ఉన్నవాడు) లాంటి పురుష పుంగవాలే ఈ చిన్నింటి కాపురాలు పెడ్తున్నారు. కడుపు నింపుకోవటానికి పడుపు వృత్తికన్నా రెండో భార్య హోదా నయమే కావచ్చు... అది తమకో హక్కుగా భావించుకునే మగాళ్ళ గురించే ఇక్కడ మనం చర్చించాల్సింది.

చిన్నిల్లు పెట్టిన రాజుగారు అకస్మాత్తుగా గుటుక్కుమంటే, ఆయన రాణులు ఆస్తుల కోసం రోడ్లెక్కినప్పుడే ఈ చిన్నిళ్ళ భాగవతం బయట పడ్తోంది. తన భర్త చట్ట వ్యతిరేకంగా మరో స్త్రీతో 'సహజీవనం' చేస్తున్నాడని పెద్ద భార్య ముందుగా బైటపడి బండించక పోవటం ఈ అనాగరికతకు మూలకారణం. వాళ్ళకళ్ళు తెరిపించే ఉద్యమాలు మనకు లేవు. బహుశా విదేశాల్లో అలాంటి సమస్యల మీద ఉద్యమాలు లేవు. కాబట్టి మనకూ లేకపోవచ్చు. రెండోభార్యకు అన్యాయం జరుగుతుందేమోననే సానుభూతి ఉద్యమకారుల్లో ఉండి ఉండవచ్చు కూడా!

పాశ్చాత్య వ్యవస్థలో 'గ్లాస్ సీలింగ్" అనే పదం వ్యాప్తిలో ఉంది. గాజు గదిలోంచి చూస్తూ స్త్రీలకు బోలెడన్ని అవకాశాలు ఇస్తున్నట్టు, ఉన్నత పదవులు ఇచ్చేస్తున్నట్టు కనిపిస్తుంది. కానీ, వంద ఆంక్షలతో వాటిని తొక్కి పెట్టిన సందర్భాలే ఎక్కువ. పురుషులకు వర్తించే వెసులుబాటు స్త్రీలకు లేకుండా పోవటమే ఇందుకు కారణం. గ్లాస్ సీలింగ్' ని పగలగొట్టుకుని స్త్రీలు బయట పడవలసిన అవసరం కూడా ఉంది. ప్రపంచ వ్యాప్తంగా ప్రతి 100 మంది స్త్రీలకూ 107 మంది పురుషులు పుడుతుంటే, స్త్రీ జనాభా తక్కువగా ఉన్నప్పుడు ఒక పురుషుడు ఇద్దరు స్త్రీలు లాంటి అవస్థలు పడాల్సిన అగత్యం మహిళలకు లేనే లేదు. రెండో భార్యగా బతకాల్సిన అగత్యమూ లేదు.

మొదటి భార్యగా ఉన్నా, ముద్దుల భార్యగా ఉన్నా తన సంసారం తన పిల్లల భవిష్యత్తు తన భద్రతల కోసం ఇలాంటి మొగుళ్ళతో సర్దుకుపోతుంది. అందువలన రెండు ఇళ్లు పెట్టటం మగాడి హక్కుగా మారిపోతోంది! రాష్ట్రంలో ఇలా రెండో ఇళ్ళు ఎన్ని ఉన్నాయో సర్వేలో తేలేది కాదు. బయటపడ్డ వాటి సంఖ్యే ఆందోళనగా ఉంది.

మగాడికి ఇద్దరు పెళ్ళాలు సహజమంటూ కావ్యాలు మనమైండ్ సెట్ మీద దారుణంగా ప్రభావం చూపిస్తున్నాయి. దేవుళ్ల కథలు కూడా అవే చెప్తున్నాయి. అవే సమాజానికి మార్గదర్శకాలా? మహిళావాదం స్త్రీ స్వేచ్ఛ గురించి బాగానే మాట్లాడుతోంది. కానీ, స్త్రీ అక్రమ సంసారానికి బలౌతున్న అంశం గురించి ఇంకా ఎక్కువ గొంతెత్త వలసిన అవసరం ఉంది!

అభ్యుదయ మేధావులు కూడా ఉపేక్షించే అంశం కాదిది! చట్టం తన పని తాను చేస్తోందా? ✮

# రేపటి రాజధాని

**తగ గోట దాచిన మగమానికంబుల/తెలిరంగు లెపుడు వెన్నెలలు గాయ**
**మేడలపై నాడు మెలతలు దెఱగంటి/కొమ్మలు నే ప్రొద్దు గూడి తిరుగ**
**జిలువ చామ లగడ్త వలినీటిపై దేలి/యెరిమతో ననయంబు నోలలాడ**
**మేలిమి బంగారు మేని పచ్చల చాలు/మిసిమి మింటికి నెల్ల బసిమియొసగ**
**జదల రాసిన కొమ్మల చాలు కతన**
**మీద రారాక యల ప్రొద్దు మెఱుగు దేఱ**
**గవనులనె రాక పోకలుగా మెలంగ**
**దనరు బుడమి బ్రతిష్ఠాన మనగ వీడు**

రాజధాని అంటే ఇలా ఉండాలి. అంతటి రాజధానిని ఆ రోజుల్లో కట్టటానికి మయుడు అనే గొప్ప సివిలు ఇంజనీరు మన పురాణేతిహాసాల్లో ఉండేవాడు. ఆ తరువాత ఆయన తన సంతతితో సహా మెక్సికోవెళ్ళి స్థిరపడ్డాడని కొందరు, లేదా మెక్సికో నుండే వచ్చాడని కొందరు వాదిస్తూ ఉంటారు. భిక్షూచమన్‘లాల్ అనే పరిశోధకుడు ‘హిందూ అమెరికా’ అనే గ్రంథంలో మెక్సికోలోని ‘మయా’ జాతీయులైన ఆదిమ రెడ్డిండియన్లకు భారతీయ నేపథ్యం ఉందన్నాడు. సరే, అది వేరే కథ.

పైన చెప్పిన పద్యంలోని ప్రతిష్ఠానపుర రాజధాని నగర వర్ణనలోకి వద్దాం. **...తగ గోట దాచిన మగమానికంబుల తెలిరంగు లెపుడు వెన్నెలలు గాయ’** ఆ నగరంలో రాజుగారి కోట ఉండేది. కోట అంటే సెక్రెటేరియట్,అసెంబ్లీ, గవర్నరుగారుండే రాజభవన్, ముఖ్యమంత్రిగారి క్యాంపు ఆఫీసు, నివాసం, ఎమ్మెల్యేల ఇళ్ళు,మంత్రుల పేరోలగాలు, వీటన్నింటితోపాటు అన్నీ దొరికే ఆరో ఏడో నక్షత్రాల హోటళ్ళు... వగైరా ఉండే చోటు. ఇవన్నీ ఒకే చోట ఉంటేనే అది రాజధాని అవుతుంది. ఆ కోట గోడలకు మగమాణిక్యాలు తాపటం పెట్టించారట. మణులకు లింగభేదం ఏవిటా అనుకోవద్దు, మగమాణిక్యాలంటే శ్రేష్ఠమైన మణులు. వాటి తెలిరంగులు తళతళలాడుతూ పగలే వెన్నెలలు కాయిస్తాయిట.

కోట లోపల, కోట బయట అన్నీ మేడలే! మేడంటే మేడ కాదు...ఒక్కోటీ ఆకాశాన్నంటేంత గొప్పమేడ. విమానాలు కూడా తన ఎత్తు పెంచుకుని ఈ నగరం మీంచి ఎగరాలన్నంత ఎత్తైన మేడలు.**మేడలపై నాడు మెలతలు దెఱగంటి కొమ్మలు నే ప్రొద్దు గూడి తిరుగ** వాటి పైన మెలతలు అంటే చక్కనమ్మలు ఆడుకుంటున్నారట. **తెరగంటి కొమ్మలు**–కన్నార్పకుండా చూడగల నేర్పరులైన అప్సరసలతో ఈ మెలతలు ముప్పొద్దులా కలిసి తిరుగుతారట. మేడల మీదే ఎందుకు ఆడుతున్నారంటే కింద నేలమీద తిరగటానికి జాగా లేదు కాబట్టి! గజం స్థలం ఉంటే అక్కడొక మేడ

కట్టేయాలన్నంత పరిస్థితి! ముప్పై వేల ఎకరాలు ఏ మూలకి? ప్రపంచంలో ఏ దేశానికీ లేనంత రాజధానికదా! ఆడవాళ్ళు ఆడుకోవాలన్నా, మార్నింగు వాకులు చేయాలన్నా అన్నీ టెర్రేసుల మీదే!

**"జిలువ చామ లగడ్త వలినీటిపై దేలి/యెరిమతో ననయంబు నోలలాడ..."** ఆ కోటచుట్టూ పెద్ద అగడ్త ఉంది. రాజధానికి భూమి లివ్వనన్న వాళ్ళూ, భూములు బలంగా లాక్కోవటాన్ని వ్యతిరేకించే ప్రతిపక్ష శత్రు మూక కోటలో ప్రవేశించకుండా చుట్టూ తవ్వించిన లోతైన కందకం అది! ఆ అగడ్త వలినీళ్ళలో చిలువ చాములు అంటే నాగకన్యలు పాతాళం నుండి వచ్చి ఒరిమ(అందంగా)తో అనయంబుగా (ఎల్లవేళలా) తేలి ఆడుతూ ఉంటారట. మన ఊరునుండి భూమి లోపలికి తిన్నగా తవ్వుకొంటూ పోతే ఆ చివర అమెరికాలో ఎక్కడో ఒక చోట తేలతాం. అందుకని అమెరికాని పాతాళ లోకంగా భావిస్తారు పండితులు. ఆ పాతాళం పాములకు పుట్టిల్లు. అందమైన పాములు ఈ రాజధాన్ని చుట్టుకుని తేలియాడుతుంటాయి.

**"మేలిమి బంగారు మేని పచ్చల చాలు/మిసిమి మింటికి నెల్ల బసిమి యొసగ"** మేలిమి బంగారంతో కోట శిఖరాల్ని తాపటం చేశారట. ఆ బంగారు రేకుల మీద గరుడపచ్చలు పొదిగారట. ఈ రెండింటి 'చాలుమిసిమి' అంటే తళతళలతో ఆకాశం అంతా పచ్చరంగులోకి మారిపోయింది. ఎక్కడ చూసినా 'పసుపురంగు' తాండవిస్తోందట.

**"చదల రాసిన కొమ్మల చాలు కతన మీద రారాక యల ప్రొద్దు మెఱుగు దేలు'** కోటకొమ్మల చాలు అంటే కోటశిఖరాలు లేదా , బురుజుల శ్రేణి. అవి చదల రాసుకొంటున్నాయట. చదలం అంటే, ఆకాశానికి అచ్చతెలుగు పేరు. ఈ చదలంతో కోట బురుజులు రాసుకుంటున్నాయిట. నేలనే కాదు,ఆకాశం అంతా రాజధాని కోటలూ మేడలే ఆక్రమించటంతో సూర్యుడి రథచక్రాలకు అవి తగుల్తున్నాయి.దాంతో సూర్యుడు రాలేకపోయాడు. ఇంక 'చంద్ర' కాంతికి తిరుగులేకుండా పోయిందని భావార్థం. చేసేది లేక"చంద్రన్న"కి తలవంచి నేల మీద ఆరులైన్ల రహదారుల పైన తిరుగుతున్నాట్ట సూర్యుడు. అందుకని వీధులన్నీ వెలిగి పోతున్నాయి.

ఈ పుడమి మీద ప్రతిష్ఠానం పేరుతో ఒక వీడు తనరారుతోందంటాడు పొన్నెగంటి తెలగన్న! ఈకవిగారు 16వ శతాబ్దిలో గోల్కొండ ప్రభువు ఇబ్రహీం కుతుబ్ షా (మల్కిభరాముడు) దగ్గర అమీనాగా పనిచేసేవాడు. ఈయన తెలగన్న కాదు తెలుగన్నే! అచ్చ తెలుగు పదాలతో 'యయాతి చరిత్ర' వ్రాశాడు. అందులోది ఈ పద్యం.

కవిగారు గతంలోకి చూసి ఈ వర్ణన చేశాడో లేక భవిష్యత్తులోకి తొంగి చూసి రేపటి ఆంధ్ర రాజధాని గురించి వ్రాశాడో తెలియదు. ఈ రాజధానిలో సామాన్యులు ఎక్కడ, ఎలా నివసించారో ఆయన చెప్పలేదు. వారిని రాజధాని లోపలికి రానీయకుండా గ్లోబల్ పాములు అడ్డుకుంటాయా ? 

# లెక్కలంటే లెక్కలేని జాతి

**ఖర్జూర ఫలములు గణకుండు కొని / తెచ్చి సగపాలు మోహపు సతికి నిచ్చె**
**అందు నాల్గవపాలు అనుగు తమ్మున కిచ్చె/ అష్టభాగం బిచ్చె అనుజు సతికి**
**తగ తొమ్మిదవపాలు తన తనయు కిచ్చె/ తనచేత నాల్గున్న తల్లికిచ్చె**
**మొదలు తెచ్చిన వెన్ని మోహంపు సతికెన్ని /అనుగు తమ్మునకెన్ని అతని సతికి**
**ఎన్ని యిచ్చె సుతునకెన్ని మఱియును**
**తల్లి కెన్ని యిచ్చె తగ వచింప**
**గణిత మెరిగినట్టి కరణాల బిలిపించి**
**అడుగవలయు దేవ అవధరింప**

పద్యాలంటే ఆడపిల్లల అంగాంగ వర్ణనలే అనే భావన కలగటానికి అలా పెద్దఎత్తున వెలువడిన శృంగార సాహిత్యమే కారణం. కానీ, అద్భుతమైన శాస్త్ర విషయాలను కూడా సంస్కృతం లోనే కాదు, తేట తెలుగు పద్యాల్లోనూ చెప్పిన మహాకవులున్నారు. ఈ పద్యంలో అర్థంకాని మాట అంటూ లేదు.

ఇది పావులూరి మల్లన్న గారి గణితసార సంగ్రహము గ్రంథంలోది. మల్లన్న కవి నన్నయ కాలం నాటి వాడని, కొందరు, నన్నెచోడుని కాలం నాటి వాడని కొందరూ చెప్తారు. రాజరాజ నరేంద్రుడు నవఖండవాడ అగ్రహారం ఇచ్చి ఇతన్ని సత్కరించాడని చెప్తారు. వెయ్యేళ్ళ క్రితం వాడని స్థూలంగా భావించవచ్చు. అతని తల్లిదండ్రులు శివన్న, గౌరమ్మ, తాతగారు మల్లయామాత్యుడు. గోదావరి తీరంలో పావులూరు గ్రామనికి ఇతని తాతగారు కరణంగా ఉండేవాడు. గణిత శాస్త్రం పావులూరు కవికి వంశపారంపర్యంగా సంక్రమించిన ఆస్తి. మహావీరుడి "జైన గురుసార సంగ్రహ గణితము" గ్రంథాన్ని ఇతను ఆంధ్రీకరించాడు.

అతను వ్రాసిన ఈ పద్యంలో ఒక గణిత సమస్య ఉంది. ఒక లెక్కల మాష్టారు ఖర్జూర పళ్ళు తెచ్చి సగం తన భార్యకిచ్చాడు. నాలుగోవంతు తమ్ముడికి ఇచ్చాడు. ఎనిమిదోభాగం తమ్ముడి భార్యకి ఇచ్చాడు. తొమ్మిదోవంతు తన కొడుక్కి ఇచ్చాడు. మిగిలిన నాలుగు పళ్ళనీ తన తల్లికి ఇచ్చాడు. ఎవరెవరకి ఎన్ని పళ్ళు ఇచ్చాడనేది లెక్క తేల్చమంటాడు ఈపద్యంలో కొంచెం కష్టపడితే జవాబు తేలికగానే వస్తుంది. తన భార్యకి 140, తన తమ్ముడికి 70, మరదలికి 35, కొడుక్కి 31, తల్లికి 4 పళ్ళు చొప్పున పంచితే మొత్తం 280 పళ్ళను ఆయన ఇంటికి తెచ్చాడని

లెక్కతేలుతుంది. రాజుగారికి ఈ పళ్లలెక్క ఇచ్చి, కరణంగారిని పిలిపించి సమాధానం అడగమంటాడు. వెయ్యేళ్ళనాటి కరణాలు క్షేత్ర గణితం (జ్యామెట్రీ) తో పాటు హై స్పీడ్ అరిథ్‌మెటిక్స్'లో కూడా పరిచయం ఉన్నవారుగా దీన్ని బట్టి అర్థం అవుతుంది.

గణిత శాస్త్రాన్ని జ్యోతిష శాస్త్రంలో భాగంగానే వైదిక సాహిత్యం పరిగణిస్తుంది. కీన, అర్కాది గ్రహ సంచర గ్రహణ కాలాన్వేషణోపాయమునన్/ దర్క వ్యాకరణాగమాది బహుశాస్త్ర ప్రోక్త నానార్థ సం/ పర్కాది వ్యవహారమునన్ భువనరూప ద్వీప విస్తారమున్ / దర్కింపగన్ గణిత ప్రవృత్తి వెలిగా దక్కొండెరింగించునే? అనే పద్యం ద్వారా జ్యోతిష శాస్త్రం కూడా గణిత శాస్త్రంలో భాగంగానే పావులూరి మల్లన్న భావించినట్టు అర్థం అవుతుంది.

ఆర్యభట్ట, భాస్కరాచార్య, బ్రహ్మగుప్త, పావులూరి మల్లన్న వంటి నిష్ణాతులైన గణితశాస్త్రజ్ఞులు ఎందరెందరో మనకున్నారు. లెక్కలంటే లెక్కలేని శాస్త్రవేత్తల వలన దేశానికి మేలు కలుగుతుంది. లెక్కల పుట్టిల్లు భారతదేశం. భారతీయ తాత్వికతలో గుణాత్మకతకు గణిత శాస్త్రమే మూలం.

ఇప్పుడంటే దేశీయులైన ఇంజనీర్లు, నిర్మాణ శాస్త్ర నిపుణులు, గణిత శాస్త్రవేత్తల్ని పక్కనబెట్టి జపాన్, సింగ్‌పూర్లమీద ఆధారపడి రాజధాని నగరాన్ని నిర్మిస్తున్నారు. ఫ్రాంక్లిన్ సి పౌత్ వర్త్ అనే పండితుడు సింధు నగరాలకు తెలుగు నేలమీంచి ద్రావిడులు తరలి వెళ్ళి అక్కడ మహా నగరాలు నిర్మించారని పేర్కొన్నాడు. అశోకుడి కవల పిల్లలు మహేంద్ర, సంఘమిత్ర ఇద్దరూ కృష్ణాతీరానికి వచ్చి ఇక్కడి నిర్మాణ శాస్త్ర నిపుణుల్ని తీసుకుని శ్రీలంక వెళ్ళి అక్క బౌద్ధస్తూపాలు నిర్మింప చేశారని మహావంశ గ్రంథం సాక్ష్యం ఇస్తోంది. ఇప్పుడు సీను రివర్స్ అయ్యింది అంతే! ✩

# వరి కూడు

ఫుల్ల సరోజ నేత్ర అల పూతన చన్నుల చేదు ద్రావి నా
దల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెదవేమొ? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లగ నొక్క ముద్ద దిగ మ్రింగుమ నీ పస కాననయ్యెడిన్

ఇది శ్రీనాథుడి చాటు పద్యం. దాదాపు ఏడు వందల యేళ్ళ క్రితం వాడు శ్రీనాథుడు. అప్పటికే తెల్లన్నం(తెల్లగా పాలిష్ పట్టిన వరిబియ్యంతో వండిన అన్నం) మీద వ్యామోహం జనాల్లో బాగా వచ్చేసింది. శ్రీనాథుడు నెల్లూరు, కృష్ణా మండలాల్లో ఎక్కువగా జీవించిన వాడు కాబట్టి, చివరి రోజుల్లో కృష్ణ ఒడ్డున బొడ్డుపల్లిలో గొడ్డేరి మోసపోయి వ్యవసాయంచేసి ప్రాణాలు అర్పించుకున్న తొలి తెలుగు రైతు కాబట్టి, తెల్లన్నానికి బాగా అలవాటు పడి, జొన్నన్నాన్ని ఈసడించాడు. అదేం పాపమో, ఇతర ధాన్యాలు ప్రధాన ఆహారంగా తీసుకునే వాళ్ళు తెల్లన్నం తినాలంటే పెద్ద ఇబ్బంది పడరు. కానీ, వరిబియ్యం తినే వాళ్ళు మాత్రం మరో ధాన్యం తినాలంటే ప్రాణం మీద కొస్తుంది.

నాలుగు రోజులు ఉత్తర భారతదేశానికి వెళ్ళిన తెలుగువాడు వరి అన్నం, ఆవకాయ కోసం మొహవాచిపోతాడు. శ్రీనాథుడి పరిస్థితి కూడా అదే! ఆయన పలనాడు వెళ్ళి జొన్నకూడుని, కర్ణాటక వెళ్ళి రాగి సంకటినీ తినటానికి నానా తంటాలు పడ్డాడు. తన అవస్థని అనేక చాటు పద్యాల్లో చెప్పుకున్నాడు కూడా! ఈ పద్యం వాటిల్లో ఒకటి!

బహుశా శ్రీనాథుడు ఉత్తరాదికి వెళ్ళి ఉంటే, చపాతీలూ, పుల్కాలూ ఇష్టంగానే తినేవాడనుకుంటాను. ఆయన తన కావ్యాలలో అనేక వంటకాలను పేర్కొన్నాడు. వాటిల్లో, 'అంగారపోలిక' అనే వంటకం ఉంది. 'పోలి' అంటే ఉండలా చేసిందని! పోలిని పలుచగా వత్తి, నిప్పుల మీద కాలిస్తే అది 'పోలిక' (పుల్కా). దీన్నిబట్టి, తెలుగువారికి గత 700 యేళ్ళ నుండీ పుల్కాలు బాగా తెలుసనీ, అవి ఉత్తరాది నుండో, అరబ్బు దేశాల నుండో దిగుమతి అయినవి కావనీ, తెలుగువారి ప్రాచీన వంటకం అనీ అర్థం అవుతోంది. .

వరి బాగా పండే కృష్ణా, గుంటూరు నెల్లూరు జిల్లాల్లో ఉండే వారికి తెల్లన్నాన్ని రాజభోజనం అనీ, జొన్నన్నాన్ని జొన్న కూడు అనీ పిలవటం ఒక అలవాటు. గొప్పవాడు కనిపిస్తే భోజనం చేశావా అనీ, సామాన్యుడు కనిపిస్తే కూడు తిన్నావా అనీ అడుగుతుంటారు. ఇది తరతరాలుగా వచ్చిన అలవాటే గానీ, కూడు అనేది నీచమైన పదం ఏమీ కాదు. కూడు కుడిచేది కుడిచెయ్యి కదా! శ్రీనాథుడికి జొన్నన్నాన్ని తినటం ఎంత ఇబ్బంది అయ్యిందో 'జొన్నకూడు' అనే పదం వాడటంలోనే తెలుస్తుంది.

"బాగా వికసించిన తామర పూవుల వంటి కన్నులూ, అందమైన రూపమూ ఉన్న ఓ కృష్ణుడా! చిన్ననాట పూతన రొమ్ముపాలలో చేదుని తాగేసాననీ, పెద్ద దావాగ్నిని మింగేశాననీ విర్రవీగుతున్నావేమో, తింత్రిణీ పల్లవాలు అంటే లేత చింత చిగురు కలిపి వండిన బచ్చలాకు పులుసుకూరని ఈ జొన్నకూట్లో కలుపుకుని ఒక్క ముద్ద దిగమింగు, నీ పస ఏమిటో తెలుస్తుంది"అంటూ దేవుణ్ణి నిలేస్తాడు ఈ చాటు పద్యంలో శ్రీనాథుడు.!

ఇప్పుడే గనక శ్రీనాథుడే ఉంటే షుగరో బీపీయో ఆయనకూ పెరక్కుండా పోదు. అప్పుడు ఎలుగెత్తి ఆ గోపాల కృష్ణుణ్ణి పిలిచి,"ఓ కృష్ణా! చిన్ననాడు పూతన రొమ్ముపాలలో చేదు మింగాననీ, దవాగ్ని అమాంతం మింగేశాననీ విర్రవీగకు! చేతనైతే, చేవ వుంటే ఈ తెల్లన్నంలో తీపిని తిని బతికి బట్టకట్టు చూద్దాం! నీ పస ఏపాటిదో తెలుస్తుందీ..." అని మొత్తుకుని ఉండేవాడు.

ఇక్కడో గమ్మత్తయిన విషయం ఉంది. ఎవడో బోయ వేసిన బాణం ములుకు గుచ్చుకునికాలు సెప్టిక్ అయి కృష్ణుడు అవతారం చాలించాడట! ఈ రోజుల్లో షుగరు వ్యాధికి ఎన్నో పరిక్షలొచ్చాయి. అప్పట్లోకృష్ణుడు మధుమేహాన్ని బహుశా పసిగట్ట లేకపోయి ఉండొచ్చు.పసిగడితే జొన్నకూడు తినిప్రాణాలు నిలుపుకునేవాడు కదా!



# వార్తిళ్ళు

**"వార్త యందు జగము వర్తిల్లు చున్నది**
**యదియ లేని నాడ యఖిల జనులు**
**నంధకార మగ్నులగుదురు గావున**
**వార్త నిర్వహింపవలయు బతికి"**

పాండవులు ద్రౌపదిని పెళ్ళాడారు. ఇంకా చాలా విజయాలు సాధించారు. అర్ధరాజ్యం వచ్చింది. మయసభ కట్టుకున్నారు. మంచి పేరు తెచ్చుకున్నారు. దుర్యోధనుడంటే గిట్టని వాళ్ళంతా పాండవుల అభిమాను లయ్యారు. వాళ్ళంతా పాండు పుత్రుల్ని అభినందించాలని వచ్చి తలా ఒక సలహా ఇచ్చి వెళ్తున్నారు. ధర్మరాజు ఆ వచ్చిన వాళ్ళందరికీ దణ్ణం పెట్టి చెప్పిందల్లా వింటున్నాడు.

ఆ సమయంలో అక్కడికి నారదుడొచ్చాడు. ఆయనకు వార్తలంటే పరమ ప్రీతి. వార్తను చూడటం, దాని పూర్వాపరాలను సమీకరించటం, దాని పర్య వసానాలను గ్రహించటం, వాటన్నింటికీ తన అనుభవాన్ని జోడించి వార్తను వ్రాయటం, దాన్ని చెప్పవలసిన రీతిలో చెప్పవలసిన వారికి చెప్పటం, తద్వారా అనేక రాజకీయ పరిణామాలకు మూలకం కావటం ఇవే మన పురాణేతిహాసాల్లో నారదుడి గురించి మనకున్న అవగాహనలు. ఆయన ధర్మరాజుకి 'వార్త' విషయంలో అశ్రద్ధ చేయవద్దని సలహా ఇచ్చాడు.

"వార్తలోనే ఈ ప్రపంచం మొత్తం నడుస్తోందయ్యా" అన్నాడు. వార్త లేకపోతే మనుషులంతా అంధకార మయం అవుతారన్నాడు. కాబట్టి, వార్తను సక్రమంగా ప్రజలందరికీ చేర్చవలసిన బాధ్యత ప్రభువు మీద ఉన్నదని, దాన్ని బాధ్యతగా నెరవేర్చాలనీ సూచించాడు. కనీసం వెయ్యేళ్ళ క్రితం నన్నయ గారు సమాచార పౌరసంబంధ శాఖని పటిష్టం చేసుకో వలసిన అవసరాన్ని ప్రభుత్వాలన్నింటికీ నొక్కి చెప్పాడని దీన్ని బట్టి అర్థం అవుతోంది .

'నారం దదాతీతి నారదః' అని నారద శబ్దానికి వ్యుత్పత్తి చెప్తారు. అంటే, జ్ఞానాన్ని తొలగించి అజ్ఞానం ఇచ్చేవాడని అర్థం. ఆయన ఇచ్చే జ్ఞానం ఆ పరమాత్మ గురించి అని పండితులంటారుగానీ, అంతకు మించిన లౌకిక ప్రయోజనాలు నెరవేర్చాడు. అనేక స్టింగ్ ఆపరేషన్లు జరిపాడు. కీలక సమాచారాలు చేరవలసిన

వారికి చేర వలసిన సమయంలో చేర్చి లోకకళ్యాణం సాధించాడు. సమాజం గురించి సమాచారం ఇచ్చినా, ప్రమాదాల గురించి హెచ్చరికలు ఇచ్చినా నారదుడు నిఖార్సయిన ఫ్రీలాన్సర్ లేదా నిబద్ధత కలిగిన రిపోర్టర్'గా కనిపిస్తాడు. అందుకనే ప్రాతికేయులకు నారద పురస్కారాలు ఇస్తారు.

బానిస దేశం కాబట్టి, తెలుగు నేలమీద తొలి సామాజిక పత్రికలన్నీ విదేశీ పాలకుల మీద కసితో దేశభక్తులైన ప్రజల చేతుల్లోనే నడిచాయి. వార్తలు లేదా వార్తా పత్రికలు లేకపోతే అజ్ఞానం వ్యాపిస్తుందనే నారద వాక్యాలే స్వాతంత్రోద్యమ కాలంలో పత్రికలు పుట్టడానికి ప్రేరణ. స్వాతంత్ర్యం వచ్చాక ప్రభుత్వాలూ, పత్రికలూ పరస్పర ఆశ్రయ ఆశ్రయీ భావంలో నడవటం మొదలైంది. అందువలన వార్త స్వరూప స్వభావాల్లో వింత మార్పులు వచ్చాయి.

రాజకీయాల్లోనే వార్తలు వర్తిల్లుతున్నాయనీ, రాజకీయాలు లేకపోతే వార్తలు వెలవెల బోతాయనీ, వార్తలు లేకపోతే జనానికి తెల్లవారదనీ, కాబట్టి వార్తల్ని అదుపులో పెట్టుకుని రాజకీయాలను ఏలాలనీ ఇప్పటి ప్రభువులు తమకు తామే నారద వాక్యానికి వక్రభాష్యం చెప్పుకుని పాలిస్తున్నారు. నారదుడి కాలంలో 'జగము' వార్త యందు వర్తిల్లింది. నేటి ప్రభువుల కాలంలో జగము 'అర్థ'సత్యాలతో వార్తిల్లు'తోంది.

వర్తకుడు తెచ్చింది కాబట్టి, వార్త అయ్యిందని భాషావేత్తలు చెప్తారు. 'వార్తికుడు' అంటే వార్తాహరుడు, వ్యాపారి అని రెండర్థాలూ ఉన్నాయి. వార్తిల్లడం అంటే వార్త వ్యాపారంగా మారటం అని !

మానవ శరీరంలో ప్రతి కణానికీ మరో కణంతో సమాచార మార్పిడి వ్యవస్థ ఉంటుంది. వార్త అంటే అదే! వాత ధాతువు ఈ వార్త వ్యాప్తికి కారణం అవుతుందని ఆయుర్వేద శాస్త్రం చెప్తుంది. బాధ కలిగితే మెదడు నుండి వచ్చిన వార్త వలనే కళ్ళలో నీళ్ళు స్రవిస్తున్నాయి. దుమ్ము పడబోతుంటే అసంకల్పితంగానే కనురెప్పలు మూత పడటం వార్త వలనే జరుగుతోంది. శరీరానికి నీటి అవసరం యేర్పడినప్పుడు దాహం అనే వార్త మన చేత నీళ్ళు తాగిస్తోంది. ఆకలి అనే వార్త మనచేత అన్నం తినిపిస్తోంది. కాళ్ళు, చేతులు, కళ్ళు, ముక్కు, చెవులు సమస్త జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మొత్తం నాడీవ్యవస్థ అంతా వార్త వలనే పని చేస్తోంది. వార్తా వ్యవస్థ దెబ్బతింటే ఆకలి దప్పులు, మలమూత్రాలూ, ఇంకా ఇతర జీవనక్రియలూ నశించి శరీరం క్షీణిస్తుంది. ప్రభుత్వ యంత్రాంగమూ అంతే! పాలనా యంత్రాంగంలో వాతం వికటిస్తే వార్త 'గాలివార్త' అయిపోతుంది. ✯

# వ్యర్థ ప్రయోగ నిష్ఫలాలు

**"తేజము, సాధు వృత్తమును, తేకువ గల్గిన మర్త్యుడెప్పుడున్**
**అజికి నిట్లనున్ పరుని యాలికిట్లనున్, నర్థి కిట్లనున్**
**తేజము సాధువృత్తమును తేకువ లేని నరూండు నెప్పుడున్**
**అజికి నిట్లనున్, పరుని యాలికి నిట్లను నర్థికిట్లనున్..."**

ఇది తెనాలి రామకృష్ణుడిదిగా భావిస్తున్న చాటు పద్యం. ఇందులో అర్థం కానిదేమీ లేదు. అర్థం అయ్యేది కూడా ఏమీ లేదు. నిజానికి అర్థం కూడా ఏమీ లేదు. అలాగని వ్యర్థ పద్యం కాదు. గొప్ప పద్యమూ కాదు. ప్రతిభావంతుడైన ఒక కొంటెకవి చేసిన సరదా ప్రయోగం ఈ పద్యం.

రాయల ఆస్థానానికి ఎవరో మహా పండితుడు వాదించటానికి వస్తున్నాడని తెలిసి, ఆయన్ని అర్థం కాని పదాలతో బెదర కొట్టటానికి వేసిన ఎత్తుగడ ఈ పద్యం.'ఇట్లనున్' తప్ప ఈ పద్యంలో ఇంకొకటి లేదు. దీనికి అర్థం ఎలా చెప్పాలో తెలియక ఆ పండితుడు ఓటమి అంగీకరించాడు. కానీ, రాయలవారు రామకృష్ణుణ్ణి వదల్లేదు. "ఆయన చెప్పలేక పోయినా అర్థం నువ్వు చెప్పగలిగి ఉండాలి కదా?" అనడిగాడు.

"చెప్తాను ప్రభూ!" అంటూ భుజం మీది ఉత్తరీయం తీసి నడుముకు కట్టి నాట్యాచార్యుడిలా అబినయిస్తూ అదే పద్యాన్ని తెనాలి రామకృష్ణుడు ఇలా చెప్పాడు: "తేజము, సాధు వృత్తమును, తేకువ గల్గిన మర్త్యుడెప్పుడున్" పరాక్రమం, మంచితనం, దాన గుణం కలిగిన ఒక మంచివాడెప్పుడూ....

"అజికి నిట్లనున్" శత్రువు దాడికి వచ్చినప్పుడు 'ఇట్లనున్' అంటూ జాగ్రత్త అని హెచ్చరిస్తాడన్నట్టు అభినయించి చూపించాడు. నిజానికి ఈ పద్యంలో 'ఇట్లనున్' అన్నాడే గానీ ఎట్లా అన్నాడో రాయలేదు. దాన్ని పాఠకుడు ఊహించుకోవాలన్నమాట! ఇప్పుడు రాయలవారే అడిగే సరికి ఇట్లా అన్నాడని నటించి చూపించాడు.

"పరుని యాలికిట్లనున్" మంచి తనం ఉన్నవాడు కాబట్టి పరాయివాడి భార్య ఒక వేళ కోరరాని కోరిక కోరితే 'ఇట్లనున్' అని, చెయ్యి అడ్డంగా ఊపుతూ అభినయించి చూపించాడు,

"అర్థికిట్లనున్" పేదవాడు యాచనకొచ్చినప్పుడు దాన గుణం కలిగిన వాడు కాబట్టి 'ఇట్లనున్' అంటూ 'ఇంద తీసుకో ' అన్నట్టుగా అభినయించాడుట! ఈ అభినయాలేవీ లేకుండా ఊరికే ఇట్లనున్ అంటూ పద్యాన్ని పద్యంలాగా చదివితే

ఎంతటి పండితుడికైనా తారెత్తటం సహజం.

ఇక్కడికి రెండు పాదాలు పూర్తయ్యాయి. మూడో పాదంలో పరాక్రమం, మంచితనం, దాన గుణం లేని వాడైతే ఇదేసందర్భాలలో 'ఇట్లనున్' అంటూ సరిగ్గా వ్యతిరేక చర్యలను అభినయించిచూపించ సాగాడు

శత్రువు వచ్చినప్పుడు వీడు తేజం లేనివాడు కాబట్టి, భయపడి దణ్ణంపెట్టి కాళ్ళమీద పడినట్టు, శీలం లేని వాడు కాబట్టి, పరాయి వాడి భార్య పిలిస్తే పళ్ళికిలిస్తూ కులికినట్టు, పిసినారి కాబట్టి, దానంకోరి వచ్చినవాణ్ణి చీదరించుకున్నట్టూ అభినయించి చూపించాడు.

నాటక రచనలో నటుడు ఒక సంభాషణను ఎలా నటించాలో స్పష్టంగా రాస్తారు. ఈ పద్యంలో కేవలం 'ఇట్లనున్' అంటూ చదివే వాడి ఊహకు వదిలేశాడు. నిజానికిది అసంపూర్ణ ప్రజ్ఞా దురహంకార రచన!

పుట్టపర్తి నారాయణాచార్యులవారు ఈ పద్యాన్ని ఉటంకిస్తూ, "రామకృష్ణుడు తార్కికుడు. ఈ వాసన వాని గ్రంథాల్లో ప్రతి చోటా కనిపిస్తుంది" అని మెచ్చుకున్నారు గానీ, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు, "రామకృష్ణ కవికి చాలనిది నేర్పు కాదు, మరి యోర్పు" అంటారు.

కవికి నేర్పుతోపాటు ఓర్పు తోడైతే ఆ సాహిత్యానికి మరింత ప్రయోజనాత్మకత సిద్ధిస్తుందని దీని భావం. నేర్పొక్కటే ఉంటే ప్రయోగాలు తమాషాలు చేస్తాయి కానీ, ప్రయోజనాలు మాత్రం సశేషాలౌతాయి.

పద్యాన్నో, కవితనో, లేదా ఒక సంభాషణనో వ్రాసేప్పుడు అందులో చమత్కారాన్ని పేల్చ గలిగే నేర్పుతో పాటు కొంత సందేశమూ, ఆలోచనా లోచనమూ చొప్పించ గలిగిన ఓర్పు కవికి ఉంటే అది గొప్ప కవిత అవుతుంది లేకపోతే వికట కవితగా మిగిలిపోతుంది.

చార్లీ చాప్లిన్ సినిమాలు కేవలం నవ్వుకోసం కాదు, జీవితాన్ని సజీవంగా ప్రదర్శించటానికి పుట్టిన సంగతి మనం మరిచిపోకూడదు. ☆

# శుక్రుడి నీతి

"అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మరి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నయు వడి యెడ
దలపక యున్నతడె చూవె ధర్మజ్ఞుడిలన్"

నన్నయగారి పద్యం ఇది. ధర్మజ్ఞుడెలా ఉండాలో శుక్రాచార్యుడు చెప్తున్నాడు. శుక్రాచార్యుడు రాక్షసుల గురువు. ఆయన చెప్పిన నీతి ఇలా ఉంది: "ఎవడికైనా కోపం వచ్చినప్పుడు ప్రతిగా కోపం తెచ్చుకోకుండా ఉండే వాడు, ఎవడైనా తిడితే, విననట్టే ఉండి మారుమాట్లాడని వాడు, ఎవడు ఎంత అవమానించినా ఆ సంగతే మనసులో పెట్టుకోని వాడే ధర్మజ్ఞుడు" అని శుక్రాచార్యుడు అన్నట్టు ఈ పద్యం చెప్తుంది.

ఈ దేశంలో మేధావులు అక్షరాలా ఈ శుక్రనీతిని పాటిస్తున్నారనేది ప్రత్యక్ష ప్రమాణానికి నిలిచే సత్యం. ప్రభువులు ఇలాంటి ధర్మమూర్తులే తమ కొలువులో ఉండాలని కోరుకుంటారు. ఎదురు తిరిగేవాడిని 'ధర్మ మూర్ఖిష్టు' గా భావిస్తారు. వృషపర్వుడు రాక్షసుల రాజు. అతని కూతురు శర్మిష్ఠ. శుక్రాచార్యుడు రాక్షస గురువు. ఆయన కూతురు దేవయాని. శర్మిష్ఠ, దేవయాని ఇతర చెలికత్తెలతో కలిసి సరస్సులోకి దిగి జలకాలాడారు. బయటకు వచ్చిన తరువాత పొరబాటున దేవయాని బట్టల్ని శర్మిష్ఠ కట్టుకుంది. శర్మిష్ఠ బట్టలు దేవయాని కట్టుకోవాల్సి వచ్చింది. దాంతో దేవయానికి కోపం వచ్చింది. "మానాన్న మీ నాన్నకు గురువు. మా నాన్న చెప్పినట్టు మీనాన్న నడుచుకోవాలి. నువ్వు నాకు దణ్ణం పెట్టాల్సిన దానివి. నీ బట్టను నేను కట్టడం ఏమిటి?" అంది. మాటా మాటా పెరిగింది. ఇద్దరూ నోటికొచ్చినట్టు తిట్టుకున్నారు. దేవయానిని నూతిలోకి తోసి వెళ్ళిపోయింది శర్మిష్ఠ.

అంతలో యయాతి అనే రాజు దాహం కొద్దీ నూతి దగ్గరకు వెళ్ళటం, నూతిలో దేవయాని చెయ్యి పట్టుకుని పైకి లాగి రక్షించటం ఇది మనకు తెలిసిన కథే! రాజు కూతురు తనను అవమానించింది కాబట్టి, ఆ రాజ్యంలోకి తాను రానంటుంది దేవయాని. ఎవరెంత బ్రతిమాలినా రాదు. అప్పుడు శుక్రుడు చెప్పిన నీతి ఇది.

"అనుపమ నియమాన్వితులై/యనూన దక్షిణల గ్రతు సహస్రంబులు సేసిన వారికంటె నక్రో/ధనుడ గరంబధికు డండ్రు తత్త్వ విజ్ఞుల్" అంటాడు. ఎడతెగని

యజ్ఞాలు, దానాలు చేసే వాడికన్నా ఏమాత్రం కోపం లేనివాళ్ళే గొప్పనీ, కోపం అనే రాక్షస గుణాన్ని మార్చుకుంటే దేవతలకన్నా గొప్పవాళ్ళౌతారని శుక్రుడు కనిపెట్టాడు. అప్పటికే, మృతసంజీవని విద్యద్వారా రాక్షసులు దేవతలమీద పైచేయి సాధించారు. కాబట్టి, తన సిద్ధాంతాన్ని మొదట తన ఇంట్లోనే మొదలెట్టాడు. మనమీద అలిగిన వాళ్ళపైన మనం అలగకూడదనీ, మనల్ని తిట్టినా తన్నినా మారు మాట్లాడకూడదనీ, అందువలన అంతిమ విజయం మనదే అవుతుందనీ నీతి చెప్తాడు. దేవయాని అందుకు ఒప్పుకోదు. ప్రియము, స్నేహభావం, మన గురించిన ఆసక్తి అనేవి లేనిచోట, మనల్ని నిందించే వాళ్లతో కలిసి ఎందుకు ఉండాలని అడుగుతుంది.

గతంలో ఈ దేవయానిని ప్రేమించిన కచుడిని మృత సంజీవని విద్యతో బతికించిన సందర్భంలో శుక్రాచార్యుడు తాను మద్యపానం చేసినందువల్లే కచుడిని ఆరగించవలసి వచ్చిందనీ,కాబట్టి, తానే కాదు, బ్రాహ్మలెవరూ మద్యపానం చేయరాదనీ ఒక కట్టడి చేస్తాడు. పురోహితవర్గానికి రాచరికానికీ మధ్య స్పర్థ ఏ స్థాయిలో ఉండేదో ఈ కథ చాటుతోంది.

చివరికి దేవయాని చెప్పినట్టే శుక్రాచార్యుడు తనుకూడా రాజ్యం వదిలి కూతురితో కలిసి వెళ్ళి పోవటానికి సిద్ధం అవుతాడు. కథలో తర్వాతి పరిణామాలన్నీ అలిగిన శుక్రాచార్యుడికి అనుకూలంగా మారతాయి. ఇవన్నీ రాచరిక వ్యవస్థ కాలంనాటి అంశాలు. ప్రజాప్రభుత్వంలో అంతా దీనికి వ్యతిరేకంగా ఉండాలి. ఈ యుగంలో ప్రభుత్వ మేధావులంటే ఐయేయస్సులూ, ఉన్నతాధికారులూ, ఇతర సలహాదారులూ కాబట్టి ముఖ్యంగా వారు నన్నయ అనువదించిన శుక్రనీతిని కాకుండా, ఆకథలో శుక్రుడు చేసినట్టు చేయాలన్నమాట. మేధావులు తప్పొప్పుల గురించి మాట్లాడాలి. ప్రభువులు వారిని మాట్లాడ నివ్వాలి. అదే ప్రజాస్వామ్యం మేధావుల్ని ఆకట్టుకో గలిగిన ప్రభువు చరిత్రలో నిలిచిపోతాడు.

మేధావులు అలిగితే ప్రభుత్వం చేసేవాడు అలగకూడదు, మేధావులు తిడితే ప్రధాని లగాయితూ పంచాయితీ మెంబరు దాకా అధికారం చేలాయిస్తున్నవాళ్లంతా ఎదురు తిట్టకుండా విమర్శను స్వీకరించి తప్పు సవరించుకోవాలి!సీజర్ భార్య కూడా విమర్శకు అతీతం కాదు గదా!

రచయితలు ప్రభుత్వాన్ని విమర్శిస్తారని చాలామంది ముఖ్యమంత్రులు కోపగించుకోవటమేగాని సాహిత్యాన్ని, భాషకూ, సాహితి వేత్తలకు ఏ కొంచెం అయినా గౌరవం ఇచ్చే పని ఒక్కటైనా చేయకపోవటం వింత.

మేధావులు ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేస్తారు. మేధావుల్ని ఆకట్టుకోలేని పాలకుడు తానే దబ్బా కొట్టుకోవాల్సి వస్తుంది. ★

# సభామర్యాదలు

**చుట్టాలన్న మహాభిమాన మది యచ్ఛోమన్నచో వారికిం**
**బెట్టింపందగు భక్ష్య భోజ్యములు నీ పెంపెందునిం పొందగా**
**పట్టుంబుట్టము లిచ్చి పుచ్చదగు సంబంధపు బాంధవ్యముల్**
**రెట్టింపందుగు వంతెకాని యొరు గారిత్రయ్య సుబ్రాణ్మణీ!**

ఈ మధ్య కాలంలో సభామర్యాదలు మంటగలిసిపోతున్నాయి. చట్ట సభలే కాదు, చాలా సాహిత్య సభలు కూడా అలానే ఉంటున్నాయి. వాటిని పాటింప చేయవలసిన స్థానంలో ఉన్నవారు కూడా పట్టించుకోవటం లేదు.

సభ అనేది వేదకాలం నాటిది. ఋగ్వేదంలో గ్రామ సభ, రాష్ట్రసభ, జనసభ, ద్యూత సభల ప్రస్తావన కూడా ఉంది. జూదశాలని కూడా “సభ” అనే అంటారు. ఈ జూదసభకి అధ్యక్షుణ్ణి సభికుడు అంటారు. అందుకని మనం సాహిత్య సభలో ‘సభికులారా’ అనటం సభామర్యాద కాదు. సదస్యులారా అని గానీ, ‘సభాసదులారా’ అని గానీ అనటం మంచిది.

టీవీల్లో లైవులో చూస్తున్నప్పుడు చాలా సందర్భాలలో మన చట్ట సభలు ద్యూత సభల్లా వ్యవహరించటాన్ని మనం చూస్తూనే ఉన్నాం, మిగతా సభల సంగతులు ఎలా ఉన్నా ఆంధ్రప్రదేశ్‌ని విభవింజిన రోజున జరిగిన పార్లమెంటుసభ మాత్రం ద్యూతసభని మించి నడిచింది. పార్టీల కతీతంగా సభ్యులు చాలామంది ‘సభికు’లై ప్రవర్తించటం లోకం అంతా చూసి ఆ రోజున ముక్కున వేలేసుకున్నారు. ఇలాంటి మాయని మచ్చలు చాలా ఉన్నాయి. సభలో సభ్యుడి ప్రవర్తన మర్యాద పూర్వకం గానూ, తార్కికంగానూ, పదుగురు మెచ్చే తీరులోనూ లేనప్పుడు అతను సదస్యుడు కాదు, సభికుడే అవుతాడు. సభా నాయకుడి కన్నా, సభే గొప్పది. చట్టసభ అనేది ప్రజలందరికీ వర్తించేదిగా ఉంటుంది. సభామర్యాదకు భంగం కలిగితే అది ప్రజలను అవమానించటమే అవుతుంది. సాహిత్య సభ అయినా అంతే!

సభ నడిచే తీరుని బట్టే పాలనా నిర్ణయాలు కూడా ఉంటాయి. అందరూ కలిసి ఏకత్రాటిన సంక్షేమం నిర్ణయాలు తీసుకోగలిగితే అది ఋగ్వేదం చెప్పిన ‘రాష్ట్రసభ’ అవుతుంది. ఒక త్రాటికి రాలేక తలా ఒక వేపు గుంజుతూ, “రాగుంజుపోగుంజులాట” (tug of war) ఆడితే అది చట్టసభ కాకుండా ద్యూతసభ అవుతుంది. ప్రజలు టీవీలో కోడి పందాలాటని చూసినట్టు చట్ట సభల్ని చూస్తున్నారని

పాలక ప్రతిపక్షాలు అర్థం చేసుకోవటం లేదు. సభా మర్యాదలను పాటించటమే ప్రజలకు నిజమైన జవాబుదారి అవుతుంది.

'తన వాళ్లకే అన్నీ" అన్నట్టు పాలించే పాలకులకు తగిలేలా ఉంటుందీ పద్యం. ఒక పెద్ద మనిషి సభలో తన కులం వాళ్ళకి మాత్రమే గౌరవం ఇచ్చి ఊరుకున్న సదర్భంలో , సభామర్యాదని గుర్తు చేస్తూ తిరుపతి వెంకట కవులు చెప్పిన పద్యం ఇది. నిజానికి, కుల, వర్గతత్వంతో పాలించే పార్టీలకూ ఈ మాటలు తగులుతాయి. అందుకే సభామర్యాద, పాలనామర్యాదలు రెండూ ఒకదాన్ని ఒకటి ప్రతిఫలిస్తాయని ఈ పద్యం చదివితే అర్థం అవుతుంది.

తిరుపతి కవులకు, కొప్పరపు కవులకు మధ్య శాఖాపరమైన భేదాలు ఏర్పడి అవి అనేక స్పర్థలకు దారి తీశాయి. వారి శాఖకు చెందిన పండితులూ వీరి శాఖకు చెందిన పండితులూ రెండు వర్గాలుగా మోహరించి అనేక సార్లు సభా మర్యాదల్ని అతిక్రమించిన సందర్భాలు ఉన్నాయి. అదొక దుష్ట సాంప్రదాయం నెలకొన్న కాలం. సుబ్బారాయుడనే ఒకపెద్ద మనిషి కొప్పరపు వారి శాఖకు చెందిన వాడు. ఆయన ఆ సభలో కొప్పరపు వారిని మాత్రమే సన్మానించి ఊరుకున్నాడు. అప్పుడు తిరుపతి కవులు ఘాటుగా స్పందించి, "సుబ్బారాయుడా! వీళ్ళు నీకు చుట్టాలైతే నీ యింటికి తీసుకుపోయి పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనం పెట్టు. నీ రీవికి తగ్గట్టు పట్టుబట్టలు పెట్టు. కావాలంటే సంబంధం కలుపుకో... కానీ, ఇది సాహిత్యసభ... ఇంట్లో అతిథి మర్యాద లాగే, ఇక్కడ సభా మర్యాద ఉంటుంది. దాన్ని నువ్వు పాటించాలి. నీ కులం కాని వాళ్ళని ఇలా అవమానించటం సరికాదని మందలించటం ఈ పద్యంలో కనిపిస్తుంది.

సభామర్యాద అనేది చట్ట సభలకూ వర్తిస్తుంది. అది పాలనా మర్యాదకు గుర్తు. పాలనలో తన, పర భేదభావాలు చూపించటం ఈ సుబ్బారాయుడు చేసిన తప్పులాంటిదే అవుతుందన్న మాట!

కుల మర్యాద, కుల సంక్షేమం, కులరుణాలు, కులరుణమాఫీ, కులాలవారి పదవులు...ఇలా'కులకలం' మనల్ని పాలిస్తోంది. తక్కిన కులాల వాళ్ళు 'తమ సంగతి ఏమిటని కావాలని కులం గురించి ఆలోచించే పరిస్థితి తెస్తోంది ! ☆

# సింహంగారి భార్య

**"అగ్నిని నూరేండ్లు అర్చన సల్పియును**
**అర్చకుండీల్గడే యందు దాబడిన"**

"వందేళ్ళపాటు అగ్నిని అర్చించినంత మాత్రాన అర్చకుడు పొరబాటున ఆ అగ్నిలో పడితే మాడి, మసి కాకుండా ఉంటాడా?" అనేది ప్రశ్న. దేని స్వభావం దానిది. కాలే గుణం అగ్నిది. అర్చించే గుణం మనిషిది. కాల్చే ముందు "అయ్యో వీడు నన్ను పూజిస్తున్నాడుగా...అనే తర్క మీమాంసలు అగ్నికి ఉండవు. మనిషీ అంతే! పొరబాటున పట్టుకుంటే కాలకుండా ఉంటుందని అగ్నిని అర్చించటం లేదు. స్వభావం తెలుసుకుని మసలు కోవటంలో యుక్తి ఉంది. అది అగ్నికి లేదు. మనిషికి ఉంది. మనిషి ఆ యుక్తిని ఎంత మేర ఉపయోగించ గలుగుతున్నాడో సందేహమే!

"సింహానికి బానిసలా సేవ చేయటాన్ని దేనికి కోరుకున్నావు..." అని సివంగిని అడిగితే అది గొప్ప లోక సత్యాన్ని చెప్తుంది. సింహం వేటాడి తెచ్చిన మాంసాన్ని నేను తింటున్నాను. కష్టపడి వేటాడాల్సిన అవసరం నాకు లేదు. సింహం శౌర్యప్రతాపాల ఆశ్రయంలో ఉంటున్నాను. అదే నాకు, నా పిల్లలకూ రక్ష...." అంటుంది. "అంత విశ్వాస పాత్రంగా సింహానికి సేవ చేస్తున్నావు గానీ, దానికి దగ్గరగా తిరక్కుండా దూరం దూరంగా ఉంటావేమిటీ?" అనడిగితే సివంగి ఈ ద్విపద చెప్తుంది... "అగ్నిని నూరేండ్లు అర్చన సల్పియును/అర్చకుండీల్గడే యందు దాబడిన" అని! ఎంత మొగుడైనా, వాడికి ఎంత సేవ చేసినా వాడి కోపాగ్నికి అబల బలికాక తప్పదు. లోకంలో మగాళ్ళంతా ఇంట్లో సింహాలై గర్జిస్తారు. అందుకే ఇల్లాళ్ళు ఈ సివంగిలా తమ జాగ్రత్తలో తాము అంటీ ముట్టనట్టు ఉంటారంటుంది. ఇది సివంగి నీతి.

ఈ ద్విపద సాదీ దేశానికి చెందిన ఒక మహాకవి వ్రాసిన "గులిస్తాన్" అనే పారసీ కావ్యానికి కవికోకిల దువ్వూరి రామిరెడ్డి "గులాబీ తోట" పేరుతో చేసిన అనువాద కావ్యంలోది. వచనం, పద్యం, వ్యాఖ్యానం మిశ్రమంగా ఈ కావ్యం సాగుతుంది. కొండంత లోక వ్యవహారాల్ని చిన్నచిన్న సాదృశాలతో వివరించిన ప్రయత్నం ఇది.

"ఇంతటి ప్రాజ్ఞత ఎవరి దగ్గర నేర్చుకున్నావని లక్మాను అనే జ్ఞానిని నడిగితే, "గుడ్డివాణ్ణి చూసి! ఎందుకంటే అంధుడు నేల తడువుకోకుండా కాలు పెట్టడు కాబట్టి" అని సమాధానం చెప్తాడు. ఇలాంటి అపూర్వ సాదృశాలు, కవితలు, కథలు,

పూర్వ కాలపు సాదీ రాజుల స్వభావాలు అన్నింటినీ గుదిగుచ్చిన గులాబీల మాల ఈ "గులాబీ తోట"పుస్తకం. ఇందులో ప్రతి అంశం చాలా ఉత్సాహకరంగానూ, నేటి సమాజానికి అన్వయించేదిగానూ ఉంటుంది. మచ్చుకు కొన్ని చూద్దాం.

ఒక రాజుగారు అన్యాయంగా శిక్ష వేశాదని ఓ విదేశీ ఖైదీ తనభాషలో రాజుని తిట్టటం మొదలెట్టాడు. వాడి మాటలకు అర్థం ఏమిటని రాజు అడిగాడు. మంత్రుల్లో ఒకడు లేచి "ప్రభూ! దీనుల్ని కనికరించే వాణ్ణి దేవుడు కరుణిస్తాడని అంటున్నాడు" అని చెప్పాడు. ఈ మంత్రికి విరోధి అయిన మరో మంత్రి లేచి, అదంతా అబద్ధం అంటూ, ఆ ఖైదీ ప్రభువుని ఏమేం తిట్టాడో అవన్నీ బిగ్గరగా చెప్పేశాడు. అప్పుడు రాజు అంటాడు... "ఆ మంత్రి చెప్పిన అబద్ధమే నువ్వు చెప్పిన నిజం కన్నా నన్ను ఎక్కువ సంతోష పెట్టింది. ఆ అబద్ధం మంచి ఉద్దేశంతో. నీ నిజం అతని మీద అసూయతో..." అని!.

"ఓ అమాయకుడికి అందమైన అమ్మాయినిచ్చి రహస్య మందిరంలో సమస్త సౌకర్యాలూ కల్పించి తలుపులు వేసి ఏకాంతం కలిగించారనుకుందాం. పళ్ళు పుష్కలంగా కాసిన తోటకు కాపలాదారుడు లేనట్టు అంతా అనుకూలంగా ఉన్న ఆ పరిస్థితుల్లో అతను తన బుద్ధి బలంతో చిత్త చాంచల్యానికి లోను కాకుండా తనను తాను రక్షించుకోగలడా?" అని అడుగుతాడు రాజు. దానికి ఓ పండితుడి జవాబు: "ఒకవేళ అతను కామోద్రేకం నుండి తప్పించుకున్నా పరనిందా పరాయణుల నుండి తనను తాను కాపాడుకోలేడుకదా! సాధ్యమౌ దనమతి శాసించి నిలుప/ నయిన లోకుల నాల్కల నరికట్టదరమే" అంటాడు.

ఓ ఆసామికి అంద వికారమైన కూతురుంది. ఎన్ని సంబంధాలు చూసినా కుదరక పోయే సరికి ఓ అంధుడికిచ్చి పెళ్ళి చేశాడు. పెళ్ళయ్యాక ఆ ఊరికి గుడ్డివాళ్లకు కళ్ళు తెప్పించే ఓ వైద్యుడు వచ్చాడు. "మీ అల్లుణ్ణి కూడా ఆ వైద్యుడికి చూపించ వచ్చు కదా!" అనడుగుతారు. ఆసామి పెద్ద మీమాంసలో పడ్డాడు... అల్లుడికి కళ్ళొస్తే, తన కూతురి అందవికారాన్ని చూసి ఇబ్బంది పెడ్తాడేమో..." అని.

గులాబీ తోట కావ్యం పారసీ మూలం (గులిస్తాన్) వెయ్యేళ్ళ నాటిదైనా, దానిలో భావాలు నేటికీ వర్తించేవిగానే ఉన్నాయి. అమీబా నుండి ఆర్మ్‌స్ట్రాంగ్ దాకా సాగిన ఈ సృష్టి పరిణామ క్రమంలో అభివృద్ధి ఎంతో కనిపించవచ్చు. కానీ మౌలికమైన స్వభావాల్లో ఏ మాత్రం మార్పులేదనేది సత్యం. వానరుడు నరుడైనా కోతి లక్షణాలు కోతివే! నరుడు మానవుడౌటమే దుష్కరం.

తేట తెలుగులో సాగిన దువ్వూరి రామిరెడ్డిగారి గులాబితోట కావ్యం పునర్ముద్రణ పొందటం అవసరం. ★

# 'సీను' పండాలి

**"ఈతడజాత శత్రుడు, మహిం దగ దిగ్విజయంబు చేసె, వి**
**ద్యాతిశయార్థి, వాసవు మహాసన మైనను నెక్కనరు, దు**
**ద్యోదిత మూర్తి, కౌరవ కులోద్వహు దార్య నికాయ సంతత**
**ఖ్యాత చరిత్రు, డీ చిఋత గద్దియకుం దగడే?, నరేశ్వరా!"**

తిక్కనగారి ఈ పద్యానికి టీకా తాత్పర్యాలు అవసరం లేదు. "ఇతనికి శత్రువులు ఇంతవరకూ పుట్టలేదన్నంతగా అందరినీ మిత్రభావంతో చూస్తాడు. పెద్ద భూభాగాన్ని గెలిచాడు. బాగా చదువుకున్నాడు. ఇంద్రుడి సింహాసనాన్నైనా ఎక్కగల అర్హతలున్నవాడు. కౌరవ రాజవంశంలో పుట్టాడు. ఎంతో గొప్పవాళ్లు ఈయన్ని పొగుడుతూంటారు. అంతటి పెద్దాయన నీ ఈ చిన్న సింహాసనాన్ని ఎక్కి కూర్చోవటానికి తగడా?" అనడగటం ఇక్కడ కనిపించే ఒక చిన్న సంఘటన.

ఇలాంటి అర్హతలున్న వాడు ధర్మరాజు కాబట్టి, ఇది ఆయన్ని ఉద్దేశించిన పద్యమేనని అర్థం అయిపోతోంది. కానీ, ఇక్కడే అసలు డ్రామా మొదలమైంది. తేలికైన తెలుగు పదాలతో పద్యాన్ని వ్రాయటమే కాకుండా అందులో నాటకీయతని తేవటం తిక్కన గారి ప్రత్యేకత. శ్రీమదాంధ్ర మహాభారతం విరాట పర్వం, ఐదవ ఆశ్వాసంలో పద్యం ఇది. విరాటపర్వంలోది కాబట్టి అజ్ఞాతవాసం చేసిన సందర్భం అనీ, ఇదంతా విరటుడి కొలువులో వ్యవహారం అనికూడా అర్థం అవుతోంది.

నాటకీయతని ఇక్కడే సాధించాడు తిక్కన. అజ్ఞాతవాసం పూర్తయ్యింది. ఉత్తర కుమార ప్రగల్భాల దృశ్యం కూడా అయిపోయింది. అర్జునుడు బయట పడ్డాడు. తిథి వార నక్షత్రాల ఆధారంగా అప్పటికే గడువు తీరిందని భీష్మ ద్రోణాదులు చెప్పటంతో ఉత్తర గోగ్రహణ ప్రహసనం ముగిసింది. ఇంక మిగతా పాండవులు ఒక్కరొక్కరే బయట పడాలి. ఈ బయట పడే క్రమంలో అందరికీ కాకపోయినా ధర్మరాజుకైనా కొంత డ్రామా పెట్టక పోతే సీను పండదనిపించింది తిక్కనగారికి. అందుకోసం ఈ దృశ్యాన్ని ఉపయోగించుకున్నాడు.

అది, విరటుడి సభ. ఆయన ఇంకా సభకు రాలేదు. వచ్చే సమయం కానుండటంతో సభాసదులంతా ఒక్కరొక్కరే వచ్చి ఎక్కడ చోటు దొరికితే అక్కడ కూర్చుంటున్నారు. పాండవులు కూడ అంతకు మునుపటి వంటలవాడి వేషం, గుర్రాలు కాచేవాడి వేషం ఇలాంటివన్నీ వదిలేసి, రాజకుమారుల్లాగా మంచి బట్టలు కట్టుకుని సభకి వచ్చారు. అప్పటికే అర్జునుడు ఉత్తరుణ్ణి చెట్టెక్కించి తమ ఆయుధాలకట్టని జమ్మి చెట్టు మీంచి దింపించి రథంలో వేసుకుని తెచ్చాడు కాబట్టి, ఎవరి ఆయుధాలు వాళ్ళు చేతుల్తో పుచ్చుకొని ఖాళీగా ఉన్న సీట్లలో కూర్చున్నారు.

పాపం ధర్మరాజుకి, అంటే రాజుగారి ఆటనేస్తుడైన కంకుభట్టుకి ఎక్కడా కూర్చునే చోటు దొరక్క తిన్నగా వెళ్ళి రాజుగారి సింహాసనం మీద కూర్చున్నాడు. ఈ కంకుభట్టుకి మతి పోయిందా... అని అందరూ విస్తుపోయారు.

అంతలో రాజుగారు సభలోకి వచ్చేశారు. వందిమాగధుల స్తుతి స్తోత్రాలన్నీ జరిగిపోతున్నాయి. దూరం నుంచే తన సింహాసనం మీద ఎవరో ఆగంతకుడు కూర్చున్న సంగతి రాజుగారు గమనించి ఉండకపోవచ్చు. తన సింహాసనానికి ఢోకా లేదనే ధైర్యం కూడా కావచ్చు. మిగతా భద్రతా సిబ్బంది చూసికూడా ఎందుకు మౌనం వహించారో తెలీదు. బహుశా రాజుగారు లోపలికి రావటం, కంకుభట్టు సింహాసనం ఎక్కటం ఒకేసారి జరిగి ఉండవచ్చు.

రాజుగారు సింహాసనం దాకా వచ్చేశారు. సభాసదులు అందరూ లేచి నిల్చుని కరతాళ ధ్వనులతో రాజుగారికి స్వాగతం పలుకుతున్నారు. కానీ కంకుభట్టు లేచి నిల్చోలేదు. విస్తుపోయాడు విరటుడు. తను వచ్చాక లేచి నుంచుని చప్పట్లు కొట్టని వాడు, ఏకంగా తన సింహాసనమే ఎక్కి కూచున్నవాడు, రాజవందనాలు చేయకుండా తనముందే కూచుని తననే చిరునవ్వుతో పలకరిస్తున్నవాడు, ఎవరితనూ...? తేరిపార చూశాడు. ఇంకెవరూ కంకుభట్టు...!

ఏయ్! కంకుభట్టూ! నీకేమైనా మతి పోయిందా, ఆ కిరీటం ఏవిటీ...?. నీ చేతిలో ఆయుధాలేమిటీ...? ఈ రాజు వేషం ఏవిటీ...? పైగా వచ్చి నా సింహాసనం ఎక్కావేమిటీ...? అనడిగాడు. అంతకు మించి ఓవర్ యాక్షన్ చేయలేదు. అదీ తిక్కన నాటకీయతలోని సంస్కారం.

బృహన్నల అప్పటికే అర్జునుడని బయటకు తెలిసిపోయింది కాబట్టి, అర్జునుడులేచి, చిన్నగా నవ్వి ఈ పద్యాన్నిచెప్పాడు. ఇలాంటి రహస్యాల్ని, ముఖ్యమైన విషయాల్నీ చెప్పవలసి వచ్చినప్పుడు ఏ వార్తాహరుడి చేతనో చెప్పించినా కథా గమనానికి వచ్చిన ఇబ్బందేమీ ఉండదు. కానీ, తిక్కన కథ చెప్పటానికి పరిమితం కాలేదు. కథను అందమైన పూలసజ్జలాగా అల్లి అందులో సుగంధభరితమైన పూలు పెట్టి పాఠకులకు అందించా లనుకున్నాడు, అదీ ఒకే ఒక పద్యంలో! ఇది మరొకరు రాస్తే హాస్య సన్నివేశం అయిపోతుంది. అందువలన కథనంలోని ఔచిత్యం, ఔన్నత్యం దెబ్బతిని ఉండేవి.

పురాణ ప్రవచనాలకన్నా హరికథలు ఎక్కువ మందిని ఆకట్టుకుంటాయి. హరికథల్లో డ్రామా బాగా పండుతుంది. బుర్రకథ ఇంకా ఎక్కువ ఉత్తేజితం చేస్తుంది. తెలుగింట ఈ ప్రక్రియలు ఎక్కువ ఆదరణ పొందటానికి తెలుగువారి నాటకీయ ప్రియత్వమే కారణం. కథా నవలా రచయితలందరికి ఇది తిక్కనగారి గొప్ప సందేశం వ్రాశామంటే, ఆ "సీను" పండాలి ! 

# సీమస్వరాలు

"హరుడెక్కి తిరుగాడునట్టి యాబోతు నీసేద్యంబునకు ముఖ్య జంతువయ్యె
బలభద్రమూపున బరగు నాగేలు నీ వ్యవసాయంబునకు ముఖ్యంబు గాదె
వైదేహి నవనికి వెలువరించిన కఱ్ఱు తగనీకు ముఖ్య సాధనము గాదె
కాలుండు జీవులగట్టెడి పాశంబు నరయ నీకొక పరికరంబు గాదె
నలఘు దివ్యోపయోగమైనట్టి జంతు
పరికరంబులు నొగి వాడబడుటవలన
నీవు దివ్య సముండవై నెగడినావు
హాలికా! నీకు సాటిలేరవనియందు"

కొన్ని వస్తువులకు వాటిని వాడేవారి వలన పేరు వస్తుంది. లడ్డూ అంటే తిరుపతి వెంకన్న, ఉండ్రాళ్ళంటే వినాయకుడు గుర్తొచ్చినట్టే, గద అనగానే భీముడు, వీరఖడ్గం అనగానే టిప్పుసుల్తాన్ వగైరా యాదికొస్తారు. కొందరికి కొన్ని అలా హక్కుభుక్తా లౌతాయి. కందపద్యాన్ని యోగి వేమన స్వంతం చేసుకోవటం లాంటిదే ఇది. పంచె కొంగుని లాల్చీ జేబులో దూర్చి, చేతిలో చుట్ట పీకతో గుప్పున పొగవదుల్తూ విలాసంగా నిలబడే భంగిమ ఒక్క గిరీశానికే దక్కుతుంది. ఎవరి శైలి (స్టైయిల్) వాళ్లది.

ఎ.వి సుబ్బారెడ్డిగారు తొలితరం రాయలసీమ జాతీయోద్యమ కవుల్లో ముఖ్యుడు. ఈ పద్యంలో ఆయన వివిధ ప్రతీకల్ని రైతు సేద్యం కోసం ఉపయోగించటాన్ని ప్రస్తావించటం ద్వారా, రైతే అధికుడని చాటుతాడు. "శివుడెక్కి తిరిగే ఎద్దు పొలం దున్నటానికి నీకు ముఖ్య జంతువయ్యింది, బలరాముడు భుజాన మోసే నాగలి నీ వ్యవసాయానికి మూలం అయ్యింది. సీత అంటే నాగేటి చాలు. నాగలి కఱ్ఱు నేలను దున్నేప్పుడు ఏర్పడే 'చాలు' (సీత) లో దొరికింది కాబట్టి ఆమెను సీత అన్నారు. సీతను ఈ అవనికి తెచ్చిన ఈ 'కఱ్ఱు' (లోహంతో చేసిన నాగలి కొన) వ్యవసాయానికి ప్రధానం కదా! ఆఖరికి యముడి చేతిలో ఉండే పాశం కూడా నీకు 'పగ్గం'లాగా ఉపయోగపడ్తుంది. ఇలా దివ్యోపయోగమైన పరికరాలన్నింటినీ వాడి నువ్వుకూడా దివ్య సముడివయ్యావు, రైతన్నా! నీకెవరు సాటి..." అని కీర్తిస్తున్నాడీ పద్యంలో కవి.

జోడెడ్లూ, నాగలి, దాన్ని పట్టిన రైతు బొమ్మ వ్యవసాయానికి ఆవూ-దూడ పాడి పరిశ్రమకు దివ్యప్రతీకలు.వాటిని ఎన్నికల గుర్తుగా చేశాక అవి ప్రాధాన్యత

కోల్పోయాయి. శ్రీరంగనాథుడి అభయహస్తాన్ని ఒక రాజకీయ పార్టీకి ఎన్నికల గుర్తుగా కేటాయించాక ఏమయ్యిందో చూశాం గదా! దివ్యమైన వాటిని దివ్యసములు వాడినప్పుడే వాటికి ప్రాధాన్యత, పవిత్రత, ప్రాచుర్యం కలుగుతాయి. నాగలి, నాగలి కర్రు, ఎడ్లపగ్గాల్లాంటి వ్యవసాయ పరికరాలను తమ సింబల్స్'గా వాడుకున్న దివ్యులు వాటికి ప్రతిష్టనే తెచ్చిపెట్టారు. గ్రామీణ వ్యవస్థలో పెద్ద కొడుకు నాగలి పట్టుకుని పొలానికి పోయి పొలం పనులు చూస్తాడు. అందుకే, బలరాముడు హలధారుడు కాగా, చిన్నకొడుకు పశువుల్ని మేపుకొస్తాడు కాబట్టి, కృష్ణుడు గోపాలుడయ్యాడు. కూతురు పాలు పితుకుతుంది. అందుకని, ఆమెను దుహిత అన్నారు. హలం అంటే నాగలి. నాగలితో భూమిని దున్నటాన్ని హల్యం అంటారు. ద్విహల్యం, త్రిహల్యం అంటే రెండుసార్లు, మూడుసార్లు దున్నిన భూమి అని! అహల్యం అంటే రాళ్ళూ రప్పలు, తుప్పలతో నిండిన 'అసలు దున్నని నేల'. రాముడు వచ్చి వ్యవసాయాన్ని ప్రారంభిస్తే, అహల్యగా ఉన్న రాతినేల హల్యం అయ్యింది. రాతిని నాతిని చేసిన కథలో ఇలా వ్యవసాయ మూలాలు కనిపిస్తాయి.

ఏ ప్రభువు వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తాడో అతను రాముడు. ఏ ప్రభుత రైతుకు చేదోడై నిలుస్తుందో అది రామరాజ్యం, ఏ వ్యవస్థ పంట భూములను పవిత్రంగా కాపాడుకొంటుందో అది రామాయణం. వ్యవసాయాన్ని దండగమారిగా చేసి సంక్రాంతి జరుపుకునే హక్కు మనకెక్కడుంటుందీ...?

ఎ. వి సుబ్బారెడ్డి గారు "హాలికుడు" మకుటంతో వ్రాసిన ఖండకృతిలోది పైన పేర్కొన్నఈ పద్యం. 1934 సెప్టెంబరు 8 సంచికలో 'శ్రీ సాధన పత్రిక'లో దీన్ని ప్రచురించారు. 'సీమ సాహితీ స్వరం-శ్రీ సాధన' పేరుతో 'సాధన' సంచికల్లోని విశేషాలను డా అప్పిరెడ్డి హరినాథరెడ్డి ఒక పుస్తకంగా వెలువరించారు. సీమసాహితీ స్వరాలను స్వంత డబ్బు ఖర్చుపెట్టి ఇలా వెలుగులోకి తేవటానికి సిద్ధపడిన యువమిత్రుడు హరినాథరెడ్డికి జేజేలు. ఈ తరం యువతీ యువకుల్లో ఇలాంటి నిబద్ధత అరుదు.

జాతీయోద్యమం కోసం రాయలసీమ ప్రాంతంలో 'శ్రీ సాధన' పత్రిక ద్వారా పప్పూరు రామాచార్యులు గారు, కోస్తాజిల్లాల్లో 'కృష్ణాపత్రిక' ద్వారా ముట్నూరు కృష్ణారావుగారూ ఉద్యమం కోసం చేసిన కృషి అనన్య సామాన్యం. ఆ మహానుభావులు నిలిపిన సాహిత్య సంపదకు మనం వారసులం. ☆

# స్వచ్ఛ గీరతం

**చీపురు నొక్కచేత, ఒక చేతను చింపిరి గంపబూని, యీ**
**పాపపు గుప్పలూడ్చెదవు బాలిక! చీదరలేదె సుంత! నీ**
**యోపిక చూచి మెచ్చి తలయూచు జగత్పిత కన్నుగొల్కులన్**
**తేపకు తేపకు బయలుదేఱునవే నులి వెచ్చ బాష్పముల్!**

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి 'పాకీపిల్ల' ఖండిక లోదీ పద్యభాగం. రోడ్లు ఊడ్చటం కోసమే కాదు, అంతకన్నా అమానుషమైన కార్యాల కోసం సమాజం వారిని వినియోగిస్తోంటే చూసి గుండె తరుక్కు పోయి వ్రాసిన పద్యం ఇది.

ఒకచేత్తో చీపిరి పుచ్చుకుని, ఇంకో చేత్తో చింపిరి గంపబుట్ట పుచ్చుకుని, ఈ పాపపు కుప్పల్ని ఊడుస్తున్నావు కదా పాపా! నీకు చీదర అనిపించట్లేదా! నీ ఓర్పుని చూసి ఆ జగత్పిత కనుకొలకల్లోంచి వెచ్చని కన్నీళ్ళు జాలువార్తున్నాయి.

ముప్పయ్యేళ్ళ క్రితం వరకూ పెద్ద పంచాయితీ స్థాయి నగరాల్లోనూ, డ్రైనేజీ వ్యవస్థలేని చిన్న పట్టణాల్లోనూ ఇలాంటి ఏహ్య సన్నివేశాలు బాగా కనిపించేవి. ఆ రోజుల్లో ప్రతి ఇంటి పెరట్లోనూ ఇసుక పోసిన టాయిలెట్లు ఉండేవి. దొడ్డి దారిన ప్రహరీలో ఒక మనిషి వంగుని దూరేంత చిన్న గేటు ఉండేది. ఆ గేటులోంచి పాకీమనిషి బుట్ట పుచ్చుకుని పాకీ దొడ్లో ఉన్న మలాన్ని ఎత్తి తీసుకు వెళ్ళేది.

ఇప్పటికీ మహా నగరాల్లో కూడా డ్రైనేజీ పూడి పోతే, మ్యాన్'హోల్లో ముక్కు నోరూ మూసుకుని మునిగి రిపేర్లు చేసే వారిని చూస్తున్నాం. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం ఇంతగా పెరిగిన ఈ రాకెట్టు యుగంలో కూడా ఇంకా మ్యాన్ హోల్సులో దిగే మనుషులున్నారంటే జాతి మొత్తం సిగ్గు పడాల్సిందే!

"ఆకల్పాంతము నీ పవిత్ర దినచర్యల్ నిత్య నిర్నిద్రవి/ శ్వైక ప్రేమ మహాగమమ్మునకు తూచా పోని వ్యాఖ్యానముల్/ పాకీ దానిగ నాడిపోసుకును ఈ పాపిష్టిలోకమ్ము నీ/ బాకీ తీర్చుకొనంగలేదు జగదంబా! జన్మ జన్మాలకున్/ ఒక్క రోజీవు వీధుల నూడ్వకన్న/ తేలిపోవును మా పట్టణాల సొగసు/బయటపడునమ్మ బాబుల బ్రతుకులెల్ల/ ఒక క్షణమ్మీవు గంప క్రిందకును దింప/ ఉక్కు పాదాలతో నిన్ను ద్రొక్కు దున్న/ పోతు సంఘమ్ముపై సానుభూతి చాలు/ కడుపు గడవంగ చాల మార్గములు గలవు/ బైటపడుమమ్మ! ఈ మూగ బ్రతుకునుండి...."

కరుణ శ్రీ గారు ఈ పనిని పవిత్ర దినచర్య అంటాడు. ఊరును శుభ్రం చేసే పిల్లని పాకీదాన్నిగా ఆడిపోసుకునే ఈ పాపిష్టి లోకం జన్మ జన్మాలకు ఆమె బాకీ తీర్చు కోలేదంటాడు. ఒక్కరోజు వీధులు ఊడవకపోతే ఈ పట్టణాల సొగసు తేలిపోతుందనీ, ఈ బాబుల బతుకు బయట పడుతుందనీ అంటాడు.

వేలు జీతాలు, గీతాలు తీసుకునే ఉద్యోగులు సమ్మె చేస్తే పెన్ డౌన్ అంటారు. కరుణశ్రీ గారు "ఒక క్షణమ్మీవు గంప క్రిందకును దింప-గంప డౌన్ చేస్తే-ఆ సమ్మెని విఫలం చేయటానికి ఉక్కు పాదాలతో తొక్కే దున్నపోతు సంఘం మీద సానుభూతి చూపించవద్దంటాడు. కడుపు నింపుకోవటానికి చాలా మార్గాలున్నాయి, ఈ మూగ బతుకు నుండి బయట పడమని ఈ వృత్తిలోని వారిని కోర్తున్నాడు కవి. చిన్నప్పుడు అమ్మ చేసిన పనినే కదా ఇప్పుడీ పారిశుధ్య వృత్తిలోని వారు చేస్తున్నారంటూ, "పాకీదే గద మాకు మా జనని బాల్యమ్మందు సంజీవని" అంటాడాయన.

స్వచ్ఛభారత్ నినాదంలో మనుషులచేత ఈ అమానుషాన్ని చేయించే పనికి ప్రత్యామ్నాయాన్ని వెదికే ఆలోచన ఏదీ ప్రభుత్వాలకు ఉన్నట్టు లేదు. తక్కువ కూలీకి ఎక్కువ పారిశుధ్య సిబ్బందిని నియమించటం ఒక గొప్పగా భావిస్తున్నారు.

ఊరును అలంకరించటం మాత్రమే స్వచ్ఛ బారత్ అనుకోవటం సబబేనా? కడుపు గడవంగ చాల మార్గములు గలవు/ బైటపడుమమ్మ! ఈ మూగ బ్రతుకు నుండి...." అనే కరుణశ్రీ గారి వాక్యాలకు అనుగుణంగా పారిశుధ్య పనివారికి ఎలాంటి అపకారం జరగకుండా, ఈ కార్యక్రమాన్ని ఆధునీకరించే పథకాలను చేపట్టవలసిన అవసరం ఉంది.

అన్నింటికీ ఆమెరికాని ఆదర్శంగా తీసుకునే మన పాలకులు అక్కడ డ్రైనేజీలోకి దిగే ఉద్యోగాలు, రోడ్లు ఊడ్చే ఉద్యోగాలు, పాకీదొడ్లను తుడిచి, మలాన్ని బుట్టలో కెత్తుకొని తీసుకుపోయే ఉద్యోగాలు ఉన్నాయో లేదో తెలుసుకోవటం అవసరం.

స్వచ్ఛమనసు, స్వచ్ఛ ఆలోచనలు, స్వచ్ఛ జీవనం, స్వచ్ఛ ఆహారం, స్వచ్ఛకుటుంబం ఇవన్నీ సమకూరినప్పుడే స్వచ్ఛపాలనా వైభవం కలిగిన స్వచ్ఛ భారత నిర్మాణం సాధ్యం అవుతుంది. మనసులో కుళ్ళును కుప్పలుగా పేర్చుకుంటూ రోడ్ల మీద చెత్తను ఊడ్చి ఏం ప్రయోజనం...?

అది స్వచ్ఛ గీరతం కాకుండా చూసుకోవటం కూడా అవసరమే!

# స్వచ్ఛ తెలుగు

**అచ్చతెనుంగు పద్దెమొకటైనను గబ్బములోన నుండినన్**
**హెచ్చని యాడుచుందు రదియెన్నుచు, నేర్పున బొత్తమెల్ల ని**
**ట్లచ్చతెనుంగున్నన్నుదువ నందుల చంద మెఱుంగువారునిన్**
**మెచ్చరొ, యబ్బురంబనరొ, మేలనరొ, కొనియాడరోనినున్**

ఇది ఐదొందల యేళ్ళనాటి పొన్నెగంటి తెలగన్న కవి అచ్చతెలుగులో యయాతి చరిత్ర కావ్యం వ్రాయాలని సంకల్పం చెప్పుకుంటూ, సంస్కృత పదం ఒక్కటి కూడా వాడకుండా పద్యం చెప్పాలనుకున్నాడు.

"కావ్యం (కబ్బం)మొత్తం వెదికితే అచ్చతెలుగుపద్యం (పద్దెం) ఒక్కటి కనిపిస్తే చాలు, మెచ్చుకుంటూ అదేగొప్ప (హెచ్చు) అంటారు. కవి పండితులకు సంస్కృతభాష మీద పట్టు సహజంగా ఉంటుంది. కాబట్టి, సంస్కృతం మాటల్ని అవలీలగా వాడేయ గలరు. కానీ, అన్నీ అచ్చతెలుగు పదాల పద్యాలతోనే మొత్తం పద్యాలన్నీ చెప్పటానికి (నుడుప) నేర్పుకావాలి. నుడుపనేర్పుఉంటే ఆ చందం (అందం) తెలిసిన వారు మెచ్చకుండా ఉండగలరా? ఆహా!అనీ, ఇదే మంచిదని కొనియాడ కుండా ఉండగలరా?" అంటాడు ఈ పద్యంలో తెలుగన్న! ఏది అచ్చ తెనుగు? అనేది ప్రశ్న. అతిసామాన్య ప్రజల నాలుకల మీద ఆడే మాటలే అచ్చతెనుగు. ఈ మాటల్లో అనేక సంస్కృత పదాలు, ఇంగ్లీషు, పర్షియన్, ఉర్దూ, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి పదాల్ని సామాన్యులు మాట్లాడు తూనే ఉన్నారు. జనంలోకి వెళ్ళిపోయిన పదాలు విదేశీయమైనా స్వదేశీయంగా మార్చుకో లేకపోతే భాష ఎదుగుదల లేక గిడసబారిపోతుంది. అలాగని అయ్యిన్దానికీ, కాన్దానికీ సంస్కృతాంగ్ల పదాలను ఇష్టారాజ్యంగా ప్రయోగించటమూ తప్పే!

చదువుకున్నవాళ్ళు ఏదైనా మాటని తెలుగులో పలకాలంటే సంస్కృత భాషలోకే వెడతారు. తెలుగులో అనవచ్చేమో అని ఆలోచించరు. ..Two wheeler..ని ద్విచక్రవాహనం అనే గానీ రెండు చక్రాలబండి అనవచ్చనుకోరు.

ఇంగ్లీషూ, సంస్కృతమూ ఎవరికి తెలియవో వాళ్ళకి తెలుగులో పదాలు పలుకుతాయి. సామాన్యుడు డ్రెడ్జరుని "తవ్వోడ (సముద్రం అడుగున ఇసుకని తవ్వి తీసే ఓడ)" అనగలడు. ఫ్లైవోవరుని 'పైవంతెన' అనగలడు. అలా అనలేనప్పుడు ఆ ఇంగ్లీషు లేదా సంస్కృతం మాటనే ఉన్నదున్నట్టు తనభాషలో కలిపేసు కుంటాడు.

పొన్నెగంటి తెలగన్నది కూడా ఇదే దృష్టి. ఆయన దేవతల పేర్లని 'పాదం అడుగున నీళ్ళున్నవాడు' లాంటి అనువాదాలతో హింస పెట్టకుండా వాటిని తెలుగు పదాలుగానే ఈ కావ్యంలో వాడేశాడు, కావ్యం పేరే యయాతిచరిత్ర అని రెండు సంస్కృత పదాలతో ఉంటే ఇంక అచ్చతెలుగులో వ్రాసేదేవుంది? అని ఈసడించిన వాళ్ళున్నారు. కానీ, సంజ్ఞావాచకాలను అంటే, పాత్రలూ, ప్రకృతిసంపదలు, పట్టణాలు, పనిముట్లు వీటి పేర్లను తెలుగులోకి మార్చాలనే ప్రయత్నం తాను చేయనన్నాడు. తెలుగు భాషాభివృద్ధికి ఇది ముఖ్యమైన విషయమే!

మనవి కాని వాటికి పేర్లు మనభాషలో ఉండవు. కంప్యూటర్, ఇంటర్నెట్ లాంటి మాటల్ని తెలుగు చేయలేక గణకయంత్రం, అంతర్జాలం అన్నందువలన తెలుగు భాషకు ఒరిగేదేమీ ఉండదు. పైగా పూర్తి అర్థాన్ని అందించలేక పోవటాన్ని కూడా గమనించవచ్చు. పొన్నెగంటి తెలగన్న అలా తెలుగీకరించే పని తాను చేయబోనన్నాడు.

రైలు, రోడ్డు, ఫ్యాను, లాంటిమాటల్ని తెలుగు మాటలుగా తీసుకుంటే వచ్చే నష్టం లేకపోగా తెలుగు పొంగు లెత్తుతుంది. రైలెక్కు, ఫ్యానెయ్యిలాంటి సంధులు, సమాసాలు వ్యాప్తిలో ఉన్నాయి. వీటిని దుష్టసమాసాలుగా ముద్ర వేయటానికి వీల్లేదు. సామాన్యుల వాడకంలో ఉన్నమాటల్ని కనీసం వంద సంవత్సరాల కొక సారయినా దేశ్యపదాలుగా కలుపుకుంటే, భాష విచ్చుకుంటుంది. లేకపోతే వాడకం తప్పి ముదుచుకు పోతుంది. చీపురు, రోలు, రోకలి లాంటి అచ్చతెలుగు పదాలను తెలుగు నిఘంటువుల్లో చేర్చకపోవటం వలన, అన్ని తెలుగు మాటలకు ఆంగ్ల తర్జుమాలు కూర్చక పోవటం వలన విదేశీ పరిశోధకులకు తెలుగుమాటలు తెలియకుండా పోయాయి. అందువలన మనం చాలా నష్ట పోయాం.

మన మాటల పుట్టుక తెలియాలంటే ముందుగా వాటన్నింటినీ ఒకచోట చేర్చవలసి ఉంది. తమిళానికి లెక్సికాన్ (మహానిఘంటువు) గత శతాబ్ది మొదటి పావులోనే తయారయ్యింది. అందువలన పరిశోధనా రంగంలోని వారికి చాలా మేలు జరిగింది. అదే సమయంలో తెలుగు మాటలు "జరుగుబాట" వదిలి, జారుబాట పడుతుంటే మనం ఊరక చూస్తున్నాం. ✭

# హృదయంతో పాలన

'అదను దలంచి కూర్చి ప్రజ నాదరమొప్ప విభుండు కోరినన్
గదిసి పదార్థ మిత్తు రటు కానక వేగమె కొట్టి తెం దనన్
మొదటికి మోసమౌఁ బొదుగు మూలము గోసిన పాలు గల్గునే
పిదికినఁ గాక భూమిఁ బశుబృందము నెవ్వరికైన భాస్కరా."

భాస్కరశతకంలో ఈ పద్యం ప్రజలకు బాధ్యులుగా ప్రవర్తించవల్సిందిగా పాలకులకు అంటే, రాజకీయ వేత్తలకు, ప్రభుత్వాధికారులకూ హితవు చెప్తుంది.

పూర్వం రాజుల సంగతి ఇది. ఇప్పుడు రాజ్యానికి పాలకుణ్ణి ప్రధానమంత్రి లేదా, ముఖ్యమంత్రి అంటున్నాం. ఈ రాజు శబ్దం కలెక్టర్లకి, పట్టణాల కమీషనర్లు, ఛైర్మన్లు, మేయర్లకీ కూడా వర్తిస్తుంది. మన దేశంలో మాత్రం అధికారులు దేశానికి గానీ, ప్రజలకు గానీ ఏమాత్రం బాధ్యత వహించవల్సిన అవసరం లేని వారు.

వాళ్ళలో ప్రజల పట్ల దయాదాక్షిణ్యాలతో పాలించే వాళ్ళు అరుదు

జాతీయ పార్టీల ప్రభువులు అధిష్ఠానం దయ కోసం ఎదురు చూస్తారు. ప్రాంతీయ పార్టీల ప్రభువులు ఇతర పక్షాలతో పొత్తుల కోసం ఎదురు చూస్తారు. అధికారులు అధికారంలో ఉన్నవాడి మేలుకోసం కష్టపడతారు. వీళ్ళలో ప్రజల గురించి పట్టేది ఎవరికి?

పాలకుడు 'అదను తలచి' అంటే, సమయం తెలుసుకుని ప్రవర్తించాలి. కరువు రోజుల్లో పన్నులు పెంచటం గురించి ఆలోచించే వాడు పాలకుడు కాలేడు. 'నాదరమొప్ప విభుండు కోరినన్' మర్యాదతో, ప్రేమగా అడిగితే, 'గదిసి పదార్థ మిత్తురు' ప్రజలు సంతోషంగా ఇస్తారు. సినిమాల్లో చూపించినట్టు "వేగమె కొట్టి తెందనన్" బలవంతంగా లాక్కోవాలని చూస్తే, మొదటికి మోసమౌతుందని హెచ్చరిస్తాడు భర్తృహరి.

తను ధరలు పెంచగానే అమ్మో అనే వాళ్ళను దేశం బాగు పడాలని కోరుకోని దేశద్రోహులుగా చిత్రించే గడుగ్గాయిలూ పాలకుల్లో ఉంటారు. వీళ్ళు తమని తాము మేధావులం అని భావిస్తుంటారు. ఆ మధ్య రైల్వే మంత్రిగారు రైలు టిక్కెట్ల ధరలు పెంచి, అదేమని అడిగిన వాళ్ళను "రైల్వేలు బాగా ఉండాలని మీకు లేదా?" అంటూ ఎదురు దాడికి దిగాడు. రోజులు మారే కొద్దీ ఇలాంటి వాళ్ళు దేశభక్తులుగా చెలామణి

అయ్యే పరిస్థితి వస్తుంది. ప్రజలు నిమిత్త మాత్రులు ఓపిక చచ్చేవరకూ ఓపిగ్గానే ఉంటారు.

సమయం తెలిసి ప్రవర్తించటం, ప్రజల అవసరాలు గ్రహించటం, అవి నెరవేర్చి, వాళ్ళు పన్నులు కట్టగలిగేలా పాలించటంలో గొప్పతనం ఉంటుంది. అదీ, హృదయంతో పాలించటం అంటే! పన్నులు వెయ్యకుండా పాలించిన వాణ్ణి ప్రజలు ఎన్నేళ్ళ తరువాతైనా గుర్తు చేసుకుంటారు. ప్రజలకు కోపం వచ్చేలా ప్రవర్తిస్తే వాళ్ళు బాధలు పడతారే గానీ, పాలకులకు ఫలం దక్కదంటాడు కవి ఈ పద్యంలో! పొదుగు మూలము గోసిన పాలు గల్గునే...? "ఆవుల్ని పోషించి, మచ్చిక చేసుకుని పిండితే పాల ధారలు వస్తాయి గానీ, మొత్తం పిండేయటానికి పొదుగు కోసేద్దాం అనుకుంటే వెనకకాళ్ళతో తన్ని పంపుతుంది గోవు... గోసమానమైన ప్రజ కూడా అంతే!" అని కవి భావన.

"భూమిఁ బశుబృందము నెవ్వరికైన" భూ బృందం అంటే వ్యవసాయ పరిశ్రమ వారు, పశుబృందం అంటే, పాడి పరిశ్రమ వారూ, ఇంకా ఇతర వృత్తి వ్యాపారాల వారూ ప్రభుత్వాలు నిలబడటానికైనా కూలటానికైనా కారకులు! ఈ విషయాన్ని ఆ ఫ్యూడల్ వ్యవస్థ రోజుల్లోనే భర్తృహరి చెప్పాడు.

మహాభారతం శాంతి పర్వంలో కృష్ణుడు అంపశయ్య మీద ఉన్న భీష్మడి దగ్గరకు వెళ్ళి పరామర్శించి, ఆయన దగ్గర పాలనా పరమైన ధర్మసూక్ష్మాలు నేర్చుకోమని చెప్తాడు. పర్సనాలిటీ డెవలెప్‌మెంట్ క్లాసు తీసుకున్నాకే రాజువైతే ప్రజలకు మేలు కలుగుతుందని కృష్ణుడి సలహా! ఇప్పుడు కూడా కొందరు ముఖ్యమంత్రులు తమ మంత్రులకు, పార్టీ ప్రముఖులకు వ్యక్తిత్వ వికాస తరగతులు నిర్వహిస్తున్నారని పేపర్లలో చూస్తూ ఉంటాం. వాళ్ళు నేర్చేది తెల్లవారే సరికి బిల్ గేట్స్‌ని మించి పోవటం ఎలా...? లాంటి విషయాలైతే అది ఆ ప్రజల దురదృష్టం. అలాంటి విద్యలో నిష్ణాతులైన వాళ్ళకే ఆ పదవులు దక్కుతాయి కాబట్టి, వాళ్ళు కొత్తగా నేర్చుకునేది కూడా ఏమీ ఉండకపోవచ్చు!

"అందరినీ నమ్మాలని నేను చెప్పను, కానీ, ఎవరినీ నమ్మనట్టు ప్రవర్తిస్తే అంతఃశత్రువులు పెరుగుతారు. అంతః శత్రువులు ఎక్కడి నుండో పుట్టుకు రారు. ప్రజల నుండే వస్తారు...." అని హెచ్చరించిన భీష్మడి ధర్మసూక్ష్మాలు పాలకులు వంటబట్టించుకుంటే మళ్ళీ మళ్ళీ గెలువ అవగలుగుతారు. అలాంటి పాలకుడితో ప్రజలు సంతోషంగా, కపటంలేకుండా పుత్రుల్లాగా మెలగుతారంటాడు భీష్మపితామహుడు. ☆

# మంచిపొద్దులు

**ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ! యొంటి జరించెదోటలే**
**కివ్వనభూమి? భూసురుడ, నే బ్రవరాఖ్యుడ, ద్రోవ తప్పితిన్**
**గ్రొవ్వున నిన్నగాగ్రమునకు న్జనుదెంచి, పురంబుజేర నిం**
**కెవ్విధి గాంతు? దెల్పగదవే, తెరువెద్ది? శుభంబునీకగున్**

మనుచరిత్రలో పెద్దనగారి పద్యంఇది. మాటతీరులో మర్యాద ఎలా ఉండాలో ఈపద్యం చెప్తుంది.

కొందరు కారులో వెళ్ళే వాళ్ళు కారు లోనే కూర్చుని ఫలానా అడ్రస్సు ఎక్కడ అని అడిగేప్పుడు ఇలాంటి మర్యాద పూర్వక భాష ఉపయోగించే వారు అరుదుగా కనిపిస్తారు. ఎక్కువ మంది 'ఏయ్ఓయ్' అనే పిల్చి అడుగుతుంటారు. ఆమధ్య ఓ సినిమాలో ఇలా అడిగాడనే కడుపు మండిన ఓపెద్దమనిషి "తిన్నగా వెళ్ళు అక్కడో స్తంభం వుంటుంది. అక్కడకుక్కని పట్టుకుని ఒకాయన ఉంటాడు. ఆయన్నడిగితే చెప్తాడు అంటాడు. 'అక్కడ కుక్కాయన లేకపోతే ఏంచెయ్యా'లని అడిగితే "మళ్ళొచ్చి నన్నడుగు" అంటాడు.

ప్రవరుడికి సిద్ధు డిచ్చిన పాదలేపనం కరిగిపోయింది. లేపన మహిమతో ఎలా వచ్చాడో అలా తిరిగి వెళ్ళే అవకాశం లేకుండా పోయింది. ఆ హిమాలయాల్లో పడి తిరుగు తున్నాడు. మనిషన్న వాడు ఒక్కడు కనిపిస్తే ఒట్టు. బెంబేలెత్తి పోయాడు దారి తప్పిన వాడిమన:స్థితి అంతేకదా! అది హిమాలయాలే కానవసరం లేదు, పట్టపగలు కూడా ఒక్కోసారి రోడ్డుమీద నరసంచారం లేకపోతే అడ్రస్సు ఎవర్నడుగుతాం ? ఎవరైనా కనిపిస్తే బావుణ్ణనుకుంటాం. ప్రవరుడు అలాంటి మనిషి కోసం వెదుకు తున్నాడు.

సరిగ్గా ఆసమయంలో వరూధిని అతనికి కనిపించింది. ఆమెను చూడగానే అతనికి ప్రాణాలు లేచొచ్చాయి. అందమైన అమ్మాయి కనిపించినందుకుకాదు, ఇంటికి దారి చెప్తుందని ఆశ!

"ఎవ్వతెవీవు?" అని పద్యం ఎత్తుకున్నాడు పెద్దనగారు. ఎవ్వతెవీవు అని, వెంటనే, "భీత హరిణేక్షణ?-భయపడినట్టుగా కనిపించే లేడి కళ్ళవంటి కళ్ళున్నదానా" అని పిలిచాడు. ప్రవరుడు బ్రహ్మచారి కాదు కాబట్టి, ఆడాళ్లను ఎలా పిలిస్తే అనుకూలంగా పలుకుతారో బాగాఎరిగినవాడే! భీత హరిణేక్షణా అంటునే "భయం

లేకుండా వంటరిగా ఈ మంచు కొండల్లో తిరుగుతున్నావేంటీ?” అనడిగాడు. అడగబోయే ముందు తనెవ్వరో చెప్పుకోవటం మర్యాద అనిపించింది. “నా పేరు ప్రవరుడు, నేను బ్రాహ్మణుణ్ణి” అన్నాడు.

చాలా మంది ఫోనుల్లో మాట్లాడేప్పుడు ఈ మర్యాద వదిలేస్తుంటారు. “హలో ఏవరూ మాట్లాడేది?” అనడుగుతారు. అవతలివ్యక్తి మీరెవరంటాడు. ఇవతలి వ్యక్తి “మీరెవరో ముందు చెప్పండి” అంటాడు. ఇద్దరూ అరుచుకుని ఫోను పెట్టేస్తారు. “నేను ఫలానా అండీ, ఎవ్వరూ మాట్లాడేది” అనడిగితే మనటైమే వృథా కాకుండా ఉంటుంది.

“క్రొవ్వున ఈ నగాగ్రానికి చనుదెంచి”ఒళ్ళుకొవ్వెక్కి, ముందూ వెనకా ఆలోచించ కుండా ఈకొండ మీద కొచ్చాను. “పురంబు జేర నింకెవ్విధి గాంతు?” మాఊరికి వెళ్ళే దారి ఎలా తెలుస్తుందో అర్థం కావట్లేదు. “తెల్పగదవే, తెరువెద్ది? శుభంబు నీకగున్” దారెటో చెప్పగలవా? నీకు పుణ్యం ఉంటుంది...అనడిగాడు.

ప్రవరుడి భాషలో ఏమే, ఎవతివే లాంటి పదాలు ఎబ్బెట్టుగా ఉన్నమాట నిజమేగానీ, తనను కూడా ఒళ్ళు కొవ్వెక్కి వచ్చాననంటూ తిట్టుకున్నాడు. పూర్తి నిరాశలో కూరుకు పోయి ఉన్నాడు. ‘దారిచెప్పవే తల్లీ’ అని బ్రతిమాలు కున్నాడు, అంత తికమక అవస్థలో ఉన్నప్పటికీ పలకరింపు మర్యాదను పాటించాడు.

ఇంగ్లీషు వాళ్ళు గుడ్ ‘మార్నింగులు చెప్పటం, థ్యాంక్స్ అనటం, సారీలు చెప్పటం, ఐయామ్ అఫ్రైడ్ లాంటి మర్యాద పూర్వక పదాలు వాడతారనీ, మనకు అలాంటి సంభాషణ అలవాటు లేదనీ కొందరు ఆక్షేపిస్తుంటారు.

ప్రవరుడు దుఃఖ భాజనంగా ఉన్నప్పటికీ తనమర్యాదను కోల్పోకపోవటం గమనిస్తే, తెలుగుభాషా సంస్కృతుల్లోని ‘మన్నన’ మనకు అర్థం అవుతుంది. గుడ్మార్నింగ్, గుడ్ఈవెనింగ్, గుడ్‘నైట్ అనే సాంప్రదాయం మనకీ ఉంది. ఉదయం అయినా, మధ్యాహ్నం అయినా, రాత్రయినా ఏపొద్దయినా మంచి జరగాలనేదే కోరిక కాబట్టి, ‘మంచి పొద్దులు’ లేదా ‘మేలుపొద్దులు’ చెప్పుకుంటారు. ఉభయకుశలోపరి అన్నట్టుగానే ‘మంచిపొద్దులు’ కూడా వాడుకోదగిన చక్కని జాతీయం.

భాషలో గౌరవ వాచకాలను మనం చక్కగా ఉపయోగించుకో గలగటానికి కొంచెం ‘చాకచక్యంకావాలి. తెలుగు మాటల్లో గౌరవ పూర్వకంగా మాట్లాడే వారికి అన్నీ మంచి పొద్దులే!

“ప్రవరుడు కూడా శుభంబు నీకగున్” అనే సంబోధించాడు. అంటే, ‘గుడ్మార్నింగ్’ అన్నాడన్నమాట! ☆

## మా ప్రచురణలుగా వెలువడిన
## డా॥ జి.వి. పూర్ణచందు BAMS., గారి రచనలు

### ఆయుర్వేద వైద్య గ్రంథాలు

1. దీర్ఘాయుష్మాన్భవ
2. క్విక్‌రెమిడీస్
3. వంటిల్లే వైద్యశాల
4. మీ వ్యాధులకు మీరే వైద్యులు
5. భోజన భోగం
6. ఆరు రుచులతో ఆరోగ్యం
7. ఆయుర్వేదంలో పథ్యాలు - అపథ్యాలు
8. బీపీ వ్యాధి - సులభ నివారణ
9. జీర్ణకోశ వ్యాధులు - సులభ నివారణ
10. కీళ్ళవ్యాధులు - సులభ నివారణ
11. ఆయుర్వేదంలో సులభ చికిత్సలు
12. ఆడవారి కోసం ఆయుర్వేదం
13. చిటికలో చికిత్సలు
14. ఆరోగ్య రహస్యాలు
15. ఆహారవేదం
16. షుగర్ వ్యాధి సులభ చికిత్సలు
17. ఎలెర్జీ వ్యాధుల - సులభ నివారణ ★
18. ఆలనాటి ఆహారాలు ★
19. నిత్య యవ్వనం ★
20. ఆయుర్వేదంలో చమత్కారాలు ★
21. ఆరోగ్యామృతం ★
22. చిరంజీవ! చిరంజీవ! సుఖీభవ!! సుఖీభవ!!
23. ఆరోగ్య భగవద్గీత ★
24. షుగర్ వ్యాధి - సులభ నివారణ★

### సాహిత్య గ్రంథాలు

1. కాలచక్రతంత్రం
2. దీనజన బాంధవుడు
3. కొసమెరుపులు
4. సభాపర్వం
5. శ్రీగీతగోవిందం ★
6. పేరులోనే పెన్నిధి ★
7. మాటల ముచ్చట్లు ★
8. ఆలనాటి పట్టణాలు ★
9. బ్రిటిష్ యుగం ★
10. భారతీయ సభామర్యాదలు

★ ప్రస్తుతం స్టాకు లేవు



## 'అక్షర పూర్ణుడు' పూర్ణచందు

పద్యానికి వ్యాఖ్యాన ప్రాయమైన ప్రకాశ వ్యాసంగం చేస్తున్నాడు డా. జి.వి. పూర్ణచందు.. పద్యం అనేది ఒక వ్యాజం. దాని వంకతో ప్రపంచంలోని పలు అంశాలను వెలిగినస్తూ పోయాడు. లోకంలో ప్రసిద్ధమైనవీ, లేదా తనకు బాగా నచ్చినవి వ్యాఖ్యాన సాపేక్షక మైనవి, జటిల మైనవీ పద్యాలను ఎన్నుకొని మనతో ముచ్చటిస్తున్నాడు.

మూడున్నర దశాబ్దాలుగా డా. పూర్ణచందు వందకు పైగా గ్రంథాలు వెలువరించటం సంఖ్యా ప్రసిద్ధి కోసం కాదు. ప్రతీ పుస్తకం సమాజం పైన తనదైన ముద్రవేసిన నాణ్యతాపూర్ణమైనది.

పైకి రెండు చేతులు కన్పిస్తున్నా వెయ్యి చేతుల్తో పని చేస్తున్నాడు. తొమ్మిది వార, మాస పత్రికల్లో శీర్షికలు నిర్వహిస్తున్నాడు. బహుపార్శ్వీన శేముషీగుణ సంపన్నుడు.

'పూర్ణచందు' అనే పేరు ఈయన పట్ల సార్థకమయ్యింది. ఈయన ఎప్పుడు శ్వాసిస్తున్నాడు. ఎప్పుడు భోంచేస్తున్నాడు. అక్షరం ఈయన తత్త్వంలో ఎలా నిరంతరం ప్రసరిస్తున్నది... ఇది నిజంగా ఆశ్చర్యమే !

పూర్ణచందు భాషావేత్త అంటానికి నేనేమాత్రం సంకోచించను. ఆఫ్రో ఏసియాటిక్ భాషల్లో తెలుగు పదాలకు మూలాలు వున్నాయన్న అంశమొక్కటి చాలు, 'ఇక మీద 'అకడమీషియన్లు' దీనిపై దృష్టి పెట్టవచ్చు.

ఒక భాషోద్యమ సైనికుడుగా పూర్ణచందు కృషి కలకాలం నిలిచి పోతుంది! అది తెలుగు ప్రాచీన గుర్తింపు దాకా వెళ్ళింది.

పదానికి హితమైనది, జనానికి ఇష్టమైనది పద్యం. ఆ ఇష్టాన్ని మరింత పెంచేదిశగా సాగింది విలువైన ఈ గ్రంథం.

– డా. యన్. గోపి

పూర్వపు వైస్ ఛాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం



ఫోన్ : 0866 - 2434320
శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు
28-3-51, అరండల్‌పేట, విజయవాడ - 2 (ఆం.ప్ర)
Cell : 9440172936, 9032088555


202

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | GVP01J249 | **Date** | 18/11/21 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | CI, 201 | | |
| **Missing Pages** | No | | |
| **Prepared** | Swathi | **Scanned** | K. Yameema |
| **BOOK SIZE** | H 8.3 W 5.3 | **Pages** | 205 |